

గ్రంథకర్త:

అయ్యగారి నరసింహమూర్తి గారు, బి. ఏ.,

శ్రీ బాలభారతి గ్రంథమాల, నెం. 6.

# చోరశోధకుఁడు

(డిటెక్టివు నవల)

గ్రంథకర్త:

అయ్యగారి నరసింహామూర్తి, బి. ఏ.,

ప్రకాశకులు:

యం. రామసుబ్బయ్యశెట్టి

శ్రీ బాలభారతి గ్రంథనిలయము

చాగలమఱ్ఱి, కర్నూలు జిల్లా



వెల చందాదార్లకు కాలికోబైండు రు. 1-0-0.
ఇతరులకు సాదాప్రతి రు. 1-0-0.

# పీఠిక

-:o:-

పల్లెల గ్రామము గోదావరీ మండలములో నున్నది. గోదావరిజిల్లాలో మూఁడుకాలువలు ప్రవహించుచున్నవి. దానిలో మధ్యకాలువకు అమలాపురముకాలువ యని పేరు. ఈకాలువపై రాజమండ్రికి యిరువదియైదు మైళ్లదూరమునఁ బల్లెలయున్నది. ఇప్పటికిని పల్లెలయంతకు గ్రామము కాదు. ఇప్పు డది పిఠాపురపుసంస్థానములోఁ జేరి యొక ఠాణేదారున కాస్థానమై యున్నది. పల్లెలయందున్న భాగములలో నొక దానికి కోటమెఱక యనిపేరు. పూర్వము కోట నశించి యట్లు దిబ్బగా నేర్పడుటచే నది కోటమెఱకయని యిప్పటికిని బిలువఁ బడుచున్నది.

ఈకథ వ్రాసిన తరువాత దీనిని పూర్తిగా నోపికతోఁ జదివి చాలవఱకు సరిచేసిన—తెలుఁగుభాషతోఁ బట్టభద్రులైన మిత్రింటి మందేశ్వరరావుగారికిని, మరికొన్ని సలహాల నిచ్చిన పోడూరి రామచంద్రరావుగారికిని, నావందనము లర్పించు చున్నాను.

మదరాసు.
1-5-26.

అయ్యగారి నరసింహమూర్తి.

# మ న వి

—:o:—

మహాశయులారా !

మా గ్రంథనిలయమును బహుకష్టపరంపరతో నేటి వఱకు నెట్టులో ఒకవిధముగా జరుగుచున్నది. మాపాఠకమహాశయులగు తమకెల్లరకు విదితమేకదా? ఇంతటినుండియు తప్పక ప్రతిరెండుమాసములకు పొత్తముల వెలువరింతుము. మాఆలస్యమునకు సైరించి పొత్తములను స్వీకరించుచున్న మా మిత్రుల కెంతయు గృతజ్ఞుఁడ నగుచున్నాను.

గోదావరీమండలాంతర్గతం బగు నొకానొక సుప్రసిద్ధమగు "కోటమెఱక" యను స్థానికచరిత్రను నవలారూపకముగా వ్రాసి మాకొసంగుటయే గాక మా గ్రంథనిలయమునందలి ప్రేమచే గ్రంథకర్తగారగు శ్రీయుత అయ్యగారి నరసింహమూర్తిగారు గ్రంథప్రకటనమునందలి సర్వాధికారములను మా కొసంగినందులకు మే మెంతయు వారికిఁ గృతజ్ఞులమై యున్నాము

ఇట్లు :

చాగలమఱ్ఱి.
1-5-26.

అప్పా, రామచంద్రయ్య.

# చోరశోధకుఁడు

## మొదటి ప్రకరణము

ఈ కథ జరుగునాటికాలమునఁ గౌశికానది యిప్పటివలెఁ గాక విమలసలిలధామమై ముద్దులు మూటగట్టుచుండెను. గోదావరీనదియం దొకపాయగా బయల్వెడలి యనేక పుణ్యక్షేత్రంబులు తనతీరంబున వెలయుచుండ నీనది కనుల పండువై ప్రవహించుచుండెను.

అట్టి సుక్షేత్రంబులలోఁ బల్వాలక్షేత్ర మొకటి. పల్వాల యిప్పటివలె నొకచిన్నగ్రామము కాక, యాకాలమున నొక గొప్పపట్టణమై, పెద్దరాజ్యమునకు రాజధానియై యుండెను. కౌశికానదిలోనుండి యాకాలమున నోడలుకూడ ప్రయాణము చేయుచుండెడివి. పల్వాలపట్టణము గొప్ప యోడరేవుగాఁగూడ నుండెడిది. పల్వాలపట్టణమం దాకసమును ముద్దిడుకొనునట్టి దేవాలయములు, నానాచిత్రవిచిత్రాలంకారములతో మెరయుచుండు రమ్యహర్మ్యములు, నంగడివీథులును లెక్కకుమిక్కుటమైయుండెడివి. రత్నసింహునికాలముననే పల్వాలరాజ్య మింత

యౌన్నత్యదశకు వచ్చినది. అనేకసామంతరాజుల జయించి, రాజ్యమును జాల బలపఱచి వెంకటప్పయ్య యను బ్రాహ్మణ మంత్రికా రాజ్యము నప్పగించి, సత్కీర్తిగడించి, రత్నసింహుఁడు గతించెను. రత్నసింహుని సంతానములో నిప్పుడు శ్యామసుందరి మాత్రమే మిగిలియున్నది. ఆమె పదవయేటనే రత్నసింహుఁడు గతించెను. వెంకటప్పయ్య శ్యామసుందరీదేవికి విద్యాబుద్ధులు గఱపెను. ఇప్పుడు శ్యామసుందరీదేవి వయస్సు పదునైదు వత్సరములు. మిగుల సుందరియగు నా బాలికకు తగినవరునిఁ జూచుభారము వెంకటప్పయ్య నెత్తిపైఁబడెను. అతఁడును శక్తివంచనలేక, సకలప్రయత్నంబులఁ జేయుచుండెను.

పల్వోలకోట చాలగొప్పది. ఎల్లప్పుడును, యుద్ధసామగ్రితోను, వీరపురుషులతోను నిండి, చుట్టునుగల బురుజులతోడను అగాధమై, చూపఱకు భయంకరమైన కందకముతోడను; బలిష్ఠమైన యినుపతలుపులతోఁ గూడియున్న సింహద్వారముతోడను, వెలయుచు నాకోట యెంతటి ప్రబలశత్రువర్గమునకైనను దుర్భేద్యముగా నుండెను. సౌందర్యమునం దాకోట ఆకాలపుకోటల కన్నిటికిని మిన్నయై యుండెను. అందు రాణి యుండు యింద్రభవనము వర్ణనాతీతము. కోటకట్టఁబడి చాలకాలమైనను నింద్రభవనము మాత్రము రత్నసింహుని కాలమునఁ గట్టఁబడుటచే నా నూతనసౌందర్యముకూడ నింద్రభవనమున కొకవన్నె తెచ్చుచుండెను.

విమలభవనముకూడఁ జాలనందమైనదే. కాని యది చాల పురాతనఁపుఁ గట్టడ మగుటచే నింద్రభవన మంత సౌందర్యమైనది కాదు. విమలభవనమునందు రత్నసింహుని రెండవభార్యయగు హైమవతీదేవి నివసించుచుండెను. ఈమె యిరువది సంవత్సరముల వయస్సు కలది. రత్నసింహుఁడు బ్రతికియున్న దినములలోఁగూడ నీమెను సరిగాఁ జూచెడి వాఁడు కాడని వాడుక. శ్యామసుందరి తల్లి చనిపోయిన కొలది దినములలోనె రత్నసింహుఁడు హైమవతీదేవి రూపరేఖా విలాసములకు లోఁబడి యీమెను వివాహమాడెను.

వెంకటప్పయ్య రాచకార్యము లన్నియు తానే యతి నిపుణతతో నిర్వహించుచుండెను. పల్వెలరాణియగు శ్యామ సుందరీదేవితో వెంకటప్పయ్య కొన్నికొన్ని రాచకార్యముల జెప్పుచు నామె వాని నతినిపుణతతో విమర్శించుటఁజూచి మిగుల సంతసింపుచుండును. వెంకటప్పయ్యభవనము కోటకుఁ జాలసమీపముననే యుండెను. నిశాసమయములందుఁ దక్క వెంకటప్పయ్య తఱుచు కాలమంతయు కోటయందే కడపు చుండును. రత్నసింహునికాలమున ప్రజలందరు సర్వసౌఖ్య ముల ననుభవించుచు హాయిగనుండిరి. ఆతని మరణానంతర మునఁగూడ వెంకటప్పయ్య రత్నసింహుని రాజ్యపద్ధతులనే యవలంబించి ప్రజలను సుఖపెట్టుచుండెను.

హైమవతీదేవి రామచంద్రనగరాధీశ్వరుని కూఁతురు. రామచంద్రనగరము పూర్వమెంత గొప్పదియో యిప్పుడంత హీనస్థితియం దుండెను. రామచంద్రనగరము రాజుపేరు జయచంద్రుఁడు. ఆతనికి హైమవతీదేవియను కొమరితయు, రాజసింహుఁడను కొమరుఁడును గలరు. రాజసింహునికిఁ బదునెనిమిది వత్సరములుమాత్ర ముండును. జయచంద్రుఁ డేబదివత్సరములు గలవాఁడు.

## రెండవ ప్రకరణము

కౌశికానదిపై నాకసము వింతవింత రంగులఁ దాల్చుచు మిగుల నానందదాయకమై యుండెను. ఆ వసంతకాలమునం దరుణోదయసమయమున మందమారుతము మెల్ల మెల్లన వీఁచుచుండ హాయిగ నుండెను. పాంథులా చల్లగాలి ననుభవించుచు, శకుంతసంతానంబుల కూజితంబుల కమందానంద మందుఁచు, తమతమదారుల నోవ్వుచుండిరి. కోటలోని మేల్కొలుపుపాటలకు మురియుచున్నవో యనునటుల, కౌశికానదియందలి తరంగములు నృత్యముఁ జేయఁజొచ్చెను. క్రమముగా వెలుగువచ్చునప్పటికి, పల్లెలపురవాసులు స్నానసంధ్యాద్యనుష్ఠానంబుల నెఱవేర్చికొనుటకై నదీతీరమునఁ జేరుచుండిరి. నదియొడ్డునఁ బెద్దమెట్లు, ఆమెట్లపైన స్త్రీపురుషులు

వివిధవర్ణముల దుస్తులతో నిల్చియుండఁగాఁ జూచుటకుఁ జాల ముచ్చటగ నుండెను.

అత్తఱికి కొంతసేపటి కొకగొప్పయోడ యొకటి వచ్చి చేరెను. చిత్రవిచిత్రములగు రంగులతోఁ దళతళలాడెడు నా యోడ పెద్దభవనమువలె నుండెను. ఎవరో గొప్పమహారాజా యోడలో నుండియుండునని యచట స్నానముచేయు ప్రజాళి యంతయు వింతగా నాయోడపైపే చూచుచుండెను. ఆ యోడ తలుపులన్నియును మూయఁబడియుండెను. నావికులు తక్క మఱెవరును నగపడుటలేదు. ఓడకు మాత్ర ముచ్చట లంగరువేయఁబడెను.

ఆదిన మంతయు నట్లనే తలుపులు మూయఁబడి యున్నను ప్రజలుమాత్రము వేలకొలఁది యోడనుచూచుటకు వచ్చుచుఁ బోవుచునుండిరి. మేడలపై నెక్కియు, మిద్దెలపై నెక్కియు, స్త్రీలును, బాలురును ఆయోడను జూచుచుం డిరి. సూర్యాస్తమయ సమయమున నాయోడనుండి యొకవిధ మైన దివ్యగానము వినఁబడెను. ఎట్టివారి నైనను మోహింపఁ జేయు నాగానము వినుటకై ప్రజ లొకరి నొకరు త్రోసికొనుచు వచ్చిపడుచుండిరి. చల్లపడునప్పటి కాయోడతలుపులు తెఱువఁ బడెను. అంత నందుండి సుమా రేబదిమంది యౌవనులు, సుందరాకారులు, బయటి కరుదెంచిరి. వారందరు నొకేవిధ

పైన ధవళవస్త్రములఁ ధరించియుండ నందరు నొక్కతల్లికడు పున నొక్కసారిగా జన్మించినవారాయని తోచుచు నుండిరి. ఈ యాశ్చర్యము నంతయు నిట్లుండ, నావాహనమునుండి, సౌందర్యరాశి యగు నొక మనోహరమూర్తి, తళతళమని మెరయు దుస్తులతో, కిరీటమును బోలిన శిరోవేష్టము నొకదానిని ధరించి, కడునీటుగా నందుండి క్రిందికి దిగెను.

ఇట్టి చారుమోహనమూర్తి యచట నిలువఁబడియుండ నా ధవళాంబరధారు లందరును జుట్టును బరివేష్టించియుండిరి. వారిలో నొక డచ్చటనున్న ప్రేక్షకులలో నొకనిఁ బిలచి "మంత్రియింటికి దారిచూపుము" అని యడిగెను. అతఁడును సమ్మతించి బయల్వెడల, రెండువంకల నీయేబదిమందియు వరుసలుదీరి నడువ నా సుందరాకారుఁడు నడచివచ్చుచుండెను.

మంత్రియగు వెంకటప్పయ్య కోటలోనేయుండెను. ఆతఁ డాసమయమునందుఁ గొన్ని రాచకార్యములయందు నిమగ్నుఁడైయుండెను. అత్తఱి నొకసేవకుఁ డరుదెంచి, "స్వామీ! తమదర్శనార్థ మెవ్వరో యేతెంచియున్నారు. ఆయన యాడంబర మంతయుఁ జూడ నొక మహారాజువలె గాన్పించుచున్నాడు." అని తెలుప, మంత్రి యాతనిని లోనికి రా నాజ్ఞనిచ్చెను. అంత నా సుందరాకారుఁడు ఠీవిగా లోని కరుదెంచి, తనకై యమర్పఁబడిన యొకయాసనము నధిష్ఠించెను. తదనంతర మా మంత్రికిని, ఆ యువకునికిని నీక్రింది సంభాషణమాయెను.

మంత్రి—అయ్యా! తమ దేయూరు?

యువ—మంత్రిపుంగవా! మాది కళింగదేశము. మా తండ్రి యందొక్క గొప్ప జమీందారుఁడు. నేను దేశమును జూచుటకై యరుదెంచితిని. కొంతకాలక్షేప మగునని, యమూల్యములైన రత్నహారములు మొదలగువానిఁ గూడ మేము తెచ్చియుంటిమి. ఈ విధమున వర్తకము చేసికొనుచు చాలదూరమునుండి వచ్చుచుంటిమి. మీ పల్వాలరాజ్యకీర్తి చాలదూరము వ్యాపించియుండుటచే నిచ్చట మేము కొన్నిదినములుండ సంకల్పించికొని వచ్చియుంటిమి. తమసెలవు—

మంత్రి—అయ్యా! తమనామధేయము?

యువ—నాపేరు విజయమోహనుఁడు.

మంత్రి—మీ రిచ్చట నుండుట కెట్టి యభ్యంతరమును లేదు. అయినను, మారాణియగు శ్యామసుందరీదేవి యనుజ్ఞ కూడ గైకొనివచ్చెదను.

అని చెప్పి లోనికిఁ బోయి, మఱికొంత సేపటికి వచ్చి వా రుండుట కనుజ్ఞ నిచ్చెను. విజయమోహనుఁడును, సెలవు గైకొని బయట కరుదెంచెను. మరల నటనున్న యాధవళ వస్త్రాలంకృతు లందరును వంగివంగి సలాములుగావింప వచ్చిన

తీరుననే వెడలి యా రాజకుమారుఁడు తనయోడలోనికిఁ బోయెను.

విజయమోహనుఁ డీరీతిగా నోడలోనే యుండుచు వచ్చెను. ఒకనెలదినము లగునప్పటి కాపట్టణమునందలి గొప్ప వా రందరిస్నేహము నాతఁడు సంపాదింపఁగలిగెను. అనేకుల యింటికాతఁ డతిథి యయి, వారిచ్చు సత్కారంబుల గ్రహిం చుచు, వారిని తనయోడకుఁ బిల్చుచు, రత్నములుకొనుచు, నమ్ముచు, నాతఁడు సుఖముగాఁ గాలము గడపుచుండెను. ఆతనియంతటి ధనశాలి ప్రపంచమున మఱియొకఁ డుండఁ బోడని ప్రజ లనుకొనసాగిరి.

## మూఁడవ ప్రకరణము

ఆకాలమునందు పల్వోలపట్టణమున మిగుల ధనికుఁడగు హేమచంద్రుఁడను నొక క్షత్రియ కుమారుఁడు నివసించు చుండెను. ఆతని కాపట్టణమున, మేడలును, మిద్దెలును జాల గలవు. ఆతఁడు నివసించు విలాసభవనమున కీడైనది, కోట లోని యింద్రభవనముతక్క మరేదియునులేదు. విలాసభవన మొక సుందరోద్యానవనములో నుండెను. ఆయుద్యానవనము నం దతిరామణీయకములైన వృక్షములు, లతాగుల్మములు నసంఖ్యాకములై యున్నవి. అందలి తటాకము వినిర్మల జల

పూరితమై తామరపుష్పములతో నిండియుండెను. అం దప్పు డప్పుడు హేమచంద్రు డొకచిన్ననావపై షికారుపోవుచుండును.

హేమచంద్రుఁడు చాల విలాసపురుషుఁడు. తన విలాస మునకై ద్రవ్యము నాతఁడు రెండుచేతుల విచ్చలవిడిగా వెచ్చించుచుండును. నానా దేశములనుండియు వచ్చిన యపూర్వ సౌందర్యవతులగు వారాంగన లేమి,లోకమునంతయు భ్రమింపఁ జేయు గానకళావిశారదు లేమి యాతనిని దర్శించుటకై వచ్చి యాతనిచే సత్కరింపఁబడి పోవుచుందురు. ఎంత చేసినను తఱుఁగని ధనరాసుల నాతని పూర్వులు గడించియుండిరి.

ఆనాటిరాత్రి హేమచంద్రుని విలాసభవనమున నొక వారాంగన నృత్యముచేయుటకై వచ్చియుండెను. విలాసభవన మంతయు వివిధవర్ణములగు లాంతరులచేఁ బ్రకాశమానముగానుండెను ధనికులును, విలాసపురుషులును, ననేకులు వచ్చి విలాసభవనము నలంకరించుచుండిరి. ఆభవనమునందలి యందమైన పటములును, దేశదేశములనుండియుఁ దేఁబడి, గుత్తులు గుత్తులుగా వ్రేలాడఁగట్టఁబడిన పుష్పరాజములను జూచుచుఁ బ్రేక్షకు లందఱు మిగుల నానందించుచుండిరి. కొందఱు తివాచీలపైఁ గూర్చుండి, వారాంగనాదర్శనాయత్తచిత్తులై తహతహపడుచుండిరి. ఇటులఁ గొంతకాలము గడచెను. రాత్రి తొమ్మిదిగంట లాయెను.

అంతట నావిలాస భవనమున కొక ప్రక్క నున్న యొక గదితలుపు తెఱవఁబడెను. అందుండి వివిధాలంకార శోభితలగు వనిత లైదుగురువచ్చి సభ కెదురుగా నిర్మింపఁబడిన తమస్థలమునందు నిలువఁబడియుండిరి. సభలోని వారలందఱావనితలఁజూచి మైమరచిరి. వారట్లు చూచుచుండఁగనే అట్టిదుస్తులు కలవారే మఱియిద్దరును వారిమధ్య నొకబిబ్బోకవతి, మణిమయాలంకార శోభితురాలై రాకాసుధాకరుని బోలు మోముతో నతివిలాసముగావచ్చి యట నిలువఁబడెను. సభికుల దృష్టులన్నియు నొక్కసారిగా నామెమీద ప్రసరించెను. ఆమెయు నటులనే నిలువఁబడి యజమానుని యాజ్ఞకై నిరీక్షించుచుండెను.

ఇంతలో సింహద్వారమునొద్ద నేదియో కలవరము వినవచ్చెను. హేమచంద్రుఁ డటకుఁబోయి చూడ నచ్చట విజయమోహనుఁడు తన యనుచరులతో నిలువఁబడి యుండుటను గాంచెను. విజయమోహనుఁడు ముందున కొక యడుగిడెను. హేమచంద్రుఁ డాతని హస్తముఁ గైకొని, సగౌరవముగా లోనికి తీసికొనివచ్చి యొక యుచితాసన మాతని కిచ్చెను. కొన్ని నిముసములముం దాపూవుబోఁడి మోముపై వ్రాలియున్న చూపులన్నియు మరల నిటు తిరిగెను. విజయమోహనుఁడును తదేకధ్యానముతో నావారాంగనాముఖావలోకనము గావించుచుండఁ ప్రేక్షకులునుఁ తమ వీక్షణముల నటుఁద్రిప్పిరి.

నాట్యమున కనుజ్ఞ యీయఁబడెను. వెంటనే మధురగానము, దానిని వెంబడించి నృత్యమును బయల్వెడలెను. నటకురాలు తననోరు మెదల్చునప్పటికి సభయంతయు నిశ్శబ్దముగానుండెను. ప్రేక్షకులు తమచూపుల నటనుండి మరల్పఁజాలకుండిరి. తమల పాకులు నోటఁ కందీయఁబోవుచు, హస్తములు తమపని మరచి యచ్చటనే యాఁగిపోయెను. కొందరు మోము శుభ్రముచేసి కొనుటకై జేబునందలి చేతిగుడ్డలను తీయఁబోవుచు నాచేతుల నట్లే యుంచిరి. వీవనవేయువారు తమపని మరచి యట్లే నిలువ బడిరి.

ఈవిధమున మూడు గంటలు నొక్క నిముసమువలె నెగసిపోయెను. పాటకత్తెయును చాల నలసిపోవుటచేఁ బాట యాపుచేయఁబడియెను. ప్రేక్షకులు తమతమ నెలవులకు వెడలి పోయిరి. విజయమోహనుఁడును తనవారితో వెడలిపోయెను. విలాసభవనము మరల నిశ్శబ్దమాయెను. సేవకులు మైమఱచి నిద్రించిరి. వారాంగనలారాత్రికి విలాసభవనముననేయాఁగిరి.

హేమచంద్రుఁడు మేడమీఁద నొంటరిగాఁ బరుండియుం డెను. కాని యావిలాసవతి సౌందర్యముఁ జూచినతరువాత నాతని మనస్సంతయు నచ్చటనేయుండెను. “ ఆమె నొకసారి పిలిచి, కొంతసేపేల మాటలాడకూడదు? ఆమె పార్శ్వమునఁ గూర్చునియే నా సౌందర్యామృత మేలగ్రోలఁగూడదు ? ” ఇట్లు మనస్సు పరిపరివిధములఁ బోవుచుండ, నాతఁడు లేచి పిచ్చివాని

డుకలదా? మాగధులకు ప్రాణశత్రుమైన యా శ్రీముఖుని యుసురులు నేఁటితో కడముట్టును గాక."

"జయజయ సుశర్మచక్రవర్తి." యని సభనుండి యుచ్చైస్స్వరముతో శబ్దములు పైకి లేచెను.

సుశర్మ ఇట్లు ప్రకటించెను.

"ఇదియే రాజాజ్ఞ ఆంధ్రులు మగధపురాధీశ్వరులకుఁ బ్రబలవిరోధులు. ఎక్కడ ఏయాంధ్రుఁడు కానవచ్చినను వానినిఁ బట్టి వెంటనే మా కారాగృహాధికారికి పురజనులు అప్పగించవలసినది. స్త్రీశిశుసహితముగా లోకము ననాంధ్రముగావించి పాటలీపుత్రమునకు నాపురజనులు శాశ్వతకీర్తులను సంపాదింతురు గాక. దండనాథా! నీ సేనావివహము లెట్లున్నవి?"

దండనాథుఁ డిట్లనియె:

"దేవా! ఒకరథము. ఒక యేనుఁగు, మూఁడు గుఱ్ఱములు అయిదుగురు బంట్లును గల యొక్కొక్క పత్తినే నేను వేలు వేలుగా ఆంధ్ర దేశమునకుఁ బంపియున్నాను. ఇప్పుడు శ్రీముఖిరాజ్యములోనట్టి మనపత్తులన్నియుఁ జేరి యెన్ని సేనాముఖములైనవో యెన్నిగుల్మములు వాహినులు. పృతనలు, చమువులు, అనీకిములు అయినవో నేను చెప్పఁజాలను. రెండు అక్షౌహిణులసేన ఇదివఱకే ఆంధ్ర రాజ్యముల మీఁదఁ బడి వానిని నిర్మూలము చేయుచున్నది."

ద్వారికుఁడువచ్చి రాజునకు నమస్కరించెను.

"అయ్యో! యిదియేమి, దంతమా? ఎంతస్వచ్ఛముగా నున్న
ది!" అని ప్రశ్నించి మంచముపై బందిరికట్టపైఁ జేయివైచెను.
హేమచంద్రుఁడును శరీరముమఱచి యేమిచేయుచున్నాఁడో
తెలియక, "ఇదియా? ఇంతవరకును దంతమే" అని యామె
చేయియొద్దనే చేయినుంచెను. ఆ స్పర్శవలన కలిగినసుఖముచే
హేమచంద్రుని యొడలంతయు రోమాంచితమాయెను. ఆ చేతి
నటులనే యుంచి రెండవచేతితో నా విలాసవతి చేతినున్న
గాజులు పట్టుకొని "ఇవి దేనితోఁ చేయఁబడినవి?" అనియె
ను. హేమచంద్రుఁడు ఆమాటకు ప్రత్యుత్తర మీయకనే,
యా యభిసారిక "అయ్యో! రాత్రి చాలవర కతిక్రమించినది.
మీకు నిదురవచ్చుచుండును. నాకు సెలవిండు" అనెను.
హేమచంద్రుఁ డామెహస్తములను గట్టిగా నొక్కిపట్టి,

"లేదు! లేదు! వద్దు! వద్దు!" అనియెను.

ఆమెయును విదలించుకొనఁబోయెను.

ఇంతలో "దబ దబ" మని మేడమెట్లు చప్పుడాయెను.
వారిద్దరు చేతులు వదలి నిర్ఘాంతపడి చూచుచుండిరి. అంత
సుమా రిరువదిమంది మనుష్యులు, నల్లని దుస్తులను ధరించి,
ముఖములకుకూడ నల్లనిగుడ్డలుకట్టి, తళతళలాడు ఖడ్గములను
హస్తములందు ధరించి పైకివచ్చిరి. అందులో నొకడు "నీ
ఖజానాపెట్టె తాళముచేతు లెక్కడ?" అని గట్టిగా హేమ

చంద్రునివైపు చూచి యడిగెను. హేమచంద్రుఁడు గడ గడ వణకుచుండెను. ఆ వారాంగన మాటలేక క్రిందఁ బడియెను. వారిలో నొకఁడు ముందుకువచ్చి "నీతాళముచేతు లెచ్చట?" అని భుజముపట్టి హేమచంద్రుని గట్టిగా నూపెను. హేమ చంద్రుఁడు కేకలు వేయ ప్రయత్నించెను. కాని మిగిలినవారు వచ్చి చేతులతో గట్టిగా నాతనినోరు మూసి, క్రిందపడవైచిరి. హేమచంద్రుఁడు గిజగిజ తన్నుకొనుచుండెను.

అందులో నొకఁ డాతనిశరీరమంతయుఁ దాళముచేతుల కొఱకై వెదకెను. ఆగది నంతయును మరియొకఁడు వెదకి యంతయు చిందరవందర గావించెను. మరల "నీతాళముచేతు లెటనున్నవో, నీకు ప్రాణములపై నాశ యున్నఁ దెలుపుము. నేను, "ఒకటి, రెండు, మూఁడు" అనియెదను. అప్పటికిని నీవు మాటాడకపోయిన యెడల నీకత్తితో నిన్ను పొడిచివైచెదను" అనెను. ఆదుర్మార్గుఁ డట్లనుచు హేమచంద్రునివైపు చూచుచు కత్తిపట్టుకొని క్రిందికి వంగెను. "ఒకటి" "రెండు" ........ ఇంతలో నాతని ముఖమునకు చుట్టిన నల్లగుడ్డ యొక్కింత తొలగెను. హేమచంద్రుఁడు భయాశ్చర్యములతో "నీవా"... అనుచుండగా నా హంతకుడు గట్టిగా "మూ...డు........." యనుచు నావాఁడికత్తితో నాతనిగుండెలలోఁ బొడిచివైచెను.

ఇంతలో నా వారాంగన లేచి కెవ్వున కేక వైచెను. మరియొక డామెనుపడవైచి యామెవక్షమునం దాతని కత్తిని బలముతోఁ గ్రుచ్చివైచెను.

## నాల్గవ ప్రకరణము

జయరాముఁడు బోయినతర్వాత పల్వేలపట్టణవాసులు గుండెలపై చేతులనిడికొని హాయిగా నిదురించుచుండిరి. అయిదు సంవత్సరముల వెనుక పల్వేలపురవాసులకు నిశ్చింత యెచటిది? మహాబలసమన్వితుండును, రాజకార్యధురంధరుండును నగు రత్నసింహునంతటివానిని సరకుచేయక, పదివత్సరములవరకు పల్వేలపట్టణమును, నాచుట్టుప్రక్కల గ్రామములను, జయరాముఁడు గడగడలాడించివైచెను.

చివరకాతఁడు రక్షకభటులచేతులలో బడెనను సంగతి విని, ప్రజలు స్వర్గసౌఖ్య మనుభవించిరి. ఆతఁడు పట్టువడక మునుపు, ధనికులకు ధనమే యొకబరువుగా నుండెడిది. ప్రతి నిముసమును విచారముతో జయరాముఁ డేరూపుతో వచ్చి తమకొంపకూల్చునో యను భయముతోఁ బ్రజలు హడలు చుండెడివారు. మేడలా; మిద్దెలా; కోటలా! ఏమియు నా గజదొంగకడ్డులేవు. మనుష్యులను నిష్కారణముగా చంపడని యును, పేదలను బాధింపడు సరికదా వారి కుపకారముకూడ

చేయుననియును గొందఱు చెప్పుదురు. కాని యా కాలమున నెన్ని నరహత్యలు జరుగలేదు! మొత్తముమీఁద నేదుంపగము లెచ్చట జరిగినను వానికి జయరాముఁడే మూలపురుషుఁ డని ప్రజ లనుకొనెడివారు. రక్షకభటులు, జయరాముని దాము ముక్కలుముక్కలుగా ఖండించివైచితిమని చెప్పెదరు. కాని యిప్పటికి జయరాముఁడు వారిచేతులలోనుండి తప్పించికొని పోయి యెచ్చటనోయున్నాఁడని యొకప్రతీతిమాత్రము కలదు.

అప్పటినుండియు మరల నీవిలాసభవనమునందలి హత్యల వఱకును పల్వోలపట్టణవాసు లేమియు దారుణముల నెఱుంగరు. ఈహత్యలతో మరల జయరాముఁడే వచ్చెనని ప్రజలు మిగుల భీతిల్లిరి. ఆ హత్యలు జరిగిన మఱునాడు పల్వోలపట్టణ మంతయు విలాసభవనమునందే యుండెను. ముఖ్యరక్షక భటాధికారి, మంత్రియగు వెంకటప్పయ్య మొదలగు ధురంధరు లందరు నచటనే యుండిరి. హత్యలలోనను, సామాన్య హత్యలా! ఆపట్టణములోని కెల్లను ధనవంతుఁడును, నందఱికిని దలలో నాలుకవలె మెలంగెడువాఁడును నగు హేమచంద్రుఁడును; ఆ వెనుకటిదినముననే పల్వోలపట్టణమునందలి విటలోకము నంతటిని తహతహపెట్టిన యా వారనారీశిరోమణియును దారుణముగాఁ జంపఁబడి రనుట సామాన్యవిషయము కాదు. ఆ వారాంగన చెలికత్తె లింకను నేడుగురుండిరి. వా రేమియుఁ దెలుపలేకపోయిరి. తమనాయిక వ్రై కెపుడు

పోయెనో, యీ హత్యలేల జరిగెనో వారి కేమియును దెలియలేదు. హేమచంద్రుని యింటిలో నాతనికాప్తు లెవరును లేరు. తల్లియు దండ్రియుఁ జిన్ననాఁడే గతించిరి. దాసదాసీజనంబులుండిరిగాని వా రేమియు నీయుపద్రవము విషయమై తెలుపలేకపోయిరి. విలాసభవనఁపు ద్వారమొకటిమాత్ర మూడఁదీయబడియుండెను. దొంగ లా కన్నమునుండియే ప్రవేశించియుందురు.

ముఖ్యరక్షక భటాధికారి యగు రామదా సనమాన ప్రవీణతగలవాఁడు. అయిదుసంవత్సరముల వెనుక నాతఁ డొక చిన్న యుద్యోగములోఁ బ్రవేసించి తన నిపుణతచే నిట్టి యున్నతోద్యోగమునకు వచ్చెను. ఆతఁ డీయుద్యోగములోనికి వచ్చినప్పటినుండియు దండింపఁబడని నేరస్థుఁడు లేడు. కన్నగాండ్రకును, జూదరులకును నీతఁడు ప్రక్కలోని బల్లెమై మెలఁగుచుండెను. అట్టి రామదాసు సహిత మిప్పు డేమియునుఁ దోఁచక తటపటాయించుచుండెను. ముఖ్యమంత్రి యగు వెంకటప్పయ్య చాలసేపటివరకచ్చటనే యుండి రామదాసున కాభవనము నప్పగించి నిష్క్రమించెను.

ఇంతలో రాజవైద్యుఁ డట కరుదెంచి శవములను బరీక్షించి రాత్రి మూడుగంటల కీపని జరిగియుండుననియును, గత్తి దిగినవెంటనే ప్రాణములు పోయియుండుననియును, తన యభిప్రాయమును దెలిపెను. తరువాత నాతఁడును వెడలిపోయెను.

రామదాసు మాత్ర మాభవనము నంతటిని బాగుగా పరీక్షించి, యుద్యానవనము నంతయు నల్దిక్కుల వెదకి యేమియు నాధారము గానక విఫలమనోరథుఁడై తిరిగి భవనములోనికి బోయి శవములను దహనమున కాజ్ఞనిచ్చి కొంతసేపటి కింటికిఁ బోయెను.

సంధ్యాసమయమునకు మరల వేలకొలదిఁ బ్రజలును, ముఖ్యరక్షకభటాధికారియు వచ్చిరి. ఇంతలోఁ గొంత మంది పరివారముతో విజయమోహనుఁ డట కరుదెంచెను. రక్షక భటాధికారి కీతనితోఁ గూడ కొంత పరిచయమాయెను. అందువలన నాతనిని చాలగౌరవించి యొక యాసనమున కూర్చుండ నియోగించి రామదా సాతనితో నిట్లనియె. "అయ్యా! ఇది యేమో, చాల మాయగా నున్నది. ఈ వారాంగన యొడలి మీఁదినగలన్నియునుఁ బోవుట చూడ నీ హత్యలఁ గావించిన వారు దొంగలనియే యూహింపవలసి యున్నది. కానిహత్యలు ఇంత దారుణమైన హత్యలు! ఈమాత్రపు దొంగతనమునకే చేయుదురాయని నా కాశ్చర్యముగా నున్నది. ఈవారాంగన కిష్టులెవరైన నిటనుండిరేమో యని విచారింపఁగా నామె సఖు లీమె యీప్రాంతముల కెన్నఁడును రాలేదని తెల్పుచున్నారు. అందువలన నిది, దొంగతనము, బందెపోటుదొంగతనమై యుండవలెను. హేమచంద్రు నింకను నేమైనఁ జెప్పుమని బలవంతపెట్టి యుందురు. ఆతఁడు నిరాకరింప, వట్టిచేతులతో నేలపోవలయు

నని యిట్లు చేసియుందురు. లేదా, వారిలో నెవరినైన యాతఁ డానవాలు పట్టియుండవలయును. తమగుట్టు బయల్పడునని భయముచేనైన నీపనిచేసియుందురు. ఏమో! ఎట్లుతెలియును!”

ఇంతలో విజయమోహనుఁడు—“ఆహా! ఎంతలో నెంత వింత! నిన్నరాత్రి కలకలలాడుచు మెరసిన బంగరుఁబ యీనాటి కిట్లు భగ్నమైపోవుటఁజూడ నా కీప్రపంచముపై నసహ్యము జనించుచున్నది. ఏమిబ్రతుకులు! హేమచంద్రుని తో నీనెలదినముల నుండియు నాకును బరిచయము కల్గినది. ఎంత మంచివేసము! మాయొద్ద కొన్ని రత్నములుకూడ తీసికొన్నాఁడు. ఎంత తెలివితేటలతో నాట్యముచేసినాడు! ఈ కాలమంతయు మాయ! మాయ! మేమీయూరనుండి వెంటనే పోవలయును. లేనియెడల మాపనికూడ నింతయే యగునేమో. ఆరునెలలైన నిటనుందమని వచ్చితిమి. కాని ప్రాణములపై నాశవదలుకొని యుండవలయునేమో తెలియదు!” అని భయపడుచుఁ జెప్పెను. అంత రామదాసు, అయ్యా! మీకేమియును భయములేదు. పల్వాలపట్టణములో మీ రిట్టి మాటలాడుట తగదు. నాప్రాణముల ధారపోసియైనను నే నీ నేరస్థుని పట్టితీసెదను. రెండుమూడు సంవత్సరములనుండి యేమియు దారుణములు జరుగుటలేదుకదా యని మేము కొంత కనుమూసియుండుటచే నింతయైనది. ఇంక నెవరితరము. ఈనేరస్థుఁ డెవ్వఁడో”

....................అనుచుండు నప్పటి కెటనుండియో “జయ

రాముఁడు" అను గంభీరధ్వని వినవచ్చెను. ప్రజాళికంతకు నాస్వరము వినునప్పటికి గుండెలు దడదడ మనినెను. శరీర మంతయు రోమాంచిత మాయెను. తలఁచుకొనుటకుఁ గూడ దుర్భరమైన యా జయరామనామ మొక్కసారి, ప్రజల వీను లన్నిదారుణాస్త్రపాతమువలె తాక, నోటమాటలేక నిలువఁ బడిరి. రామదాసు విజయమోహనునితో మాటలాడుటమాని నల్గురు రక్షకభటులను నాల్గుమూలలకుపంపి తానుగూడ స్వయముగా బయల్వెడలెను. విజయమోహనుని యనుచరు లప్పుడే యంతయును వెదకుచుండిరి. కాని యెవరు నేమియుఁ గాంచలేక వెనుకకు మరలిరి. ఇంతలోఁ జీకటిపడెను. ఎవరి యిండ్లకు వారు పోయిరి. కాని నిదురమాత్ర మెవరికిని లేదు.

## ఐదవ ప్రకరణము

హైమవతీదేవి రత్నసింహుని రెండవభార్యయనియును ఆమె తఱచొంటరిగా విమలభవనమునందు నివసించు చుండు ననియును మొదటిప్రకరణమునందు సూచింపఁబడినది. ఆమెకు బిడ్డలులేరు. ఆమె యొక సాధారణ రాజకుమారియే యైనను, యామె యసమాన సౌందర్యరూపముఁ జూచి రత్నసింహుఁ డామెను వివాహమాడెను. కాని యామె వివాహమై కాపు

రిమునకు వచ్చిననాటనుండియును సవతికూఁతు రగు శ్యామ సుందరిని పలుతెరంగుల బాధింప మొదలిడెను. మిగుల బుద్ధిమంతురాలును, సౌందర్యవతియుఁ జెలివితేటలు కలదియు నగు తన గారాబుపట్టిని బాధించు హైమవతీ దేవితో రత్నసింహుఁడు సరిగాఁ గాపురము చేయలేకపోయెను. అందుచే రత్నసింహునికి హైమవతిపై ససహ్యము జనించెను. హైమవతీదేవి యును, వయస్సునందు వృద్ధుఁడైనను యా కాలము నందలి రాజ్యములలో మిన్నయగు పల్వాలరాజ్యమున కధీశుఁ డగు రత్నసింహుని వివాహమాడిన సర్వసౌఖ్యములు చేకూరు నని యట్లు చేసెను. సర్వాధికారమును తనచేత నుండవలయు నని యామె యూహ. కాని యీమె యభిప్రాయమును గ్రహించి రత్నసింహుఁ డీమెకేమియు స్వాతంత్ర్యమీయక చెఱసాలలో నుంచినట్లుంచి శ్యామసుందరినే ప్రేమించుచు వచ్చెను. ఆతఁడు చనిపోవునపుడుమాత్రము హైమవతికి విస్తారము ధనమిచ్చెను. అందుచే తగినంతమంది దాసదాసీజనంబుతోఁ నమూల్యము లైన పరికరములతో విమల భవనము నిండియుండెను. ఆమె యాభరణములుగూడ చాల విలువగలవి.

ఆమె మిగుల సౌందర్యవంతురా లని యిదివఱకే సూచింపఁబడినది. భర్త పోయిన సంవత్సరము వఱకు నామె విగతాలంకృత యైనను, తరువాత వివిధాభరణములను ధరించుచు, మేలిచీరలుకట్టుచుఁ బూర్వమువలె సౌందర్యరాసివలెఁ

గన్పట్టుచుండెను. ఈమె చాల విలాసవతి. నౌకపైఁ గొంత దూరము షికారుపోవుటయనినను, వనవిహార మనినను జక్కని కథ లనినను యీమె కత్యంత ప్రీతి. ఇంకను నీమెకు రాజ్యాధికారమునందలి మోహాము తగ్గలేదు. అందువలన నీమె యొక యుపాయ మాలోచించెను. ఈమెకు రాజసింహుఁడనుసోదరుడొకఁడు కలఁడుకదా! ఆతఁడు రామచంద్రనగరమును ముందుఁ బరిపాలించురాజు. ఆతని కీమె సవతికొమరిత నిచ్చిన యెడల నాతని మూలముననైన తన కోరిక నెరవేర్చికొనవచ్చు నని యీమె సంకల్పించుకొనియెను. కాని, రాజసింహుఁ డతిదుర్మార్గుఁడనియును, రామచంద్రనగరరాజ్యము శిధిలావస్థలో నున్నదనియును వెంకటప్పయ్యకును శ్యామసుందరికినిఁ దెలియక పోలేదు. శ్యామసుందరి మెడలెట్టులో విఱచి వివాహాము చేయుటమన్న యీమాయ వెంకటప్పయ్య నెగ్గనిచ్చునా! అయినప్పటికి నీవిషయమై ప్రయత్నించుటకును, నాలోచించుటకును పుట్టినింటికొకసారిపోవుట సమంజసమని హైమవతితలంచెను. ఆమె తలఁచిట్టి యాలోచనలతోడనే కాలముఁగడపుచు దగిన యాప్తులుగాని సలహాలనిచ్చువారుగాని లేక హృదయ భారముతో కొట్టుకొనుచుండెను.

ఒకదినమున నీమె మంత్రికొఱకై కబురుపంపెను. వెంకటప్పయ్య కీమె మనస్సంతయును తెలిసియున్నప్పటికిని, రత్నసింహునిభార్య యగుటచే బాహ్యాదరణముమాత్రము లేకపో

లేదు. హైమవతీదేవి యవనికచాటున నుండి యాతని నొక యాసనముపైఁ గూర్చుండ నియోగించి యీవిధమున మాట లాడెను.

హైమ—అయ్యా! రాజ్యమునందు విశేషము లేమియును లేక రాజకార్యములు యథావిధిగా నడచుచున్నవా?

వెంక—అమ్మా! అట్లనే కాని, యీమధ్య నే నాల్గు దినముల వెనుక విలాసభవనమునందు రెండు దారుణహత్యలు జరిగినవి జయరాముఁ డపుడు చనిపోలేదనియును, మరల నరుదెంచె ననియును ప్రజలు మిగులఁ దల్లడమందు చున్నారు. రామదా సాహంతకులను ద్వరలోనే పట్టు కొనుటకుఁ గంకణము కట్టుకొనినాడు. ఈ యశాంతి తక్క మరేదియును విశేషములేదు.

హైమ—అవును. దీనిని గుఱించి నేనును వినియుంటిని. చాల దారుణముగానే యున్నది. ఏదో గట్టిగాఁ బనిచేయవల యును. రాజులేనిరాజ్య మరణ్యముతో సమానము. ఇంతకును మేధావంతు లగు మీరుండ రాజ్యవ్యవహార ముల కేమిభయము! సరే! మనశ్యామసుందరి యుక్త వయస్కురా లైనది. ఆమె వివాహవిషయమై నేమైన నాలోచించుచుంటిరా?

వెంక—అమ్మా! పల్లెలరాజ్యమున కంతటికిని రాణియగు శ్యామసుందరీదేవి వివాహమన్న సులభసాధ్యము

కాదు. దైవనిర్మితమగు వరుఁ డెచటనో యుండియే యున్నాడు. అయినను వివాహమున కింత తొందర యేల?

హైమ—నిజమే. కాని మనముకూడ ప్రయత్నించుట మన విధి. నా యభిప్రాయ మేమన, నేదో చిన్న రాజ్యము నకు రాజైనవాఁ డైనయెడల, నాతఁడుకూడ వచ్చి యిచటనేయుండి రాజ్యవ్యవహారములఁ జక్కఁబెట్టును. కొంచెము బుద్ధిమంతుఁడును, రూపసియు నైనవానినిఁ జూచి కట్టిపెట్టిన బాగుగనేయుండును.

వెంక—బాగుగనేయున్నది. కాని శ్యామసుందరీదేవి కీవిష యమున నొరులుచెప్ప నక్కఱలేదు. ఆమెయే తగిన వరునిఁ జూచికొనఁగలదు. ఇంతకును దైవాజ్ఞ ప్రధాన ము, కాని మనయాలోచన లెంత?

హైమ—ఆమాటనిజమే, కాని మనముకూడఁ బ్రయత్నించుట విధి. నా యాలోచన చెప్పినాను. మీరు పెద్దలు. నా యాలోచన యనవసరము లేదు. ప్రస్తుతము మీకుఁ గబురుపంపిన కారణ మిది. నే నొకసారి రామచంద్ర నగరము పోవలయు ననుకొనుచున్నాను. మావారి యొద్దనుండి యుత్తరముగాని, కబురుగాని లేదు. మా తండ్రిని, రాజసింహుని చూచిరావలయునని యున్నది.

వెంక—అవసరమైనయెడల నేనే ప్రయత్నము లన్నియును చేసెదను. మీరు కపిలేశ్వరపురమువరకును నావపై పోవచ్చును. తరువాత పాలకీమీఁద రామచంద్రనగరము పోవచ్చును. పాలకీబోయీలను మీతోడ నేనే పంపించెదను.

హైమ—అట్లనే చేయుఁడు. ఏదో మంచిరోజు చూచి, ముహూర్తముంచినయెడల నేను సిద్ధముగ నుందును.

తరువాత వెంకటప్పయ్య మరల కోటలోనికిఁ బోయి యీసంగతుల నన్నిటిని శ్యామసుందరీదేవితోఁ జెప్పెను. ఆమెయును, దనసవతితల్లి యింతత్వరలో పుట్టినింటి కేల పోవలయునో యని యాలోచింపసాగెను. హైమవతి చాల నాలోచనాపరురాలని తెలిసినప్పటికిని నామెయూహ యిట్టిదని నిశ్చయించుటకు వెంకటప్పయ్యకుఁగాని శ్యామసుందరికిఁ గాని యేమియును దోఁచలేదు. వెంకటప్పయ్య మాత్రము హైమవతిమాటలవలన విశేషమగు సంగతుల గ్రహించియు శ్యామసుందరీదేవితో నేమియుఁ దెలుపలేదు.

## ఆరవ ప్రకరణము

వెంకటప్పయ్య తన కచేరీయందే రాచకార్యములు తనక్రిందివారితో మాటలాడుచుండెను. ముఖ్యసైన్యాధికారి యగు రామచంద్రుఁడు, ముఖ్యవైద్యాధికారియు నచటనే యుండిరి. ఇంకను నారుగురితో వెంకటప్పయ్య మాటలాడు చుండెను. వీరందఱు నిట్లు సంభాషించుకొనుచుండగా నొక సేవకుఁడరుదెంచి విజయమోహనుని రాకనుఁ దెలిపెను. మంత్రియుఁ దనప్రక్కనే యొక యాసనమును వేయ నియోగించి, విజయమోహనుని రావించి యందాసీనుఁ డగునటులఁ జేసెను. వీరందఱును మాటాడుచుండ విలాసభవనము నందలి హత్యలనుగురించి మాటవచ్చెను. విజయమోహనుఁడు హేమచంద్రునికిని తనకునుగల స్నేహమును గురించియు నాతని యౌదార్యమును గురించియు దెలిపి యంతటిభయంకరవ్యాపారము తా నిదివఱకెన్నఁడును విన లేదని వాక్రుచ్చెను.ఇంతలో భోజనఁపువేళ యగుటచే, మఱికొంత సేపు మాటలు చెప్పి యెవరి యిండ్లకు వారుపోయిరి. వెంకటప్పయ్యయును నశ్వము నధిరోహించి తనయింటికిఁ బోయెను.

వెంకటప్పయ్య కిప్పుడు నలువదియైదువత్సరముల వయస్సుండును. ఆతని భార్యాపుత్రు లెవరును యిప్పు డింటియొద్ద

లేరు. భార్యను, పిల్లలను పుట్టినింటి కొకసారి యత్తవారు కోరఁగా వెంకటప్పయ్య పదునైదుదినముల వెనుక పంపించెను. కాని యింటియందు దాసదాసీజనంబులు చాలమంది యుండిరి. వెంకటప్పయ్య యింటికి వచ్చినవెంటనే ముఖ్యసేవకుఁ డొకఁడరుదెంచి చాకలివాఁడు వచ్చెనని తెలిపెను. మంత్రి తన కోటునుతీసి చాకలికివేయుమనియిచ్చెను. సేవకుఁడును యెప్పటి వలె జేబులలో చేతులనిడి యంతయును వెదకి యందులోని కాగితఁపు సంచి నొకదానిని మంత్రిచేతి కిచ్చెను. దానిపైన "ముఖ్యమంత్రి యగు వెంకటప్పయ్యగారి సన్నిధికి"యని యుండెను. వెంకటప్పయ్యకు దాని నిదివరకుఁ జూచిన జ్ఞాపకముగాని యది యెవరైన నిచ్చిన జ్ఞాపకముగాని లేనందున యాలోచించుచు దానిని దెఱచెను. దానిలో నొక యుత్తరము తనకే యీక్రిందివిధమున వ్రాయఁబడెను.

ముఖ్యమంత్రియగు వెంకటప్పయ్యగారి సన్నిధికి :

అయ్యా,

ప్రస్తుతము రాజకీయవ్యవహార మంతయుఁ దమచే నడుపఁబడుచున్నది గనుక, నాదొకమనవి చిత్తగింప వేఁడుకొనుచున్నాను. విలాసభవనపు హత్యలనుగురించి యంత శ్రద్ధ తీసికొనక్కరలేదని మీరు రామదాసుతోఁ దెలుపఁగోరెదను. జయరాముని పట్టునంతటి మేధావి రామదాసు

కాడుకదా, యీ ప్రపంచమునం దెవరును లేరు. ఈ రక్షక భటులు, నీ వ్యవహారమును జూడగా, నాకు నిజముగా నవ్వు వచ్చుచున్నది. యాత్రార్థమై నేను కాశీకిపోయియుండుటయేమి యీ చేతకాని పెద్దమ్మ లందఱును జయరాముని చంపితిమని యూరూరఁజాటుట యేమి! జయరామునిఁ జూచినవారిలో ప్రస్తుతమున్న రక్షకభటుఁ డొక్కఁడును లేడు. జయరాముఁడు పట్టపగలు మీ సమక్షమున తిరుగుచున్నాడు. ముఖ్యరక్షక భటాధికారి యని గర్వించు రామదాసుతో మాటలాడు చున్నాడు. దొంగయును మనుష్యునివలెనే యుండును. వెఱ్ఱి రామదాసు నీపాటికైన విశ్రాంతి తీసికొనుమని చెప్పుడు. ఈ యుత్తరముఁ జూచినవెంటనే రామదాసునకు కబురుపంపి, యాతని నావ్యవహారమునుండి త్రిప్పెదరని నమ్ముచున్నాను. మీ వ్యవహారము లన్నియును నేను కనిపెట్టుచునే యున్నాను. మరల త్వరలో వ్రాసెదను.

చిత్తగించవలెను.

ఇట్లు,

జయరాముఁడు,

త్రిభువనచోరాగ్రేసరుఁడు.

ఈ యుత్తరము చదువుచున్నపుడు వెంకటప్పయ్య కెట్లుండునో, చెప్పటకంటె, చదువరు లూహించికొనుటయే బాగుగానుండును. రాజ్యమునందలి ప్రజలక్షేమ మంతయు

తన చేతులలో నున్నది. ప్రజల కీతఁడు తండ్రివంటివాఁడు. అట్టితని నీనిర్భయమైన యుత్తరము తనకే వ్రాయఁబడుటఁ జూచి మిగుల నాశ్చర్యమగ్నమానసుఁ డాయెను.

వెంటనే యేమియునుఁదోఁచక, రామదాసునకు తక్షణము రావలయునని కబురుపంపి, తాను భోజనమునకై లేచెను. భోజనమునకు కూర్చుండునపుడును, భోజనము చేయునపుడును, భోజనానంతరము లేచునపుడునుగూడ నాతనికిదియే యోచన. ఉదయముననే లేచి తాను స్నానాదికృత్యములఁ గావించుకొని బయలుదేరి కచేరీకిఁబోవుట. అచట స్నేహితులతోడను, రాజకీయోద్యోగులతోడను మాటలాడుట. మరల నశ్వముమీఁదతిరిగి యింటికివచ్చుట. "అరే! ఈయుత్తర మెట నుండి నాజేబులోని కురికినది!" భోజనము చేయుచున్నపుడు మరల నాయుత్తరమునుఁ దెప్పించి చూడగా దానిపై నానాటి తారీఖేయుండుటఁగాంచి, వెంకటప్పయ్య మిగుల చమకితుఁడాయెను. "అట్లయిన నీయుత్తర మీనాఁడే యరుదెంచినదా! ఏమి యీయాశ్చర్యము! ఉదయమున నేను బోవునపు డంగటి వీథిని జనసమ్మర్దములో నెవరైనఁ బడవేసియుందురా? బహుశః యటులనే జరిగియుండవలయును. అంతకుఁదక్క వేరుమార్గము కానరాదు."

ఇట్టి యాలోచనలతో భోజనము ముగించి బయటకరుదెంచనప్పటికి రామదాసువచ్చి కనిపెట్టుకొనియున్నటుల సేవ

కుఁడరుదెంచి మంత్రితోఁ దెలిపెను. తత్తరమున నాతఁడ టకుఁబోవ, రామదాసు సగౌరవముగా లేఁచి నమస్కారముఁ జేసెను. మంత్రియు నాతనినిఁ గూర్చుండఁజేసి "రామదాసూ! విలాసభవనమునందలి హత్యలవిషయమై యెంతవఱకుఁ బని జరిగినది?" అని ప్రశ్నించెను. రామదాసందులకు "అయ్యా! ఈ హంతకుఁ డెవఁడో నాకేమియును బోధపడుటలేదు. ఇచ్చటి వాఁడో లేక మఱెచ్చటినుండియైన నిచ్చటికి వచ్చెనో కూడ తెలియదు. ఈ హత్యలనుగురించి తలఁచిన కొలఁదియు నా మేధాశక్తి యంతరించిపోవుచున్నటులఁ దోఁచుచున్నది" అని ప్రత్యుత్తర మిచ్చెను.

వెంక—హంతకునినామమే తెలియుటలేదా! తెలిసినమాత్ర మేమిప్రయోజనము? ఆతఁ డెచ్చటనున్నాఁడో నీకేమి తెలియును?

రామ—మీరు హంతకునినామము తెలిసినటులనే మాటలాడు చున్నారు! ఆతనిపేరు మీకుఁ దెలియునా?

వెంక—ఆ! తెలియును. ఆ చోరాగ్రేసరుఁడు, దారుణహంత కుఁడు, క్రూరకర్ముఁడు, మాయోపాయుఁడును నగు జయరాముఁడు మరల నవతరించినాఁడు. వాఁడు చని పోయినటుల నీరక్షకభటవర్గ మొక వదంతిమాత్రము

కల్పించినది. ఈవిలాసభవనమునందలి హత్యలకుఁ గార
కుఁడు జయరాముఁడే!

రామ—జయరాముఁడా! కాడు. నిశ్చయముగా ముమ్మాటి
కిని జయరాముఁ డీహత్యలను చేయలేదు.

వెంక—అట్లైన నాతఁడు చనిపోయెననియేనా నీనిశ్చయము?

రామ—బ్రతికియే యుండవచ్చును. కానియీహత్యలుమాత్ర
మాతనిచేఁ గావింపఁబడలేదు.

వెంక—నేను హత్యజేయలేదని నీ కాతఁడేమైన వుత్తరము
వ్రాసెనా?

రామ—చేసితినని, జయరాముఁడు తమ కేమైన వుత్తరము
వ్రాసినాడా?

వెంక—ఆ! వ్రాసెను. ఇదిగో చూడుము. అని తన యొద్ద
గుప్తముగా నుంచఁబడిన యుత్తరము రామదాసున
కందిచ్చెను.

రామదా సదిచూచి నిర్విణ్ణుఁడైపోయెను. ఏటికో కాని, వాత్యాహతంబగు సముద్రనౌకవలె నాతఁడు ప్రకంపితశరీరుఁడై, ఆయుత్తరమును వడిగాచదివి "అసత్యము! అంతయు నబద్ధము! ఈ జయరాముఁడు వేరు—జయరాముఁడు కాడు" అను నర్థములేని పదములను కంపితస్వరముతోఁ బలికెను.

వెంక—ఇంతకన్నను చాలవిచిత్రము లైన దుర్ఘటకార్యంబుల ననేకముల నెఱవేర్చియుంటిని. రామదాసూ! జయ రాముఁడన్న నీకంతవణఁకేల? అని కొంచెము హాస్య సూచకమైన చిరునగవుతో వెంకటప్పయ్య యనెను.

రామదాసు లేఁచినిలువఁబడెను. ఆతఁ డిపుడు కంపము నొందుటలేదు. మిగుల గంభీరమైన రూపముఁదాల్చి కోపారుణితలోచనుండై మత్స్యవల్లభు నెదుట తననిజస్వరూపముఁ దాల్చుటకు సంసిద్ధుఁడైన హనుమంతునివలె నుండెను. వెంకటప్పయ్యయును, దనకు తెలియకనే లేఁచినిలువఁబడెను. కొంత సేపటివర కెవరును మాటలాడలేదు. రామదాసే యిటులనెను. "అయ్యా! ఇది దారుణకుతంత్రము. జయరాముఁడీహంతకుఁడు కాడని చెప్పుటకు నాకు ప్రబలసాక్ష్య మున్నది. ఈ విషయములో దయయుంచి, నన్నేమియుఁ బ్రశ్నింపకుఁడు. కొలదికాలములోనే నేనీహంతకుని తమసన్నిధికిఁ దీసికొని వచ్చెదను. ఆతఁడీభూలోకములో నెచటనున్నను మదీయహస్తగతంబగునని నమ్ముఁడు. అటులఁ ద్వరలో నెఱవేర్చలేక పోయిన యెడల, నేనీయుద్యోగము విడచిపెట్టి ఫకీరునై పోయెదను."

వెంక—రామదాసూ! నీశక్తి నాకుఁ గ్రొత్తకాదు. నీకును నాకును నుండు పరిచయమునుబట్టియు, నాకు నీమీఁద నుండు పుత్రవాత్సల్యమునుబట్టియు నటుల హేళనఁ

జేసితిని. ఇంతమాత్రమున కీదారుణశపథమేల? ప్రయత్నము చేయుము. నీకీపనియం దిదివఱకే సర్వస్వాతంత్ర్య మీయఁబడినది.

రామ—అయ్యా! నా సెలవిండు. నేనీరోజుననే చోరాన్వేషణప్రయత్నము మొదలువెట్టెదను. నేనీపట్టణమున నెప్పు డుండెదనో, ఎప్పు డుండనో తెలుపఁజాలను. ఈ కార్యము నెరవేరువరకు తరచుగా తమదర్శనము చేసికొనఁజాలనందుకు మాత్రము క్షమింపుఁడు.

## ఏడవ ప్రకరణము

మ. అదె మాణిక్యపు పూర్ణకుంభమువయస్యా కార్య సంసిద్ధికై
మొదలందోచిన యట్టి మంచి శకునంబుంగా విచారింపవో
యుదయంబయ్యెడు, భానుబింబుముది శావ్యోమావ కాశం
బులన్.
బదిమార్వన్నె పసిండితీగలగతిం బ్రాకెన్ బ్రభాజాలముల్.
—క్రీడాభిరామము.

ఉదయకాంతులు కౌశికానదిపైఁ బ్రసరించి చూచుటకు చాల ముచ్చటగనుండెను. పల్వోలపట్టణమునందలి దివ్యసౌధములును, దేవాలయములును, ఆ యుదయ కాంతి, ఆబాల

సూర్యుని లేఁతకిరణములు పైఁబడ మెఱయుచుఁ జూపరుల దృష్టి నాకర్షించుచుండెను. బ్రాహ్మణోత్తములు పాత్రధారులై కౌశికానదియందు స్నాన సంధ్యాది కృత్యంబుల నెరవేర్చి కొనుచుండిరి. స్నానముచేసినవారు దట్టముగ విభూతిరేఖలు దిద్ది యదరముల నాడించుచు నెమ్మదిగా నింటికిఁబోవుచుండిరి. శిష్యులు గురువుల వెంటఁబడి వేదమును వల్లించుచు గురువుల కంఠధ్వని ననుకరించుచుఁ బోవుచుండిరి. సోపాన పంక్తికికొంత దూరములో నిరుప్రక్కల ననేకవర్ణముల నౌకలు కట్టఁబడి యుండెను. పడవవాండ్రు నేవోపాటలుపాడుచు కూనిదీర్ఘములఁ దీయుచుండిరి.

ఆసమయమునం దిద్దరు భూసురులు మెట్ల కీవల నున్న గచ్చుతిన్నెలపైఁ గూర్చుండి యీక్రింది విధమున మాటలాడు కొనుచుండిరి.

మొదటి—నీవాతఁడటు మాయమైపోవుటఁ జూచినావా?

ఏమో, నాకుమాత్ర మంతనమ్మకము లేదు.

రెండ—నీ వేదియును నమ్మవు. నే నీకన్నులతో స్వయముగా జూచినాను. నేనంత వెఱ్ఱివాఁడను కాను. మొదట నేనును నమ్మలేదు. కాని స్వయముగాఁ జూచినతర్వాత నమ్మకపోవు టెట్లు?

మొదటి—అట్లులైన నేమి జరుగునో చెప్పుము.

రెండ——నిన్న మూడుగంటలకే నేను పోయి సన్న్యాసి సాధా రణముగా జపముచేసికొను రావిచెట్టుక్రింద కూర్చుం టిని. నేనేమిటి! వేలకొలదిజన మచటనే యుండిరి. ఆ సన్న్యాసియు కొంతసేపటి కక్కడకు వచ్చెను. కాని యాతఁడు కన్నులుతెఱచి చూడలేదు, మాట్లాడలేదు. ఓహో! యేమియాజపము! ఆనిష్ట! చూచితీరవలసినదే.

మొదటి——ఏమిటో! దొంగసన్న్యాసులు చాలమంది యింత కన్న నెక్కువ నిష్ఠతో నుందురు. అంత మాత్రము చేతనే గొప్పవాఁ డని నిర్ధారణ మెక్కడ?

రెండ——అదుగో! అందులకే నాకుఁ దలనొప్పి పోదూ! నేను చెప్పను. నీయిష్టము. నమ్మితేనమ్ము, లేనియెడలలేదు.

మొదటి——అదికాదు. మాటవరుసకంటిని. కానిమ్ము. నీవు పొగడుట, వర్ణనమాని, కథ జరిగినది జరిగినటులఁ జెప్పుము.

రెండ——నాకడ్డము చెప్పక వినుమరి. అంతట వేలకొలదిజన మచ్చటికి వచ్చినారు. ఆసన్న్యాసి, మాటలేదు; అదే జపము; అదేతపము; ఎవరేది యిచ్చినను, పండ్లుగాని పాలుగాని తీసికొనుటలేదు. తననిష్ఠయేమో, తనధ్యాన మేమో కన్నులయినను తెఱవనిదే! ఇంతలో రావి చెట్టుకొమ్మ యొకటి,—చిన్నదేలే—విరిగి యాతని

మీఁదఁ బడినది. జనులు గొల్లుమనినారు. సన్న్యాసి మాత్రము చలనములేదు; రాతిబొమ్మవలె, రావిచెట్టువలె నదేజపము. జనులు, కన్నులు తెఱచునేమో, మాటలాడునేమోయని కనిపెట్టుకొని, కూర్చుని చివరకు విసుగెత్తి యెవరియిండ్లకు వారు పోయినారు. పాప మెవరో ముసలియవ్వ యొకతె గిన్నెడుపాలు...

మొద—కానిమ్ము. ఇంతలో సాయంసమయ మైనది. ఎవరి యిండ్లకు వారు పోయినారు.

రెండ—ఏమిటా తొందర! నా యిచ్ఛవచ్చినటుల చెప్పనిమ్ము. లేనిమెడల లేదు.

మొద—ఊఁ! త్వరలో కానిమ్ము. నాకు వేరే పని యున్నది.

రెండ—సరే! అయితే వినుమరి. నాలుగు ముక్కలలో ముగించెదను. చూచినావూ! రామాయణ మంతా, "పూర్వం, రామ తపోవనానుగమనం" యను శ్లోకములో నిమిడ్చివైచి, చెప్పినట్లు చెప్పివైచెదను: ఆ విధముగా నందరూ వెడలిపోవుచుండిరి. నేనును, మరినల్గురము మాత్రము మిగిలితిమి. ప్రత్యక్షముగాఁ జూత మనికాదూ! ఇంతలో కొంతవరకుఁ జీకటి పడినది. దీపము లన్నిచోట్లను వెలిగింపఁబడినవి. వాహ్యాళికి పోయినవారందరు........

మొదటి—ఆ దిక్కుమాలినవర్ణన మేలనోయి ?

రెండ—ఆ! ఇంతలో చీకటిపడినది. సన్న్యాసి, యప్పుడు కన్నులు తెరచినాడు. మేము దూరముగాఁ బోయి నిలువఁబడితిమి. ఆ సన్న్యాసియును బయలుదేరి, తిన్నగా నదియొద్దకు వచ్చినాడు. మమ్ములను మాత్రము చూచినాడో లేడో, మేము సరిగాఁ దెలుపఁ జాలము. అతఁడా నర్తకుల క్రొత్తయోడవరకును నడచి పోయి, యచట బుడుంగున మునిగి మాయమై పోయి నాడు. ప్రజలందరు ననుకొనున దేమియనగా, నాతఁడు జలస్తంభనవిద్య నేర్చినవాఁడనియును, యందుచే, దినములకొలదియు చేపవలె నీట మున్గియే యుండుననియు దానికికూడ నిదర్శనము లేకపోలేదు. ఆనీటనుండియైన ప్రతిదిన మాతఁడు బయటకు రాడు. ఒకదినమున నుదయమునను, మరియొకదినమున సాయంసమయమునను యాతఁ డగపడును. ఒక్కొక్క దినమున నసలే కానరాడు. ఆతఁడటు మునిగినవెనుకనే మేమును నింటికి పోయితిమి. ఆతఁడు భవిష్యత్తును గన్నులకుఁ గట్టినటుల జెప్పఁగలఁడట. అతఁ డన్నమా మైతీరునట. కాని యాతఁడెవరితోడను మాటలాడుచుండగా నేను జూడ లేదు. ఒంటరిగా నున్నపు డెవరితో నైన నాతఁడు మాటలాడునట. ఇట్టివాఁ డావిచిత్ర సన్న్యాసి!

మొదటి—నిజము నిలుకడమీఁదగాని, తేలదు. ఇంత మాత్ర
మునకే నాతఁడు మానవాతీతుఁ డనియును, దైవాంశా
సంభూతుఁడనియును దెలుపవీలుకాదు. ఆతని రూప
మెటులుండును?

రెండ—రూపమా! అతనిని, నిజముగా మనుజుఁ డనుకొనుటకు
వీలులేనంతటి సౌందర్యవంతుఁడు, నిజముగా నాతఁడు
దేవతాంశాసంభూతుఁడుగాని సాధారణ మనుష్యుఁడు
కాఁడు. ఆతని రూపరేఖావిలాసములఁ గాంచిన నాతఁడు
మహానుభావుఁ డని తోఁచకమానదు. ఆబిరుసుగెడ్డము
ఆ జడలుకట్టుకొనిపోయిన జటలతోడనే యాతఁ డంత
సౌందర్యవంతుఁడై యుండగా, నిజముగా నీ కాలపు
మనుజులవలె నాగరికుఁడై యుండిన నెటు లుండునో
కదా!

మొద—ఈ రోజున నేనుకూడఁ జూచెదను.

వీరిసంభాషణ ముగియునప్పటికి నెండ కొంచెము కొంచె
ముగాఁ దీక్షణమగుచుండుట గ్రహించి, స్నానమునకుబోయిరి.
మొదటివాఁడుమాత్రము సన్యాసికొఱకచ్చట చాల తడవు
చూచి యాతఁ డెంతసేపటివఱకును రాకపోవుటచే వెడలి
పోయెను.

---

# ఎనిమిదవ ప్రకరణము

విమలభవనమునందు హైమవతీదేవి తనపడకగదియం దత్యంతమనోహరమైన యొకమంచముపైఁగూర్చుండి యుండె ను. ఆమె కేశజాల మంతయు న్విప్పఁబడి మంచముక్రిందికి వ్రేలాడుచుండ ప్రియంవదయనుదాసి చిక్కును తీయుచుండెను.

ప్రియంవద హైమవతీదేవి కత్యంతప్రియురాలు. ఈమె కు పదునెనిమిదేండ్ల వయస్సుండును. మిగుల సౌందర్యవతి. హైమవతీదేవియు నిరువదేండ్ల వయస్సుగల జవరాలగుటచే వీరిద్దరకు నత్యంతస్నేహము. ప్రియంవద శృంగారకథలు, హాస్యకథలు, పట్టణమునందలి విశేషములుచెప్పి హైమవతీ దేవికి కాలక్షేపమగునటులఁ జేయుచుండును. వారిద్దరికి నీక్రింది విధమున సంభాషణ మగుచుండెను.

హైమ—ప్రియంవదా! ఈనాడు నాకేలనో యేమియు దోఁచుట లేదెందుచేతనే?

ప్రియం- ఏదైనకథఁ జెప్పమందురా?

హైమ—కథకాదుకాని, యీపట్టణమందలి విశేషము లేమైన నున్నఁ జెప్పుము.

యం—విశేషము లేమున్నవి! కాని యీపట్టణమున కొక విచిత్రసన్న్యాసివచ్చియున్నాఁడు. ఆతనిని నేను మొన్న

కౌశికకుఁ బోవుచుఁ జూచినాను. ఏమి రూప మమ్మా యాయనది! ఆ ముఖవర్చస్సు సూర్యకాంతిని మించి యున్నది. ఒంటరిగాఁ గాని యాతఁ డెవరితోడను మాటలాడఁడట. ముందు జరుగఁబోవుసంగతులు, మనస్సులోనున్న సంగతులు నాయనకుఁ దెలియనివిలేవట. ఎప్పుడును గన్నులు తెఱచిచూడనైనఁ జూడఁడట. మఱియొక సంగతి! దినములకొలదియు నీటనే యుండి, జపము చేసికొనునట. ఆపీలికలలోను, గెడ్డములలోను, నంత యందమైనవాఁడుగా నుండినప్పుడు, నిజముగా సంసారియైన నెట్లుండునో?

హైమ—అంత గొప్పవాఁడటే యాతఁడు. ఎన్ని దినములనుండి నిచట యున్నాడు?

ప్రియం— సుమారు పదునైదు దినములనుండి యిచటనే యున్నాఁడట.

హైమ—ఆలాగునా? అటువంటివారి దర్శనము కల్గుట మహాభాగ్యమే. నాకెట్లులైన నాతనిదర్శనభాగ్య మబ్బునా? ఏమే ప్రియంవదా! నీవు చాల తెలివితేటలు కలదానవు కదా! ఆయన దర్శనము నాకుఁ గాదా?

ప్రియం—ఏమో, నాకేమియును దోఁచకున్నది. మీరు బైటకుఁబోరుకదా. ఆ సన్న్యాసినిఁ గోటలోని కెవరు రానిత్తురు?

హైమ—అవును. ఆ పాపిముండకొడుకు వెంకటప్పయ్య యీ లాటివారికి నాజ్ఞనీయఁడు. ఎందుచేతనోకాని, నా కాయనదర్శన మొకసారి చేయవలయునని యున్నది. ఇంకేమియును దారిలేదా? నీవు సూక్ష్మబుద్ధి కలదానవు. ఏదైన దారి నాలోచింపుము.

ఇంతలో నొకసేవకుఁడటకరుదెంచెను. "మహారాణీ! తమయాజ్ఞయైనదని తెలిసినది" అని యాతఁడు సవినయపూర్వకముగా ననియెను. రాణి కంతట నేదియోసంగతి జ్ఞప్తికివచ్చెను. "అవును, నిన్ను పిలువనంపితిని. నిన్నొకముఖ్యమైన రాజకార్యమునందు నియోగించెదను. నీవాకార్యము, కడురహస్యముగను, జాగ్రతగను ముగించినయెడల నీకు గొప్ప బహుమతి దొరకఁగలదు" అని యామె యనెను.

సేవ—తల్లీ! తమయన్నముఁ దినువాఁడను. నాకు బహుమతులేల? తమయాజ్ఞ శిరసావహించి, తమ యిచ్ఛవచ్చిన రీతినిఁ గడుజాగరూకతతోఁ జేయగలవాఁడను.

హైమ—అట్లైన వినుము. నేనొక యుత్తరమును వ్రాసితిని. ఆయుత్తర మతిరహస్యముగా రామచంద్రనగరము తీసికొనిపోయి యచట నాసోదరున కీయవలయును. నీవొక మంచిగుఱ్ఱమును దీసికొని, యీరాత్రియే తెల్లవారకమునుపే బయల్వెడలి పొమ్ము. నీవా యుత్తరమునకు

జవా బెంతత్వరలోఁ వెచ్చిన నంత బహుమతి నీకిచ్చె దను.

సేవ—తల్లీ! అట్లనే చేసెదను. ఉత్తరమును దయచేయుఁడు.

అంత హైమవతీదేవి, యుత్తర మెచ్చటనున్నదో చూడ మని ప్రియంవదతోఁ జెప్పెను. ప్రియంవదయును, బీరువాను తీసి, యందొక దంతపుకరండములోనున్న యుత్తరమును సేవ కుని కిచ్చెను. సేవకుఁడును మరల నమస్కరించి వెడలిపోఁబో వఁగా, హైమవతి యాతనికి భత్యమునకని చెప్పి కొన్ని బంగారు నాణెములనిచ్చి యాతనిని పంపివైచెను.

హైమ—ఏమేప్రియంవదా! మొన్న వెంకటప్పయ్యతో నేను పుట్టినింటికిఁ బోయెదనని చెప్పియుంటిని. ఈయుత్తర మునకు జవాబు వచ్చువరకును వెడలఁదలఁచికొనలేదు. కనుక నీమాట మరల వెంకటప్పయ్యకొక సేవకురాలిచే కబురుపంపుము. నాశరీరమునం దస్వస్థతగానున్నదనియు నందుచేఁ బ్రయాణ మాఁపు చేయఁబడిన దనియును, గబురు పంపుము. సరే! నన్న్యాసిమాట మఱచితిమి. నీకేమియు నాలోచన కుదరలేదా?

ప్రియం—నాకొక్క యాలోచనమాత్రము తోఁచుచున్నది. అది మీకు బాగుగానుండునో లేదో ?

హైమ—ఏమిటది?

ప్రియం—మన యుద్యానవనమున కవతలనున్న ద్వారము లోనివారల కేమైన లంచమిచ్చిన వా రొడఁబడుదురు. సింహద్వారమునుండియే రావలయునా యేమి. ఈ ద్వారము తఱచు తెఱవఁబడకపోయినను సువర్ణముచే నాపని చేయింపవచ్చును. ఇదంతయు వెంకటప్పయ్యకుఁ దెలియవలసినంత యవసరమేమి వచ్చినది ?

హైమ—అవును. నీయాలోచన బాగుగనేయున్నది. నీవీనాఁడే దీపములవేళఁబోయి యాసన్న్యాసి నొంటరిగా కలసికొని, నీవాక్చాతుర్యమును జూపి, యెట్లులైనఁ దీసికొని రమ్ము. ఆసన్న్యాసియే యిచ్చటికివచ్చిన మనమదృష్టవంతులమే !

ఇటులనే చాలసేపటివఱకును, హైమవతియు, ప్రియంవదయు సన్న్యాసినిగురించియు ననేకవిషయముల గురించియు మాటలాడుకొనిరి. సాయంసమయ మగుటతోడనే, ప్రియంవద యరిగెను.

ప్రియంవదయు నటుపోయిన వెంటనే, రాణి తన్ను శృంగారించుకొన మొదలుపెట్టెను. రాణిమనస్సులో నేము న్నదో యెవరికెఱుక! ఏమియునుండి యుండదు. ఆమెమనస్సు స్వచ్ఛమైనదే కావచ్చును. మనస్సు పరిశీలింప శక్తి యెవరికి? కాని యాశృంగారమూర్తి, దివ్యాలంకారశోభితురాలై, నిల్వ

టద్దములోఁ దనఛాయను జూచికొని, చాల మురిసిపోయెను. ఎవరుచూచి సంతసించున దాయందము! చిన్ననాడే వైధవ్య మెంత దురవస్థ! అందునను, మహాభోగపరురాలును, నత్యంత విలాసవతియును నగు హైమవతీ దేవికి!

ప్రియంవదయు నెమ్మదిగా నెవరితోడను మాటలాడక సన్న్యాసి ప్రతిదినము నలంకరించుస్థలమునకుఁ బోయెను. కాని యచట సన్న్యాసిలేడు. అచటినుండి నదియొద్దనకుఁబోయెను. ఆమె యదృష్టముచే నచట సన్న్యాసి యొకచెట్టుదరిని బట్టల నారవైచుకొనుచుండెను. చుట్టుప్రక్కల నెవరును మనుష్యులు లేరు. చీకటివేళ, చెట్లనీడ. మంచిసమయమేయనుకొని ప్రియం వద నెమ్మదిగా నాబిమీలితలోచనుఁడగు సన్న్యాసికినమస్కా రముఁ గావించెను. ఆతఁడుచూడనేలేదు. ప్రియంవద"స్వామీ" యని పిలచెను. సన్న్యాసి కన్నులవిప్పి చూచెను.

సన్న్యా—ఎవరు నీవు?

ప్రియం—స్వామీ! నేను మహారాణియగు హైమవతీదేవి దాసిని. నాపేరు ప్రియంవద. తమదర్శనార్థ మరు దెంచితిని.

సన్న్యా—పనియేమి?

ప్రియం—మా మహారాణి తమదర్శనము నొకసారి కోరు చున్నది. తమ రనుగ్రహించినయెడల నామె మిగుల సంతసించును.

సన్న్యా—సన్న్యాసులము! మ
రాచనగరులతోడను పనిలేదు.

ప్రియం—ఈదాసురాలివిన్నప మాలింపవలయును. మీ రన్ని యు వదలిపెట్టిన సన్న్యాసులేఁ కాని దాసదాసీజనం బుల కోరికలునెఱవేర్చి దైవత్వ మొందవలయును. స్వామీ! తమదయ.

సన్న్యా—ఎప్పుడు రమ్మన్నది మీరాణి?

ప్రియం—తమ చిత్తము స్వామీ!

సన్న్యా—పరులకంటఁబడకుండ, నేనచటికి వత్తునని యెవరికిని దెలియకుండ, నీకార్యము నిర్వహింపఁబడఁగలదా? లేక మంత్రికిని వారికి దెలియునా?

ప్రియం—స్వామీ! ఎవరికిని దెలియదు. నేను మిమ్ములను బరులుచూడకుండఁ జీకటిలోఁ దీసికొనిపోఁగలను. కోట కు రహస్యద్వారములు లేకపోలేదు.

సన్న్యా—సరే! అట్లైన తేపింకను గొంచెము చీకటి పడిన తరువాత సరిగా నిచటికే రమ్ము. పొమ్ము.

అనగా, ప్రియంవద సంతుష్టాంతరంగురాలై వెడలెను. సన్న్యాసియు నదిగట్టువెంబడి నెచటికో పోయెను.

ప్రియంవదయు నాతురతతో నెదురు చూచుచున్న హైమవతీదేవికడకువచ్చి, జరిగినదంతయుఁ దెలిపి యామెను సంతోషపెట్టెను.

## తొమ్మిదవ ప్రకరణము

ఆనాటిరాత్రింకను చీకటి యుండగనే బయల్వెడలి యశ్వారూఢుఁడై హైమవతీదేవి సేవకుఁడుత్తరమును గొంపోవుచుండెను. తనకేదో మంచిలాభము వచ్చునని యాతఁడధిక సంతసముతోఁ గడురయమునఁ బోవుచుండెను. కపిలేశ్వరపురముయొద్ద రేవుదాటి, యచటనుండి రామచంద్రనగర మానాటి సాయంసమయమునకో మరునాటియుదయమునకో. పోవచ్చునని యాతఁడు తలంచెను.

కపిలేశ్వరపురము, కౌశిక కావలియొడ్డున నున్నది. రేవుదాటినయెడల నాగ్రామము కన్పట్టును. పల్వెలపట్టణము నుండి వేదపురికి సుమారు ఆరుమైళ్లదూర మున్నది. కాని బాట యేమియు మంచిదిలేదు. కౌశికానది వఱదకాలమునందు పొంగినపుడు పల్వెలపట్టణఁపు సరిహద్దు మొదలు వేదపురివరకు నున్న స్థలమంతయు మునిగిపోవును. వరద తగ్గినపుడు మాత్రము కృషికు లాలంకలమీఁద పంటలు పండించికొని

వరదకాలమునఁ దమతమ యిండ్లకుఁ బోవుదురు. పల్వేల పట్టణము చాల నెత్తుగాఁ గట్టబడి యుండుటచే నెంతవరదవచ్చినను భయములేదు. పల్వేలపట్టణమునుండి కపిలేశ్వరపురము వరకునున్న కాలిబాటయం దశ్వములుకూడ బోవచ్చును. ఆదారియంతయు నరణ్యమువలె పెద్దపెద్ద, బూరుగు మఱ్ఱి, తింత్రిణి వృక్షములచే నిండి భయంకరముగా నుండును. చాల దూరము పట్టపగలే సూర్యకిరణములు ప్రవేశింపలేని యాయ విరళారణ్యములోనుండి యా యాశ్వికుఁడు పోవుచుండెను. గుఱ్ఱము చాలసార్లట ప్రయాణముఁ జేసినదే యగుటచేఁ ద్వరితముగనే పోవుచుండెను. ఆ యాశ్వికుఁడును బహుమానము నందలి యాశచే నింకను బాగుగా చీకటియుండగనే బయల్వెడలెను.

పట్టణము వదలి యాతఁడు మూడుక్రోసులదూరము మాత్రమే వచ్చెను. కాని యప్పుడాయరణ్య మధ్యమం దేదో చప్పుడాతని వీనులబడెను. కాగడాల వెలుఁగుతోఁ బదిమంది పరువెత్తికొని తనవైపేవచ్చుటఁగాంచి యాతఁడు చాల భయపడెను.

గుఱ్ఱమును వడిగాఁ బరుగెత్తించుటకుఁగాని వెనుకకుఁ దిరుగుటకుఁగాని యాతనికేమియును దోచలేదు. ఇంతలో నా పదిమందియుఁ గడురయంబున నీతనియొద్దకేవచ్చి గుఱ్ఱమును జుట్టువెచిరి. ఒకఁడు కళ్లెమును గట్టిగాఁ బట్టుకొనెను. గుఱ్ఱము

కదలలేకపోయెను. అందులో నొకఁడు "నీయొద్ద నేమున్నదో దాఁచక మాయెదుట నుంచుము. కాదేని నీప్రాణములు నీవి కావు" అనెను. అంత నాయాశ్వికుఁడును భయపడి తనయొద్ద నేమియులేదని తెల్పుచుఁ దనకత్తికొఱకై వెదకుకొనెను. కాని యాకత్తి యప్పుడే దొంగలచేతిలోఁ బడెను. దొంగ లాతనిని బలవంతముగాఁ గ్రిందికి దింపిరి. "నీయొద్ద నేమున్నదో యిచ్చెదవా లేక బల ముపయోగింప మనియెదవా?" యని మరల నొకదొంగ యాతనినిఁ బ్రశ్నించెను. అంత, తనయొద్దనున్న నాణెములను వారి కాయాశ్వికుఁ డిచ్చెను. "ఇంకను నేమైన నున్నదేమో చూడుఁడు" అని వారినాయకుఁడు మరల నాజ్ఞాపించెను. అప్పు డాయశ్వికుని దుస్తులన్నియు విడఁదీసి వానిని వెదుకఁగా నాదొంగల కందొక యుత్తరము దొరకెను. వారి నాయకుఁ డాయుత్తరమును దీఁపపు వెలుఁగున నీక్రిందివిధమునఁ జదివెను.

"చిరంజీవి రాజసింహునకు,

నీసోదరి యగు హైమవతి దీవించివ్రాసిన సంగతులు. ఈమధ్య నీదగ్గరనుంచి యుత్తరములేమియు లేవు. కారణము తెలియదు. నేనొకసారి బయలుదేరి వచ్చెదననుకొంటిని గాని మరల నీయుత్తరము వ్రాసి, దీనికివచ్చినజవాబుచూచిన వెంటనే వచ్చుటకు నిశ్చయించుకొంటిని. నే నిప్పుడొక క్రొత్త యాలోచనలో నుంటిని. నాసవతికూఁతురగు శ్యామసుందరిని నీ కిచ్చి

వివాహము చేసినయెడల మనకుఁ జాలలాభము లున్నవి. కాని మిత్రత్వమునను మంచిమాటలచేతను, యావివాహము జరుగు నటులఁ దోఁచదు. వెంకటప్పయ్య జరుగనీయడు. శ్యామసుందరి కేవిధముననైన నచ్చచెప్పవచ్చును. అటులగనుక జరిగినయెడల రాజ్యము మన చేతులలోఁ బడును. ఇచ్చటి సేనాధిపతి యగు రామచంద్రుఁ డిప్పుడు రామచంద్రనగరము వచ్చెనని తెలిసినది. ఆతనిని నీవు చాలగౌరవించి మంచిమాటలతో మనపక్షమగు నటులఁ జేయవలయును. ఆతఁడే మనపక్షమునకు తిరిగినయెడల వెంకటప్పయ్య యేమియును జేయఁజాలఁడు. ఈముదుస లెంత కాలము బ్రతుకునో యంత కాలము మన కార్యమున కడ్డమే. నీయాలోచన యేమి? నీవుకూడ నీవిషయమై బాగుగా యోజింపవలయును. వీలైన నొకసారి బయలుదేరి యిచ్చటకు రావలెను.

బాబయ్యగా రారోగ్యముగా తిరుగుచుండిరని నమ్మెదను. ఇప్పటికింతే సంగతులు. ఈ సంగతులు బాబయ్యగారికి గూడ, నెమ్మదిగా నున్నపుడు చెప్పుము.

ఇట్లు నీప్రియసోదరి,

హైమవతి.

ఆయుత్తరములోని సంగతులటు చదివినవెనుక నాదొం గలు తా మాయాశ్వికుని విషయమై యేమి చేయవలయునో

తోఁచక యాలోచించుచుండిరి. నల్గురాతనిని గట్టిగాఁబట్టుకొని నిలువఁబెట్టిరి. మిగిలినవా రొకచెట్టుక్రింద నిలిచి కొంతవఱ కేదియో యాలోచించుకొని, మరలవచ్చి నా యాశ్వికుని పొమ్మనిరి. అంత నాతఁడు "అయ్యలారా! నాయొద్ద నున్న దంతయు మీ కిచ్చివైచితిని. ఈ యుత్తరము మాత్రము నా కిచ్చి నన్నుఁ బోనిండు. మీ కనేకవేల నమస్కారములు. ఈ యుత్తరము పోయిన నా యన్నము పడిపోవును. పిల్లలు కల వాఁడను. నాభార్య చనిపోవుటచే నా కసుగాయలకు నేనే దిక్కు. మీపాదములపైఁబడి వేడుకొనియెదను" అని మిగుల దీనముగాఁ బ్రార్థించెను. అంతట నాదొంగలనాయకుఁడు, మరల నొకసారి యుత్తరము చదివి, దాని నాయాశ్వికున కిచ్చి పొమ్మనియెను. ఆతఁడును చాలసంతసించి మృత్యువునోట నుండి వెల్వడినవానివలె నానందించుచుఁ దనదారిని పోయెను. దొంగలును బళ్ళాలపట్టణమువైపు పోయిరి. అప్పటికి తెల్ల వారెను.

# పదవ ప్రకరణము

ఆనాటి సాయంకాలము చీకటిపడిన వెనుక ప్రియంవద మరల నెమ్మదిగా నిర్ణీతసమయమున కరుదెంచి సన్న్యాసిరాకకై వేఁచియుండెను. కొంతతడవైనపిమ్మట సన్న్యాసియుఁ గమండలధారియై వచ్చెను. కాని యాతఁడిపు డెప్పటివలెఁ దడిగుడ్డలతోను, బికారిమోముతోను రాలేదు. ఆ జటలు, గెడ్డము, నున్నగా దువ్వఁబడియుండెను. తెల్లనిపంచె, లుంగీ, ముసుగు, ధరించిన యాతఁడిపుడు మిగుల నందముగాను వింతగాను కన్పట్టుచుండెను. ప్రియంవదయు, నాశ్చర్యపడి,

"స్వామీ! యిదేమి? మీరు నీటిలోనుండి రాలేదా?" అని ప్రశ్నించెను.

సన్న్యాసి, యామాటకు "మాటలాడకుము. గాలిలో నుండి వచ్చితిమి. దారితీయుము" అనెను.

ప్రియంవద యాతని ప్రభావమునకు మురియుచు, సందులవెంబడిని, తోటలదారిని, నెవరును లేనిచోటులనుండి తీసికొనిపోయి తిన్నగా రహస్యద్వారమునొద్దకుఁ జేర్చెను. అంతకుముందే మాటలు జరిగియుండుటచే ద్వారపాలకు లెవరును నడ్డుచెప్పలేదు. ఆ త్రిదండిని దిన్నగా విమల భవనములోనికిఁ దీసికొనిపోయి, యొకగదియందలి యాసనముపై గూర్చుండ

నియోగించి, రాణి కావార్త తెల్పుటకై ప్రియంవద లోనికిఁ బోయెను.

రాణి తన పడకగదియం దుండెను. ఆ లావణ్యవతి యాభరణాలంకృతయై, విలువగల చీరెఁగట్టి, జడ వైచికొని దేవకన్యకవలె మిగుల నొయ్యారముతో నడచివచ్చెను.

భిక్షుకుఁడు తలవంచికొని ధ్యానపరుఁడై యుండెను. "స్వామీ మారాణి వచ్చియున్నది." అని ప్రియంవద యాతనిని మేల్కొలిపెను. ఆతఁడును "నారాయణ" అనుచు కన్నుల దెఱచెను. ఎదుటనున్న రాణి ప్రక్కకుఁ దొలఁగెను. మబ్బులో మెఱుపు! సన్న్యాసి తలవంచెను. మఱల నెత్తెను. రాణియు నీవలకువచ్చి మరల లోనికిఁ బోయెను.

ప్రియంవద రాణిని మెల్లఁగా దట్టి "మాటలాడుము" అనియెను.

రాణి సన్న్యాసివంకఁజూచెను. మాటాడయత్నించెను. కాని మాటరాలేదు. ఎట్టకేల కతిప్రయత్నముతో, 'స్వామీ' అనియెను.

ఆతఁడు తలపైకెత్తి రాణివంకఁ జూచుచుండెను.

రాణి—తమరు.

సన్న్యాసి—మావద్ద సిగ్గేల. సన్న్యాసులము నారాయణ! ధైర్యముగా మాటలాడవచ్చును.

రాణి బయటకువచ్చెను. కాని, కన్నులు సాధారణముగాఁ దెరచిచూడని యీ మునిపుంగవుఁడు కనులమూయుటయే మఱచెను.

హైమవతి:—"తమకు భవిష్యత్తు తెలియు ననియును, దమరు చెప్పగలరనియును మా ప్రియంవద నాతోఁ బల్కినది. తమరు నాయదృష్ట మెట్లుండునో దయ యుంచి చెప్పెదరా?" అనియెను.

సన్న్యా—ఆఁ! అభ్యంతరములేదు. కాని, పరులుండగా నేను నోరు విప్పను. అటుల నాకొక నియమమున్నది.

రాణి ప్రియంవదవైపు చూచెను. ప్రియంవదయు, "ఇదివఱ కాడినమాటలన్నియు, నేను చెంతనుండఁగా నేల బల్కెనో!" అని గొణుఁగుకొనుచు నావలికిఁ బోయెను.

"ఏదీ! నీహస్తము." అని సన్న్యాసి యడిగెను. రాణి తన కుడిచేతినిఁజాచ సన్న్యాసి యాచేతిని గైకొని, "ఈచేయి కాదు, అది" అనెను.

హైమవతియు, పరపురుషుఁ డని జంకక తన వామహస్తము నాతనిచేత నుంచెను. సన్న్యాసియు, నామె చేతిని, ముఖమును చాలసేపటి వరకుఁ బరిశీలించి, కొంతవరకు ధ్యానించి వ్రేళ్లమీద లెక్కించి, యిటులఁ బల్కెను.

“నీవు రామచంద్రరాజ తనూజవు. దురాశాపరుఁడగు నీతండ్రి నిన్నొక ముదుసలికిఁ గట్టినాడు. నీభర్త బ్రతికియున్న దినములలో నీయందు దయలేక నిన్ను చాలఁ క్రూరముగాఁ జూచెడివాడు. అతఁడు చనిపోయినందుకు, నీకంత విచారము లేదు. నీ వధికారప్రియురాలవు. రాజ్యాధికారమంతయు నీచేతనే యుండవలయునని నీకోరిక. కాని నీకేమియు దారి కాన్పించుటలేదు. నీ యూహాలకు మంత్రి పెనుభూతము వలె నడ్డు తగులుచున్నాడు.

నీసవతికూఁతురు, నీకు త్రాచుపామునకుఁజేయుమర్యాద చేయును. నీవు నీతమ్ముఁడైన రాజసింహునికి శ్యామసుందరి నిచ్చి వివాహముచేసి యా విధముననైన రాజ్యాధికారమును బొందచూచుచుంటివి. ఈసంగతి యంతయును, మీ తమ్మునికొక వార్తాహరుని మూలమునఁ దెలియఁజేసి, యాతనియొద్ద నుండి వచ్చు జవాబునకై నీవిపుడు నిరీక్షించుచున్నావు. నేను చెప్పినది సరిగా నున్నదా?

హై—మీరు మహానుభావులు. నేను తలపెట్టిన కార్యము కొనసాగునా?

సన్యా—కార్యమా? కొనసాగవచ్చును. కాని చాల యడ్డులున్నవి. ముఖ్యముగా, వెంకటప్పయ్య బ్రతికి యుండగా నీకోరిక నెరవేరదు.

హైమ—మరి యెట్లు?

సన్యా—ఆతని నీలోకము విడుచునట్లు చేయవలెను.

హైమ—అదెటుల?

సన్యా—అదే యసాధ్యము. కాని మాబోంట్లు తలcచిన యెడలకార్యముల కడ్డములుండవు. నిన్నుచూచినతోడనే, మాకు నీమీఁద నవ్యాజానురాగము కలిగినది. నీ వదృష్టవంతురాలవు. నీకష్టచరిత్ర మాకు చాల జాలి కలిగించినది. అనేకమంది సంవత్సరములకొలఁదియు నారాధించి విఫలమనోరథులైరి. నీకు కోరిక సిద్ధించునటుల నేను వరము ప్రసాదించితిని. ఇంక నీభార మంతయు నాదే యని తలంచుము. మా ముందట, మా తపోప్రభావము ముందట, మంత్రులుకారుకదా. రాజ్యములే నిలువcబడలేవు...................... ఇప్పటికి నేను పోయెదను.

హైమ—మహాత్మా, నాకు ధైర్యము కలిగించితిరి. మరల దర్శన మెప్పుడు?

సన్యా—వచ్చుచుండెదము. మే మెప్పుడువచ్చినను యడ్డు చెప్పవలదని ద్వారపాలకుల కాజ్ఞనీయుము.



## పదునొకండవ ప్రకరణము

రామదాసు వెంకటప్పయ్యను గలసికొని యప్పుడే పదు నైదుదినములు కావచ్చుచున్నది. విలాసభవనమునందలిహత్య ల విషయమై యాతఁడు పడుచున్నపాట్లు భగవంతుని కెఱుక. ఆతఁ డెన్నియో మారువేషములు వేయుచుండెను. ఎచట పదిమందిచేరి మాటలు చెప్పుకొనుచుందురో యచట పొంచి వారిమాటలు వినుచుండెను. కాని యేవిధమైన కర్తవ్యము తోఁచుటలేదు. ఆతఁ డీవిషయమై తలంచిన కొలఁదిని మన స్థిమితముకూడఁ దప్పిపోవునట్లుండెను. ఆతని యనుచరు లందరు దేశదేశములు తిరుగుచుండిరి. కాని యిప్పటివఱకును కార్య మేమియుఁ గొనసాగలేదు.

రామదాసున కిప్పుడు వయస్సు ముప్పదియైదు వత్సర ములు. ఆతఁడు చాల దృఢగాత్రుఁడు. చుఱుకైనవాఁడు. తెలివి తేటలు కలవాఁడు. ఈతని నింటియొద్ద నీతఁడును, యీతనితో తఱచు తిరిగి పనిచేయుచుండు శశిభూషణుఁ డను యిరువదేండ్ల యీడుగల బాలుఁడును దప్ప, యీతని కెవరును నాప్తులు లేరు. ఐదు సంవత్సరముల వెనుక పల్వోలలో రక్షకభటోద్యో గమునఁ జేరువఱకును, రామదాసు సంగతి యెవరికిని దెలి యదు. ఈతఁ డెచ్చటివాఁడోకూడ తెలియదు. ఎవరైన నా

విషయమై ప్రశ్నించినను సరియైన సమాధానము చెప్పఁడు. పొడుగైన నల్లనిగడ్డమును, మీసములును కలిగి చూపఱుల కీతఁడు భయంకరముగా మాత్రము కన్పట్టుచుండును. ఈతఁడంతచనువుగా నెవరితోడను మాటలాడఁడు. చాల చుఱుకైన వాఁడగుటచే నొకస్థలమందే నిలకడగా నుండడు. అశ్వారోహణ మాతని యభిమానవిద్యయే. కాని తఱచీతఁడు నడచియే పోవుచుండును. ఆతని శరీరము చామనచాయగా నుండును.

శశిభూషణుఁడుమాత్రము, బంగరురంగునుబోలిన మేని చాయయును; కమలములవంటి కన్నులును; వెడదయైన యురమును; వీనులతోడ నెకసక్కెములాడు భుజములును కలిగి చూచుటకుఁ జాల సౌందర్యవంతుఁడుగా నుండును. రహస్యపరిశోధనయం దీతఁడును, రామదాసునకుఁ జాల సాహాయ్యము చేయుచుండును. రామదా సీతనికి మంచిశిక్ష గఱపుచుండెను. ఈబాలకుఁడుకూడ తఱచు మారువేసములు వేయుచు, విలాసభవనమున హత్యలనుగావించిన హంతకులను బట్టుటయందు రామదాసునకుఁ జాల సాహాయ్యముఁ జేయుచుండెను.

ఒకనాటి సాయంసమయమందు రామదాసు తన యనుచరుఁడగు శశిభూషణునితో సాధారణవేషముననే కౌశికానదీ తీరమునకు విహారార్థము చనుదెంచెను.

కౌశికానదిపైనుండి మలయమారుత మరుదెంచుచు ప్రాణులకు హాయినిచ్చుచుండెను. ఆనదిపైఁ జిన్నచిన్న తరంగ

ము లా మారుతసౌఖ్యము ననుభవించుచు నృత్యము చేయు చుండెను. రామదా సానదియొద్దున కొంతదూరముపోయి, చివ ఱకు విజయమోహానుని యోడ సమీపమున నాఁగెను. ఆ యోడనుండి మెల్లనిగాన మరుదెంచుచుండెను.

"విజయమోహానుఁడు లోన నున్నాఁడా?" యని రామ దా సచటనున్న మనుష్యునొకనిని బిలచి యడిగెను! ఆమాట విని విజయమోహానుఁడే బయట కరుదెంచి "రండు, లోనికి రండు" అని యాహ్వానించి, రామదాసును శశిభూషణునితోఁ గూడ లోనికిఁ దీసికొనిపోయెను. ఓడ లోపలిభాగ మంతయు నతి మనోహరంబుగను, నమూల్యాలంకార శోభితంబుగను, నిర్మలముగను, మనోజ్ఞవస్తుసముదాయంబున గాటపట్టుగను, నైయుండి చూచుటకుఁ జాల ముచ్చటగ నుండెను.

వా రనేకవిషయములను గురించి మాటలాడిరి. విలాస భవనమునందలి హత్యలనుగురించి మాటవచ్చెను. రామదాసు తన ప్రయత్నము లింకను నేమియుఁ గొనసాగలేదని తెలి పెను. అంత విజయమోహానుఁడు "విలాసభవనఁపుఁ బ్రస్తుతా ధికారి యెవరు?" అని ప్రశ్నించెను.

"ఇప్పటివఱకును దొరతనమువారి యధీనముననే యు న్నది. ఆ యాస్తి కెవరును హక్కుదారులు లేకపోవుటచే దొరతనమువారు దానిని కొలఁదిరోజులలో వేలము వె చెదరు.

చాల సొగసైనది. అనుభవించుట కెవరికదృష్టమున్నదో కాని యని రామదాసనెను. కొంతసేపైన వెనుక రామదాసు, శశి భూషణుఁడును దిరిగివచ్చిరి.

తరువాత సరిగా నాల్గుదినములకు విలాస భవనము వేలము వేయఁబడెను. చాలమంది ధనికులు దానిని గొనుటకు బ్రయత్నముచేసిరి. కాని విజయమోహనునితో నెవరును సరి తూఁగలేకపోయిరి. దొరతనమువారు విలాసభవనమును విజయ మోహనుని యాస్తిగాఁ జేసివైచిరి. అతఁడందు వెంటనే ప్రవేశించెను. ఓడనుండి యచటకు వచ్చుటకుఁ బోవుటకు, రెండు గుఱ్ఱములబండి నొకదాని నాతఁడు కొని మహారాజభోగ మనుభవించుచు నుండెను.

## పంద్రెండవ ప్రకరణము

రామచంద్రనగరము పూర్వకాలమునఁ జాల యౌన్నత్యమునందుండెడిది. కాని యీకథ జరుగునాటికాలమున జాల హీనస్థితికి వచ్చెను. బలహీను లగురాజులు సింహాసన మధిష్ఠించుటచేతను, మితిమీఱి కర్చుచేయుటచేతను, తఱచితరరాజ్యములతోఁగోరి వైరము పెట్టుకొనుటచేతను నారాజ్య మట్లు

శుష్కించిపోయెను. ధనము, సైన్యముకూడ నా రాజ్యమునఁ జాల తక్కువగ నుండెను. ఐనను స్వాతంత్ర్యలక్ష్మి మాత్ర మారాజ్యముపై నింకను గత్తిఁగట్టలేదు. అయిదారు తరముల నుండి బలహీనులగు రాజులే రామచంద్రనగరసింహాసన మధిష్ఠించుచుండిరి. ఇప్పుడు రాజ్యముఁ జేయుచున్న జయచంద్రుఁడు నాతని పుత్రుఁడగు రాజసింహుఁడునుగూడ గంభీరనామధారులు మాత్రమే, కాని శౌర్యపరాక్రమములందును, రాజకార్య నిర్వహణమునందును, తండ్రి చంద్రుఁడునుకాఁడు. తనయుఁడు సింహమును కాఁడు.

ఒకదినమునఁ దండ్రియును, గొడుకును, బల్వాల రాజ్య సైన్యాధికారియగు రామచంద్రుఁడును గూర్చుండి యేవో రాచ కార్యములనుగురించి మాట్లాడుకొనుచుండిరి. ఇంతలో నొక భటుఁ డరుదెంచి పల్వాలనుండి యొక యాశ్వికుఁడు వచ్చెనని తెలుప జయచంద్రుఁ డాతనిని లోనఁ బ్రవేశపెట్టు మని యాజ్ఞ నొసంగెను. కొంత సేపటికి, వెనుక హైమవతిచేఁ బంపబడిన సేవకుఁ డరుదెంచి వారి కభివాదముగావింప వారంద ఱేకగ్రీవముగా పల్వాలక్షేమసమాచారముల నడిగిరి. సేవకుఁ డందులకు సదుత్తర మిచ్చెను.

తరువాత నాతఁడు రాజసింహుని చేతికి హైమవతీదేవి యిమ్మని చెప్పిన యుత్తరము నిచ్చెను. రాజసింహుఁ డాయుత్తరమును దనలోఁ దాను జదివికొని యమందానంద భరితుఁ

డాయెను. కొంతసేపటికి వీరిమాటలు ముగిసెను. వారందరును భోజనములు చేయుటకై కోటలోనికిఁ బోయిరి. ఆమరునాఁడు మరల నింకొకయుత్తరమును జవాబుగా గ్రహించి యాశ్వికుఁడు పల్వలపట్టణమునకుఁ బోయెను.

రెండుమూడురోజులకు రామచంద్రునికార్యము కూడ ముగిసెను. తరువాత సెలవుఁగైకొని పోనుద్యమించెను. కాని, హైమవతీ దేవి లేఖపై జయచంద్రరాజసింహులాతనినిఁ బోనీయ లేదు. వారాతనిని మిగుల గౌరవించుచుండిరి. జయచంద్రుఁడు కూడ నా యుత్తరమును గాంచి సంతసించి, రామచంద్రు నూఁతగాఁగొని శ్యామసుందరీ రాజసింహుల వివాహము నెఱ వేర్పఁ దలంచెను. ఆనాటి సాయంకాలమున జయచంద్రుఁడును రామచంద్రుఁడును నుద్యానవనవిహారమునం దుండిరి. అపుడు వారికి జరిగిన సంభాషణమువలన జయచంద్రుని యూహలు మనకు గోచరమగును.

రామచం—అయ్యా! నాకు మీరు చేసిన గౌరవమున కమందా నందభరితుఁడ నైతిని. నేనిదివఱకు తమదర్శన మెపుడును జేయకపోయినను తమరు నన్ను మీయాత్మీయులలో నొకనిగా భావించి చేసిన మీ మర్యాద నేను బ్రతికియున్నంతకాలమును మఱవఁజాలను.

జయచం—మీరు నన్ను కారణములేకయే స్తుతిచేయు చున్నారు. మంత్రితరువాత మంత్రియంతటివారు; పల్వాల రాజ్యచక్ర మంతయు మీచే నడుపఁబడుచున్నది. మీకుఁ జేసిన దిది యొక మర్యాదయా! ఇంతకన్న మేమేమియుఁ జేయలేకపోయినందులకు క్షమింప వేఁడుచున్నాను. మా మర్యాదల కేమిగాని, మిమ్ములను రెండుమూఁడు అంశములను గురించి ప్రశ్నింపఁ దలఁచి కొంటిని. తమ సెలవైన......

రామ—మీరు మహారాజులు! నన్నంత మన్నించుట యేల? తమ సందియముల నవశ్యముగాఁ దీర్చెదను.

జయ—రత్నసింహుఁడుచనిపోయినప్పటికినియాలోచేమియును లేక, మేధావి యగు వెంకటప్పయ్య రాచకార్యము లన్నియు బాగుగనే నెఱవేర్చుచున్నాఁడు. కాని, యీ ముదుసలి యింకను నెంతకాలము బ్రదుకును? ఆతని యనంతర మంత నమ్మకమైనవాఁడును, తెలివైనవాఁడును మరల మంత్రిగా దొరకునని నమ్మక మెచట? ఆతఁడు బ్రదికియుండఁగనే రత్నసింహునిపేర నెవరినైన పెంచికొనుటయో, లేక శ్యామసుందరి కెవరినైన వివాహ మొనర్చి వారిని రాజకార్యదక్షులుగాఁ జేయుటయో, కాని చేయక యిట్లు మౌనము వహించి యూరకొనుట యేమి మంచిసంగతి?

రామ—నిజమే! తమరు చెప్పినమాట లన్నియును సత్యము. ఈ విషయమై నే ననేకపర్యాయములు వెంకటప్పయ్య గారితో ముచ్చటించితిని. కాని, యాయన "శ్యామ సుందరి తన మగనిని దానే వెదకికొనఁగలదు." అని చెప్పుచుండును. ఆయన యాలోచన లెవరికిని దెలి యవు. ఆయనకు సలహా నిచ్చుటను గూడఁ గష్టమే! ఆ ముక్కోపితో నెవరును చనవిచ్చి మాటలాడరు.

జయ—సరే! నాతో మీరుకూడ నేకీభవించినారు గనుకఁ దెల్పుచున్నాను. ఆ ముదుసలిమాట నటుండనిచ్చి, పల్లవరాజ్యక్షేమముఁగోరు మీర లందఱును కలసి పనిచేయవలయునని, బాధ్యత కలవాఁడను గనుకఁ జెప్పుచుంటిని. మీ రందఱు పట్టుఁబట్టి వెంకటప్ప య్యకుఁ దెలియఁజెప్పియో, మఱియొక విధముననో పనిచేయవలయును. శ్యామసుందరి మాత్రము పసిబిడ్డ యా? తెలియనంతటి చిన్నపిల్లయును గాదు. గ్రహిం చి తానే చేయఁగలిగినంత పెద్దపిల్లయును గాదు. కనుక రాజ్యక్షేమముఁ గోరు మనబోంట్లు కలుగఁజేసి కొనవలయును. ఈవిషయమున మాయమ్మాయి యగు హైమవతియు బాధ్యత వహింపఁదగినదే! కాని యామె యాలోచనఁ గైకొనువా రెవరు? ఆమె ని ట్లగౌరవముఁ జేయుట కది, యేమి దౌర్జన్యము చేసి

నది. ఏమి పాపకృత్యముల కొడఁగట్టినది? ఇదంత
యు రత్నసింహుఁడు బ్రదికియున్నపుడు చేసికొన్న
దాని ఫలమే! రాజ్యమంతయు దిక్కులేకుండ ననాథ
మై పోవునని నాకు మిగుల భయముగా నున్నది.

రామ—అయ్యా! అంత భయపడవలసిన విషయ మేమి
యును లేదు. వెంకటప్పయ్య మైనను గొంచ మాలస్య
మనుమాట కాని, యాతఁడుచేయు కార్యములలో
లోప ముండదు. ఇంతకును రత్నసింహమహారాజే
కార్యభార మంతయు నాతని నెత్తిపైనుంచి చనిపోయి
నాడు. వెంకటప్పయ్య బ్రదికియున్న దినములలో
నాతని కెదురాడువా రెవరును లేరు.

జయ—నిజమే! అయినప్పటికిని రాజ్యము రాజులేకుండ నెంత
కాల ముండును? నెమ్మదిగా జరిగిపోవుచున్నది కనుక
భయము లేదు. ఎవరైనఁ గత్తిఁగట్టి యుద్ధమునకు
వచ్చినచో నెదుర్కొను నాథులేరి? తిరుగుబాటుల
నణఁచు ధీరు లెవరు? రాజులేని రాజ్యమేలేదు. అందు
చే శ్యామసుందరి పెండ్లి త్వరలోఁ గానిచ్చినఁ జాల
బాగుగా నుండునని నా యభిప్రాయము. పెండ్లికాని
పిల్లలందఱును గొండమీదిదేవునే పెండ్లియాడుద మను
కొనెదరు. కాని యట్లు లనగునా?

రామ—మీరు చెప్పినది సత్యమే. కాని, యీమాటలు వెంకటప్పయ్య వినునా ?

జయ—విన కేమి చేయును. ఆతఁడు వినకపోయినయెడల శ్యామసుందరికే నచ్చఁజెప్పవలయును. వరుఁ డెవ్వరైనను దగ్గరవాఁడును, గలసినవాఁడు నైనయెడలఁ జాల బాగుగా నుండును. ఏలనన, నాఁడుది రాజ్యము చేయునది. కనుక, మగవాఁడు చేతికందునటుల నుండవలెనని నా యభిప్రాయము. మీ రేమందురు ?

రామ—మీరు పెద్దలు. జ్ఞానసంపన్నులు. మీతోఁ దప్పక నే నేకీభవించెదను. కాని, యటువంటివరుఁ డెవరును గానరాఁడే !

జయ—కానరాఁడా? మాటవరుసకుఁ జెప్పుచున్నాను. మనలో మనమాట. మా యబ్బాయి రాజసింహుఁడు లేఁడా? ఆత డింకను నవివాహితుఁడు. సద్గుణసంపన్నుఁడు. తెలివైనవాఁడు. ఈసంగతి వెంకటప్పయ్యకు మాత్రము తెలియదా?

రామ—అవును. నా కిదివర కీయాలోచన తట్టనేలేదు. ఇది నిజముగాఁ జాలమంచి యాలోచన. మీ యబ్బాయిని శ్యామసుంద రెప్పుడైనఁ జూచినదా?

జయ—ఈమధ్య నెప్పుడును చూడలేదు. రామచంద్ర నగరము పల్వోలకుఁ జాలదగ్గర. కలిసిన సంబంధము. ఈ విషయమై మీరుకూడ నాలోచన చేయుఁడు.

రామ—ముఖ్యముగా! నే నీవిషయమై వెంకటప్పయ్యకుఁ గూడ నచ్చచెప్పెదను.

ఈవిధమున వారు చాలతడవు మాటలాడుకొని లోపలికిఁ బోయిరి. రామచంద్రుఁడును మఱి రెండుదినము లుండి, పల్వోలకుఁ బయనమైపోయెను.

## పదమూడవ ప్రకరణము

అప్పటినుండియు నాసన్న్యాసి తఱుచారహస్యద్వారమునుండి హైమవతీదేవి దర్శనార్థ మరుదెంచు చుండెను. ప్రియంవదయు నీ విషయమున వా రిరువురకును జాలసాహాయ్యముఁ జేయుచుండెనని వేరుగాఁ దెలుపనక్కఱలేదు. ఈ కృత్రిమసన్న్యాసియునమూల్యాభరణములు వజ్రవైఢూర్యములు,మణిమయాలంకృత వస్తువులు మొదలగువాని ననేకముల నారాణి కిచ్చుచు తన తపోమహిమచే వానిని సంగ్రహించితినని తెల్పుచు వచ్చెను. సన్న్యాసియొక్క నిజరూపమహిమలో నారాణియు,

నామెయొక్క లావణ్యమహిమలో నా సన్న్యాసియును బడిపోయిరి. వారొకరినొకరు గాఢముగా మోహించికొనిరి. తఱుచా సన్న్యాసిదీపముల వేళ రాణీభవనమున కరుదెంచి, యింకను జీఁకటియుండఁగనే యొరుల కనులఁబడక యెట్లో తప్పించుకొని పోవుచుండెను.

ఈకథ యిట్లుండ, రామచంద్రుఁడు బల్వోలపట్టణము సురక్షితముగాఁ జేరెను. రామచంద్రుఁ డింటికి వచ్చిననాట నుండియు జయచంద్రుఁడు చెప్పిన యాలోచనను గురించి తలపోయసాగెను. ఆవిషయమై తగిన ప్రయత్నముఁ జేసెదనని యాతఁడట వాగ్దాన మొనరించియుండెను. కాని, యీ పట్టణమున నీతనిమాటలు వినువారుకాని సలహానిచ్చువారు కాని లేకపోయిరి. రామచంద్రనగరము వెళ్లకపూర్వము నీతఁడును రాజసింహుని గురించి చాల దురభిప్రాయపరుఁడై యుండెను. కాని, యచటికి వెళ్లినతరువాత, రాజసింహుని సద్వర్తనము, మర్యాద, నమ్రత చూచి రామచంద్రుఁడు తనపూర్వాభిప్రాయమును మార్చుకొనెను. పూర్వము రాజసింహు నెంత దూషించుచుండెనో యిప్పుడంత భూషింపుచువచ్చెను. వేయేల! శ్యామసుందరికి రాజసింహుఁడే తగినవరుఁ డనియు నట్టి వివాహము వలనఁ బల్వోలరాజ్యము మున్ముందు చాల నభివృద్ధి పొందుననియు నాతఁడు తనమనస్సునం దొక దృఢసంకల్పముఁ జేసికొనెను.

రామచంద్రుఁడు సైన్యాధికారోద్యోగంబునకుఁ దగినట్లు మిగుల బలసమన్వితుండేగాని, వెంకటప్పయ్యవలె దీర్ఘాలోచన పరుఁడును, దూరాలోచనపరుఁడును గాఁడు. ముక్కునకు సూటిగా నేదియున్న దానిని తెలిసికొనుటయే గాని వెంకటప్పయ్యవలె దానినిగూర్చి సముచితవిచారణఁ జేయఁజాలఁడు. ఆతఁడు యంత్రమువలెఁ దాను నిర్వహింపవలసిన పనిని జక్కగాఁ జేయును. కాని యందేమైన లోటుపాటులు వచ్చినయెడల వానిని సర్దుకొను సమర్థత యీతనియొద్ద లేదు. ఇట్టి రామచంద్రుఁడు తన స్వల్పపరిచయముచేతనే, రాజసింహుని గొప్పగా భావించె ననుటలో నాశ్చర్య మెద్దియును లేదు. ఈతఁడు పట్టణముఁ జేరినప్పటినుండియు శ్యామసుందరీ రాజసింహుల వివాహమునకు సాధన యేమైన నున్నదా యను నాలోచనల తోడనె కాలము గడపుచుండెను.

ఒకదినమున సాయంసమయమున తానిట్టి యాలోచనలలో మునిఁగియుండఁగా సేవకుఁ డొకఁ డరుదెంచి "స్వామీ! తమ దర్శనార్థ మెవరో స్త్రీయొకతె వచ్చియున్నది. సెలవైన లోనికి మార్గముఁ జూపెదను" యని తెలుపఁ రామచంద్రుఁ డొక స్త్రీ తనదర్శనముఁగోరుట కాశ్చర్యపడి, వెంటనే లోనికి కొనివచ్చుట కనుజ్ఞ నిచ్చెను. అంత నా సేవకునివెంట పదునెనిమిదేండ్ల సుందరాంగియొకతె మేలిముసుఁగుధరించి లోనికి

వచ్చెను. రామచంద్రుఁ డామెకొక యాసనమిచ్చి, సేవకునికిఁ బోవ ననుజ్ఞ నిచ్చెను. వారీక్రిందివిధమున మాట్లాడిరి.

రామ—అమ్మా! మీ రెవరు? నావలన మీకుఁ గావలసిన కార్య మెద్ది?

స్త్రీ—నేను రత్నసింహ మహారాజురాణి యగు హైమవతీ దేవి సేవకురాలను. నాపేరు ప్రియంవద. తమరు రామ చంద్రనగరము నుండి వచ్చిరని తెలిసి, మారాణి తమ వలన నచటిసంగతులు వినఁగోరి నన్నిచటికిఁ బంపినది.

రామ—ఓహో! అలాగునా? రామచంద్ర నగరమున నందరు.........

ప్రియం—స్వామీ! క్షమింపుడు. ఆమె తమ దర్శన మొక పర్యాయము కోరుచున్నది.

రామ—నా దర్శనమా! కోటలోనికి నేను, యందునను రాణి యెదుట నెప్పుడును పోలేదే! మాకుఁ గోటలో రాచ చావడి యం దేపనులుకాని, యంతఃపురమునకు నే నెటుల రాను?

ప్రియం—విమలభవనమునకును, గోటకును సంబంధ మంతగా లేదు. మీరు కోటలోనుండియే రానక్కఱ లేదు.

రామ—గుప్తద్వారమున, రహస్యముగా రాణియొద్దకా!

ప్రియం—అయ్యా! ఇది యేమంత దోషకార్యము? ఆమె తన వారినిగుఱించి తానే స్వయముగాఁ దెలిసికొనఁగోరి, నన్నిచటికిఁ బొమ్మని యాజ్ఞాపించినది. మీకు వచ్చుట కిష్టములేక పోయిన నేఁబోయెదను.

రామచంద్రుఁ డాలోచించుకొనుచుండెను. రామచంద్ర నగరరాజులు చాల మర్యాదయును, సాంప్రదాయమును కల వారు. వారుజేసిన మర్యాదవిషయమై యాలోచించిన యెడల తానువెళ్లకపోవుట దోషమే!

రామ—(ప్రకాశముగా) ప్రియంవదా! రాణుల యెదుటకుఁ బరపురుషులుపోవుట యాచారముకాదు. కావున నటు లంటిని. ఎటులైనను నేను రాణియాజ్ఞకు బద్ధుడనే, కాని యెవరైన చూచిన.

ప్రియం—అయ్యా! మీ కాసందియ మక్కఱలేదు. ఎవరును జూడకయే మీరు విమల భవనమును ప్రవేశింప వచ్చును.

రామ—ఎప్పుడు నేనురావలయునని మీరాణియాజ్ఞాపించినది?

ప్రియం—ఈరాత్రియే! భోజనానంతరము తమ దర్శనమున కెదురుచూచుచుండెదనని పల్కినది.

రామ—సరే! పొమ్ము.

తరువాత ప్రియంవద యీగుప్తద్వార మెచ్చట నున్న దో, యెటుల రావలయునో యంతయును బోధించి సెలవు గైకొని వెడలిపోయెను.

## పదునాల్గవ ప్రకరణము

క. మగువలకు నింతలోంగెదు
మగవాడవెనీవు పశువు-మాడ్కిన్ వగవం
దగవే మానుషపశువును
మృగములుగని రోయుగాక-మేలనితినునే ?

—భాగవతము.

హైమవతీదేవిచేఁ బంపఁబడిన సేవకుఁడు రామచంద్ర నగరమునుండి త్వరలోనే యుత్తరమును గైకొనివచ్చెను. ఆ యుత్తరమును బ్రియంవద యీక్రిందివిధమునఁజదివెను.

ప్రియమైన సోదరికి,

నీవువ్రాసిపంపిన యుత్తరమును జూచితిని. బాబయ్యగారుకూడ దానినిఁ జూచినారు. వారు నీయాలోచనకు జాల సంతసించినారు. నీవు వ్రాసిన ప్రకారము మీసేనాధిపతి యగు రామచంద్రునకు సర్వమర్యాదలు చేసెదము. ఆతఁడును

మమ్ములను నిప్పటికే యనేకవిధములఁ గీర్తించుచున్నాఁడు. నీవు చెప్పిన యాలోచనయే కొనసాగినయెడల మన కేవిధమైన లోటును యుండదని బాబయ్యాగా రనుచున్నారు. కాని, యీ విషయమున మనము చాల రహస్యముగాఁ బ్రవర్తింప వలెను. నేను మరలఁ ద్వరలో వ్రాసెదను. సమయము కనిపెట్టి యీవిషయమై రామచంద్రునితోఁ బ్రస్తావించెద నని బాబయ్యాగా రనుచున్నారు. అప్పుడు మరల వ్రాసెదను.

ఇట్లు,
రాజసింహుఁడు.

ఈ యుత్తరము విని హైమవతీదేవి మిగుల సంతసించె నని వేరుగావ్రాయ నక్కరలేదు. తరువాత నాల్గురోజులకు రామచంద్రనగరమునుండి మరల నింకొకయుత్తర మరుదెంచెను. అం దిట్లుండెను.

ప్రియసోదరీ,

అంతయు మన కనుకూలముగనే యున్నది. బాబయ్యాగా రీవిషయమై నిన్నరాత్రి రామచంద్రునితోఁ బ్రసంగింపనాతఁ డింత మంచియాలోచన మఱియొకటి లేదనియెను. బాబయ్యాగారు మిగుల సంతసముతో నున్నారు. రామచంద్రుఁడు రెండురోజులలో బయలుదేరి వచ్చెద ననుచున్నాడు. నీ వచ్చుటిసంగతు లెటు లున్నవో వ్రాయుము.

ఇట్లు,
రాజసింహుఁడు.

ఈ యుత్తరముఁజూచి హైమవతి సంతసమున నొక్క-గంతువైచెను. తనకోరికలన్నియు నప్పుడే ఫలించినట్లే యామె సంతసించెను. ఆ సాయంకాలమే యేమైన నగుగాక యని హైమవతి ప్రియంవదను రామచంద్రునింటికిఁ బంపెను. ప్రియంవద పిలుచుటయు రామచంద్రుఁడు వల్లెయనుటయుఁ జదువరు లిదివరకే చూచియున్నారు.

ఆప్రకారమే రామచంద్రుఁడు ప్రియంవద దారిఁజూప, గుప్తద్వారమున విమలభవనము ప్రవేశించెను. అత్యంత రహస్యముగాఁ జరుపఁబడుటచే నీసంగతి యెవరికిని దెలియలేదు. ద్వారపాలకులును సువర్ణమహిమచే నోరెత్తలేదు.

హైమవతీదేవి మరల నానాఁడు, సన్న్యాసిని మొదటఁ జూచినపుడు ధరించిన దుస్తులనేధరించియుండెను. అదే వేసము! అదేకథ !! రామచంద్రుఁడును రాణి సౌందర్యమునుఁ జూచి ముగ్ధుఁడైపోయెను. అంత యందమైనస్త్రీని యాతఁ డిదివఱలో తన జన్మమధ్యమం దెప్పుడును జూచి యుండలేదు. ఆమెనుఁ జూచి యాతఁ డత్యంత విస్మయము నొందెను. రాణియుఠీవిగా నొక దంతపుమంచముపైనున్న ముఖమల్ పరుపుపైఁగూర్చుండి యుండెను. తెరచాటున నుండలేదు. ఎట్టయెదుట రామచంద్రుఁడు నిలువఁబడెను.

హైమవతి చిఱునగవుతో "దయచేయుఁడు" అని యొక సోఫానుఁజూప రామచంద్రుఁడటులఁ జేసెను. కాని యాతని యింద్రియములు స్వాధీనముతప్పి యాతనిపైఁ దిరుగుబాటు గావించుచుండెను. రాణి మోముపైఁ దాండవ మాడుచున్న యా చిఱునగ వేమి? అది చిఱునగవు కాదు. ఎదుటి వారిని మంత్రించి ముగ్ధహృదయులంజేయు మోహనజ్వాల! యానగవు నుండి వెలువడుకాంతికిరణము లెదుటివారిని బంధించి పరాజయులం గావించు శృంఖలాబంధములు. రాణి రామచంద్రుని మనస్సు నిముసములో గ్రహించెను. తానుతలంచినకార్యమున కడ్డుతీరినది. సంతసించి "అయ్యా! మిమ్ములనిటురావించుట చాల సాహసమైన కార్యమే! కాని మీరు మా పుట్టినింటి కేఁగి వచ్చుటచే, మావారిని గురించి యేమైన తెలిసికొనవలయునని కుతూహలముచే నిటులఁ జేసితిని. ఇది యకార్యమైన యెడల క్షమింప వేఁడెదను." అనెను.

రామ——మహారాణీ! తమయాజ్ఞకు మే మెల్లరమును బద్ధులమై తమకనుసన్నలంబట్టి మెలఁగుచుందుము. తమయాజ్ఞల నెఱవేర్చుట కీదాసుఁడు సిద్ధముగా నున్నాఁడు.

హైమ——మీరు రామచంద్రనగరమున నున్న దినములలో మాతండ్రియును, మాసోదరుఁడును, మిమ్ములను సరిగా సైన్యాధికారికి తగినటుల గౌరవముచేసిరా?

రామ—వారు చూపినట్టి మర్యాద, సౌజన్యత, నే నీవర కెచ్చటను గని విని యెరుగను. రాజసింహునివంటి బుద్ధిమంతుఁ డుండు టరుదు. అందుచేతనే శ్యామసుందరి కాతఁడు తగినవరుఁ డని నేను నిర్ధారణఁ జేసితిని. కాని, యీ వెంకటప్పయ్య యెవరిమాట వినును? వెంకటప్పయ్యయే లేకపోయినయెడల యీకార్యము నిర్విఘ్నముగా కొనసాగునను ధైర్యము నాకున్నది. కాని, నా మాట నెవరు విందురు? వెంకటప్పయ్యమాట నెవరు నిరాకరింతురు?

హైమ—అవు నామాటనే నేనును తలంచుచున్నాను. నేనును సర్వప్రయత్నములఁ జేయుచున్నాను. వెంకటప్పయ్యకుఁ దెలియక యీకార్యము జరుగుట చాలదుర్ఘటము. మీరు నా కీకార్యమున సర్వవిధములఁదోడ్పడుదు రని నేను తలంచుచున్నాను. మీరు నన్నితరముగా భావింపక నాతోఁగలసి యీ కార్యమును కొనసాగించిన యెడల.

రామ—అవు నవును. ఆమాట మీరు వేరుగా నుడువనక్కఱ లేదు. నాకు న్యాయమని తోఁచుచున్న యీకార్యమునందు మీకు నేను సర్వవిధములఁ దోడ్పడెద నని ప్రమాణము చేయుచున్నాను. వెంకటప్పయ్యతో

నాలోచన యీకార్యమునం దప్రస్తుతము. ఆతఁ డీపని నేలాగునను జేయఁడు.

హైమ—వెంకటప్పయ్య నాలుగునెలలపా టెక్కడికైనఁ బోయినఁ జాలబాగుగ నుండును.

రామ—ఎక్కడకుఁ బోవును? యమలోకమునకు!

హైమ—ఆతఁడు యమలోకమునకుఁ బోయిన మీరు నిజముగా సంతసించెదరా?

అనుచు చిఱునవ్వు మోమున ధరించి తా నిదివర కధిష్ఠించిన మంచమునుండి క్రిందికిదిగి యొయ్యారముగా రామచంద్రుని ప్రక్కకువచ్చి నిలువఁబడెను. ఆఁత డప్రయత్నముగా లేఁచి నిలువబడెను. "మీరు కూర్చొనుడు" అనిపలికి యామె మహారాణికి నుండవలసిన గౌరవము వీడి, రత్నసింహుని రాణికి యుండవలసిన యౌన్నత్యమునువీడి, సామాన్యవారాంగనవలె కిలకిల నవ్వుచు, నతివిలాసముగా రామచంద్రుని ప్రక్కంజేరి, కూర్చుండెను. రామచంద్రుని హృదయము, తుపాను నందలి సముద్రమునలె సంక్షోభించుచుండెను. ఆతని కిటువంటిసమయ మెప్పుడును తటస్థింపలేదు. మహారాజు భార్య యగు హైమవతీదేవి, త్రిలోకసౌందర్యమూర్తియగు నా మహారాణి తన ప్రక్క తనశరీరము నంటుచు కూర్చుండుట,కలయా లేకనిజమా యనునటు లుండెను. ఇంకను నేమి తటస్థింప నున్నదో కదా!

రామచంద్రుఁడు పూర్తిగా బాహ్యప్రపంచమును మఱచి పోయెను. తా నెవరో, తనపని యేదియో, తన యౌన్నత్య మెంతయో, యంతయును మఱచిపోయెను. తా నిప్పుడు స్వర్గ లోకమున రంభతోఁగూడియున్న దేవేంద్రుని వలె నుండెను. ఆతని మనస్సు దేవేంద్ర భోగము ననుభవించుచుండెను.

అంత నారాణి యాతనికింకను దగ్గరగాఁబోయి, "మీ కొక రహస్యము తెల్పెదను. మీరట్లు తెలతెల బోయెద రేమి? నావైపు తిరుగుడు" అని నవ్వుచు బల్కెను. ఈమె మిక్కిలి నెరజాణయై యుండవలయును. "తన యంకెకు రాని మహా బలాఢ్యు, వేభంగుల మాయలాడ్డి చెరుపందలపెట్టు" మాయ లాడియై యుండవలయును. మహాబలాఢ్యు డగు వానియొద్ద మాయలు కాని దుర్బలహృదయుఁడగు రామచంద్రుని యొద్ద నవసరములేదు. రామచంద్రుఁడు దాసానుదాసుఁడై యామె చెప్పినటు లెల్లం జేయుచుండెను. ఆతఁ డటువైపు తనవంక తిరుగఁగనే హైమవతి యాతనికి నొకయరగంటవఱకు నేవియో రహస్యములం దెలిపెను. వానిని వినుచున్నంతసేపును రామ చంద్రునివదనము చిత్రవిచిత్రములుగా మారుచుండెను.

ఆమాట లన్నియు నైనవెనుక హైమవతి, యాతని మఱియొకచోటికిఁ గొంపోయి నేదియో మరల చెప్పి పంపి వేచెను.

రామచంద్రుఁ డతికష్టముతో హైమవతిని విడచి, ప్రియంవదవచ్చి దారిచూప బయల్వెడలెను. ఆతఁడు తన హృదయ మనేకభావములతో నిండియుండ, నెమ్మదిగా వచ్చుచు ద్వారముచెంతకు వచ్చునప్పటికి, ధవళవస్త్రధారియై సన్న్యాసములో పూర్తియైన శృంగారరూపముఁ దాల్చి యెదుటవచ్చు సన్న్యాసిని జూచి నివ్వెఱపడియెను. ఒకరి నొకరానవాలు పట్టిరి. ఇద్దరిముఖములు వెలవెలఁ బారెను. తన భార్యయొద్ద పరపురుషుఁ డుండగాఁ జూచినపు డాభర్తహృదయమున నెట్టి ద్వేషము, కోపము, యీర్ష్య కల్గునో యట్టి భావము లిద్దరిహృదయములలోను బయల్వెడలెను. ఇద్దరును గోపఘూర్ణితమానసులై, యొకరితో నొకరు మాటలాడకుండ, నెవరిదారిని వారు పోయిరి.

## పదునైదవ ప్రకరణము

అది శ్రావణమాసము. ఆకసమంతయు దట్టమైన మేఘమాలికలచేఁ గప్పఁబడి ప్రపంచమునంతయు నంధకారమయముగావించివైచెను. నక్షత్రములు లెక్కకొక్కటియైనను కానవచ్చుటలేదు. ఝంఝామారుతముచే వృక్షము లన్నియు నల్లలాడుచుండెను. మహావృక్షము లచ్చటచ్చట గాలితో బలమైన యుద్ధముచేసి నిలువఁజాలక నేలఁగూలుచుండెను.

ల్వాలపట్టణ మారాత్రి మిగుల నల్లకల్లోలముగా నుం డెను. గాలియోరును, చెట్లయాకుల సందడియును దక్క మను ష్యుల యలుకు డెచ్చటను గానవచ్చుటలేదు. వీధులయందలి దీపికలన్నియు నారిపోయి చీకటిలో నైక్యమైపోయెను. చాల రాత్రి యగుటచే నెవరియిండ్లలోవారు తలుపులు గట్టిగావైచి కొని, బయటకు వచ్చుటకు భయపడుచుండిరి.

ముఖ్యమంత్రియగు వెంకటప్పయ్య తన సౌధమునం దొకగదిలో భార్యతో నేదో చర్చించుచుండెను. ఆ గదియం దొక ప్రకాశమానమైనదీపిక వెల్గుచు నాల్గుగోడల యందును గల నిల్వుటద్దములయందుఁ బ్రతిఫలించుచుండెను. వెంకటప్ప య్యభార్యయగు లక్ష్మిదేవి భర్తప్రక్కనే మంచముపై నధి ష్ఠించియుండెను. పిల్లలు నిద్దురపోవుచుండిరి.

లక్ష్మిదేవి యనుచుండెను. "ఏమి యీ గాలి! నేను జ్ఞానమువచ్చినవెనుక నింతగాలివానను గనియెఱుఁగను. మన పెండ్లిలో నాల్గవదినమున, గొప్పగాలియును వానయును వచ్చు ట మీకు జ్ఞాపకమున్నదా? ఆనా డూరేఁగింపున కెంతయో ప్రయత్నముచేసి విరమించిరి. మీరు మరల విడిదిలోనికైనను బోవుటకు వీలులేక, మాయింటనే యుండిపోయిరి. అప్పుడు మీరు...............

వెంక—అవునవును. ఆమాటలవలన కల్గుసౌఖ్యము మఱిదేని వలనను కలుఁగదు. వివాహమైన చాల కాలమునకు బిడ్డలుకూడ పుట్టినవెనుక నా మాటలు తలఁచుకొను టకుఁ జాల సంతోషకరముగా నుండును. అప్పుడు నీవు తలయైనను త్రిన్నగా యెత్తిడిదానవా? ఇప్పు డాసిగ్గంతయు నేమైపోయినది ?

లక్ష్మీదేవి—సరి. సరి ! బాగుగనే యున్నది. అప్పుడు మీరు నా పేరు చెప్పుటకే యంతగందరగోళము చేసెడి వారు. ఇప్పు డెప్పుడును నన్ను ' లక్ష్మీ ! లక్ష్మీ ! ' యని యేల పిలచెదరు ?

వెంక—ఆహా ! ఏమి చమత్కారము ! నీ చతురవాక్యముల చేతను, నీయనురాగపూర్ణమైన ముఖమండలము చేతను నాహృదయము నిర్భరానందపూర్ణమై యున్నది. సంసారము దుఃఖభాజన మగుటకు మారు, సంపూర్ణ సంతోషవాహినిలో నూగులాడు నౌకవలె హాయిగా నున్నది.

" మీరు నన్నెప్పుడు నిట్లే పొగడుచుందురు. " అని మృణాళ సుకుమారమగు తనబాహులతను, లక్ష్మీదేవి తన నిజనాథుని మెడచుట్టును బెనవైచికొనెను. ఆ సమయమున వారి హృదయములలో నుండు ప్రేమానుబంధమును వర్ణిం

చుట కెవ్వారితరము ? ప్రేమానుభవులగు చదువరులే వారి హృదయభావములను తెలిసికొనుట యుచితము. ఆ యానంద సముద్రములో వారిరువురు నట్లే చాల సేపటివరకు నోలలాడిరి.

పైన వర్షమట్లే కురియుచుండెను. వర్షధారలు తలుపులపై 'జలజల' మని కొట్టుకొనుచుండెను. గాలి హోరుమని భయంకరముగా వీచుచుఁ జెట్లయాకుల నడుమనుండి పెద్ద ధ్వని చేయుచుండెను. కాని, యా దంపతుల యానందము నావర్షముగాని, గాలిగాని, యడ్డుపెట్టుటలేదు. వారట్లే ప్రేమపూర్ణమగు మాటలలో సర్వమును మఱచియుండిరి.

అట్టిసమయమున నొకదాసి వేగముగా మేడమెటనుండి పైకిఁ బరుగెత్తుకొనివచ్చి తలుపుఁగొట్టి యత్యంత ప్రకంపిత స్వరముతో

"అమ్మా ! బాబయ్యా !! అమ్మా !!! "

యని పిలచెను. స్వప్నావస్థనుండి యా దంపతులకు వెంటనే తెలివి వచ్చెను. నిర్మలసముద్రమునఁ బోవుయోడ యకస్మాత్తుగా భయంకరమైన తుపానులోఁ జిక్కుకొన్నటుల వారి నిర్మలసంతోషహృదయములు భయమేఘావృతములై, దుఃఖములో మునిఁగెను. వెంకటప్పయ్య పోయి తలుపుఁదీసెను.

"బాబయ్యా! లెక్కలేనంతమంది కత్తులతో వచ్చి మనయింటిపైఁ బడినారు. నేను కిటికీలోనుండి చూచితిని.

వారిచేతులలోఁ గత్తులు తళతళమని మెఱసిపోవుచున్నవి. మిమ్ములను జంపుటకని వారు కేకలు వేయుచున్నారు. స్వామీ! ఈ దారుణ మేమి?" యని యాదాసి వణకుచుఁ జెప్పెను. దుఃఖమన నెట్టిదో యెఱుంగని లక్ష్మీదేవి కీమాట విషాగ్నివలెఁ దోఁచెను.

"బాబయ్యా! అప్పుడే వారిపదధ్వనులు వినవచ్చుచున్నవి. ఆశ్చర్యమునకును భయమునకును నిదిసమయముకాదు." అని దాసి వెంకటప్పయ్యను హెచ్చరించెను. లక్ష్మీదేవి భయముచే, తన భర్తపాదములపైబడి "నాథా!" యను నొక వెఱ్ఱికేక నిడెను.

"లక్ష్మీ! యూరడిల్లుము. మాటలతోఁ గార్యములేదు. ఆమూలనున్న కత్తి నిటకు తీసికొనిరమ్ము" అని పోయి తానే కత్తిని తీసికొనివచ్చి ధైర్యముగా నిలువఁబడెను.

"బాబయ్యా! వారు చాలమంది గలరు. మీరొక్కరు వారితో నిలిచి పోరగలరా?" అని దాసి యనెను. "మీరా క్రిందిగదియందు దాఁగుకొనుఁడు. పైన మేము తలుపును గనబడకుండ సరిఁజేసెదము" అని లక్ష్మి యొక క్రొత్తమార్గమును జూపెను.

వెంకటప్పయ్య వెంటనే యందున్న నేలగదియందు గభీలున దుమికెను. లక్ష్మి తలుపును సరిచేయుచుండెను. మెట్ల

పైన హంతకులపాదధ్వను లత్యంతభయంకరముగా వినవచ్చు చుండెను. ఆ యోరుగాలి; వర్షము; మెట్లపైనధ్వని యంతయు మహాఘోషగా నుండెను. ఆ గదిలో నున్న యాఁడువారి మనస్సులు కలఁతఁజెంది కలిపివేయఁబడిన తటాకములోని మీనములమాడ్కి మిగుల నస్థిరముగా నుండెను. తలుపుదరి కష్టుడే వా రరుదెంచిరి.

"తలుపే!" యని లక్ష్మి కేకనిడెను.

దాసి పరుగెత్తి తలుపువైచి, యాగడియయందుఁ దన ముదుసలిహస్తమును దూర్చెను. మొదట తలుపు నెమ్మదిగాఁ ద్రోయఁబడెను. తరువాత నాహంతకులు బలముతోఁ ద్రోయఁగా నాదాసియుఁ జేయివిరిగి నేలఁబడెను.—ఎంత విశ్వాసపాత్రురా లాదాసి!

లక్ష్మి తలుపును విడిచి దూరముగాఁ బోయి నిలువఁబడెను. పులులమందవలె నాహంతకు లత్యంతహర్షముతో లోనికివచ్చి యచట వెంకటప్పయ్యను గానక విస్మయము నొందిరి. నల్గడల వెదకిరి. అం దొకఁడు లక్ష్మిదేవియొద్దకుఁ బోయి, "మంత్రియెక్కడ! తెల్పెదవా, లేక నీ వాఁడిఖడ్గముతో నీగుండెలలోఁ బొడువనా?" యని భయంకరనాదముతోఁ బ్రశ్నించెను. కాని, యామె మాటలాడలేదు. అంత నాతఁడును, లాభము లేదనుకొని వెనుకకుఁ బోయెను. అంత

వారిలో, నొక డాతనిచెవిలో నేదియో తెలుప నాతఁడు రివ్వున నేలగదిద్వారముదరికిఁ బోయి యాతలుపుకు పెనకి వైచెను.

వెంటనే యొక డందులోనికి దుమికెను. కాని యాతని ఖడ్గమును పట్టి తీసికొని, వెంకటప్పయ్య యాతని నొక్క-వ్రేటున ఖండించెను. కాని యాఖడ్గమును బట్టుటలో వెంకటప్పయ్య హస్తము గాయపడి రక్తము ధారగా స్రవించు చుండెను. ఆతఁడు దానిని జూచికొనుచుండగా, మఱియొక హంతకుఁడు లోనికిఁ దుమికెను. అది చాలచిన్నగది. కత్తి సవరించుకొనుట కైనను స్థలము చాలదు. రక్తపాతముతో వెంకటప్పయ్య నిముష నిముషమునకును బలహీనుఁడై పోవుచుండెను. కాని రెండవమారు దుమికినవానిమీఁదకూడఁ దెగించి ఖడ్గము నెత్తి కొట్టి వానిని మృత్యుముఖమునకుఁ జేర్చెను. కాని చనిపోవుటకుముందా హంతకుఁడు విసరినకత్తి మంత్రి నెత్తిపైఁబడి బలమైనగాయముఁ గావించెను. ఈమారు నాయకుఁడే లోనికిఁ దిగెను. ఆతఁ డత్యంతబలశాలి. వెంకటప్పయ్య బలమంతయుఁ బోయి యుండుటచే నాతని కాహంతకనాయకుని వలన మృతి తప్పినదికాదు.

పదునైదు గాయములతో వెంకటప్పయ్య ప్రాణముల విసర్జించి వీరస్వర్గము నలంకరింపఁబోయెను. హంతక నాయకుఁడు చనిపోయిన తనవారిలో నిరువురుని పైకి విసరఁగా మిగి

లినవా రాశవములను జాగ్రత్తగాఁ బట్టుకొనిరి. తరువాత నాతఁడా చనిపోయిన వెంకటప్పయ్య శిరస్సును ఖండించి దానిని గూడఁ బైకి విసరెను. దానినికూడ మిగిలినవారు జాగ్రత పెట్టిరి. అంత నాతఁడు బయట కరుదెంచెను.

లక్ష్మీదేవి దీని నంతను జూడకుండగనే, యెప్పుడా హంతకుఁడు తలుపును బెరికివైచెనో యప్పుడే చేష్ట లుడిగి మూర్ఛపోయెను. ఆభయంకరమైన హోరుగాలి యట్లె వీఁచుచుండెను. ధారాపాతముగా వర్షము కురియుచునే యుండెను. ఆధ్వనివలననే మంత్రిభవనములోని కలకల మెవరికిని వినఁబడలేదు. లోనిసేవకులు సహితము చలిబాధ కోర్వఁజాలక ముసుఁగులు వెట్టుకొని గాఢనిద్రాపరవశులై యుండిరి. హంతకులు తమకార్యము నెఱవేర్చికొని రక్తసిక్తమైన మొండెములఁ దీసికొని, నిర్భయముగా, నిశ్చింతగా తమదారిని దామువోయిరి.

---

# పదునాఱవ ప్రకరణము

ఈ సంగతి మఱునాఁ డూరంతయు వ్యాపించెను. ఆనాఁడుకూడ నాకసము మేఘావృతమై విచారసూచకముగా నుండెను. భానుఁడు, విచారభారముచే నింటియందే నిలచి ప్రపంచయాత్ర మానుకొనెనేమో యనున ట్లానాఁడు కనపడనేలేదు. పల్వోలపట్టణ ప్రజాళి యంతయు మంత్రిభవనము నొద్దకే చేరెను. రాణీకుమారి యగు శ్యామసుందరీదేవి కూడ నచటికివచ్చి భయంకరమగు నా రక్తసిక్తమైన మొండెమును జూచి విచారము ముప్పిరిగొన బిగ్గరగా నేడ్చెను. ఆ బాలిక తనజనకుఁడు పోయినపుడైన నంతవిచారమును బొందలేదు. పల్వోలరాజ్యరమాదేవి రెండవసారి దిక్కులేకుండపోయె నను మాట వినుసరికి, యామెగుండియ వ్రీలిపోయెను. ఆమె కిక దిక్కెవ్వరు ? ఇక నా పల్వోలరాజ్యనౌక యత్యంతభయంకర సముద్రమధ్యమునఁ జిక్కుపడిపోవును. ఆయోడ నడపు నావికుఁడు గతింప నాయోడ విచ్చలవిడిగాఁ బోవలసినదే కదా !

వెనుక హేమచంద్రుఁడును హత్యచేయఁబడెను. నిజమే యది చాల భయంకరహత్యయే! కాని వెంకటప్పయ్య పోవునపు డాతనితో నాతని పంచప్రాణములు మాత్రమే పోలేదు.

పల్వేలపట్టణ సాధుజనాళియొక్క ప్రాణసమూహమే పోయినది. రాజ్యప్రాణమే పోయినది. శ్యామసుందరీదేవి బుద్ధిబలము దీప సాహాయ్యమున మెఱసిన వజ్రమువలె, వెంకటప్పయ్య సాహాయ్యమున మెఱసినది. కాని యిపుడా సాహాయ్యమేది? ఆమె యెవరిని నమ్మగలదు? ఎవరితో నాలోచింపఁ గలదు? ఎవరి మాటపై నిశ్చింతగా నుండఁగలదు? వెంకటప్పయ్య హత్య, యందుచేఁ బల్వేలపట్టణము నంతగా గలంచెను.

రామచంద్రుఁడు, రామదాసు, విజయమోహనుఁడు, రాజవైద్యుఁడు మొదలగు పెద్దపెద్ద లందరును వచ్చిరి. వా రందరు భయవిషాదముల వెలిబుచ్చిరి. విజయ మోహనుఁడు వైరాగ్యప్రబోధఁ గావించెను. వైద్యాధికారి తన యభిప్రాయమును వెలిబుచ్చి, యెనిమిది పెద్దగాయములు, యేడు చిన్నవి యున్నవని సరిగాఁ దెలిపెను. రామచంద్రుఁడును జాల విచారమును వెలిబుచ్చెను.

రామదాసీవిషయమై తగినప్రయత్నముచేసి హంతకులను వెంటనే పట్టినఁగాని పల్వేలరాజ్యమునకు ముక్తిలేదు. ఈ హంతకుల యన్వేషణమున వెనుకటినేరముకూడ తప్పక బయల్పడునని రామదాసున కొకనమ్మకము కలిగెను.

లక్ష్మీదేవి దుఃఖమునుగురించి వ్రాయుట కేరితరము? ......తరువాత దహనసంస్కారమగువరకును వచ్చినవా రందరు నాగి దుఃఖముతో మరలిరి......

రామదాసొంటరిగాఁ దనభవనమునందే కూర్చుండి యీవిషయమై తలంచుకొనుచుండెను. ఆతనియాలోచన లనేక విధములఁ బర్వులెత్తుచుండెను.

"వెంకటప్పయ్యకు విరోధు లెందరో యుందురు. మంత్రిగాన నాతఁ డనేకుల శిక్షించియుండును. కాని, సాధారణు లీకార్యమును జేయుటకు సాహసింపరు. ఎవరో పెద్దవారిందుఁ దప్పక కలిసియుందురు. పల్వెలరాజ్య క్షేమమును శ్యామసుందరీదేవి భాగును జెఱుపఁగోరి యీ దారుణహత్య చేయబడినది. కాని, ప్రయత్నించిన వా రెవరో తెలియక పోవునా ? చూచెదము !" అనుకొని, శశిభూషణుని బిగ్గరగాఁ బిలచెను. ఆ కేకను విని శశిభూషణుఁడు వెంటనే ప్రత్యక్షమయ్యెను.

రామ—వెంకటప్పయామాత్యుఁడు హత్యచేయఁబడెను. వింటివా? మన మిచటఁ జేతుల నలుపుకొనుచుఁగూర్చుండినఁ గార్యములేదు. నీ వీఁక నీ తెలివితేటల నన్నిఁటిని నుపయోగించి పనిచేయవలెను.

నీవీరాత్రి మారువేసముతోఁ బయల్వెడలి పట్టణమన్ని భాగములను జూచి, యేమైన విశేషములున్నచో నాతోఁ దెలుపుము. ఏమి?

శశి—మామా! తప్పక చేసెదను. ఏ వేషము వేసిన బాగుగా నుండును?

రామ—బిచ్చగాని వేషము వేయుము. అట్లైన నిన్నెవరు
నానవాలు పట్టఁజాలరు. కానిమ్ము. శశిభూషణుఁడు
వెంటనే లోనికిఁబోయెను.

రామదాసానాఁడు బయటకేపోలేదు. దీర్ఘాలోచనతో
నాతఁ డింటివద్దనే సాయంసమయమువఱకుఁ గడపివైచెను.

## పదునేడవ ప్రకరణము

శశిభూషణుఁడు యథావిధిగాఁ దన వేసమును వైచి
కొనెను. ఒక చిఱుగుల యంగరకా, చెప్పుల కిత్తడిపోగులు, శరీ
రమునిండ నామములు, యొడలినిండ దుమ్మును ధరించిన
యాతని జూచినవా రెవరును శశిభూషణుఁ డని యానవాలు
పట్టఁజాలరు. పూటకు గతిలేని బిచ్చగానివలె నాతఁ డుండెను.

ఆతఁడు బయల్వెడలి నెమ్మదిగా నిటునటుఁజూచుచు
పోవుచుండెను. విశేషము లేమియు నాతనికిఁ గన్పట్టలేదు.
కాని, ప్రియంవదమాత్ర మెచ్చటికో నతివేగమున పోవుటఁ
గాంచెను. ఆమె యసాధారణ వేగమును జూచి, వెంబడింత
మని శశిభూషణుఁడు తలంచెను. కాని, యందువలన నేమైన
లాభ ముండునో, లేదోయని తనదారిని దానుపోయెను.

అటులఁ గొంతదూరము నడచి యాతఁడు విమలభవన ప్రాంతమునకుఁ జేరికొనెను. అది పట్టణబాహ్యప్రదేశమై యుండుటచే నిర్మానుష్యమై యుండెను. విమలభవనమునకును సింహద్వారమునకును జాలదూరమున్నదని యిదివరకే సూచింపబడినది. ఆవైపున నొక్క యినుపద్వారము మాత్రమే యుండెను. దానిని సాధారణముగా నెప్పుడును తీయరు. ఎందుచేతనో కాని యా దినమున నది తీయఁబడియుండుట శశిభూషణుఁడు గాంచెను. అందేదో విశేషముండియుండునని యాతఁడు తలఁచెను. ద్వారపాలకు లది నిర్మానుష్యప్రదేశ మనియో, మఱెందుచేతనో, చాల నజాగ్రతగా నుండిరి. వారు దగ్గరకు వచ్చినపుడు మెఱయుచుండు వారిచేత దీపఁపువెల్తురు తక్క మఱియొక వెల్తురు రచ్చుటలేదు.

"లోనికిఁ బోవుదమా?" యని శశిభూషణుఁడు తలఁచెను. ఆకాశమంతయు మబ్బుగా నుండుటచే లోకమంతయు నంధకారబంధురముగా నుండెను. కొంతతడ వాలోచించి, శశిభూషణుఁడా చీకటిలో మెల్లగా ద్వారమునుదాఁటి లోపల ప్రవేశించెను. ద్వారపాలకుల కంటఁబడకుండ నాతఁ డొక చెట్టుక్రింద జాగ్రతగాఁ గూర్చుండెను. ఆతనిశరీరము విమలభవనకుడ్యమును దాకుచుండెను. ఆతని నెత్తిపై నాలుగడుగుల దూరముననే యొకకిటికీ యుండెను. అదియే, హైమవతి పడక

గది. ఆగది క్రిందనే శశిభూషణుఁ డుండెను. రాత్రి పదిగంట లగుసరికిఁ బ్రియంవద తిరిగివచ్చెను. ఈమా రామె యొక్కతెయు నరుదెంచలేదు. ఆమెతో, మనకుఁ జిరపరిచయుఁ డగు సన్న్యాసికూడవచ్చెను. శశిభూషణుఁ డాతనినానవాలుపట్టెను. ఈ మునిపుంగవుఁ డెవరితోడను మాటలాడక పోయినను, రెండు నెలలనుంచి యగపడుచుండుటచే పల్వాంపట్టణవాస్తవ్యుల కందరకుఁ జిరపరిచయుఁడే!

సన్న్యాసి తానున్న గోడప్రక్కనున్న గదిలోనికి వచ్చెనని శశిభూషణుఁడు కనిపెట్టెను. అక్కడజరుగు మాటలను వినుటకై శశిభూషణుఁ డత్యాతురతతోఁ జెవియొగ్గి వినుచుండెను. సన్న్యాసియే గాక, యందొక స్త్రీకూడ నుండి మాట్లాడుచున్నట్లు కంఠధ్వనివలన శశిభూషణుఁడు కనిపెట్టెను. ఆమె ప్రియంవదయై యుండవచ్చునని యాతఁడు తలంచెను. కాని కొన్నిమాట లైనవెనుక నా పురుషధ్వని "రాణీ" యని పిల్చినటుల నాతని వీనులకు సోకుటచే నామె మహారాణియగు హేమవతీదేవియే యైయుండవచ్చునని యాతఁడు తలంచెను.

ఇట్టి రాత్రివేళ, నంతఃపురకాంతయగు రాణికి, సన్న్యాసియు, దేశద్రిమ్మరియునగు నాతనితోఁ బనియేమి యుండుననియాతఁ డత్యంత విస్మయమునకు లోనాయెను.

ఎంతజాగ్రతగా విన(దలఁచినను, వారిమాటలు మాత్ర మాతని వీనులఁ బడుటలేదు. గుసగుసలు తక్క మఱేమియు నాతనికి విన(బడుటలేదు. భిక్షుకుఁడు రాత్రియంతయు నిచ్చటనే యుండిన ద్వారపాలకులు తలుపులబిగింతురు. అందువలన నాతని కపాయము కల్గినను కలుగవచ్చును. "వెనుకకుఁ బోవుదమా?" యని యాతఁడు మరల నొకసారి యాలోచించుకొనియెను.

కాని వారిమాటలలో "వెంకటప్పయ్య................ మంత్రి.. ....................హత్య" మొదలగుమాటలస్పష్టముగానైనను శశిభూషణుని చెవులఁ బడకపోలేదు. ఆతని యాశ్చర్యము మఱింత వృద్ధియాయెను. ఏమైన నగుఁగాక! చివరవఱకు నుండదమని యాతఁడు సంకల్పించుకొనెను.

అర్ధరాత్ర మాయెను. లోకమంతయు నిశ్శబ్దముగా నుండెను. అచ్చటచ్చట నకాత్తుగా లేఁచి, కలకలారావములు గావించు, పక్షుల యస్పష్టధ్వనులుతక్క మఱేధ్వనియునులేదు. మంద మైన మారుతము వీఁచినప్పుడు మాత్రము, చెట్లమీద నాకులు, నిశాదేవియొడలిమీఁది నగలేమో యనునట్లు గలగల లాడుచుండెను. గదిలోని యస్పష్టధ్వనులును దగ్గిపోయెను. శశిభూషణుఁడు సన్న్యాసి మఱేదారినైన వెడలిపోయెనేమో యని చాలకలవర మందెను. తన నెత్తిపైనున్న కిటికీలో నుండి

లోనికిఁ దొంగిచూతమన్న యాలోచన యతనికిఁ దట్టెను. కాని చాలయెత్తుగా నుండెను. గోడకూడ నున్నఁగా గచ్చు చేయఁబడియుండెను. అటునిటు జూచెను. పూలమొక్కలున్న కుండలు తక్క నాతని కేమియు నగపడలేదు. ఆ కుండ్లలోని మొక్కలఁ బీకివైచి, యొకదానిపై నొకటిబోర్లించి యెక్కిచూతమన్నయూహ యాతనికిఁ గల్గెను. అట్లే నాలుగైదుకుండలను సేకరించెను పెద్దది. దానిపైఁగొంచెముచిన్నది. మఱియొకటి మఱియొకటి ఆవిధముగా నారింటినిఁ బేర్చెను. దానిపై నతిజాగ్రతతో నెక్కెను. కిటికీనుండి లోనికిఁజూచెను. చూడగా నచటివింతఁగని యాతని నయనములు తిరిగిపోయెను. శరీరము వణకెను. హృదయ మంతయుఁ గలచిన ట్లాయెను. అత్యంత విస్మయమునకులోనై యాతఁడు నెమ్మదిగాఁ గ్రిందికి దిగి, గోడనానుకొని చాలసేపేదియో నాలోచించుకొనుచుఁ గూర్చుండెను. కొంతసేపటి కాతని కేదియో ధ్వని విననయ్యెను చూడగా నా సన్న్యాసి లేఁచి యీవలకుఁ వచ్చుచుండెను. ఆతని వెనుకనే నెమ్మదిగా శశిభూషణుఁడును బయట కరుదెంచెను. వెనుకపాటున నాసన్న్యాసిని తనఖడ్గముతో నొక్కపోటునఁ బొడుతమన్నకోప మాతనికిఁ గల్గెను. ఆతఁడాయాత్మద్రోహి నప్పుడే యమసదనమునకుఁ బంపివైతమను కోరిక యాతనికిఁ గల్గెను. కాని యజమానుని యాజ్ఞలేనిదే యంతఁ పనిఁజేయుట కాతని మనసొప్పలేదు. సన్న్యాసి యెచటికిఁ

బోవునో యని నెమ్మదిగా శశిభూషణుఁ డాతనిని వెంబడింప, నాతఁడును విలాసభవనముదరికిఁబోయి, యాద్వారములో నుంచి యదృశ్యుఁ డగుటఁగాంచి మఱియు నాశ్చర్యమునకు లోనాయెను.

## పదునెనిమిదవ ప్రకరణము

శశిభూషణుఁడు మరల నింటికిఁజేరునప్పటి కప్పుడే వేకువజా మాయెను. చాల నలసిపోయి యాతఁ డతికష్టముతో నిలుచేరునప్పటి కచ్చట నందరు నిదురపోవుచుండిరి. రామదాసు మాత్రము కలఁతనిద్దురతో నటునిటు దొరలుచుండెను. ఆతఁడును రాత్రియంతయు నిదురలేకనే కడపెను. శశిభూషణుని పదధ్వని విని రామదా సులికిపడి లేఁచి, యాతనిఁ జూచి "విశేషములేమి? క్షేమముగా వచ్చితివా"? యని తొందరగా బ్రశ్నించెను.

శశిభూషణుఁడు తాను వినినది, కనినది పూసగ్రుచ్చినట్లు దెలిపెను. ఆ కథను విని రామదా సత్యంత విస్మయమునకు లోనయ్యెను. ఆ సన్న్యాసి విలాసభవనము ప్రవేశించెనని వినినప్పు డాతని యాశ్చర్యము మఱింత వృద్ధియయ్యెను.

ఆ సన్న్యాసి కాశ్రయమిచ్చువాఁడా విజయమోహనుఁడు? ఆతఁ డిదివఱకేమో న్యాయవర్తనుఁడని తలంచితిని. ఆతనితోఁ గల్గిన స్నేహముచే ననేకరహస్యంబుల నాతనిచీనుల వైచితిని. ఇంకను నయమే! ఆతనితోఁ గొన్ని ముఖ్యసంగతులు చెప్పనేలేదు. కొంప మునిఁగియుండును. ఈ సన్న్యాసి రాణితోఁ గలసి వెంకటప్పయ్య హత్యనుగురించి మాట్లాడిన ట్లీతఁడు చెప్పుచున్నాఁడు. హైమవతీదేవి కిం దేమియు సంబంధముండి యుండదుకదా? వెంకటప్పయ్య భవనమున కారాత్రి చాల మంది మనుష్యులు వచ్చెనని తెలియవచ్చుచున్నది.

ఈ పట్టణమున నేదో దుర్మార్గపు జట్టున్నది. కాని దాని నెవరు పోషించుచున్నారో, యిచ్చటివారో; లేక మఱి యొకచోట నుండువారో, యేమియును దెలియకున్నది. మూఁడు నెలలలో మూఁడు హత్యలా! నా యుద్యోగమును గాల్పనా? ప్రజలందఱు హతాశు లగుచున్నారు.............. ఱేపటి యుదయముననే విలాసభవనమునకుఁబోయి, యీ సన్న్యాసి యుదంతమంతయుఁ దెలిసికొనవలయును. హైమవతీదేవిని వెంటనే కథలోనికి దింపఁగూడదు. కాని యీ విషయమై శ్యామసుందరీదేవి కేమైనఁ దెలుపవలయునో లేదో, తెలియకున్నది..... ముందు సన్న్యాసియుదంతముఁ జూతము.” ఇట్టి యాలోచనలతో రామదాసునకుఁ దెల్లవారెను.

సూర్యోదయ మగుసరి కాతఁ డుచితవస్త్రముల ధరించి విలాసభవనమునకుఁ బోవుటకు సిద్ధముగా నుండెను. ఇంతలో రాజభటుఁ డొక డరుదెంచి "శ్యామసుందరీదేవిగా రొకసారి రమ్మనుచున్నా రని తెలియఁజేయ, యాతనితోఁ గలసి శ్యామసుందరీదేవి దర్శనార్థము పోయెను.

శ్యామసుందరీదేవికి వెంకటప్పయ్య గతించినప్పటినుండియు నిద్రాహారములు లేవని వేరుగాఁ దెలుప నక్కఱలేదు. ఈ రెండుదినములనుండియు నామె శుష్కించి సగమాయెను. రామదాసు వచ్చినవెంటనే యాతని కుచితాసన మిచ్చి "అయ్యా! రత్నసింహునిరాజ్య మిప్పుడే దిక్కులేకుండఁ బోవుచున్నది. వెంకటప్పయ్య గతించుటచే నీ రాజ్యభార మెవరిపై నుంచవలయునో నా కేమియు బోధపడకున్నది. నేనే యీ రాజ్యభారమంతయు వహించుటకు నా కింకను జిన్నతనముకదా!.........మీ రీహంతకుల నెంతత్వరలోఁ బట్టుదురో! వారినిఁ బట్టినఁగాని ప్రజలకు శాంతియుండదు. నాకును శాంతిలేదు.........ఆ! నా కీదినమున నొక భయంకరమైన యుత్తరము వచ్చినది. వెనుక వెంకటప్పయ్యకు జయరాముఁ డొక యుత్తరము వ్రాసెనని నాతోఁ జెప్పియున్నాఁడు. ఈ జయరాముఁడు—అబ్బ! వానిపేరు తలఁచిననే నా శరీరము కంపమెత్తును. నా చిన్నతనమందు వానికథ లత్యద్భుతముగా మా తండ్రిగారు నాకుఁ జెప్పెడివారు—ఆ జయరాముఁడే మరల

నాకొక యుత్తరమును వ్రాసినాడు. ఇదుగో! చూడుడు! ఇది యెటుల నిచ్చటికి వచ్చినదో నా కేమియు బోధపడకున్నది. ఇంత కట్టుదిట్టముతో కాపాడఁబడుచున్న యీకోటలోని - యుత్తరమెటుల వచ్చినది? నేను లేచునప్పటి కిది నాప్రక్కలోనున్నది. దీనివలననే యాజయరాముని శక్తిసామర్థ్యములు నాకు బోధపడుచున్నవి. కోటలోని కాతఁ డెటులరాఁగలిగెనో? ఏమో! యింకను యెట్టి యాపదలు మూడనున్నవో! యని శ్యామసుందరీదేవి మిగుల భయముతో ననియెను. అంత రామదాసు,

తల్లీ! మీకంత యాశ్చర్య మక్కఱలేదు. కోటలోనికి జయరాముఁడే రా నక్కఱలేదు. కోటలోనే విశ్వాసఘాతకు లగు జయరాము లనేకు లుందురు. ఏదీ! ఆ యుత్తరము నొక సారి చూపుడు అనగానే, శ్యామసుందరి యుత్తర-మాతని చేతికి నిచ్చెను. రామదాసు దాని నీక్రిందివిధమునఁ జదివెను.

మహారాణియగు శ్యామసుందరీదేవి సన్నిధికి.

వెంకటప్పయ్యను నేనే చంపితినని జనులందఱు ననుకొనుటఁ జూడ నాకుఁ జాలవింతగానున్నది. నేనే చంపినయెడలఁ బైకిఁ జెప్పియే యుందును. విలాసభవనమునందలి హత్యలఁ గావించినవాడను "నేనే" యని చెప్పినపు డీ రామదాసు నన్నేమి చేయఁగల్గినాఁడు. రామదాసు కాదు కదా! వేయి మంది రామదాసులు వచ్చినను న న్నేమియుఁ జేయఁజాలరు.

ఆతని కనుల యెదుటనే నేను తిరుగుచున్నాను. రామదాసు చిన్న నేరము లెన్నిపట్టినను, యిట్టివిషయమున నాతని ప్రభావ మేమియుఁ బనికిరాదు. ఈహంతకునిఁ గన్గొనుటకై నేనే యత్నించుచున్నాను. వెంకటప్పయ్యను చంపినవాని నామమును మీకుఁ దెలియఃజేయఁగలను. కాని మీరు చాల నాశ్చర్యమును బొందెదరు. మీయన్నమే తినుచు, మీరాజ్యముననే యొక యున్నతోద్యోగముఁ జేయుచున్నవాఁ డొక డాతనిని చంపెనని నేను చెప్పినయెడల——మీరు నమ్మెదరా? కాని, యటులనే జరిగినది. దానికి నిదర్శనములున్నవి. మంత్రి మొండెము మాత్రమే మీ కగపడినది. ఆతనితల యెవరియింట నుంచబడినదో, యాతఁడే హత్యాకారకుఁడని నేను చెప్పిన నింకను నమ్మరా? అయినను, నామాటను మీరు నమ్మకపోవచ్చును. ఏలనన, పైచూపుల కాహంతకుఁ డంతనమ్రత కలవానివలెను, సజ్జనశ్రేష్ఠునివలెను గన్పట్టును. కాని యాతఁడు నిజముగా మేకతోలు కప్పుకొన్నపులి: పయోముఖవిషకుంభము. ఆ దుర్మార్గుఁడు ఆహంతకుఁడు పల్వాలరాజ్యప్రాణాపహారి మఱి యెవరునుకాఁడు. నిత్యమును మీకన్నులయెదుట దిరుగు మీ సైన్యాధికారియే! రామచంద్రుఁడే!!

ఆతని పడకగది పెరటిలో మల్లెపందిరి క్రిందఁ జూడుఁడు. అచట పాతఁబడియున్నకుండలో వెంకటప్పయ్య శిరస్సున్నదో

లేదో చూడుడు! వెంటనే రామచంద్రుని బంధించి యాతనిస్థాన మున మఱియొకని నుంచుడు. తరువాత మరల వ్రాసెదను.

చిత్తగించవలెను.

జయరాముఁడు.

త్రిభువన చోరాగ్రేసరుఁడు.

శ్యామసుందరి యుత్తరము పూర్తియైనతోడనే యను చుండెను. "ఇదంతయు మఱియొకమాయ. రామచంద్రుఁడు మాతండ్రియొద్ద చాలకాలము పనిఁజేసెను. అతఁడనిన మా తండ్రి కత్యంతగౌరవము. పల్వాలరాజ్యక్షేమముకొఱకు నిరం తరమును బాటుపడువారిలో నాతఁడొకఁడు. ఆతనిపై నీనింద వేయుట మిగులనన్యాయము. ఈజయరాముఁడు మిమ్ములను ద్రిప్పుటకును, మీ ప్రయత్నముల భంగపఱచుటకు నిట్లు వ్రాసినాడు. ఆతని శిర స్సటనుండుట యసత్యము. ఉన్నను, యదికూడ జయరాముని మాయయేకాని మఱియేమియును గాదు. మీ రేమందురు?"

"మీరు చెప్పుమాటలు సత్యములే కావచ్చును. కాని హత్యజరిగిన తరువాత రామచంద్రుఁ డెంతమాత్రము నాశ్చ ర్యము పొందలేదు. ఎవరిమన స్సెటువంటిదో తెలిసికొనుట కష్టము. దినములు మారినట్లే మనుజులుకూడ మారుచుం దురు. రామచంద్రుని పెరటిలోనికి, శిరస్సు వచ్చిపడుట యంత సులభసాధ్యమైన పనికాదు. ఆతఁడు సాధారణ మనుజుఁడు

కాడు, సైన్యాధికారి. అట్టివాని యింటిలోనికిఁ బరులు ప్రవేశించుట యంతసులభసాధ్యమైన పనియని నేననుకొనను. ఈజయరాముఁ డెవఁడు? ఈతఁడు పూర్వోపుజయరాముఁడు మాత్రము కాడని, నేను ముమ్మాటికిఁ దెలుపఁగలను. ఎట్లని నన్ను మీరడుగవద్దు. .........రామచంద్రుని విరోధి యెవరో సెటుల వ్రాసెననుకొందము. కాని యిటులవ్రాసి మీ శయన మందిర మందుఁ బడవేయుట మాత్ర మంతసులభసాధ్యమైన పనియా? కోటలోనుండి విమలభవనమునకు రాకపోకలు గలవా?" అని రామదాసు ప్రశ్నించెను.

శ్యామ—ఏమి? అటులనడుచుచున్నారేల? మానవతితల్లిచటికెపుడును రాదు. కాని దాసీలు వచ్చుచుఁ బోవుచుందురు.

రామ—మీరిక నదిగూడఁ గట్టివేయవలెను.

శ్యామ—అదేమి?

రామ—ఈ యుత్తర మాదారినిఁగాక మరెటుల నిటఁ బ్రవేశించెను?

శ్యామ—మీరు చాల విపరీతముగా మాటలాడుచున్నారు. మా సవతితల్లి యిటులఁ జేయఁజాలదు. ఆ జయరామునికి విమలభవనములో సంబంధ మున్నదనియా మీ యభిప్రాయము? దానికేమైన నిదర్శన మున్నదా?

రామ—తల్లి! క్షమింపుము. పైమాటలు, పైమెఱుఁగులు చూచి భ్రమపడఁగూడదు. హైమవతీదేవికి వెంకటప్పయ్యహత్యతో సంబంధ మున్నదని నేను గట్టిగాఁ జెప్పుటలేదు. కాని......

శ్యామ—ఏమి! ఏదు—ఈవిషయమున నే నేదివిన్నను భయపడను.

రామ—నా మేనల్లుఁడగు శశిభూషణుఁడు నిన్నరాత్రి విమల భవనమునందుఁ జూచిన దారుణకార్యమును గురించి మీరు విన్నయెడల నత్యంతవిషాదమునకు, నాశ్చర్యమునకు లోనగుదురు. అట్టిసంగతులు మఱియొకరికిఁ జెప్పఁదగినవి కావు. కాని మీకుఁ జెప్పక తప్పదు. అచ్చటిద్వారము రాత్రియంతయుఁ దెఱువఁబడియే యున్నది. ప్రియంవదయను దాసి సహాయమున నొక సన్న్యాసి లోనఁ బ్రవేశించి రాత్రియంతయు హైమవతీదేవితోఁగూడి యేదియోచర్చించుచునేయున్నాఁడు. వారిమాట లస్పష్టముగా నున్నను శశిభూషణుఁడు, "వెంకటప్పయ్య, హత్య" యనుమాటల వినకపోలేదు. అందుచే నా కనుమానము మెండుగానున్నది. మీ కీయుత్తరము విమలభవనముద్వారా వచ్చినందుల కను మంతయు సందియములేదు."

శ్యామసుందరి యీపలుకులు వినుచున్నంత సేపును నిర్ఘాంతపోయియుండెను. ఆమెకుఁ జాల విషాదము కలిగెను. హైమవతి తాను తలచినంతకంటెను జాల దుర్మార్గురాలని యిప్పుడు గ్రహించెను.

"ఇదంతయు నాకుఁ జాల నభిమానవిషాదముల కల్గించినది నేనికముందుఁ జాలజాగరూకతతో నుందును. ఈయుత్తరములోని సంగతులెంతవఱకు నిజమో చూడవలయును. మీరు చెప్పినట్టుల నెవరిని నమ్ముదమన్నను నాకు దోఁచుటలేదు. ఈ రామచంద్రుని సంగతిఁగూడ బాగుగా గ్రహింపుడు. ఇపుడు మీరేమిచేయుదురు?" అని శ్యామసుందరి ప్రశ్నించెను.

రామ—నేనా? తమ యాజ్ఞయైనయెడల నీ యుత్తరమును గొంపోయి, రామచంద్రునికే చూపెదను. ఆతని ముఖచర్యఁబట్టి యంతయును గ్రహింపవచ్చును.

శ్యామ—అటులనే చేయుఁడు. ఈయుత్తర మాతనికే చూపినయెడల మనము స్నేహభావముతోడనే యాతనినిసమీపించుచున్నట్లుండును. ఇంకను దగినన్నినిదర్శనములున్నఁగాని యాతనితోడ విరోధమేల?

రామ—అటులనేచేసెదను. నేనాసన్న్యాసి యుదంతముకూడఁ గన్గొనవలయును. ప్రతిదినమును, తమ దర్శనముచేసి పనియెంతవఱకైనదో తమకు నివేదించుచుండెదను.

శ్యామ—ప్రతిదినము రానక్కఱలేదు. కాని మీ ప్రయత్న మెంతత్వరలో సఫలమైన నంతలాభమున్నది. ప్రజలందఱు చాల నశాంతులైనట్లు వినుచున్నాను.

అంత రామదా సచ్చటనుండి యీవలికివచ్చెను. విలాసభవనమునకుఁ బోయి, యచ్చట, విజయమోహనునివలన సన్న్యాసియుదంత మేదైనఁ దెలిసికొనవలయునని యాతని యూహ.

ఆప్రకార మాతఁడు విలాసభవనమునకుఁ బోయి లోనికిఁ దన రాకను గుఱించి కబురుపంపఁగా విజయమోహనుఁ డాతని రాకకు వెంటనే సమ్మతించెను. వీరిద్దరునుకలిసి మిగుల సొగసుగా నలంకరింపఁబడిన యొకగదియం దాసీనులైయుండ, విజయమోహనుఁడు.

"రామదాసుగారూ! క్షేమమా? ఏమి యీ దినమున నిటుల దయచేసితిరి. మీ రాకవలన మాగృహము పావనమైనది. మేమిట ప్రవేశించినప్పటినుండియు, తమ రొక్కసారియైనను రాలేదు. మహాత్ములూరక రారు. నావలన మీకుఁ గావలసిన కార్యమేదియైన నుండిన నవశ్యము చేసెదను. మంత్రిని జంపినవారిని గుఱించి యేమైనఁ దెలిసినదా? ఆ హత్యకూడ మరల నాజయరాముఁడే చేసియుండవచ్చునని ప్రజ లనుకొనుచున్నారు. ఎవ రాజయరాముఁడు! చాల భయంకరమైన వాఁ

డుగానున్నాఁడే యని తన యాశ్చర్యమును, భయమును వెలిపుచ్చెను.

రామ—నా ప్రయత్న మింకను సరిగాలేదు. కాని యీవిషయమై మీసహాయమును గొంతకావలసియున్నది. నిన్న రాత్రి మీ భవనమున కొకసన్న్యాసి వచ్చినాఁడట. రెండునెలలనుండి యీ పట్టణముననే యున్నాఁడఁట. కాని నే నెన్నఁడు నాయనను జూడలేదు. నాకాయన దర్శన మొకసారి చేయించెదరా?

విజయ—ఎవరండి యాసన్న్యాసి? ఆయనను మీ రెంత యెఱుఁగుదురో నేను నంతియే యెఱుఁగుదును. మాభవనములోఁ బ్రవేశించినాఁడా? అసంభవము. అతనికి మాతో నేమిపనియున్నది? మరల నీరాత్రి కనుక నిచటికి వచ్చిన యెడల మీకుఁ జూపెదను. వలసిన మీరీరాత్రి మా యింటనే యుండవచ్చును.

రామ—అక్కఱలేదు. మీభవనమునకు వచ్చెనని యెవరో తెలుపఁగా నిజమనుకొంటిని. మీ రెప్పుడైనఁ జూచిన నాకొక పర్యాయ మాయనదర్శన మిప్పింపుడు, సెలవు! అని బయట కరుదెంచెను. ఇంతకుఁదక్క నాతఁ డేమి చేయగలఁడు? విజయమోహానుని "సన్న్యాసిని నీవెరుగుదువు" అని బలవంతముచేయుటెట్లు? ఆ సన్న్యాసి

రాత్రి విలాసభవనమునఁ దలఁదాఁచికొని, యుదయమున నే వెడలియుండవచ్చును. రామచంద్రుని యింటికి పయనమై, రక్షకభటాధికారి యాతని నింటియందే కాంచెను. రామచంద్రుఁ డీతనిని గౌరవించి యుచితాసనమిచ్చి,

"ఏమండీ! రామదాసుగారూ! చాల నన్యాయముగా నున్నది. మరల మంత్రిపదవి నెన్న డలంకరింతురు? ఈ దారుణ హత్యనుగురించి మీయత్నము లెంతవఱకు సాగినవి?" అని ప్రశ్నించెను."

రామ—ఏదీ! ఇంకను మొదలు—కాని......మీ రీ యుత్తరము నొకసారి చూడుడు.

రామచంద్రుఁడాయుత్తరమును గైకొనెను. చదువుట పూర్తియైనతోడనే యాతఁడు స్పృహతప్పి నేలఁగూలెను.

రామదాసు లోని వారినిఁ బిలిచెను. లోననుండి దాసదాసీ జనంబులు పరుగున వచ్చిరి. కొంతశీతోదక మాతని మోముపై జల్లగా, రామచంద్రుని కొకింత తెలివి వచ్చెను. కాని యాతనిశరీర మంతయు వణకుచుండెను. పిలిచిన పలుకుటయే దుర్లభముగానుండెను. రామదాసట నిశ్చేష్టుడై నిలువబడెను. అతని దీర్ఘవిగ్రహము కూడ నొకవిధమునఁ జలించిపోవుచుండెను. ఆతని విశాల నేత్రములు నక్షత్రములవలె మెఱయు

చుండెను. వెంకటప్పయ్యను జంపిన దురంతకుఁ డీతడే యని రామదాసునకు దృఢసంకల్పమేర్పడెను. కాని వెంటనే బాధించుటకుఁ దగినయాధారము లేవి? అందుచే నావేశముతోఁ బొంగిపోవుచున్న హృదయాందోళన నొక్కిపెట్టుకొని, రామదాసు, సైన్యాధికారితో నీక్రింది విధమునఁ బల్కె.

"రామచంద్రుఁడుగారూ! ఏమిది? మీరటులఁగంగారు పడెదరేల? లెండు, మీరంత గంభీరహృదయులు; సైన్యాధికారులు; యీయుత్తరమును గాంచినంతనే యంత యాందోళనమేల?. రండు! ఒకసారి యాపెరటిలోనికిఁ బోయి చూతము.

అత్యంత గద్గదస్వరముతో రామచంద్రుఁడు "వలసిన మీరు పోయిచూడుఁడు. నేను...........చూడ.. ...లేను" అని పల్కుచు మరల నేల కొఱగెను...

"నేను" చూడలేను "యనుమాటలో నర్థమేమి? ఈతని కాశిరస్సచట నున్నటులఁ దెలియునా యేమి? ఏమియిది? ఎటువంటి వానికెటువంటి బుద్ధి." ఆలోచించుకొనుచు, రామదాసు నెమ్మదిగా, రామచంద్రుని శయనమందిరములోనుండి పెరటిగదిలోనికిఁ బోయెను. అచ్చట మల్లెపందిరి, దానిక్రిందఁ గ్రొత్తగా మన్నుకప్పబడియుండిన స్థలమును గాంచెను. రామదాసు హృదయము కలఁగి పోయెను. ఎటువంటి పాపదృశ్యమును చూడవలసి వచ్చునో యని యాతఁడు మిగులఁ దల్లడి

ల్లెను. ఎటులనో హృదయమును బదిలపఱచికొని, కాలితో మన్ను నొత్తిగించెను. లోపలకుండ! ఆకుండలో రక్తమయమై, భయంకరమై, పాడరియున్న వెంకటప్పయ్య శిరస్సు స్పష్టముగా నుండెను!

రాజ్యము నంతయు నఱచేతినుంచుకొని, యేలిన యట్టివాని మెదడీ విధమున భూమిలో నుండినది. ఎటువంటి వారినైనను, తన విశాలనయనములతోఁ జూచి, భయపెట్టజాలిన, యాయమాత్యుని కన్నులిట్లుపాడరి, మెఱుగువీడి, చెడియున్నవి! ఎటువంటి కఠిన హృదయులనైనను, లోఁబఱచు కొనుటకుఁ దగిన సామర్థ్యముఁగల, వాక్చాతురిగల యాతని నోరిప్పుడు మన్నుతో మున్గియున్నది. ఎంతలో నెంతమార్పు: ఎంతవింత!!

రత్నసింహుని బహిఃప్రాణము: పల్వేలరాజ్యప్రాణము: లక్ష్మీదేవిప్రాణము: ఆహా! యీవిధమున దిక్కులేక పరస్థలము నందుఁ బడియున్నది. దివ్య సౌధాంతర్భాగములయందున్న హంసతూలికాతల్పముల యందైనను, నిశ్చింతగ నిద్రపోయి యెఱుంగని యాతని శిరస్సీవిధమున, కళలుతప్పి, కాంతివీడి, మెఱుగుపోయి, పొరలాడుచున్నది! ఎంతలో నెంతమార్పు! ఎంతవింత!! రామదాసిట్టి భావములతో నిశ్చేష్టుఁడై పోయెను. మరల నాకుండ నచ్చటనేయుంచి రామదాసు, రామచంద్రుఁడున్న గదిలోనికిఁ బోయెను. ఆతఁడింకను మాటలాడుస్థితిలో,

లేనందున, రామదాసా శిరస్సుగలకుండ నొక సేవకునిచేఁ బట్టిం చుకొని, తనకచేరికిఁబోయెను.

## పందొమ్మిదవ ప్రకరణము

విలాసభవనమునందు విజయమోహనుఁ డొంటరిగాఁ గూర్చుండెను. ఈతఁడొక కళింగదేశపు సంస్థానాధీశ్వరుని పుత్త్రుఁడని యీతఁడే వెనుక, మంత్రితోఁ జెప్పియుండగా మన ము వినియుంటిమి: ఈతఁడు మిగుల సౌందర్యవంతుఁడని కూడ నిదివఱకే తెల్పియుంటిమి. విలాస భవనమునందు నివసించుట కీతఁడు సరిగాఁ దగినవాఁడనుటకు సందియములేదు. వారాం గనల నృత్యములును, గాయకశిఖామణుల పాటలును, హేమ చంద్రుని కాలమునందువలె నంత యెక్కువగా లేక పోయినను, కేవలములేవని చెప్పుటకు వీలులేదు. వారమున కొకపర్యాయ మైనను విలాసభవనమునం దేదో యొకవింత జరుగుచుండును. అట్టి సమయములయందు పురపౌరు లనేకులువచ్చి వీక్షించి పోవుచుందురు. విజయమోహనుఁడు మిగుల ధనాఢ్యుఁడు. అందుచే నాతఁడేది తలఁచిన జరుగదు? ఆనాడటుల నాతఁడొం టరిగా నుండగా, సేవకుఁడొకడరుదెంచి యాతనికి వినయపూర్వ కముగా నమస్కార మొనరించెను. వానిని జూచి విజయమో హనుఁడు,

"పని బాగుగా సాగుచున్నదా? ఎంతవఱకు త్రవ్వినారు? త్రవ్విన ప్రదేశమంతయు బాగుగా గచ్చుచేయఁబడినదా? ఇంకను నెన్నిదినములలోఁ బని పూర్తియగును?" అని ప్రశ్నించెను.

సేవ—స్వామీ! పని చాలత్వరలోనే పూర్తికావచ్చును. మీరు చెప్పినటుల నత్యంత వేగముతోఁ బనిచేయఁబడుచున్నది. కౌశికానది యింక చూపుమేర దూరములో నుండును.

విజ—సరే! పనియంతయు నతిజాగ్రత్తతో, రహస్యముగా జరుపఁబడుచున్నదా?

సేవ—చిత్తము.

విజ—సరే! నీవుపొమ్ము.

అను నంతలో సేవకుఁడు విరమించెను. ఈ రహస్యపుబని యేమియని చదువరులకుఁ గుతూహల ముండవచ్చును. విజయమోహనుఁడు, విలాసభవనమునుండి పట్టణము వెలుపల కౌశికానదీతీరమున కొకబాటను, భూగర్భములోనుండి నిర్మింపఁ జేయుచుండెను. ఆపని చాల రహస్యముగా జరుపఁబడుచుండెను. విలాసభవనమునుండి తన యోడదగ్గఱకు వేగముగాఁ బోవలయుననియో, లేక మఱియొకకారణ ముండియో, యాతఁడాబాటను తయారు చేయించుచుండెను. ఆబాటకచ్చ

టచ్చట బ్రక్కలను,జిన్నగదులు,తలుపులు నతిచిత్రముగాఁదెలి యకుండగనే యమర్పఁబడెను. విలాసభవనమునం దొక త టాకము నిర్మలజలపేరితమై యొప్పారుచుండెనని యిదివఱకే తెలుపఁబడినది. ఆతటాకములోనుండి వలయునప్పుడీ బాట లోనికి నీరుకూడఁబోవున ట్లమర్పఁబడెను. అందమర్చిన యొక చిత్రద్వారమువలన దానిలోనికి వలసి నపుడు మాత్రమే నీరు పోవును. ఆబాట పగలు కూడ చాలచీకటిగా నుండును.

అట్లా సేవకుఁడు వెడలిపోయిన కొంత సేపటి కచ్చటికి యానందమోహనుఁడను విజయమోహనుని యాప్తుఁడొకఁడరు దెంచెను.విజయమోహను డెంతయందమైన వాడో యాతఁడంత కురూపి. ఆతని శరీరచ్ఛాయ రాక్షసిబొగ్గును పోలియుండి చీక టితో వియ్యమందుచుండును. ఈతఁడు తగినంత పొడగరికూడఁ గాకపోవుటచే మఱింతవింతగాఁగన్పట్టు చుండును. వీనినిఁ జూచి న, నన్నయభట్టారకుఁడు, బాహుకుని వర్ణించిన పద్యము జ్ఞాప కము రాకమానదు.

అఱ పొరడు, కురచ చేతులు,
నొఱవ శరీరంబుకలిగి, నొరులకుజూడన్,
కొఱగాకుండియు............

నీ యానందమోహనుఁడు, విజయమోహనునికి మాత్ర మత్యం త ప్రియుఁడై యుండెను. ఈ మర్కటరూపియొక్క తెలివితేట

లత్యద్భుతములు! ఆలోచన లంతులేనివి. సిపురుగప్పిన నిప్పువ లెను, బాహుక రూపంబులో నణగియున్న నలునివలెను సీతని వికృతాకారములో నద్భుతమైనగుణసంపత్తి యణగియుండెను. ఆనందమోహనుఁడరుదెంచి, విజయమోహనుని యాహ్వాన మక్కఱ లేకయే యాతని ప్రక్క నధిష్టించెను. విజయమోహనుఁ డనెను, ఆనంద! మనము తలఁచిన కార్యములన్నియు నవిఘ్న ముగా,తలఁవని తలంపుగా సఫలమగుచున్నది. మనము కొన్ని నెలలపా టిచ్చటనే యుండవచ్చును.

ఆనం—— మరెచ్చటనుందువు? లక్ష్మివచ్చి చేతఁబడుచుండగా వద్దను వాఁడెవ్వఁడైనఁ నుండునా? మన యదృష్టము చాల బాగుగానున్నది. మనకింకను తిరుగుట యెందు లకు? పల్లెఁ పట్టణములోనికెల్ల నత్యున్నతమగు విలాస భవనము మనగృహమైనది కదా! పట్టణము లోనికెల్ల మిన్నలగు పురుష పుంగవులందఱు మన చేతి కీల్బొమ్మలైరికదా! మనకేమి తక్కువ! ఇంకను మనకెన్ని రానున్నవి! మహారాజులవలె నిరంకుశప్రభు వుల వలె, తలఁచినదెల్లఁ జేయుచు, నిర్వివాదాంశము తోనున్న మనము మరియొకచోటకుఁ గదలుటేల?

విజయ——నీవు చెప్పెడివన్నియు నిజమే!కాని దినములన్నియు నొక్కరీతిగాఁబోవునా? ఏమో! చాల దూరము ప్రయా ణము సల్పితిమి. చాలసంగతులను వింటిమి. చాలఘన

కార్యములను జేసితిమి. ఎచ్చటనుజయమేకాని, యప
జయములేదు. వలసినంత ధనము సంపాదించితిమి. ఇక
స్వస్థలమునకుఁ బోయి నిశ్చింతగా నుందమనిపించు
చున్నది.

ఆనం—ఎంత వెఱ్ఱివాడవు! ధనమా శాశ్వతము. నీవు వచ్చిన
పుడు దానినిఁ దీసికొనివచ్చితివా. పోవునపుడు తీసి
కొని పోయెదవా? మనము ప్రతిదినము నాలోచించు
కొను సంగతి మఱచితివా? మన తరతరములవారును
బాగుపడున దీ ధనముతోడనా, లేకకీర్తితోడనా?

విజయ—ఆయాలోచన కొనసాగునని నాకుఁ దోచదు. ఇప్పటి
వరకును చాల బాగుగనేయున్నది. కాని, యిక ముం
దెట్లుండునో?

ఆనం—ఇప్పటి వఱకు నేలాగున నున్నదో యికముందు నట్లే
యుండును. మనశక్తిసామర్థ్యములు తక్కువయా? మన
యాలోచనలు సామాన్యములా? మన మధైర్యపడ
వలసిన కారణము నాకేమియుఁ గన్పట్టుటలేదు.

విజయ—సరే! చూచెదము. ముందు మనయోడను తీసికొని
వచ్చి మననేలబాట యంతమగుస్థలమునందు కట్టివేయ
వలయును. ముందే యాపని జేయఁవలయును. లేనియెడల
ననుమానాస్పదమగును.

ఆనం—సరే— ఆలాగుననే చేయుదము.

---

## ఇరువదవ ప్రకరణము

ఆయుత్తరమును జూచిననాటనుండియు, రామచంద్రునకు సరిగా నిద్రాహారములులేవు. పిచ్చివానివలె నెల్లప్పుడును, నిలచినచోట నిలువక, నటునిటుఁ దిరుగుచు కాలమెట్లో కడపుచుండెను.

ఒకనాడీతఁడు, తనయుద్యానవనములోని బొగడచెట్టు క్రింద మతిలేనివానివలె తిరుగుచుండగా, నీతనికొఱకు ప్రియంవదవచ్చెను. ఆమెయు నీతని వైఖరిఁజూచి చాలనాశ్చర్యపడెను. సింహమువలెనుండు నాతఁడిట్లు, చిక్కి శల్యమగుట కేమికారణమేమోయని యామె చాలవఱకాలోచించెను. చాలసేపటివఱ కెవరును మాటలాడలేదు. ప్రియంవద మాత్రము పూర్వముకన్న మిగుల సౌందర్యవంతురాలైనట్లుండెను. కొంతతడవునకు రామచంద్రుఁడీమెను గాంచి "మీరాణి క్షేమమా?" అని ప్రశ్నించెను.

ఆమాటకుఁ బ్రియంవద,

"హైవమతీదేవి క్షేమముగనేయున్నది. ఈరాత్రి మిమ్ములనొకపర్యాయము దర్శన మీయుఁడని కోరుచు, నాచేఁ గబురుపంపినది" అనెను. రామచంద్రుఁడు వల్లెయనుటయు, ప్రియంవద సెలవుఁగైకొని తనదారినిఁ బోయెను.

ఆనాటిరాత్రి నిర్ణీత సమయమునకు రామచంద్రుఁడు హై

మవతీదేవి యొద్దకుఁబోయెను. పూర్వముకన్న ద్వారపాలకులొ కింత జాగరూకతతో నుండిరి. కాని రామచంద్రుని వారేమియు నడ్డలేదు. మెల్లఁగాఁజీమచిటుక్కుమన్న నదరిపడుచు రామచంద్రుఁడు విమలభవనముఁ బ్రవేశించెను. హైమవతి యాతనిని మిగుల గౌరవించి యుచితాసన మిచ్చి, యాతని ప్రక్కనే మఱియొక యాసనముపై నామెయు నాసీనురాలాయెను.

హైమ—అయ్యా! నేను కబురు పంపినవెంటనే మీరువచ్చి నందుల కనేక నమస్కారములు. విశేషములేమి?

రామ—రాణీ! తాము కబురుపంపుటయుఁ దమసేవకుఁడు రాకపోవుటయును గూడనా? విశేషముల కేమున్నది. వెంకటప్పయ్యహత్యకన్నను విశేషమేమి కావలయును?

కాని రామచంద్రుఁడు తనపెరటియందాతని శిరస్సు దొరకిన దనుమాట నామెతో నెందువలననో తెలుపక దాచి పెట్టెను. అటుల దాచుటవలన నాతని యభిప్రాయమేమైనను, ముందు ముందాతనికిఁ గల్గిన యవస్థకంతకు నదియే ముఖ్యకారణ మాయెను.

హైమ—పాపము. నిష్కారణముగాఁ జనిపోయినాడు. పోనీ! చనిపోయిన వాడెట్టులను తిరిగి రాడు. ఈవిధముననైన మనకార్యము కొనసాగిన బాగుగానుండును. మావా రేమి యాలోచింతురో? వారి కీవిషయమున నేమైనఁ

మా సోదరుఁడే పల్వాల రాజైన,!— ఏలవట్టిమాటలతో? దైవానుగ్రహ ముండవలయును. మిడిసిపడిన వెంకటప్పయ్య మిడుతవలె మాడినాడు. మనకు మిడిసిపాటు కూడదు. నాతంత్రముయొక్క చుక్కానికఱ్ఱ మీచేతిలోనున్నది. మీ రెటుల ద్రిప్పెదరో? మీ రీ యుత్తరమును తేపటి యుదయముననే పంపించవలయును. దీనిలో మనతంత్రమంతయునున్నది. కనుక, మన విరోధుల చేతిలోఁ బడిన మనకుఁ జాలఁ బ్రమాదమున్నది. దీనిని మీరు చాల నమ్మకమైన వానిచేఁ బంపవలయును. ఇదంతయుఁ దుదనెగ్గిన మీకు కాంతాకనకములు రెండును లభించును."......అని, చాల విలాసముగా నాలావణ్యవతి, యాతనిహస్తమును దనచేత నిడికొని, యటునిటు త్రిప్పుచు, సైన్యాధికారి పూర్వఁపు దుఃఖమునంతటిని మఱచునట్లు వేసెను.

రాత్రి రెండుజాము లగువఱకును వారట్లేయుండిరి. రామచంద్రుడును, కొంతతడవు విశ్రమించి, లేఁచి, మరల యథాప్రకారముగాఁ జడియుఁ జప్పుడుఁ గాకుండ తన యింటి దారినిఁబట్టి తిరిగి వచ్చుచుండెను.

ఆ నిశీథసమయమునఁ బురమంతయు నిశ్శబ్దముగానుండెను అచ్చటచ్చట గస్తీ వారిడువెఱ్ఱికేకలుతక్క,మ రేధ్వనియు వినవచ్చుటలేదు. రామచంద్రుఁడేదియో యాలోచించుకొనుచు వచ్చుచున్న నాసమయమున,"జచ్చితిని బాబో" యను కేక

యొకటి వినఁబడగా, రిచ్చవడి యాతఁడాఁగెను. ఆతని ప్రక్కనే చెటమధ్య నేదియో విగ్రహము మూల్గుచు పడియుండుటఁ గాంచి, రామచంద్రుఁ డావైపునకుపోయి చూడ, నొక బికారి వేసముతోనున్న బిక్షుకబాలుఁ డొకఁ డటఁ బడియుండెను. "ఊ—ఊ—అమ్మా" యనుచు నాబాలుఁడు మిగుల జాలికరముగా మూల్గుచుండెను. రామచంద్రుఁడు దగ్గరకుఁ బోయి,

"ఎవరురా నీవు? ఇంత రాత్రివేళ నిచ్చటఁబడి మూల్గుచున్నావేలఁ?" అని ప్రశ్నించెను.

కొంతసేపటివఱకు నా పిల్లవాఁడు మాట్లాడనేలేదు. తరువాత నెమ్మదిగా నాతఁ డిట్లనియెను.

బాబూ! ... ఇంటికి ... ఊ — ఊ! పోవుచుండగా... నేదియో ... అమ్మ!... ఊ! కరచినది ... చచ్చిపోయెదను... అమ్మా ... ఒక్క ... అగ్గిపుల్ల ... వేయండి ... బాబూ... ఊ ...! అమ్మ...మంటలు. తిమ్మెరలు ... బరువు .. అమ్మ! అమ్మ!! ఈ మాట వినునప్పటికి, రామచంద్రునికి చాల జాలి కలిగెను.

నీ యిల్లెక్కడ? చెప్పుము. అచటికేఁ దీసికొని పోయెదను? రామచంద్రుఁడు దయతో ననెను.

నాకిల్లులేదు. బాబూ ... అమ్మ...ఊ దిక్కులేని వాఁడను ... చచ్చిపోయెదను అని నెమ్మదిగా ననియెను.

పోసి! మాయింటికి రమ్ము! నెమ్మదిగానున్న తరువాత నెచటికైనను పోవుదువుగాని, అని రామ చంద్రుఁడుపలుకఁగా, నాబాలుఁడు సమ్మతించి యాతనివెనుకనే నెమ్మదిగాఁగుంటుచు పోయి, యింటికిఁజేరెను.

అప్పటికిరాత్రి చాలవఱకునతిక్రమించెను. కుక్కుటము లచ్చటచ్చటఁ గూయుచుండెను. రామచంద్రుఁడు "ఓరీ! బాధ యెట్లున్నది?" అని యాబిచ్చగాని నడిగెను.

"బాధ తగ్గినది. కాని నీరసముగానున్నది బాబూ"అని యాపిల్లవాఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

"తెల్లవాఱనీ! కొంచెము గంజి కాపించి పోయించెదను" అని రామచంద్రుఁ డాతనికి ధైర్యముఁజెప్పెను. ఆపిల్లవాడును నిదురపోవుచున్నటులఁ బడియుండెను.

అంత రామచంద్రుఁడు తన మంచముపైఁ బరుండి, యేదియో దీర్ఘాలోచనఁ జేయ మొదలిడెను. కొంతసేపటి కాతఁడు తన నిద్రావస్థనుండి మేల్కాంచి, "స్వామీ! యని రెండు, మూడుసార్లెలుగెత్తి పిలువ, కొంతతడవున కొక నల్లని దృఢగాత్రుఁ డొకఁడు వచ్చి యెదుట నిలువఁబడెను. రామచంద్రుఁ డాతనితో నిటులనెను.

"స్వామీ! నీవొక ముఖ్యమైన కార్యము నతిజాగరూకతతోఁ జేయవలయును నేనొక యుత్తరము నిచ్చెదను.

దానిని నీవు తీసికొనిపోయి, రామచంద్రనగర కుమార రాజగు రాజసింహున కీయవలయును. నమ్మకమైన వాఁడును, చురుకైనవాఁడు నీపనిఁ జేయవలయును. అందుచేత నీపనిని నీనెత్తి పైనుంచితిని. నీవు నాగుఱ్ఱమును దీసికొని యాయుధహస్తుఁడవై పొమ్ము. నేనిచ్చు యుత్తర మత్యంతరహస్యకార్యమును గురించి వ్రాయఁబడినది. అందుచేత నీ వప్రమత్తుఁడవై యుండవలయును" అందులకు స్వామి, "చిత్తము. అట్లులనే చేసెదను, నేనెప్పుడు బయలుదేరవలయును?" అని యడిగెను.

"ఎప్పుడో నా? ఈతత్క్షణము పొమ్ము. నీకు బత్యమిదిగో! నాగుఱ్ఱము నిన్ననీవు కట్టిన చోటనేయున్నది. పొమ్ము" అని రామచంద్రుఁడన, స్వామి వెడలిపోయెను.

ఆబిచ్చగాఁడును, స్వామి వెడలిపోయిన వెంటనే లేచి, "బాబూ, కొంతసేపు నిదురపోయిన తర్వాత నానీరసము తగ్గినది. కొంచమవతలకుఁ బోయి చల్లగాలిలోఁ దిరిగిన యెడల నానీరసము పూర్తిగాఁ దగ్గును. నాకిఁక సెలవిండు" అనిపలుక,

"కొంచము, గంజిఁద్రాగి పోవుదువుగాని, యుండుము" అని రామచంద్రుఁడనెను.

"అక్కఱలేదు. తమరు నాయందుఁ జూపినదయకు వేయేండ్లు వర్ధిల్లుడు" అని, రామచంద్రుఁడిచ్చిన నాణెములను గైకొని, యత్యంత సంతోషిత హృదయాంతరంగుఁడై పరుగిడి

పోయెను. వెంటనే యాతఁడు మరల రామదాసునింటఁ బ్రత్యక్షమాయెను. ఈతఁడు శశిభూషణుఁడు తక్క మఱియొకఁడు కాఁడని, పాఠక మహాశయులు గ్రహింతురుగాక!

## ఇరువదియాఁకటవ ప్రకరణము

శశిభూషణుఁడు లోపలఁ బ్రవేశించి రామదాసును గన్గొని, తాను చూచినది, విన్నది, యంతయుఁ దెలిపెను. తానురాత్రి బిచ్చగాని వేషముతో నరుఁగుట, అర్ధరాత్రమునందు రామచంద్రుఁ డొంటరిగా విమలభవనమునుండి వచ్చుచుండుట; తాను బాధనొందుచున్న వానివలె నభినయించుట; రామచంద్రుఁ డాతనిని దనయింటికిఁ గొంపోయి, యాదరించుట; స్వామిని బిలిచి యుత్తరము నొకదాని నిచ్చి రామచంద్రనగరము పంపుట; తానువెంటనే లేఁచి యొక్క పరుగున వచ్చుట; మొదలగుసంగతుల నన్నిటిని పూసగ్రుచ్చినట్లు రామదాసునకుఁ దెల్పెను.

రామదాసిదంతయు విని, యెట్లైన నాయుత్తరమును జూచి తీరవలయునని తలఁచెను, ఆయుత్తరమే తనకన్నులఁ బడినయెడల, వెంకటప్పయ్య హత్యలో నెవరి కెంతవఱకు సంబంధమున్నదో తెలియఁగలదు. రామచంద్రునియింట శిరస్సున్నదని మఱియొకఁ యుత్తరము వ్రాయుట; ఆశిరస్సట

దానే పెట్టినటుల, రామచంద్రుఁడు కంగారుపడుట చూడ నీవిష యమున నెట్లు నిర్ధారణఁ జేయుటకును వీలులేదు. హైమవతీ దేవికిఁగూడ నీహత్యలో నెంతవఱకు, సంబంధమున్నదో తెలి యుటలేదు. మొత్తమున కీయుత్తరమును గనుక, చూడగలిగిన యెడలఁ జాలవఱకు సందియము వదలిపోవును. రామచంద్ర నగరరాజులు పల్వోల పట్టణమునకు ప్రస్తుతము విరోధులుగా నున్నారు. హైమవతీదేవి, యధికారమంతయుఁబోవ, నగా రవముగాఁ బ్రదుకుచుండుటఁ జూచి, వారు మిగుల కుపితులై పల్వోల రాజ్యసౌఖ్యము నెటులైన భగ్నపఱ జూచుచు న్నారు. అట్టివారికి రామచంద్రుఁడుత్తరము వ్రాయుట రాజ్య ద్రోహముకాదా? ఏదైన వ్యవహారమునుగురించి వ్రాసినాఁడను కొనుటకు, శ్యామసుందరీదేవికిఁ దెలియని విశేషవ్యవహారము లీతని కేమియున్నవి? ఈసంగతియంతయు ముందామెతో నివే దించుట మంచిది. ఇంతలో స్వామిదాఁటిపోయిన! అయినను, ముందు పదిమంది రక్షకభటులను బంపి యాతని నాఁపుచేసి యుంచమని యాజ్ఞాపించి వెంటనే రాణినిఁ జూచుటకుఁబోవల యును."

ఇట్లాలోచించుకొని, రాణిదర్శనమునకై రామదాసు బయల్వెడలెను.

శ్యామసుందరీదేవి, వెంకటప్పయ్య గతించిన నాటనుం డియు, రాజ్యవ్యవహారములన్నియుఁ దానే చక్కఁబెట్టుకొను

చుండెను. మిగుల నమ్మకమైన వాఁడని తలఁచిన, రామచంద్రుఁడే ద్రోహియగుటఁ జూడ, నెవరిని నమ్ముటకు నామెకుఁ దోఁచకుండెను. ఆమె వయస్సునందు చిన్నదైనను, యసాధారణ బుద్ధికుశలత కలది కావున, వెంకటప్పయ్య చనిపోయెనని లోపమేమియు లేకుండ, తానే, రాజ్యవ్యవహారములఁ జక్కఁగ నెఱవేర్చుచుండెను.

ఆనాఁడు రామదా సట్లు కృతనిశ్చయుఁడై, వచ్చి, రాణి దర్శనము నతిత్వరలోనే చేయఁగలెను. రామదాసు పట్టుదలతోఁ జేయుచున్న ప్రయత్నములకు, శశిభూషణుని బుద్ధికుశలతకు నామె చాలసంతసించెను. రామచంద్రనగర ముత్తరము వ్రాసెనని వినినతోడనే, యామెకు, సైన్యాధిపతిపైఁ జాల నసహ్యము పుట్టి, యాతనియందుఁగల సదభిప్రాయమును క్రమముగా క్షీణింపఁజేసెను. వెంటనే యాతని నా యుద్యోగము నుండి, తప్పింపఁ దలంచెను కాని, రామదా సామెని నివారించి యుత్తరముఁ జూచువఱకు తొందరపడరాదని వాదించెను. రాణియును బలిమి నాయుత్తరముఁ గొనివచ్చుట కాజ్ఞనొసంగెను.

వెంటనే రామదాసు ధృఢగాత్రులగు, రక్షకభటులఁ బదిమంది నాయుధహస్తులఁజేసి, తీసికొని బయలుదేరెను. వారందఱు హయములనారోహించి నతిరయంబునఁ బ్రయాణము సాగించిరి. మూఁడుక్రోసులదూరము పోవునప్పటి కిదివఱకుఁ

బంపబడిన రక్షకభటులు, రామచంద్రుని భృత్యుఁడగు స్వామిని బంధించియుండుట రామదాసు గాంచెను. రాణి యాజ్ఞచే నాతనిఁ బంధించితిమని తెల్పి, యాతనిని రక్షకభటుల కప్పగించి, రామదాసు వెనుకకుమరలెను. స్వామియు తన దురదృష్టమును నిందించుకొనుచుఁ దానుబయల్వెడలిన యపశకునఁపు వేళం దలంచుకొనుచు, విచారగ్రస్తుఁడై మారుమాటాడక వారితోఁ జనుచుండెను. ఆతని యొద్దనున్న యుత్తరమును రామదాసు జాగ్రత పెట్టెను. వారటుల బయల్వెడలి పల్వోల, రెండు జాము లగునరికిఁ జేరిరి. రామదాసు తననివాసమునకు పోక, యుత్తరమును గైకొని వెంటనే రాణి దర్శనార్థమై వెడలెను. రాణియు నాపూటయంతయు నేమియు తోఁచక, యుండి, రామదాసు వచ్చినవెంటనే యుచితాసనమిచ్చి యుత్తరమును కడురయంబున గైకొని యీక్రింది విధమున చదివెను.

ప్రియసోదరా,

పల్వోల పట్టణములోనుండిన నీసోదరియగు హైమవతి నిన్ను చిరాయువులుగా దీవించి వ్రాయు శుభ వర్తమానములు——

మన మెట్టివేళ యీకార్యమును దలపెట్టితిమో కాని, మనతలంపులన్నియు నిర్విఘ్నముగా సాగుచున్నవి. నాప్రభావ మిచ్చట దేదీప్యమానమై వెల్గుచున్నది. వెంకటప్పయ్యహత్య వలన మన కొక పెనుపర్వతము తొలంగినది. మన మిక

నయమునకాని భయమునకాని మనకార్యము నెఱవేర్చుకొనుట స్థిరము. ఆమె యొప్పుకొన్నను, లేక పోయినను, దానితో మనకెంత మాత్రము నిమిత్తములేదు. సేనాధిపతియగు రామచంద్రుఁడు మనము చెప్పినటులఁ జేయుటకు సిద్ధముగా నున్నాఁడు. మనకేవిధమగు నధైర్యమును లేదు. మీకుఁ బ్రస్తుతము వ్రాయఁగూడని రహస్యము లనేకములున్నవి. నేను నా సర్వమును నీకొఱకై ధారవోయుచున్నాను. నీ వికఁ బల్వాల రాజ్యము, శ్యామసుందరి హస్తగతమైనటుల సంతసింపవచ్చును. నే నటులనే సంతసించుచున్నాను. ఇఁక కొలఁది దినంబు లోపిక పట్టుము. ఎందుకైననుమంచిది. మనరాజ్యమునందలి సైన్యముల మాత్రము సిద్ధపఱచియుంచుము. నా యభిప్రాయమును నీవు గ్రహించియుందువని తలఁచుచున్నాను. ఇప్పటి కింతే సంగతులు. మరల వెంటనే వ్రాసెదను. నీ ప్రయత్నంబులఁ గూడ నాకుఁ వినిపింపుమని కోరుచున్నాను.

ఇట్లు,
నీ ప్రియముఁగోరు నీసోదరి
హైమవతి

ఈయుత్తరమును చదివిన శ్యామసుందరి కాశ్చర్య, భయవిషాదంబులు ముప్పిరిగొనఁ గొంత సేపటివఱకును మాట రాలేదు. రామదాసుచు మాటలాడకయూరక చూచుచుండెను. రామచంద్రుని వెంటనే బంధింపవలసినదని యామె రామదాసు

నాజ్ఞాపించెను. తానుగూడ వెంటనే పట్టాభిషేకముఁ గావించి కొని, సింహాసన మధిష్ఠించినఁ గాని లాభముండదని యామె నిశ్చయించుకొనెను. ఇఁక హైమవతి యున్నది. నమ్మకమైన భటులను విమలభవనము చుట్టును కాపుంచవలయును. ఆవిధమున కొంచ మెచ్చుతగ్గుగా నామెయు బంధింపఁబడును. వెంటనే వీనికన్నిఁటికి నాజ్ఞాపత్రముల వ్రాయించి తాను సంతకముచేసి, రామదాసును భోజనమునకై పంపెను.

## ఇరువది రెండవ ప్రకరణము

క. రాజ్యంబు పాపమూలము
రాజ్యముతో నొడలెఱుంగరాదు, సుమతియున్
రాజ్యమునఁ బూజ్యు నెఱుఁగడు
రాజ్యము గీజ్ఞము ము కిరతునకు నేలా?

—భాగవతము.

ఆనాటి సాయంకాలమునఁ బల్వాల పట్టణములోఁ గల్గిన కలవర మింతింత యని చెప్పనలవి కాదు. వెంకటప్పయ్యామాత్యకంటె, నానేరమునకై, ముఖ్యసైన్యాధికారియుఁ, బల్వాల పట్టణ చిరకాలనివాసియు, రాజసేవాధురంధర ప్రజ్ఞావిశేషియు, నత్యంత బలశాలియు నగు రామ చంద్రు నుద్యోగము నుండి తొలఁగించి, బంధించుటఁ గాంచి పట్టణ మంతయు నట్టు

డెకిన ట్లుడికిపోయెను. చాలమం దిదంతయు నెవరో చేసిన మాయయనియు, నింత విపరీత ముండదనియు, నింక పల్వాల రాజ్యము భగ్గున మండినట్లేననియు, తలంచిరి. ఆఁడుది రాజ్యమునకు వచ్చిన ఫలిత మప్పుడే కనఁబడిన దని కొందరనిరి. ఇంత తొందరగాఁ బంధింపఁజేసి నందులకు రాణిని; ఆ మాత్రము సలహా నీయ నందులకు రామదాసును మిగులనిందించి, ప్రజ లత్యంత క్రోధముతో నుండిరి.

రామదాసు, ప్రత్యక్ష నిదర్శన మట్లు దొరకిన తరువాత నింక నాలసింపవలసిన పనిలేదని రామచంద్రుని బంధించెను. ప్రజలలోఁ గలిగిన కలవరపాటునుఁగని యాతఁ డత్యంత విషాదము నందెను. ఎందఱి కని సమాధానము చెప్పఁగలఁడు? పట్టణ ప్రజాళి నంతటను నేదో యొకవిధమున శాంతింపఁ జేయవలయును; కాని యూరకుండుట కార్యము కాదు. అట్లూరకుండిన యెడల, ప్రజలకు, రాజునందును, రాజ్య విధానమునందును నమ్మకము గౌరవము తగ్గును. వారు తిరుగుఁబాటుఁ గావించుటకైనను సంశయింపరు. అప్పుడు రాజ్యము కీడు నొందుటయుఁ బరరాజుల పాల్పడుటయుఁ గూడ సంభవించును. ఈకారణములచే రామదాసు రాణిని దర్శించి, త్వరలో నొక ప్రజాసమావేశముఁ గావింపఁజేసి, యందు రామచంద్రుని ప్రత్యక్షముగా విచారించి, యాతఁడు నేరస్తుఁడని స్థిరపర్చినఁ గాని, ప్రజ లూరకుండజాలరని తెల్పెను.

అంతియగాక, నామె త్వరలో నేపట్టాభిషిక్తురాలై రాజ్యనేకను, తాను స్వయముగా నడిపించినఁ గాని ప్రజలకు, తగిన భయము భక్తియు కుదురదని యాతఁడు వాక్రుచ్చెను.

రామచంద్రుఁ డట్లాయెను. ఇక హైమవతీ దేవి సంగతి ఆమెను చెఱసాలయం దుంచకపోయినను నామె యవస్థ నిజముగా ఖైదీకన్న నెక్కుడు బాగుగా లేదు. ప్రియంవద, మునుపటివలెఁ బైకిని, లోనికిని, దన యిచ్చవచ్చిన రీతిని పో వీలు లేకుండెను. ద్వారపాలకులు మిక్కిలి నమ్మకమైనవా రుండుటచే, హైమవతి సువర్ణదానము లేమియు వారియొద్దఁ బనిచేయలేదు. రామచంద్రుఁడు బంధింపఁబడెనన్న సంగతి హైమవతికిఁ దెలియనేలేదు. శ్యామసుందరి, పట్టాభిషిక్తురా లగుటకు, సర్వమును సిద్ధముచేయుచున్న సంగతియు నామెకు దెలియదు. తన యుత్తరము రామచంద్రనగరము సురక్షితముగాఁ జేరినదనియు, నచటఁ దనతండ్రి, సోదరుఁడు, నుత్తరములోని యర్థము నంతయు గ్రహించి సమస్త సన్నాహముఁ జేయుచుందురని తలచెను, కాని యామెకు స్వాతంత్ర్యము తగ్గింపఁబడినదని మాత్రము తెలియక పోలేదు. ప్రియంవదయు నామెయుఁ గలసి, యెందుచేత నిటులఁ జేయఁబడినదో యని పలు తెఱంగులఁ జింతించిచూచిరి, కాని వారి ప్రయత్నములన్నియు బూడిదలోఁ బోసిన పన్నీ రగుచుండెను.

అట, శ్యామసుందరి పట్టాభిషిక్తురా లగుటకు సమస్త సన్నాహములఁ జేయించుచుండెను. సింహాసన మధిష్ఠించుట యన, నంత సంతోషకరము కాదు. ప్రస్తుత మీ దేవి స్థితిఁ జూచిన మనకీ సంగతి గోచరమగును. రాజ్యాధికారము నెత్తిపైనుంచి కొనుట, పాములున్న యింటియందుఁ గాపురముండుట, అందునను, బూర్వకాలఁపు రాజ్యము లంతకట్టుదిట్టమైన వికావు. దేశ మంతయును స్వాతంత్ర్య రాజ్యములతో నిండి యుండి, బాహుబల సమన్వితుఁడైన రాజందఱిని లోఁబఱచి కొనుచుండ, వాని వెనుకవచ్చు బలహీనుఁ డందఱి పరరాజుల పాదము నెత్తిపై నుంచికొనవలసి వచ్చుచుండెను.

శ్యామసుందరీ దేవికిఁగూడఁ బెక్కు కష్టములు లేక పోలేదు. రాజ్యములోనే ప్రబలవిరోధు లుండుట మొదటిది. ముఖ్య మంత్రియగు వెంకటప్పయ్యను సంహరించుట కేవల మొక నరహత్య మాత్రమే కాదు. అందుఁ జాల విషమ రహస్యము లడఁగి యున్నవని శ్యామసుందరీ దేవి తలఁచినట్లే, హైమవతి తన పుట్టినింటికి వ్రాసిన యుత్తరము తెల్పుచుండెను. రెండవ కష్టముఁ బ్రక్కలోని బల్లెమువలె, తన సవతితల్లి యగు హైమవతి యునికి ఆమె యసాధారణస్త్రీ యనియు, దన కెప్పటికైన ముప్పుఁదెచ్చునటియు, పల్నాల రాజ్యక్షేమము నపహరించు నరరూప రాక్షసి యనియు శ్యామసుందరికిఁ దెలియును. ఎంత కట్టుదిట్టములో నుంచినను, యాఁమె యున్నంత

కాలము తనకు నిద్రాహారములు నిశ్చింతగ నుండ వని శ్యామ సుందరి యూహ.

మూడవ కష్ట మామె స్త్రీయగుట "ఆఁడుది రాజ్యము చేయుట యేమి? స్త్రీబుద్ధిః ప్రళయాంతకః యను వాక్యము ననుసరించి యాఁడు దానికి రాజ్య స్పర్శకూడదు" యను మూర్ఖులు రాజ్యము నంతయు నిండియుండుట, మూర్ఖుఁడైనను, పురుషుఁ డున్నంత గాంభీర్యముగా స్త్రీయుండదని యామె భయపడెను.

ఇట్టి కష్టము లున్నను, రాజ్యాధికారము వహించిన వెనుకఁ దగినవరుని జెట్టఁబట్టి, యాతని సాహాయ్యమున క్షేమముగా నుండవచ్చునని యామె ధైర్యము నొందెను.

## ఇరువది మూడవ ప్రకరణము

సోమయాజులుగారు పల్లెలలో రాజాశ్రయముచే బ్రదుకుచున్న యొక బ్రాహ్మణపుంగవుఁడు. ఆయన యొక నాఁడు, తన వీధియరుఁగుపై మనుమని నెత్తుకొని యాఁడించుచుండగాఁ దన చిరపరిచయుఁడగు రామావధాను లరుదెంచెను.

సోమ—రామావధానులూ! కాశీ యాత్రనుండి యెప్పుడు వచ్చినా వేమిటి?

రామా—ఏదీ! నిన్న సాయంకాలము వచ్చినాను విశేషము లేమి?

సోమ—హూర్చో! విశేషముల కేమి లోపము! కావలసినన్ని! కాని, బాజాలు, భజనలు, లేక యేమిది, చడియుఁ జప్పుడును గాకుండ వచ్చినావు?

రామా—ఈ పట్టాభిషేక మహోత్సవకారణమున నెక్కడ నొక్క మనుష్యుఁడైనను ఖాళీగా లేడు. అందరికిని పని యే! నీ విక్కడనే యున్నా వేమి?

సోమ—ఇప్పుడే వచ్చినాను వారము రోజులనుంచి నిదురయే లేదు. హోమములు! మహారాధనలు! ఏవో నాల్గు డబ్బులు దొరకు రోజులు.

రామా—నీ కేమి? అదృష్టవంతుఁడవు. కాని యేమి యీచిత్రములు? నేను కాశీ పోయివచ్చు నప్పటికిన్ని దారుణములు జరిగిన వేమి! హేమచంద్రుఁడు, ముఖ్య మంత్రియు హత్య చేయఁబడిరను మాట నేను మొదట నమ్మలేక పోయితిని. సేనాధిపతిని బంధించిరట కాదూ? అది చాల తెలివితక్కువపని యనియు, జయరాముఁడు మరల వచ్చినాడనిన, నిన్నరాత్రి నాకు నిదురయే లేదు. అయితే, రామదా సేమి చేయుచున్నాడు?

సోమ—రామదాసును జాల ప్రయత్నములు చేయుచునే యున్నాడు. అతడు చేయకపోయిన, నీ రామచంద్రు

నెవరు బంధించిరి. నే నప్పుడప్పుడు కోటలో నికిఁగూడఁ బోవుచుందును గనుక, నా కింకొక రహస్యము తెలిసినది. ఇంకెవరి తోనైనఁ బల్కెదవుసుమీ! కొంప మునిఁగిపోవును! వెంకటప్పయ్యాహాస్యను హామవతీదేవి కూడఁ గొంతవరకు కారకురాలట!

రామా.—సరి, సరి! ఈ చిత్రము మఱియు వింతగానున్నది. ఆమె కేమి సంబంధము?

సోమ—తన తమ్మునికీ శ్యామసుందరి నిచ్చి పెండ్లి గావించి యీరాజ్యమంతయుఁ దానే యేల దలచికొన్నదట అట్లామె వ్రాసిన యుత్తరము రామదాసు చేతఁ జిక్కినది. ఆయుత్తరమును రామచంద్రుఁడు రామచంద్రనగరము పంపుచుండెనట—మఱి యీరాశికి, నాతనికి, నేమి సంబంధమో!

రామా.—అందుల కేనా, యీతని నిపుడు బంధించినది?

సోమ—కేవల మందు చేత నే కాదు. వెంకటప్పయ్య నాతఁడు చంపించినటులఁ బ్రత్యక్ష నిదర్శనమే యున్నది. మంత్రితల వారి యింటి పెరటియందుఁ బ్రాతి పెట్టబడి యున్నదట.

రామా.—ఎంత తెలివి తక్కువ వాఁడైనను, తన పెరటియందే ప్రాతిపెట్టుకొనునా? ఎవరైనఁ గిట్టనివా రాపని జేసిరేమో?

సోమ—నీకెప్పుడును నీలాటి సందియములే! ఆతని యి ల్లెంత కట్టుదిట్టమైనది? అటులైన, నాతని కట్టి విరోధు లెవరు?

రామా—ఏమో! మన మేమి చెప్పఁగలము? కాని ......... పట్టాభిషేక విశేషములేమి?

సోమ—చాల జయప్రదముగా జరిగినది. అనేక పట్టణముల నుండి, జనులు తండోపతండములుగా వచ్చిపడిరి. దాన ధర్మములు మిక్కుటముగాఁ జరిగినవి. అనేకమంది సామంతరాజులు వచ్చిరి. వారర్పించిన కానుకలఁ జూచి తీరవలయును. నవరత్నహారములేమి, సువర్ణాలంకారము లేమి, చెప్ప నలవికానన్ని యున్నవి. కాని యారాజులందఱికంటె నెక్కువ గొప్ప విచ్చిన వాఁడు విజయమోహనుఁడే! ఆతఁడిచ్చిన హారములు, వస్త్రములు నమూల్యములు!

రామ—ఆయన యెవరు?

సోమ—సరి, సరి! నీవింకను నెఱుఁగవా? సుమా రైదారు నెలలకు పూర్వము, వర్తకము నిమిత్త మొక చక్కని యోడనెక్కి, యనేక మంది సేవకులతో నితఁ డరుదెంచినాడు. కళింగ దేశపు రాచకొమరుడట. ఆతఁడు నిజముగాఁ గుబేరుని కంటెను ధనవంతుఁడు: వసంతుని కంటెను సౌందర్యవంతుఁడు: కర్ణునికంటెను దానపరుఁ

డు. ఆయన ముఖ సందర్శన భాగ్యము, సర్వపాపపరి హారము. నిత్యానంద పురుషుఁడగు నాతఁడు, పెద్దల యందు భక్తి, బీదలయందు దయకల్గి, యీపట్టణము లోని వారందఱకుఁ దలలో నాలుకవలె మెలంగుచు, తా నింత యనుభవించి, పరుల కింత పెట్టి, సత్కీర్తిపరుఁడై, యున్నాఁడు. ఈతఁ డీపట్టణవాసుఁడు కాక పోయినను, మొన్నఁబట్టాభిషేక సమయమున నత్యంత ధనము వెచ్చించి, యన్నియుత్సవములందును, మిగుల మోదముతోఁ బాల్గొన్నాఁడు. ఈతఁడు హేమ చంద్రుని విలాసభవనమునుకొని, యందుఁగాపురము న్నాఁడు. ఆతని కీపట్టణమునందుండుటే యెక్కువ బాగు గానున్నదనుట.

రామా—ఆనిగర్వ చూడామణి దర్శనమొక పర్యాయము చేయవలయును. అట్లను కాని, హైమవతీదేవి ప్రస్తుత మిచ్చటనే యున్నదా?

సోమ—ఏమియుండుట! పేరునకుమాత్ర మిచ్చట నేయున్నది, మొన్న జరిగిన యుత్సవములలో నామెను నిజముగా బయటకే రానీయలేదు. రత్నసింహుని కాలమున, సౌందర్యమునకును, యానందమునకు నునికిపట్టైనవిమల భవన మిప్పుడు ఖైదైయున్నది, అందామె యొకఖైదీ.

రామా॰—ఈకష్టములన్నియు ననుభవించుచు, నామె యిచ్చ
టనుండు టెందులకు? రామచంద్రనగరము పోరాదా?
గౌరవము లేనపుడు, వితంతు వత్తవారియింట నుండుట
మిగుల హేయము.

సోమ—పుట్టినింట నేమియున్నది, బుగ్గి! వితంతువని మూలపడి
యుండుటకీమె సామాన్యవితంతువా? అటులైన, నీమె
కావిచారము గాని, కష్టముగాని లేనేలేదు. రత్నసిం
హుని నాటి కన్న యామెయిప్పుడే చాల సౌఖ్యముగా
నున్నది. రత్నసింహుఁడు, సింహమువలె నీమె నణఁచి
పెట్టి యుంచెడివాడు. ఇప్పుడన్ననో విచ్చల విడిగాఁ
జెలరేగి, తనప్రియులతోఁ గూడి గర్భనిర్భేద్యమైన
యాలోచనలఁ జేయుచు, వేశ్యకన్న నెక్కుడుగాను
న్నదని, కోటలోనివాడుక మొన్న మొన్ననేకదా, యా
మెచేయు కుతంత్రము లన్నియుబైట పడినవి. అప్పటి
నుండియు నీమెనిటులఁ గట్టియుంచినారు. ఇప్పుడిఁక పుట్టి
నింటికిఁ బోవునేమో!

రామా॰—ఆమె కేమి తక్కువని యిట్టి దుర్బుద్ధులు! ఏదో
వినాశకాలము సంప్రాప్తమైనది. హత్యలుచెలరేగినవి.
జయరాముఁడు మరల దాపరించినాడు. ఆఁడుదాని రాచ
రికము; మంత్రి మన్నుఁ గలసినాడు. అయ్యో! పల్లెల

రాజ్యమా! నిస్తరంగముగానున్న త్వదీయ సుఖసముద్రమును కలఁచి వైచుటకు, నానాదిక్కులనుండియు, కష్టేర్ఘుంఝూమారుతము లరుదెంచుచున్నవి. అందు మా యదృష్టనౌక మునిఁగి పోకతప్పదు. అయ్యో! సోమయాజులు గారూ, సెలవు దయచేయుఁడు. ఏది యెట్లుఁ గావలయునో యటులనే యగును.

అని చెప్పి రామావధానులు వెడలిపోయెను. సోమయాజులు గారును మనుమనితో నింటిలోనికిఁ బోయిరి.

## ఇరువది నాల్గవ ప్రకరణము

సంధ్యాకాంతులు లోకమునంతటను నలముకొనుచుండెను. కౌశికానది కొంతదూరమువరకుఁ గానఁబడి, చివరకు చెట్లలోను, మేఘములలోను నదృశ్యమై పోయెను. ఆమేఘముల వెనుక భానుబింబము క్రుంగిపోవుచుండ, నామేఘశక్తికి నాక్షేపించు సూర్యకాంతికిని యుద్ధము జరుగుచున్నటులుండెను. ఆమేఘముల వెనుక, సూర్యుఁడస్తమించు నపుడానదిలో పెద్దస్తంభమువలె, సూర్యకాంతియొక్కయు నామేఘమాలికయొక్కయు నీడకన్పట్టుచుండెను. మేఘములు దట్టమైనపుడు సూర్యకాంతి మాయమౌచుండును. కాని యామేఘములు

మరలఁ బల్చనైనపుడు, వెనుకనున్న సూర్యకిరణముల బాధకుఁ దాళఁజాలక, నొకప్పుడు గోపురమువలెను, మరియొక్కప్పుడు పర్వతపంక్తివలెను, అనేకరూపములఁ దాల్చును రాక్షసమాయలవలె మారుచుండెను. ఇట్లుకొంతసేపు యుద్ధముఁ జేసిచేసి, దిననాధుఁడు విశ్రాంతిఁ గైకొనెను. ఆకసమంతయు మొదట నెత్తురంగునుదాల్చి, చివరకనేక చిత్రవర్ణములుమారి, తననీడను వహించు కౌశికానది నానవాలు పట్టలేనటులఁజేసెను.

కౌశికానది యొడ్డుననే, కోటకొకక్రోసెఁడు దూరమునఁ జక్కనితోఁటయొకటి కలదు. అచ్చట సాధారణముగా, గొల్లవాండ్రు మొదలగు తక్కువ జాతులవారు నివసించుచుందురు. ఆగొల్లలుదయముననే పాలును పెరుగును సేకరించి, పట్టణములోని ధనవంతుల కందఁజేయుచుందురు. ఈబీదవారు, పాఁడిపంటలు సమృద్ధిగాఁగలిగి లేనిపోని యాశలులేక సుఖముగాఁ గాలము కడుపుచుందురు.

ఆతోఁటలో నొక బాలికా పాఠశాల కలదు. ఆపాఠశాల చాల బాగుగాఁ బోషింపఁబడు చుండెను. ప్రస్తుతమా పాఠశాలాధికారమంతయు రామలక్ష్మియను నొకయవ్వ చేతిక్రింద నుండెను. ఆమెకొక చక్కనికూతురు కలదు. ఆమెయు నాపాఠశాలయందొక యుపాధ్యాయియే! సాధారణముగాఁ బురుషులెవ్వరు నచటికిరారు. పట్టణమచటికి కొక క్రోసెఁడు

దూరముండుటచే నచటనుండు బాలికలు విశ్రాంతి దినముల యందుఁదక్క తమతమ యిండ్లకుఁబోవరు. వారికిచ్చటనైనను లోటేమియు లేదు. ఆయవ్వయు, నామెకొమరితయు నాబాలికల నమితప్రేమతోఁ జూచుచుండురు. బాలికలకును వారియెడ మిగుల భక్తి కలదు. పాఠశాల యందున్నంత సేపును దక్క, తదితరసమయములయం దాపిల్లలు, పెంపుడుజంతువులతోనో పుష్పహారములఁ జేయుచునో, లేక చిన్నయాట లాడుచునో కాలము గడుపుచుండురు.

మనమిపుడు వర్ణించునా సాయంకాలమున నాబాలిక లందరు తోఁటలో కొంతసేపాడియాడి, కౌశికానది యొడ్డునకు వచ్చిరి. కౌశికానదియందు ప్పుడంత స్వచ్ఛముగా లేదు. వఱద కాలము దాఁటిపోయినను, నీరింకను బూర్తిగా నిర్మలము కాలేదు. ఆబాలికలావిధమునఁ బరుగులతోవచ్చి చివరకలస టచే నానదియొడ్డునఁ గూలఁబడిరి. వారి వదనములపై దరహాస చంద్రికలు తాండవమాడుచుండెను. నానావిధవర్ణముల దుస్తు లధరించిన, వారందఱుఁ జూచుటకు, సీతాకోక చిలుకలగుంపు వలె, చాల ముచ్చటగానుండిరి. చిరుగాలి వీఁచుచున్నపు డచ్చట నున్నవృక్షముల పైనుండి యెండినయాకులు వారినె త్తిపైఁ బడుటయు, నాయాకు మీఁద పడినబాలికను మిగిలిన వారేదోమాటయని హేళనచేయుచు, యానందించుచుండిరి.

ఆసమయమున వారిలో నొకతె లేఁచి, "నాచేతుల శుభ్రముగా నున్నవి. కొంచము కడిగి శుభ్రముచేసికొని వత్తును మీరు పోకుఁడు" అనిచెప్పి నీటిదరికిఁ బోయెను. అటులనామె హస్తప్రక్షాళనము కావించుకొనుచుండగాఁ గాలుజారి నీటఁ బడియెను. మిగిలిన బాలికలందరు గొల్లుమనిరి. ఆగోలవిని తోఁటలోనున్నయవ్వయు, నామెకూఁతురును బరుగుపరుగున వచ్చిరి. ఇంతలో నటుఁబోవుచున్న పురుషుఁడొకఁడు తటాలున నాప్రదేశమునకు వచ్చి, నీటదుమికి చనిపోనున్న యాబాలికను కాపాడెను. రామలక్ష్మియు నామెకూఁతురును, పరోపకార పారీణుఁడగు నాపురుషు ననేకవిధములఁ గీర్తించిరి. ఆ నీటఁబడిన బాలికయుఁ గొంత సేపటికిఁ దెప్పిరిలి లేఁచెను. రామలక్ష్మి యాబాలిక ననేక విధముల బుజ్జగించుచుండ, నాపురుషుఁడు "అవ్వా! బాగుగా నున్నావా? నన్నుమఱచిపోయిన ట్లున్నది" యనెను. "అంతనాయవ్వ ముఖముఁ బైకెత్తి "ఎవరునాయనా మీరు? తమసాహసమున కనేక వేల వందనములు. తమ్ముఁ జూచిన జ్ఞాపకములేదు. కాని...మాటధ్వని వినినట్లే యున్నది" అనెను.

"చీఁకటి పడుచున్నది. నీవు నన్నానవాలు పట్టఁజాలవు. నిన్నుఁజూచి చాలదినములైనది. సుఖముగానున్నావా?—చంద్రముఖి సుఖముగా నున్నదా? అని యాపురు

షుఁడు ప్రశ్నించెను. ఆతఁడామాట యనునప్పటికా యవ్వ కలవరమంది" నీవా? నాయనా.

మరల నెన్నిదినములకు.. .........“అని నేదియోఁ జెప్పబోవుచుండ, నాతఁడు" నాపేరు మఱచిపోతివా? రామదాసు......రామదాసు! నేనుపల్వాల రాజ్యముఖ్యరక్షక భటాధికారిని. అటుల కంగారుపడెదవేల? “అని ప్రశ్నించెను. ముదుసలి కొంత సేపటివరకును మాటలాడలేదు." రా...మ...దాసు—నాయనా? క్షేమముగానుంటివా?. ఈమధ్యనెక్కడను నగపడుటయే లేదు. నిన్నుఁ జూడకపోయినప్పటికిని, పల్వాల రక్షక భటాధికారి చేయుచున్న సాహసకార్యములను సతతము వినుచునే యున్నాము......పిల్లలారా! భోజనమునకు వేళకా వచ్చినది. మీరందఱును బొండు, అమ్మాయీ! చంద్రముఖీ, ఈలాగున దగ్గరకు రమ్ము. “అనెను నాముదుసలి. బాలికలందఱొక్కపరుగున తమతమ నివాసములకుఁ బోయిరి. చంద్రముఖియు నాయవ్వ ప్రక్కకు వచ్చిచేరెను.

రామ—చంద్రముఖీ! కులాసాగానుంటివా? నీముఖమైన నెరుగని క్రొత్తవాడిట్లు ప్రశ్నించుచుండెనేమి చెప్పుమాయనుకొనకుము. నన్నెపుడైనఁ జూచిన జ్ఞాపకమున్నదా?

రామలక్ష్మి—నాయానా! పూర్వసంగతులన్నియుఁ జెప్పిదానిని భయపెట్టకుము. అది నాకూతురు వలెనే ... దానిని, పిల్లలతోను, పుష్పములతోను, కాలము గడుపనిమ్ము.

రామ—అవ్వా! దానిని భయపెట్టుటకై, నేనిచటికి రాలేదు. పూర్వాఁప్రసంగతులు యేమియు, నేనును జ్ఞప్తికిఁదెచ్చుకొనను. వానివలననాకును దుఃఖము వచ్చును. ఏమియమార్చు! దైవమాయ చిత్రము కదా! కాని, అవ్వా! నీవు ముదుసలి వైతివి. చంద్రముఖి కిప్పుడుపదునాల్గుసంవత్సరములవయస్సు. దానికిఁ బెండ్లి చేసి, యొక యింటఁ జేర్చకపోయిన నెట్లు? నీవింకను నెల్లకాలము నిట్లేయుందువా? నీయనంతరము దాని బ్రదుకెటుల?

రామల—దానిటులనే సుఖముగానున్నది. దానికిఁ గ్రొత్త వేమియును వద్దు. నాయనంతరముచూడవచ్చును. దానికి భర్తకంటె నీస్వేచ్ఛయే యెక్కువ సుఖముగానున్నది.

రామదాసు—ఇప్పుడు సుఖముగనేయుండును కానియెల్ల కాలము నిటుల నుండవలదా? నీవుచనిపోయిన తరువాతనేమో, యేది యెటులుండునో, దానికి, వివాహముచేయుటకు మంచి వరునికై చూచు చున్నాను.

రామలక్ష్మి—వద్దు! నీవేమియు దానివిషయమైతలపెట్టవలదు. పెండ్లియయిన యెడల నదియత్తవారింటికిఁ బోవకతప్పదు. నేనాయుత్తరక్షణమునందే ప్రాణముల వీడుదును. దానిని విడచి నేనొక నిముసమైనను బ్రదుకలేను. నావిషయమై కూడ కొంచ మాలోచింపుము నీవు గట్టిగాఁ బట్టు

పట్టినయెడల, నీమాటకువ్యతిరేకము చెప్పుటకు నేనెంతటి దానను! ఈ విషయమై నీయభిప్రాయమును మార్చుకొననియెడల నేను బెంగతో వెంట నేమంచముఁబట్టుదును.

రామదా—నీమూర్ఖపుఁబట్టు బాగుగాలేదు. కాని, ప్రస్తుతము చంద్రముఖి, నీసంరక్షణలోనున్నదికనుక, నీమాట నిప్పటికి వినుచున్నాను. మరలనెప్పుడైనఁదీరికగానున్నపుడు వచ్చిమాటలాడెదనుకాని, యొకసంగతి! నావిషమై చంద్రముఖితో నేమియుఁ దెలుపకుము. ఎవరితోతోడ నేమియుఁదెలుపవలదు. నాయభిప్రాయము తెలిసినదా? అట్లు చెప్పినయెడలనీవు దేవునిదయకుఁదప్పినరకలోకమునఁ బడిపోయెదవు. అదియునుగాక, ముఖ్యరక్షకభటాధికారిని నేను!

రామలక్ష్మి—అట్లే! నేనెవరి తోడను చెప్పను. కాటికిఁగాళ్లు చాఁచికొనిన ముదుసలి మీఁదనానీ యధికారము! నీరహస్యమున కేమియు భయములేదు, పొమ్ము.

రామదాసు—సరే! నేను పోవుచుంటిని. చంద్రముఖి! నేనెవరనో నీకిప్పుడు తెలియకపోయినను, నీసౌఖ్యమునే కోరు నీపితృసమానుఁడ ననుకొమ్ము.

అని చెప్పి రామదాసు బయల్వెడలిపోయెను. ముదుసలియు చంద్రముఖియు గృహోన్ముఖులైరి. అమ్మా! ఆయనయెవరు?

"చంద్రముఖి ప్రశ్నించెను—పల్వాల రక్షకభటాధికారి, పేరురా మదాసు; ఇంతకంటె నేమియు నన్నడుగవలదు. నేనేమియుఁ జెప్పను" అని, రామలక్ష్మి ఖండితముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను.

చంద్రముఖి దీర్ఘాలోచనా పరురాలయెను. ఆమె మనో నేత్రమున కేవియో క్రొత్తసంగతులు గోచరించుచుండెను. కలఁత నిదుర యందలి స్వప్నమువలె నామె కేవియో, చిత్రపుదర్శ నము లగపడెను.

రామదాసుఁ ముఖముపైనున్న నిగూఢకాంతిలోను నా దీర్ఘాలోచనలలోను, నామె యేదియోనానవాలు వట్టెను— తన చిన్నతనమునందు,జ్ఞానమేమియు లేని, తననాల్గవయేట, తన తల్లి, మరణబాధఁ బొందుచుఁ యేడ్చుచున్న తన్నెవరి చేతుల లోనో పెట్టినటులను; నాతఁడే యీరామదాసనియును, నామె కనుఁదోఁచెను. స్వప్నము నిజమగు నట్టులెయుండెను.

ఈ యాలోచనలగు నప్పటికి, వారింటికిఁ జేరిరి:—

## ఇరువదిమైదవ ప్రకరణము

శ్యామసుందరీదేవి పల్వాల రాజ్యసింహాసనము నధిష్ఠిం చెను. రాజ్యవ్యవహారములన్నియు నామె పేరిటనే జరుపఁబడు చుండెను. నిరుపమాన సుగుణ శేముషీధురంధర యగుటచే,

స్త్రీయను లోపమేమియుఁ గలుగనీయకుండ, మిగుల నిపుణతతో రాజ్యవ్యవహారములఁ జక్కబెట్టుచుండెను. ఆమెమును పటివలెఁ గాక, రాజసభయందు సింహాసనమధిష్ఠించి, యందఱి యెదుట నేరముల విమర్శించుచు, నేరస్థులదండించి, నిర్దోషుల విడచిపెట్టి, ప్రజలకు సమస్తసౌఖ్యముల నొసంగుచుండెను, పూర్వకాలమున, సాధారణముగా, రాజులేన్యాయాధికారులు కూడనై యుండెడివారు, అందువలనఁ బ్రజలకుఁ గొన్నిలాభములును, గొన్నినష్టములును కూడనుండెడివి. రాజవివేకి కాని దుర్బలుఁడు కాని యైయుండినయెడల నట్టివానివలనఁ బ్రజలకు లాభమిసుమంతయు లేకుండును, కాని, రాజు బుద్ధిమంతుఁడును, వివేకియునై యుండిన యెడల సరియైన న్యాయము గ్రహించి ప్రజాళి కెక్కువమేలుఁజేయును. ఇందువలనఁ బ్రజలు భయభక్తులు కలవారై యుందురు. అంతియగాక, లంచగొండులగు స్వల్పన్యాయాధికారుల బాధలును దప్పను.

శ్యామసుందరీదేవి, రాజ్యాధికారమువహించిన కొలఁదిదినములకే, వెంకటప్పయ్యహత్యను గురించి విచారణకై సమకట్టెను. చంపబడినవాఁడు ముఖ్యమంత్రి: నేరముపట్టినవాఁడు ముఖ్యరక్షక భటాధికారి: నేరస్థుఁడు ముఖ్యసైన్యాధికారి: చాలవిచిత్ర సంఘటనము. అందుచేఁ బ్రజలానాఁడు గుంపులు గుంపులుగ వచ్చిపడిరి. సభాభవనము చుట్టుప్రక్కల యావరణ, యంతయు జనులతో నిండియుండెను. రామదాసునాఁడు,

క్షితిభూషణునితో వచ్చి తనకై యమర్చబడిన యాసనము నలంకరించెను.

న్యాయశాస్త్రమునందు నిపుణులైన వారిద్దరు రాణికి సలహానిచ్చుటకువచ్చి సింహాసనమున కీవల నాసీనులై యుండిరి. వీరిద్దరునుగూడ రాజకీయోద్యోగులే!

రాణి యాజ్ఞననుసరించి, రామచంద్రుఁడును, నానాఁడు త్తరమును గొంపోవుచుఁ బట్టుబడిన నాతని సేవకుఁడును, సభాభవనమునకుఁ దీసికొనిరాబడిరి. వారువచ్చిన వెంటనే న్యాయశాస్త్రజ్ఞులలో నొకఁడు లేఁచి, నిందారోపణపత్రము నీక్రింది విధమునఁ జదివెను.

"పల్వెల రాజ్యమునకు మహారాణియగు శ్యామసుందరీదేవి, తగినన్ని నిదర్శనములుండుటచే, మంత్రిహత్యలో నేరస్థునిగను, రామచంద్రనగర రాజులకొ నుత్తరముల జఱపు రాజద్రోహిగను గణ్గొని, రామచంద్రుని బంధింపఁజేసిరి. అంతియగాక, నీతనికి రత్నసింహ మహారాజునకు ద్వితీయభార్యయగు హైమవతీదేవితో సంబంధమున్నటులఁ గూడ నేరమారోపింపఁబడినది. ఈనేరములకన్నిటికిని, ముఖ్యరక్షక భటాధికారి తగినన్ని నిదర్శనములఁ జూపును. రామచంద్రుఁడీ నేరములతో దన కేమియు సంబంధము లేదని చెప్పఁదలఁచిన యెడల నీనిదర్శనములేవియు నిజముకావని చూపవలయును.

# నిదర్శన ప్రదర్శనము

మంత్రిహత్య సామాన్యమైనదికాదు, అది రాజకీయ విషయము కాన రాజకీయోద్యోగులలో నొకఁ డాతనిఁ జంపి యుండుననుట యసంభవముకాదు. రామచంద్రుని సేవకుఁ డొక యుత్తరమును రామచంద్రనగరమునకుపట్టుకొనిపోవుచుండగా, పట్టుపడినాడు. ఆయుత్తరము హైమవతీదేవిచే వ్రాయబడినది. దానిలో నీ విషయమున నిటులున్నది.

"మన మెట్టివేళ నీకార్యమును తలపెట్టితిమో కాని, మనతలంపులన్నియు నిర్విఘ్నముగా సాగుచున్నవి. నా ప్రభావ మిచ్చట దేదీప్యమానమై వెల్గుచున్నది. వెంకటప్పయ్య హత్య వలన మన కొక పెనుపర్వతము తొలఁగినది"

ఆమె ప్రభావము దేదీప్యమానమై వెల్గుటకే రామ చంద్రుఁడు సాహాయ్యము చేయుచున్నటుల నీయుత్తరయు నాతని సేవకునిచే బంపుటవలన స్థిరపడుచున్నది. మనతలంపులు "వెంక టప్పయ్యహత్య యను మాటలవలన నీకార్య మేదో యాలో చనలమీఁదను, గుతంత్రములవలనను జరిగినటులఁ దోఁచు చున్నది. ఈతంత్రములో రామచంద్రుఁడు పాల్గొనినటుల నీతని దగ్గర కీ యుత్తరము వచ్చుటవలనఁ దేలుచున్నది.

రెండవనిదర్శనము. హత్యజరిగిన మూఁడవనాఁడు, శ్యామసుందరీదేవి ప్రక్కపై నొకయుత్తరము వ్రాయబడియుండెను. అదచటికెటులవచ్చెనో, తెలియదు. కాని, యాయుత్తరము జయరామునిచే వ్రాయబడినది. ఈ జయరాముఁడే వెనుక విలాసభవనమున, హేమచంద్రునిఁ జంపియుంటినని యుత్తరము వ్రాసినాఁడు. ఈ యుత్తరములరెండింటిని, జయరాముఁ డను పేరిట మఱియొకఁడు వ్రాసినాడని, రామదాసువాదన. ఎవరు వ్రాసినను, ఆయుత్తరమునందు రామచంద్రుఁడు మంత్రినిఁ జంపినాడనియు నాతని పెరటియందు, శిర స్సున్నదనియు వ్రాసినాఁడు. అటులఁ జూడగా శిరస్సు దొరికినది. మీఁదుమిక్కిలి యాయుత్తరమును జూచినతోడనే, రామచంద్రుఁ డింతింతయనరాని కలవరముతోడను, భయముతోడను, నేలఁగూలి, "నేను చూడలేను" అని తొట్రుపాటుతోఁ బ్రత్యుత్తరమిచ్చెను.

అంతకుముందు బాగుగా మాటలాడిన యాతఁ డీ యుత్తరమునుజూచినతోడనే యటుల భయపడుటయును, నేనుచూడలేనని యంతయుఁ దెలిసియున్నట్టులే మాటలాడుటయును జూచిన నీతఁడే నేరస్థుఁడని స్థిరపరపఁబడవలసివచ్చినది.

తరువాత వెంకటప్పయ్య తల యీతని యింటియందు దొరకుట మఱియొక ప్రబలమైనసాక్ష్యము.

"రామచంద్రుఁడు రాజద్రోహియనుటకు నిదర్శనములఁ జూడవలయును. హైమవతీదేవివ్రాసిన యుత్తరమునందు, నయమునగాని భయమునగాని, శ్యామసుందరిని రాజసింహునకిచ్చి వివాహముఁజేయు ప్రయత్నములోనున్నట్లు, నందులకై సైన్యములఁగూడ సిద్ధము చేయవలె ననియు వ్రాయఁబడియున్నది. రామచంద్రుఁ డీయుత్తరమును బంపుటకు సిద్ధపడెను, కాన నీతఁ డీనేరమున సమభాగస్థుఁడు. ఈ నేరముల నీతఁడు తప్పించుకొనలేకపోయినయెడల నీతనికి దారుణ మరణశిక్ష విధింపఁబడును. హైమవతీదేవియు రాజద్రోహిగా నెంచఁబడి, పురమునుండి వెడలగొట్టఁబడును. రామచంద్రుఁడు యేమిచెప్పఁదలఁచుకొనునో చెప్పవచ్చును" అని చెప్పి, న్యాయశాస్త్రవేత్త తన పీఠమును మరల నలంకరించెను.

రామచంద్రుఁడు ధైర్యముగా లేచి నిలువఁబడెను కాని యాతని మనస్సంధకారమయమై యుండెను. ఏమిచెప్పవలయునాయని,యిదివఱకనేకసారు లితఁడు, చెఱసాలలోఁ జాలవఱకుఁ దలపోసి యుండెను. అసత్యములాడక తప్పదని యీతఁ డిదివఱకే నిర్ణయించుకొనెను. అసత్యములాడకపోయిన యెడల నీతఁడు హైమవతీదేవికిని దనకునుగల సంబంధమును వెల్లడిచేయవలసి వచ్చును. సిగ్గులేక, నీతఁడు, రాణిసమక్షమున నా నేరము

నెటుల నంగీకరింపఁగలఁడు! అందువలన నీతఁ డేమైన నగుఁ గాక, యని యెలుఁగెత్తి యిటులఁ జెప్పఁదొడంగెను.

"మీరారోపించిన నేరములన్నియు నసత్యములు. హైమవతీదేవికిని నాకును ముఖపరిచయముకూడ లేదు. రత్నసింహుని భార్యను సమీపించు గుండెనిబ్బర మెవరికుండును? నే నెప్పుడును విమలభవనప్రాంతములకుఁ బోలేదు." ఈ మాటఁ జెప్పునప్పటికిని, రామదాసు, శశిభూషణునితో నేదియో మెల్లఁగాఁ జెప్ప, నాబాలుఁ డతిరయమున నాసభాభవనమును విడిచి బయటకుఁ బోయెను.

మరల రామచంద్రుఁ డీ క్రిందివిధమున పలుకఁజొచ్చెను.

"నేనావైపునకుఁ బోయినయెడల నెవరికంటనైనఁబడదునా? నే నటుపోతినని చూచి చెప్పగలవా రెవరైన నున్నారా? అనునప్పటికి, ముఖ్యరక్షక భటాధికారి లేచి నిలువఁబడి, ఎవరును లేకపోలేదు. నీ వుత్తరమును స్వామి కిచ్చిపంపిననాటి రాత్రి యచటనుండి వచ్చుటలేదా? అని ప్రశ్నించెను. "అసత్యము! నే నారాత్రి యిల్లుకదలనే లేదు. ఆనాటిరాత్రి నాశరీరమునందస్వస్థతగానుండుటచే నింటియొద్ద నేపరుండియుంటిని" అని రామచంద్రుఁడు ముగించునప్పటికి, రామదాసు తనహస్తము నొకపర్యాయము పైకెత్తెను. వెంటనే, రామచంద్రుఁడానాడు, తన యింటికిఁ దీసికొనిపోయి యాదరించిన, బిచ్చపు బాలకుఁడు

సభాభవనము మధ్యకువచ్చి నిలువఁబడెను. సభాభవనమంత యుఁ గలవరముతో నిండెను." రామదా సనెను.

"నీ వానా డేబాలకుని, విమలభవనమునుండివచ్చు బాట ప్రక్కనఁ గన్గొని, నీ యింటికిఁ దీసికొనిపోలేదా? "

"జ్ఞాపకములేదు" అని రామచంద్రుఁ డనెను. అంత నా బాలకుఁడు, అయ్యా! జ్ఞాపకములేదందురేల? మీరు నన్నెత్తి తీసికొనిపోయి గంజికాపించియిచ్చెద వనలేదా? మీరు స్వామిని మూఁడు పర్యాయములు పిలిచి యుత్తర మీయలేదా? అని ప్రశ్నించెను.

రామచంద్రుఁడు నిర్ఘాంతపోయెను. అతనిముఖము వెల వెలఁబాఱెను. మేనంతయుఁ జెమటచేఁ దడసెను, అతఁ డసత్యమాడినటుల ప్రత్యక్షనిదర్శనము కానఁబడెను. అప్పుడు రామదాసు ఈ బిచ్చపుబాలుఁడు శశిభూషణుఁడే! అనియెను. ఆమాట వినునప్పటికి ప్రజాళియంతయు నొక్కసారి కదలెను. ఆ హర్షధ్వనుల నణఁచునప్పటి రక్షకభటులకుఁ జాలసేపు పట్టెను. అంత నా న్యాయశాస్త్రజ్ఞుఁడు మరలఁ లేచి, "ఈతఁడు రాజద్రోహియనుట కిసుమంతయు సందియములేదు. తన యున్నతపదవినిదలంపక, పల్వాలరాజ్యక్షేమమునందుఁ దన కున్న బాధ్యతఁ దలంపక, విరోధరాజ్యములతోఁ జరుగు నుత్తర ప్రత్యుత్తరముల కీతఁ డీవిధమున సాహాయముఁ జేయుట మిగుల

ద్రోహాకరము. ఇంతకంటెను ఘోరమగు నేరము మంత్రిహత్యా విషయమున నీతఁడేమి చెప్పనో వినవలసియున్నది. అని వ్రాకుచ్చి తనపీఠముచు మరల నలంకరించెను.

"నాతల తిరుగుచున్నది. నాకుమిగుల నస్వస్థతగానున్నది. ప్రస్తుతము నే నీమాటలనుమాత్రము చెప్పెదను. ఈవిషయమున నాకేమియును దెలియదు. ఆయుత్తరమును నావిరోధు లెవరో వ్రాసియుండవచ్చును. అంతమాత్రమున కే, నేను నేరస్థుఁ డనుట మిగుల నన్యాయము. వెంకటప్పయ్యతల నా పెరటిలోని కెటుల వచ్చినదో నాకుఁ దెలియదు. రామదాసు మాయింటికి వచ్చి నపుడు నేనట్లు కలఁతనొందుటకుఁ గారణ మాయుత్తరమే! అది చాల భయంకరముగా వ్రాయబడియుండెను. ఆనేరము నామీఁదనే యారోపింపఁబడుటఁ దలచికొని, కంపముచే నేను క్రిందఁ బడితిని. నే నానాడు రామదాసును జూచుటతోడనే, భయపడ లేదు. ఆతఁడు మాయింటికిఁ జాలనరుదుగావచ్చుచుండును. ఆ హత్యయే నాకుఁ దెలిసియుండినయెడల నాతఁడు మా యింటికి వచ్చునప్పటికే నేను భయపడియుందును. ఆ విపరీతమైన యుత్తరము జూచినతరువాతనే నేను ఖంగారుపడితిని. ఇంతకంటె నే నేమియుఁ దెలుపఁజాలను.

రామదాసు—నీ కెవరైన విరోధు లున్నారా? నీకెవరిపైననైన ననుమానమున్నదా? ఆయుత్తరము; నీకుఁగిట్టనివా రెవరు వ్రాసి రని నీ నమ్మకము?

రామచం—ఆవిషయమై నేనిదివరకు చాలవఱ కూహించితిని. కాని నాయూహ కెవరును దట్టలేదు.

రామదా—ఇట్టి నేరము నీపై నారోపించుటకు నీకుఁ బ్రబల విరోధు లుండియుండవలయును. అదియునుగాక, నీయు త్తరము వ్రాసినవానికి హంతకులతో బాగుగా సంబంధ ముండియుండుననుటకు సందియములేదు. లేనియెడల వెంకటప్పయ్యశిర స్సెటనున్నదో వాని కెటులఁ దెలియ గలదు? ఆహత్య తరువాత నీనెయ్యులతో నెవరితోనైన నీవు కలహించితివా?

రామచ—లేదు.

రామదా—మీ యింటికి సరియైన కాఁపుఁదల యున్నదా?

రామచ—ఉన్నది.

రామదా—అటులైన నానాఁడు, మీయింటఁ బరు లెవరు ప్రవేసించినది మీ సేవకులు తెలుపలేదా?

రామచ—వెంకటప్పయ్య చంపఁబడినరాత్రి తీవ్రమైనగాలివాన వచ్చినది. అందువలన సేవకులందరునిదురించియుందురు.

రామదా—మీకును, హైమవతీ దేవికిని సంబంధము కల్గు టకుఁగారణమెద్ది; అది యెంతకాలమునుండి యున్నది.? ఏవిషయమున?. నీ వీ ప్రశ్నల కుత్తరమిచ్చినఁ గాని, మాకు..................

రామచం—ఆవిషయమునఁ జెప్పుటకు నా కేమియును లేదు.

రామదా—అటులైన నీవు విమలభవనమునకుఁ బోవుట యేల సంభవించినది?

రామచ—కొంత పనియుండె.

రామదా—ఆ పని యేమి?

రామచ—ఈవిషయమున నేనేమియుఁ జెప్పఁదలఁచుకొనలేదు.

రామచంద్రుఁ డీమాటయనునప్పటికి, శ్యామసుందరీ దేవికి మిగులఁ గోపమువచ్చెను. కొండంత నేరము నెత్తిపైనుంచుకొని, యిటుల మొండిజవాబులు చెప్పుటచే, రామచంద్రునిపై నామెకు మిగుల నసహ్యముజనించెను. రామచంద్రునిపై రాణికిఁ గొంత గౌరవము కలదు. రామదాసు చెప్పెడి మాటలనన్నిటిని మొట్ట మొదటనే యామె యంతశీఘ్రముగా విశ్వసింపలేదు. కాని యిప్పుడా గౌరవ మంతయు నశించెను.

"నీవు జవాబు చెప్పనియెడల నీ కురిశిక్ష తప్పదు" అని కొంత కోపముతో నామె యనెను. తరువాత, న్యాయవాది లేచి, హైమవతీదేవి విచారణ మిగిలిన దనెను. విమల భవనమున కిరువురు సేవకుల నామెను గొని వచ్చుటకై పంపిరి.

రత్నసింహామహారాజు రాణియగుటచే నెంతదుర్గార్గురాలైనను, హైమవతీదేవి కొక ప్రత్యేకస్థల మమర్పఁబడెను. సభ

కును, యామె నిలువఁబడియుండు స్థలమునకును, మధ్య నొక యవనిక యమర్చబడెను. హైమవతీదేవిరాకకై సభికులందఱు నెదురుచూచుచుండిరి. ఆమె చెప్పు సమాధానమువలన రామ చంద్రునిపై నేరము కొంతతగ్గిపోవచ్చును. ఇంకను, రామచం ద్రునిపక్షమున వాదించువా రాసభలో కొందరు లేకపోలేదు. కొంత సేపటికి, పంపఁబడిన సేవకు లిరువురును బరుగెత్తుకొని వచ్చిరి. హైమవతీదేవియు ప్రియంవదయు విమలభవనమున లేరని చెప్పినప్పటికి, సభయందుఁ గలిగిన కలవర మింతింతయని చెప్పనలవికాదు. అంతియకాక, విమలభవన ద్వారపాలకు లలో నొకఁడు చంపఁబడెననియును, మరియొకఁడు బంధింపఁ బడెననియు, నాద్వారములలో నొకటి పెరికివేయబడియున్న దనియుఁ జెప్పినప్పటికి, సభాభవనమంతయు నాశ్చర్యమగ్న మాయెను.

శ్యామసుందరీదేవియు జేచ్చవడి, సభ యానాటికి ముగించెను.

## ఇరువదియారవ ప్రకరణము

రామచంద్ర నగరమున, జయచంద్ర రాజసింహులు హైమవతి రెండునెలలనుండి యుత్తరము వ్రాయ మానుటకుఁ గారణ మూహింపలేక మిగులఁ తల్లడిల్లుచుండిరి. ఇదివఱ కామె పదునైదుదినముల కొకపర్యాయమైన నుత్తరము వ్రాయుచు నుండెడిది. ఒకనాటిసాయంకాలమున తండ్రియును బుత్రుఁడు నాసంగతియే తమ యుద్యానవనమున మాట్లాడుకొనుచుండిరి. జయచంద్రుఁ డి ట్లనుచుండెను.

కుమారా! నాకేమియును దోఁచకున్నయది. ఏమో సుఖపడునని, ముదుసలియైనను, రత్నసింహునికిచ్చి హైమను వివాహము కావించితిని. దానికడుపున నొకకాయకాచిన నన్నికష్టములును గట్టెక్కి యుండును. కాని, యటులజరిగినది కాదు. పోని, యదృష్టమింతేయని యూరకుండక, గాలిలో హార్మ్యముల నిర్మించుచున్నది. శ్యామసుందరి, బాల్యవయస్కురాలైనను, నసాధ్యురాలు. హైమవతి కూడ దాని కిసుమంతయును దీసిపోదు. కాని, బలము శ్యామసుందరి పక్షమున నున్నది. రాజ్యాధికార మంతయు నామెచేతులలో నున్నది. రామచంద్రుఁ డేదో సాహాయ్యముఁ జేసెదనని

చెప్పియున్నాడు. కాని మనకేమియుఁ దెలియుటలేదు. నీ కోఱకే, మనపిల్ల, యిట్టి కష్టములఁ బొందుచున్నది. మన కెందులకని యూరకుండ మన్నను పల్లవరాజ్యాధికార మంతయు మనచేతఁ బడవలసినదే! హైమవతి వలన నాయదృష్టము గలుగలేదు. నీవలననైన, నా కోఱిక తీరి, మరల రామచంద్రనగరము, మరల, మనపూర్వులనాటి యౌన్నత్యమును బొందునని తలంచుచుంటిని. కాని నాతలంపు లన్నియు ఫలించునని తోఁచదు. ఉన్నదానితోడనే తృప్తిఁ బొంది యూరకుండుట మంచిది. నీవు మఱియొకబాలికను జేఁబట్టి నిశ్చింతగా నుండుము.

రాజ—ఉద్యోగము పురుషలక్షణము. మీరు స్త్రీ యగు హైమవతికంటెను నధైర్యముగా మాటలాడు చున్నారు. ఉన్నదానితోనే తృప్తి నొందినయెడల నున్నదిమాత్రము నిలుచునా? మీకుఁ దెలియని దేమున్నది? బొక్కసము కాళీగానున్నదికదా! తలకు మించిన ఋణములుకదా! మన మింకను గొంతకాల మిట్లశ్రద్ధవహించినయెడల నేను సింహాసనము నధిష్ఠించుటకుబదులు, ముష్టికై యేరి ద్వారములనో నధిష్ఠింపవలసివచ్చును. వేత్రహస్తులు నాముందు నడచుటకు బదులు, దండధరులు నావెనుకఁ దరుముదురు. ఋణ మిచ్చినవారు మనతోఁటలను, దొడ్లను నమ్మించి,

నిలువ నీడనైన నీయకఁ దరిమివైచెదరు. మన మీ ప్రయత్నమునుండి విరమించినయెడల మన కన్నియును గష్టములే!

జయ—నిజమే కాని, ప్రస్తుతము చేయవలసిన విధాన మేమి యో, బోధపడుటలేదు.

రాజ—మనము తలఁచినకార్యము భయమునకాని, నయమునఁ గొనసాగదు. బాలికకదా శ్యామసుందరి. వెంకటప్పయ్య వెడలినాడుకదా! రామచంద్రుఁడు మనకు సాహాయ్యము చేయునుగదా; మంచి తరుణమును జూచి, మనమే యుద్ధమునకు బయల్వెడలవలయును. రామచంద్రుని మన మింకను వలలో వైచికొనవలయును. అప్పుడు శ్యామసుందరి మనకుఁ దప్పక లోఁబడును. ఇక కర్తవ్యము లేదనుకొని.........నన్ను.........జేబట్టును.

ఇంతలో నొకసేవకుఁ డరుదెంచి, యిద్దరు వర్తకులు పలివెలనుండి వచ్చినారని తెలుప, జయచంద్రుఁడు త్వరితము వారినిఁ బ్రవేశపెట్టుమని యానతిచ్చెను. అంత నావర్తకు లరుదెంచి, రాజునకుఁ బ్రణామము లాచరించి నిలువఁబడియుండిరి. జయచంద్రుఁడు వారి నొక తిన్నెపైఁ గూర్చుండఁజేసి, "మీ రెచటివారు"? అని ప్రశ్నించెను. అంత నొకవర్తకుఁ డిట్లని చెప్పెను.

"మహారాజా! మాదీపట్టణమే కాపురము. మేము వర్తకము చేసికొని బ్రదుకుచుందుము. వర్తకవ్యాపారనిమిత్తము పరస్థలములకుఁగూడఁ బోవుచుందుము. ఈమధ్యఁ బల్వాలపట్టణములోఁగూడ నొకవారముదినము లుంటిమి. మీదయవలన మాకుఁ జాల లాభకరమైన బేరములు దొరికినవి. పల్వాలలో విజయమోహనుఁడను, వర్తక పుంగవుఁడొకఁడు కలఁడు, ఆతఁడు కుబేరునియంత ధనవంతుఁడు. మే మాయనకుఁ గొన్ని రత్నములఁ జాలలాభమున నమ్మితిమి. ఆయనయొద్ద కొన్ని మేము చాలలాభమునకుఁ గొంటిమి. ఇదిగో! ఈహారమును చూడుఁడు! యాయనయొద్దఁ గొనినదే! చాల నాణ్యమైనపని."

జయచంద్రుఁడు హారమును తీసి చూచెను. చూచి మిగుల నాశ్చర్యమునకు లోనాయెను. ఆతని కట్టి యాశ్చర్యము, రత్నఖచితమైన యాహారమునుజూడ, కలుగలేదు. ఆ హారము తన తనయ యగు హైమవతీదేవిది. అది యావర్తకునకెటుల వచ్చెనని యాతఁ డాశ్చర్యపడెను. తనతండ్రి యటుల దానిని మిగుల నాశ్చర్యముతోఁ జూచుచుండుటఁ గాంచి, రాజసింహుఁడు,

"ఏమి, హార మంత సౌందర్యముగా నున్నదా? మీరేమియు నట్టిహారము నిదివఱకుఁ జూడనటులనే దానిని విలోకించుచున్నారు. ఏది నన్నుకూడ నొకసారి చూడనిండు."

అనెను. అంత, జయచంద్రుఁడు,

"కుమారా! నే నాశ్చర్యమును బొందుచుండుట దీని యందమునుచూచికాదు. ఇది మన హైమవతికి మనము వివాహమునా డుంచినది. ఇది యెప్పుడును పోయినట్లైన మనము వినియుండలేదు. చిరకాలమునుండి యిది మనయింటనున్నది. ఆవర్తకునియొద్ద కెటులవచ్చినదాయని నేను తలంచుచుంటిని" అని ప్రత్యుత్తరమిచ్చెను. రాజసింహుఁడును, దానిని బాగుగాఁ బరిశీలించి చాల చమకితుఁడాయెను. జయచంద్రుఁ డావర్తకునిఁ జూచి "నీ కా హార మమ్మినవాని పే రెవరంటివి? అని యడిగెను.

వర్త—విజయమోహనుఁడు! ఆతఁడు మాబోటి సామాన్యుఁడు కాఁడు. మహారాజుకంటెను యెక్కువ భోగపరుఁడు. పల్వోలపట్టణభవనములలోని కెల్ల మిన్నయగు విలాస భవనముకొని, దానియందాతఁడు కాపురమున్నాఁడు. ఆతఁడొక కళింగదేశపు రాచకొమరుఁడట. ఆతని కున్న సేవకు లేమహారాజునకైన నుండరని నాతలంపు.

జయ—ఆతఁడు నీ కీహారము నమ్మినాడా?

వర్త—చిత్తము.

జయ—ఇంకను విశేషము లేమి?

వర్త—విశేషములు మీకుఁ దెలియని వేమున్నవి?

జయ—మాకు రెండనెలలనుండి, పల్వోల వర్తమానము లేమియుఁ దెలియుటలేదు.

వర్తకు లీమాటవిని యొకరిముఖము లొకరు చూచుకొన నారంభించిరి.

జయ—మీ రటులఁ దెల్ల బోయెద రేల? నిజము చెప్పుఁడు, మీ కేమియును భయములేదు.

వర్త—సుమారు, నెలదినములకుముందు హైమవతీ దేవిగారు, పల్వెలపట్టణమునుండి, యిచటికే వచ్చిరని, యచటి వారు తెల్పిరి. ఆమె యిప్పుడు పల్వెలలో లేదు.

జయ—సుమారు నెలదినములకు ముందా! ఇచటికే వచ్చినదా! ఏమిమాయ! రాజసింహా! నాకేమియుఁ దోఁచకున్నది. ఇప్పుడామె కోటలోలేదా? ప్రజల కేమి తెలియును? నీతో తెలియనివా రెవరైన నావిధమునఁ జెప్పిరేమో!

వర్త—లేదు, మహారాజా! ప్రజలందరు నాశ్చర్యముగా నచట నీమాటలనే చెప్పకొనుచున్నారు. మంత్రిని జంపినందులకు సేనాధిపతి కురిశిక్ష విధించినారు. స్వామీ చెప్పటకు నోరాడకున్నది.

ఈమాటలను వినునప్పుడు జయచంద్రుని, మన స్సెటు లుండెనో మనము చెప్పఁగలమా? ఎవనిపైఁ దన యాశలన్ని టిని, నెలకొల్పి, యిప్పటివరకు నువ్విళ్లూరుచుండెనో, యట్టి రామచంద్రుని కురిశిక్ష!

"చెప్పుము! నీవు వినినదానినంతయు దాఁచకఁ జెప్పుము"
అని జయచంద్రుఁడా వర్తకుని నాజ్ఞాపించెను.

వర్త—మహారాజా! సేనాధిపతి కుట్రలో, హైమవతీ దేవిగారికిఁ గూడ, సంబంధమున్నటుల గ్రహించి, రాణిగా రామెను నూరినుండి వెడలఁగొట్టఁ దలఁచిరట!

జయ—ఏమి, యా చిన్నదాని కండకావరము! ఇక పట్టాభిషేకమై, రాజ్యాధికారమంతయుఁ బూర్తిగా వహించిన తరువాత నెటులుండునో!

వర్త—పట్టాభిషేకమై నెలదినము లయినది!

జయ—సరి! మా కేమియుఁ దెలియుటేలేదు. ఇప్పుడు మా హైమవతి యెచ్చటనున్నది?

వర్త—ఇచటనున్నదని, యచ్చటివారంద రనుకొనుచున్నారు.

జయ—వా రామె నూరునుండి పంపించిరా?

వర్త—లేదు. కాని యామెను విచారణఁ జేయుటకై కబురు పంప, హైమవతీదేవియుఁ బ్రియంవదయు నాభవనమున లేరట. అచ్చటఁ దలుపు లూడఁ బెఱుకఁబడి యున్నవట. ద్వారపాలకులు చంపఁబడియుండిరట.

జయ—ఏమిది! ఎట్టివానిపట్టి కెట్టి దురవస్థ సంప్రాప్తమైనది?... కానిమ్ము "వినాశకాలే, విపరీతబుద్ధిః" అనునటుల,

పల్వెల రాజ్యమంతరించుటకే యిట్టివిప్లవము లుద్భవించుచున్నవి. అధికార గర్వాంధకారమున, శ్యామసుందరికి భూమ్యాకాశంబులు, తెలియ రాకున్నవి. హైమవతి యంతదిక్కుమాలినది యని యనుకొనెనుగాఁబోలును! తనయెక్కువేమి! హైమవతి తక్కువేమి! తల్లి వెనుకఁ దల్లి వంటిది. తనకు విద్యాబుద్ధులఁ గఱపి సన్మార్గమునఁ బ్రవేశపెట్టఁదగిన హైమవతిని, శ్యామసుందరి యెట్టి యిడుమలఁ బెట్టినది? చూతము!...... వర్తకులారా! మీరిఁకఁబొండు; నేను మరల కబురు పంపెదను.

రాజసింహా! రమ్ము. మనమువచ్చి చాల తడవైనది. సింహమునుపిలచి, డీకొన్నట్లు, శ్యామసుందరి మనతోఁ గోరి వైరముతెచ్చికొన్నది. నీవుచెప్పినటుల, మనము తగిన సమయముచూచికొని, సైన్యసమేతులమై, యుద్ధమునకు డీకొందము. శ్యామసుందరి "దేహి" యని నీకాళ్లపైఁబడిన నీవు వివాహమాడవచ్చును. లేనియెడల..............రమ్ము పోదము! ఇప్పుడీమాటలతో నేమిప్రయోజనము? రేపుదయముననే, నీకు నమ్మకమైన వారినిరువురిని, బల్వెలపట్టణమునకుఁ బంపుము. హైమవతి యింకను, పల్వెలలోనే, యెచటనైన దాఁగి యుండవచ్చును. ఏమిగతి సంభవించినది, దానికి!

అని కుమారునితోఁగలసి, కోపారుణజ్వాలలతో కన్నులు జేవురింప, మరల విచారముచేఁ జల్లఁబడ జయచంద్రుఁడు తన నివాసమున కరిగెను.

---

## ఇరువది యేడవ ప్రకరణము

---

ఆనాఁడా ముదుసలి తోడను, చంద్రముఖితోడనుమాటలాడిన తరువాత, రామదాసు, విచారకరమైన మనస్సుతో నింటికిఁ జేరెను. పల్లెయందు రామదాసునకుఁ గోటకుసమీపమునే యొక సౌధరాజము కలదు. దానిలోపల, విలాసభవనము నందువలెఁ జిత్రవిచిత్రములగు నలంకారము లేమియును లేకపోయినను, జాల నిర్మలముగామాత్ర ముండును. ఆసౌధముచుట్టును, గొంతయావరణమును, దానియం దనేకపువ్వుల చెట్లు, పెద్దవృక్షములుఁ గలవు. దీనినంతయు బాగుచేయుటకొక ముదుసలి తోఁటమాలిగానుండెను. రామదాసు భవనమొక్కటియంతస్తు మాత్రమే కలమేడ. వృక్షముల మధ్యనుండుటచే నెల్లప్పుడును, జల్లగానుండును.

ఆమేడయందు స్త్రీలెవరును లేరు. వీరికిభోజన మమర్చుట కొకఁడును, నల్గురు సేవకులు, శశిభూషణుఁడు, రామదాసు, తక్క మఱెవరు నందు లేరు.

రామదాసానాఁడు, విచారముగా నున్నటుల సూక్ష్మబుద్ధిగల శశిభూషణుఁడు చూడక పోలేదు. కాని, దానికిఁగా

రణము నడుగుట కాతనికి ధైర్యము లేకపోయెను. వారిరువ్వురును కలిసియే భోజనము చేసిరి. తరువాత, మేడపైకిఁబోయి, యిరువ్వురు నొక్కస్థలమునందే శయనించిరి. ఒకరితో నొకరు చాల సేపటివఱకును మాటలాడలేదు. శశిభూషణుఁడును నిదురించుచున్నటుల నటించెను కాని, నిజముగా నప్పటి రామదాసు యవస్థం దలంచుచు, మేల్కాంచియే యుండెను. రామదాసు కొంత సేపటి కొకదీర్ఘమైన నిట్టూర్పును విడిచెను. ఇఁక శశిభూషణుఁడు మాట్లాడక యుండలేక పోయెను. ఎద్దియో విధమున నాతనిని మాటలాడింతమని యాతఁ డిట్టులనెను.

"హైమవతీదేవిసంగతి చాలచిత్రముగానున్నది. ఆమె తన పుట్టినింటికిఁగూడఁ జేరలేదని తెలిసినది కదా! మీ కేమైన నాలోచన తట్టినదా?"

రామదాసు తన స్వప్నావస్థనుండి మేల్కాంచెను. శశిభూషణుని ప్రశ్నకీవిధమున సమాధానమిచ్చెను. "ఈ రాజ్యములో జరుగు సంగతులన్నియు రాక్షసమాయలుగా నున్నవి. ఆడుదియైనను హైమవతీదేవి కూడ మనలను మ్రింగివైచునట్లున్నది. ఆమె సామాన్యురాలు కాదు. నేనీవిషయమునఁ జాలవఱ కాలోచించితిని. వెనుకనీవుచూచిన సన్న్యాసి జాడకై, యెంత ప్రయత్నించినను, నేమియుఁ దేలనేలేదు. రత్నసింహుని రాణిని లోఁబఱచుకొనినవాఁడు, సామాన్యుఁడై యుండడు. ప్రస్తుత మామెను దాఁటించినవాఁడుకూడ నీసన్న్యాసి

యేమైయుండవచ్చును. వాఁడు కూడ దొరకిన యెడల, మన మిఁక సుఖముగా నుండవచ్చును. వాఁడేదో మాయవేష ములోఁ నీపట్టణములోననో, మఱియొక చోటనో యున్నాఁడు. హైమవతికూడ నాతనితో సుఖముగాఁ గాలముఁ గడపు చుండును."

శశి—ఇఁక మనము కన్గొనవలసినదీ సన్న్యాసిని- హైమవతిని. వీరితో మనకుఁ బీడ వదలును.

రామ—ఆవారకాంతను, హేమచంద్రుని హత్యచేసినవాఁడో! మంత్రి హత్యవలనఁ గలిగిన తొందరలలో ప్రజలా మాటమఱచినారు. కాని, నేనుమఱుతునా? వాఁడొకఁడు!

శశి—మీరు వాఁడొకఁ డనుచున్నారు. జయరాముడే కదా వాఁడు! వాఁడు, మఱియు నసాధ్యుఁడు. ప్రత్యక్షము గా నుత్తరముఁ గూడ వ్రాసినాడు. వాఁడుపూర్వోఁపు జయ రాముఁడైనను, కాకపోయినను, జాల గట్టివాఁడు!

రామ—(కొంతవఱ కాలోచించి) ఆజయరాముఁ డను వాఁ డును, హేమచంద్రునిచంపిన వాఁడును, మంత్రిని హత్య చేసినవాఁడును, నొక్కఁడే యని నాయభిప్రాయము.

శశి—అటులైన రామచంద్రుఁడే, జయరాముడా? అందరిని జంపినవా డీతఁడేనా?

రామ—కాదు.

శశి—అయిన ?

రామ—రామచంద్రుడు వెంకటప్పయ్యను, తనచేతులతో స్వయముగాఁ జంపకపోయినను, కుట్రలో ముఖ్యుఁడు. వెంకటప్పయ్య యింటనున్న దాసి, యానాఁడు హంతకులు చాలమందివచ్చిరని చెప్పుచున్నది. ఆ జట్టులో రామచంద్రుఁడుకాక, యాతనితో సమానుఁడు మఱియొకఁడున్నాడు. వాడే, యీజయరాముఁడను నామమును ధరించినవాఁడు. వాడే, హేమచంద్రునిఁగూడ హత్య చేసెను. మంత్రిహత్యతరువాత, నాతనికిని, రామచంద్రునికిని యేకారణముచేతనో విరోధముసంభవించినది. ఆతఁడెవరో చెప్పి, తాను వెంకటప్పయ్యను, తనజేఁతులతోఁ జంపలేదని, రామచంద్రుడు, తెల్పినయెడల నాతనికి మరణశిక్ష తప్పియుండును. కాని యీవిషయమై, యేలకోకాని, యాతఁడు మూర్ఖపుఁబట్టు పట్టి, యంతయుఁజెడగొట్టినాడు......చివరకిప్పుడెందఱు?సన్న్యాసి! జయరాముఁడు.

శశి హేమచంద్రునిఁ జంపిన వాఁడును, వెంకటప్పయ్యను జంపినవాఁడు నొకఁడే యని యెట్లు నిర్ధారణఁ జేయుట?

రామ—హేమచంద్రునిఁ జంపినటులఁ దానే, చెప్పుచున్నాడు, వెంకటప్పయ్యతల రామచంద్రుని యింటనున్నదని యీతఁడేచెప్పినాడు. నేనిదివఱకుఁ జెప్పినటుల, హత్యసం

గతి తెలియనిదే, తల యెచ్చటనున్నదో, యెట్లు తెలియును? అదియును గాక, నా రెండు యుత్తరములలోని వ్రాతయు నొకనిదే !............ఈహత్యకసలు కారకురాలు హైమవతి. హైమవతికిని, రామచంద్రునికిని, సంబంధమున్నది. సన్న్యాసికిని హైమవతికిని సంబంధమున్నది. ......ఆ!... తెలిసినది?

శశి—ఏమి తెలిసినది?

రామ.—జయరాముఁడనుమారుపేరిట సంచరించుచున్న వాఁడీ సన్న్యాసియే!

శశి—సన్న్యాసియా! ఎట్లు? ఆసన్న్యాసి నిజముగా నందులకుఁ దగినవాఁడని చెప్పుటయందు వింత యేమియు లేదు. ఆతని నేను చూచితిని. మహాబలసమన్వితుఁడు. మహాసౌందర్యవంతుఁడు! ఎంతమాయఁ గలవాఁడు కాకపోయిన, నింతపనిఁ జేయగలఁడా? అంతఃపురమున బంధింపఁబడి, యసంఖ్యాకులగు సేవకులతోడను, మహాబలిష్ఠములగు కుడ్యములతోడను, రక్షింపఁబడు, రత్నసింహుని పత్నితోఁ గలయువాఁ డెంతపనికైనను సమర్థుఁడు! వాని రూపము నాకనులకుఁ గట్టిన ట్లున్నది. ఆతని మేనిచాయ సువర్ణవికాసమై యున్నది. ముఖమంతయు బిఱుసు వెంట్రుకలతో నిండియున్నను, నాతని నయనములు మెఱయుచున్నవి. ఆతఁడంత పని

జేయుటకుఁ దగినవాఁ డనుటకు సందియము లేదు. కాని జయరాముడే యాతఁడని నిర్ధారణ చేయుట యెట్లు?

రామదా సొకవిధమైన యుత్సాహముతో నుబుకుచుండెను. అతని కన్నులు ప్రజ్వలించుచుండెను. శశిభూషణుఁడా ప్రశ్న వేసిన వెంటనే పరుండియున్న యాతఁడు లేఁచి నిలువఁబడెను. మనమీహత్యను గురించి పనిచేయుట, దేనితో మొదలిడితిమో, దానిని మఱచిపోతిమి.

మొట్టమొదట, సన్న్యాసి హైమవతితో నుండగా గాంచితిమి. ఆతఁడు మంత్రిహత్యను గురించి మాట్లాడుచుండుట వింటిమి. ఆతఁడే హంతకుఁడని చాలవఱకు స్థిరపఱచికొంటిమి. ఆమాట చెప్పుటకై రాణిని సందర్శించి, చెప్పితిని. ఆమె, జయరాముఁడువ్రాసిన యుత్తరముఁ జూపినది. తరువాత రామచంద్రుఁడేలకో నేరస్థునివలెనే ప్రవర్తించినాడు. కాని, యీలోపుగా సన్న్యాసి మాటనే మఱచితిమి...... ......ఒక్కసంగతి చెప్పెదను వినుము. యుగములు మారినను, మనుష్యులు మారినను, గొన్నికొన్ని లక్షణములు, మారవు. అవి దైవనిర్మితములు. మనుష్యతత్వ మెప్పటికి నొకేలాగున, కొన్ని విషయములలో నుండును. ఏదేశములోఁ జూచినను, నేజాతిలోఁ జూచినను, నాదైవ నిర్మితతత్వ మొక్కలాగుననే యుండును. ఇట్టిది! ఒకఁడు ప్రేమించిన వనితను, మరియొకఁడు ప్రేమించినట్లు తెలిసినయెడల నా మొదటివానికి క్రోధము చేరక్తముడికిపోవును.

అట్టి సమయములందాఁతడిది చేయును,నది చేయఁడని చెప్ప లేము. ప్రపంచములోని హత్యలలోఁజాలవఱకు వీనికొఱకే జరుగుచున్నవి.........నీకొక చిన్న సంగతి నుదాహరణక్రిందఁ జూపెదను. నాలుదినముల వెనుక నేనాపల్లపువీధినిఁ బోవుచుంటిని. అచట నొక వారకాంతాలయమున్నది. ఆవారకాంత నొకఁడు చాల సంవత్సరములనుంచి యుంచుకొనెను. కాని వాఁడావారవనిత, తనకే భార్యయనియుఁ బరులకుఁ దల్లియనియు భావించును. కాని దాని కుపపతులు పెక్కురు కలరు. నేను మొన్నఁ జూచినదిది. ఆవారకాంతకుజబ్బుగానున్నదనియాయుంచుకొనినవాఁడు, వైద్యునొకనిని దీసికొని వచ్చెను. కాని యావైద్యుని వీథిలో నేనిలువఁబెట్టి, రోగి గుణములు చెప్పి, మందిమ్మనుచున్నాఁడు. తనవారభామినిని, బరపురుషులకుఁ జూపఁగూడదని యాతని తలంపు. ఆవారకాంత పరపురుషుని గన్నెత్తియైనఁ జూడదనియాతనియూహ. పురుషులకిది సహజలక్షణము. ఎంత యోనీచుఁడు గాని, తానుప్రేమించు యువతిని మఱియొకఁడు ప్రేమించుటఁజూచి సహింపఁజాలడు. నీకు నేను చెప్పఁబోవుసంగతియంతయు బాగుగా బోధపఱచుటకై యిదియంతయుఁ జెప్పవలసి వచ్చినది.

ఇక మనకథ! ఎట్లో హైమవతికినాసన్న్యాసికినిసంబంధము కలిసినది. ఆసంబంధమెంత కాలమునుండియున్నదో, యాసన్న్యాసి యెవ్వరో, మనకుఁ దెలియదు. కాని, నీవుచెప్పినటుల

నాతఁడు చాల ప్రజ్ఞావంతుఁడై యుండవచ్చును. సన్న్యాసియు హైమవతియు నొకరి నొకరుమోహించుకొనిరి. ఆమెయుఁజాల సౌందర్యవతియనియును, విలాసవతి యనియును వినియుంటిని. తరువాత, రామచంద్రునికిని, హైమవతికిని సంబంధము కలిసినది. ఈసంగతియాసన్న్యాసి కెటులనో తెలిసిన, రామచంద్రునికి, సన్న్యాసి యేమగును—బలవద్విరోధి—! అందువలన నీనేరమునంతటిని, రామచంద్రునిపైఁ ద్రోసినాడు. వెంకటప్పయ్యతల నాతనియింట నాసన్న్యాసియే యుంచి, జయరాముని పేరుతోను త్తరము వ్రాసినాడు. మనకాయు త్తరమే మూలాధారమైనది. నిజముగాఁ బల్వొలరాజ్యక్షేమముఁగోరి, యాతఁడా యుత్తమురను వ్రాసెనా యేమి !

శశి—అటులైన, మనము రామచంద్రునూరకయే మృత్యుదేవత నోటఁద్రోయుచున్నాము కాదా ?

మరల రామదాసునకు విషమావస్థసంభవించెను. మరలనంతయుని ద్రవ్వినందులకు మనశ్శాంతికూడఁబోయెను. వృథాతర్కప్రయోగములచే నంతయుఁ దలక్రిందు లాయెను...మరల కథనంతటిని, మనస్సులో నొకసారినిర్మించి చూచెను. కాని, మునుపటి యంతటినిర్మలముగాఁ గథ తట్టలేదు. సంగతులఁగొన్నిఁటిని మఱచెను. క్రొత్తవానిని గొన్ని చేర్చెను. అటులైన రామచంద్రుఁడు, నిర్దోషియేనా ? బహిరంగ విచారణ కూడనెనదే ! మరలనంతయు మొదలా !

ఆనాటి రాత్రి యాతనికి నిదురయే లేదు. శశిభూష ణుఁడు మాత్రము, రామదాసింకను నేమైన చెప్పనేమోయని, చాలవఱకుఁజూచి, చివరకుఁ దనకుఁ దెలియకుండఁగనే నిదుర బోయెను.

రామదాసునకు మాత్రము నిదురలేదు. తానుచే సిన దంతయు వ్యర్థమేనా? తరువాత నీశ్వరునియెదుట వృథా ప్రాణాపహారణమున కేమనిజవాబు చెప్పగలఁడు? ఆసన్న్యాసిని గన్గొనినఁగాని, యేమియును లాభములేదని యాతఁడు నిశ్చ యించుకొనెను. ఎట్లైన రాణితో మాటలాడి, రామచంద్రుని శిక్షప్రస్తుత మాపుచేయించవలయును. హైమవతియునికి కన్గొ నవలయును. ఈయాలోచనలతోడ నాతనికిఁ దెల్లవాఱెను.

## ఇరువది యెనిమిదవ ప్రకరణము

చంద్రముఖి రామలక్ష్మి ననేక విధముల బ్రతిమాలెను. తన సంగతిఁ జెప్పుమని యడిగెను. భయపెట్టెను. ఏమి చేసి నను, కొయ్యవలె నాయవ్వ తనరహస్యమును వెలిబుచ్చ నేలేదు.

"పల్వాల పట్టణముననున్న రక్షకభటాధికారిని నీవెఱుఁ గుదువని నాతో నిదివఱ కేల చెప్పలేదు?"

"మఱచి పోయితిని"

"ఆతఁడు దాఁచమనిన రహస్యమేద్ది ?"

"దానిని నీతోఁ జెప్పఁగూడదు"

"నాయొద్ద దాఁచవలసిన రహస్యములు నీకేమి యున్నవి ? నన్నంత నమ్మవా?"

"ఆ విషయమై నన్నేమియును బలవంతపెట్టవలదు. తరువాత నెప్పుడైనఁ జెప్పెదను."

ఈవిధమున నాముసలిది ప్రత్యుత్తర మిచ్చుచుండును. అడుగవలదనిన మానదు. మరల మరలఁ జంద్రముఖి యడుగుచుండును.

ఒకనాఁ డిటులనే యడిగెను. చాలవఱకు బ్రతిమాలెను. చివరకు నాయవ్వ కసరుకొనెను. చంద్రముఖి కోపముతోఁ దన రామచిలుకను, చేతనుంచుకొని, మాటలాడక, కౌశికానదియొడ్డునకుఁ బోయెను.

ఆనాటియెండ మిగుల తీక్ష్ణమైన దగుటచే, సాయంకాలము మిగులఁ జల్లగా నున్నటులఁదోచుచుండెను. చంద్రముఖి కొంతసేపు తనలోఁ దాను గొణుగుకొనెను. కాని ఎదుట చిత్రవిచిత్రవర్ణములఁ దాల్చు నంబరమును గాంచియు, మందమారుతముచె గంతులిడుచున్న యాపిల్లయలల యాటలఁ జూచియు, తనకోపము నడఁచికొనెను. ఆమె చిలుకను చేతనుంచుకొని దానినే చూచుచు దానితో మాటలు చెప్పుచుం

డెను. చిలుకకుఁ దెలియకపోయినను నామెమాటలాడినపుడెల్ల నేదియో యస్పష్టమంజుల ధ్వనినిఁ జేయుచుండును. చంద్రముఖి మరల మాటలాడుచుండును. ప్రేమగలతల్లులు, మాటల నర్థముచేసికొనలేని యజ్ఞానములో నున్నను, తమ యర్భకుల కేవో మాటలు చెప్పుచుందురు. ఆ బాలకు లప్పుడప్పుడు సందర్భములేని పలుకేదో యాడుచుందురు. కాని యాయసందర్భపు ధ్వను లా తల్లులకు నిచ్చుసంతస మింతింతయని చెప్పఁదరమా!

చంద్రముఖియు నట్టి యానందమునే యనుభవించుచుండెను. తన మృణాళ సుకుమారమగు హస్తములతో నాచిలుకను దువ్వుచు, నసంపూర్ణవయోవికాసము శరీరమంతయు నలముకొనియుండ నత్యంత సౌందర్యమూర్తియగు నాబాలిక యచటనున్న యొక రాతిపైఁ గూర్చుండియుండెను.

ఆనాఁడు సరిగా నా సమయముననే, శశిభూషణుఁ డచటికి వచ్చెను. ఆసాయంకాలమున, తనకుఁ దెలియకనే, యూతఁడు పట్టణము వీఁడి చాలదూరము వచ్చెను. కాని యీనిర్మానుష్య ప్రదేశమున, నాచెట్టుక్రింద నతి యొయ్యారముగా, నొంటరిగా నాసీనురాలైయున్న యాయువతి యెవ్వతె! ఆ నది యొడ్డున, నామె యొంటరిగా నటులఁ గూర్చుండియుండుట, యాతనికిఁ గొంచెము, క్రొత్తగాఁ గన్పట్టెను. ఆమె ముఖము నదివైపునకుఁ ద్రిప్పఁబడియుండెను. అర్ధభాగముమాత్ర మీతనికి గోచరించుచుండెను. ఎంత సుందరమైన దామెముఖము!




పు. ౧౬౭. ......ఈ నిర్మానుష్యప్రదేశమున నా చెట్టుక్రింద నతియొయ్యారముగా
నొంటరిగా నాసీనురాలై యున్న నా రూపవతి యెవ్వతె ?

శశిభూషణుఁ డంత పెద్దవాఁడుకాడు. బాల్యావస్థకును యౌవనమునకును నడుమ నుండెను ఇరువది వసంతముల మాత్రము చూచియుండెను. చంద్రముఖినిఁ జూడ నాతని కేమి యూహ తట్టెనో కాని, యామెకుఁ దెలియకుండనే, యెండి క్రిందఁబడిన యాకులు చప్పుడుకాకుండ మెల్లగ నడుగులిడి యామె సమీపమునకువచ్చి కూర్చుండెను.

చంద్రముఖి చిలుకతో నటులనే మాటలు చెప్పుచుండెను. "నీవు చదువుకొనెదవా?" చిలుక, కు,.........క్కూ యని యొకటిరెండు పర్యాయములు కూయును. మరల చంద్రముఖి

"నీ కాఁకలి యగుచున్నదా?"

"నీవు బండి నెక్కెదవా?"

యని ప్రశ్నించెను.

ఇదేమాటలు. ప్రతిప్రశ్నకును చిలుక యొకసారి "కు, క్కూ-" యనుచుండును. అలవాటుపడినదానివలె మరలమాటఁ జెప్పవలెనును, చిలుక "కు, క్కూ" యనుచునే యుండును. చంద్రముఖియుఁ జిలుక "కు, క్కూ" యొక్క యర్థమును గ్రహించుచున్నటులనే సంతసింపుచుండెను.

శశిభూషణుఁడు, దీనినంతయుఁజూచి మిగుల సుఖము నందుచుండెను. పట్టణములోని హడావిడికిని దీనికిని యెంత తారతమ్య మున్నది? విమలమైన యానీటివిూదనుండి వచ్చు మలయమారుతమువలెను, నాచెట్లమీఁద గంతులు వైచు

చున్న యాలేఁతయాకులవలెను, వానినడుమ నస్పష్టగీతముఁ బాడుచున్న పక్షులవలెను నాతని మనస్సతి నిర్మలమైన యానందము నొందుచుండెను. అత్యుష్ణమైన యెండలో నడచినడచి బడలినవానికి, శీతోదకస్నాన మెంత సుఖముగ నుండునో, యాతని కీదృశ్య మంత సౌఖ్యకరముగ నుండెను.

పరిచయము లేకపోయినను ఆయమాయకురాలగు నా బాలికతో నొక్కసారి మాటలాడుదమని శశిభూషణునకుఁ దలంపుపుట్టెను. ఈడునకు తగనికార్యములఁ జేయుచు, రామదాసునకుఁ గుడిభుజమై తిరుగుచుండు నాతఁ డిప్పుడు కేవలము బాలుఁడై పోయెను.

సాయంకాల మతిక్రమించుచుండెను కాని వెలుఁగింకను నుండెను. ఇంతలోఁ జంద్రముఖి ప్రకంపిత స్వరముతో నొక కేకవైచెను. అప్రయత్నముగా శశిభూషణుఁ డామె దగ్గరకుఁబోయెను.ఆతఁడామె నిదివర కెఱుఁగకపోయినను మనోభావములు చాలవరకుఁ బ్రయాణముచేసి, బాహ్యమును మఱపించివైచెను. ఆతఁడామె తనకుఁ జిరపరిచయురాలైనట్లు,

"ఏమి నీముద్దులచిలుక యెగిరిపోయినదా?"అని ప్రశ్నించెను. చంద్రముఖి, చాల నివ్వెఱపడియెను. భయపడియెను. సిగ్గుపడియెను.దగ్గర నెవరును లేరనుకొని తానటులఁ జంటిపిల్లవలె చిలుకతో మాటలాడుచుండెను. శశిభూషణుఁ డటులఁ బ్రశ్నింప, నామె మాటలాడక, యటునిటుఁ జూచుచుండెను.

ఆతఁడు మరల మాటలాడక, నాప్రక్కనే, యొక్కకొమ్మపై వ్రాలిన, చిలుకను పట్టుకొని, గులాబీపూవువలెనున్న యా వనిత కోమలహస్తమునందుంచి తనలోఁదాను పొంగిపోయెను. చంద్రముఖి యాచిలుకను తీసికొని, "నిన్నుకట్టి, పంజరము లోఁ బారవేయవలెనా? నీకు బొత్తిగా భయము లేకున్నది" అని రాణి కోపముతో ననియెను

చంద్రముఖి ముఖమువంక శశిభూషణుఁడు మిగుల హర్షముతోఁ జూచుచుండెను.

ఆవదన శశిమండల మెంత రామణీయకముగా నున్నది! ఆవిశాలనయనము లెంతమనోహరముగా నున్నవి! ఆవినీలకుటిలకుంతల సముదాయము! ఆమెఱయుచున్న కపోల యుగ్మము! తనకుఁ దెలియకయే శశిభూషణుఁ డామెను, దన విస్ఫారితనయనములతోఁ బరీక్షించుచుండెను. ఎట్లైన మాట లాడవలయునని యాతనిహృదయ మాతనిని మిగులఁ బ్రేరేపించుచుండెను. కాని యేమని మాటలాడుట! ఎదో మాట్లాడినఁగాని యాతని హృదయాందోళనము తగ్గునటుల లేదు. చివర కిటులనెను.

"నీవిచట నొంటరిగానుంటివేమి! మీదేయూరు?"

చంద్రముఖి తలనెత్తెను. తన కుపకారబుద్ధిచేఁ జిలుకను దెచ్చియిచ్చిన, శశిభూషణునిముఖము—సుందరమైన యాముఖముఁ జూచి, సిగ్గుచేఁ దలవంచుకొనెను.

శశిభూషణునకొకింత ధైర్యమురా నిటుల మరలఁ బ్రశ్నించెను. "నీవు, మూగబాలికవా? నీకుమాటలురావా? ఈ ప్రశ్న విని చంద్రముఖి యొకింత నవ్వెను. ఎంత యానందకరమైనది యానవ్వు!

"మాటలు రాకేమి! మాదీయూరే! అక్కడనే మాయిల్లు" అని వ్రేలితో నామె చూపెను.

"మఱి—మఱి—నీవిచటికి వచ్చితివేమి?" అనియర్థములేని ప్రశ్న నొకదానిని శశిభూషణుఁడు వైచెను.

"అదే మాయిల్లు, చల్లగానున్నదని వచ్చితిని"

"నీవు యెవరి పిల్లవు?"

ఆ ప్రశ్నకు చంద్రముఖి యుత్తరమీయలేకపోయెను. ఆమె యెవరి పిల్లయో తనకే తెలియునటుల లేదు.

రామలక్ష్మి తనయ యని యిదివర కామెభావించెను. కాని, రామదాసును జూచినప్పటినుండియు, నామెకుఁ గ్రొత్త సంగతులు బోధపడెను. చంద్రముఖి మాటలాడకుండుట కాంచి, శశిభూషణుఁడు మరల నిట్లనియెను.

"నీపేరు?"

"చంద్రముఖి"

"చంద్రముఖియా? ఎంతమంచిపేరు!"

చంద్రముఖికి, నీతనితో మాటలాడుట బాగుగనే యుండెను. వీరిప్పు డిప్పుడే యొక నూతన ద్వారములో నడుగిడుచున్నారు.

"మంచిపే రేమి? అన్నియును మంచిపేరులే! మీపేరు మంచిదికాదా యేమి?" అని చంద్రముఖి యనెను.

శశిభూషణుఁ డాబాలికకుఁ దనపేరు చెప్పఁదలఁచి "నాపేరు శశిభూషణుఁడు" అనెను.

వీరిటుల మాటలలో మైమఱచియుండ, జగ మంతయు నంధకారము కావచ్చుచుండెను. "చాలప్రొద్దుపోయినదే! చీఁకటి కూడఁ బడినది. నేనింకను బోనేలేదు" అని చంద్రముఖి బయ ల్వెడలెను.

"చీఁకటిగా నున్నది. నేను సాయమురానా?"

"వలదు! మా కిదంతయు నలవాటే!"

"భయములేదు, వచ్చెదను" అని శశిభూషణుఁ డామె వెనుకనే యింటివఱకుఁ జనియెను. దారిలో వా రేమియు మాటలాడలేదు. "ఇదే, మాయిల్లు!" అని శశిభూషణునివైపు జూచి చెప్పి, చంద్రముఖి లోనికిఁబోయెను. శశిభూషణుఁ డేటు లనో యింటికిఁ జేరెను.

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము

రామదాసు మనస్సు మరల నస్వస్థతఁ బొందెను. ఆతఁడు గావించిన పనియంతయు వృథామైపోవుటయేకాక, మీఁదు మిక్కిలి నిందనుకూడ భరింపవలసివచ్చునేమో యని యాతఁడు

మిగులఁ దల్లడమందుచుండెను. శశిభూషణునితో సంభాష ణముఁ జరిపిన మఱునాటి యుదయమున నాతఁడు మిగుల నస్వస్థుఁడై లేఁచెను. తాను నిర్ణయించికొనిన ప్రకారము, రాణి దర్శన మొకపర్యాయము చేసిన చాలా బాగుగనుండు నని యాతఁడు ప్రాతఃకాలకృత్యంబులఁ దీర్చికొని, యొంటరి గనే బయల్వెడలి రాణి సదనంబునకుఁ బోయెను.

శ్యామసుందరీదేవి, సభాభవనమున, నూతన సైన్యా ధికారి మొదలగు రాజకీయోద్యోగులతో నేవియో సంగ తులఁ దెల్పుచుండెను. వారందరును తమకార్యముల నెఱవేర్చి కొని వెడలిన తరువాత, రామదాసు తనకుఁ గ్రొత్తగాఁ గలి గిన సందియముల నామెతోఁ దెల్పి, రామచంద్రునికి విధించిన శిక్షను, కొంతకాల మాపుచేయమని కోరెను. ఆమెయు వల్లె యనెను. కాని ప్రజాళితో మాత్ర మీవిషయ మేమియుఁ దెలు పక, రహస్యముగా నుంచున ట్లాతనిని గోరెను.

రామదాసు, మఱికొంతతడ వటఁ గూర్చుండి సెలవు తీసుకొని, పయనమై, తన సదనంబునకు వచ్చుచుండ, విలాస భవన ప్రాంతమున విజయమోహనుఁ డగుపడియెను. ఆవర్తక పుంగవుఁ డీతనిని మిగుల గౌరవించి, తన యుద్యానవనమునం దలి గచ్చుతిన్నెపైఁ గూర్చుండఁజేసి కుశలప్రశ్నలనారంభించెను.

విజయ:—మీరు చాల యుదయముననే బయలు దేఱితిరి. ఎచటనుండి, మీరాక?

రామ:—కోటనుండి.

విజ:—ఆలాగనా ? మఱేమియు విశేషములు లేవుకదా ?

రామ:—క్రొత్తసంగతు లేమియును లేవు.

విజ:—రామచంద్రుని విషయమై యేమి యాలోచించితిరి?

రామ:—ఆలోచన మేమి? నరహంతకుల కెట్టి మర్యాద జరుగునో, నాతనికియు నదే!

:—నేర మాతని మీదనే ఋజువైనదా యేమి ? బలమైన సాక్ష్యము దొరకియుండును!

రామ:—మీరానాఁడు సభకురాలేదా ? ఇటువంటి విషయములలో మీరు ముందంజ వేయుదురే!

విజ:—నిజమే! కాని నే నాసమయమునం దిచటలేను.

రామ:—ఆ! మీరు! విచారణ, రేపు జరుగుననగా, రాత్రి నాయొద్దకువచ్చి విచారణ రేపనుట నిశ్చయమేనా? అని యడిగియున్నారే?

విజ:—అవును! మఱచితిని. నేనూరికిఁ బోవుట యప్పుడు కాదు. ఆనాఁడు కొంచెము పనియుండి సభకు రాఁజాలకపోతిని — మనుజులను, పైరూప మర్యాదలను బట్టి, యిదమిత్థమని నిర్ధారణ చేయకూడదు. పైకి, సుగుణసంపద యంతయు వారి సొత్తైనట్లు నటించుచు, లోపల ననేకకుతంత్రములఁ బన్నుచుండువారి నెంద

జేనో నే నెరుఁగుదును. ఈరామచంద్రునిఁ జూడుఁడు! పై కెంత నమ్రతకలవానివలెఁ గన్పట్టెడివాఁడు! చివర కెట్టిపనిఁజేసినాడు. వీనిని నరరూప రాక్షసుఁడనుట కే మియు సంశయింప నక్కరలేదని నాయభిప్రాయము.

రామ:—అవును. ఆమధ్య, నొక సన్యాసి, రావిచెట్టుక్రింద జపము చేసుకొనుచు నుండెడివాఁడు. జలస్తంభనవిద్యా ధురంధరుఁడు. భూత భవిష్యద్వర్తమానముల నామూ లాగ్రముగ గ్రహించి చెప్పెడి వాఁడట! ఈమధ్య నెచ టను జాడలేదు. ఆతఁడు నటువంటి వాఁడే!

విజ:—ఓహో! ఆతఁడా ! ఒకదినమున, మీరాతనిని గురించి, నన్నుఁగూడ నడిగితిరికాదా? ఈ యుద్యానవనము వైపు వచ్చెనని యెవరో చెప్పగా వింటి నంటిరి. అతఁడేనా ?

రామ:—అవును.

విజ:—మీరుకూడ నాతనిచే జ్యోతిషము చెప్పించఁదలచి కొంటిరా ?

రామ:—కాదు ! వాఁడొక దుర్మార్గుఁడు. వాఁడు కొన్ని యకార్యములఁ జేసినటుల నాకుఁ దెలియవచ్చినది.

విజ:—సన్యాసి యకార్యములఁ జేయుట వింతయే ? ఏమి చేసెను ?

రామ:—సన్న్యాసియా వాఁడు? మీరిపుడు సెలవిచ్చితిరే పై వేషభాషలను జూచి మోసపోఁగూడదని! ఈ యతీశ్వరుని బాహ్యాడంబరము నంతియే! ఇప్పటి రాణికి, హైమవతీదేవి యను సవతితల్లి యొకతె యున్నది. ఆమె యొక రాజద్రోహి! సన్న్యాసికి నామెకు సంబంధ మున్నది.

విజ:—(ఆశ్చర్యముతో) మీరు, చెప్పుచున్న సంగతి చాల చిత్రముగా నున్నది. వీధుల వెంబడి తిరిగి, జపము చేసికొని బ్రతికెడి సన్న్యాసికి రాణితో నేమి సంబంధము?

రామ:—మీరు చెప్పినది సాధారణ సన్న్యాసులను గురించి, వాఁ డట్టివాఁడు కాడు. దేవాంతకుఁడు. మీరు చెప్పిన, నరరూపరాక్షసుల సంఖ్యలోఁ జేర్పఁదగిన వాడు.

విజ:—ఏమి చేసినాడు, వాఁడు ?

రామ:—ఏమిచేయలేదని ప్రశ్నింపుడు. వాఁడు హంతకుఁడు, చోరుఁడు, పైఁగా జయరాముని నామమును దాల్చి దొంగయుత్తరములు వ్రాయుట! చేసినపనిఁ జెప్పుట మీ రటుల నవ్వెద రేమి ? రాముఁడా సింత చేతకాని వాఁడనియేకాదూ?

విజ:—కాదు, కాదు! క్షమింపుడు. చేసినపని చెప్పట యన్న నవ్వువచ్చినది. మీరు చేతగానివారనఁగలనా! వెంకటప్పయ్య హత్యారహస్యము నెంత చతురతతో బయటఁ బెట్టితిరి? సేనాధిపతియని, భయపడక, జంకక, మీరు చేసినపని చాల ప్రశంసార్హమైనది. మీది యసాధారణప్రజ్ఞ! కాని మీరు చెప్పుచున్న సంగతులు కొంతవఱకు విపరీతముగ నున్నవని మాత్రము చెప్పక తప్పదు. జపముచేసికొనుచు, బ్రదికెడి యొంటరి సన్న్యాసి యిట్టిదారుణములఁ జేసెనన్న నెవరికి నాశ్చర్యముకలుఁగదు? ఏలననిన, హత్యలఁ జేయుటకును, దొంగతనములు చేయుటకును, నొక జట్టుండవలయును గాని, యొకఁ డేమి చేయఁగలడు? ఆసన్న్యాసికి శిష్యులైన నుండిరేమోయనిన, నాతఁ డిరువురియొద్ద నోరు మెదల్పడు. ఆసన్న్యాసిని నేనును రెండుమూఁడు పర్యాయములు చూచియుంటిని. కాని, నాకాతఁడతి నిష్ఠాగరిష్ఠునివలెను, సద్భక్తిపరునివలెను, గాన్పించినాఁడు. మీ రాతనిమీఁద నటువంటి నిందలమోపుట, యద్భుతముగానేయున్నది. మీ కేవైన ప్రబల ప్రత్యక్షనిదర్శనములు దొరకినవా?

రామ:—ఆ! దొరికినవి. ఆతఁడు, హైమతీదేవితో విమల భవనమున నుండగాఁ జూడఁబడినాడు.

విజయ:—అంత ఘోరమైన యకార్య మేదియైనఁ జేసెనా?

రామ:—ఏది పరమపాపహేతువో, యేది మానాపహారణ కారకమో, యట్టిపనినే చేసినాడు. హెచ్చుతగ్గు లరయక, మంచిచెడ్డ లాలోచింపక, హైమవతి గడ్డితినినది. ఆతనితో నామె యేకశయ్యాగతురాలైయుండఁగా కనులఁబడ్డది.

విజయ:—మీకనులనేనా?

రామ:—కాదు-అటులేయైన..........

విజ:—మఱియొకరుచెప్పిరా? చాలు! మీ రీమాటల నెటుల నమ్మితిరి?

రామ:— మఱియొకరిని మీరు తీసివేయుట తగదు. నాప్రాణసమానుఁడును, నాకనేకవిధముల సాహాయ్యమ్మును చేయుచుండిన యతిసూక్ష్మబుద్ధియగు మా శశిభూషణుఁడు కన్నులారఁ జూచినాడు. రామచంద్రుని బంధించుటకుఁగూడ మా శశిభూషణుఁడే కారణము.

విజయ:—ఆ యెఱ్ఱని కుఱ్ఱవాడా? మీతోఁ దఱచు తిరుగుచుండును.

రామ:—అవునాతఁడే! వయసునఁ గుఱ్ఱవాఁడే కాని, చురుకుతనమునందును, తెలివితేటలయందును నాకన్న పెద్దవాడని నానమ్మకము......ఆసన్యాసి యెట్టివాడో మీ

కిప్పటికైనఁ దెలిసినదా? నేనిపు డా సన్న్యాసి యునికిఁ గన్గొనుటకై యత్నములఁ జేయుచుంటిని. మా శశిభూషణుని సాహాయ్యమున నాకోరిక యచిరకాలములోనే, నెఱవేఱఁగలదని నానమ్మకము. ఆతఁడు పట్టువడినఁగాని, నాకు శాంతి యుండదు. పల్వోలపట్టణమునకు నీరాజ్యమునకును గూడ శాంతి యుండదు. పల్వోల రాజ్యపుఁ బట్టుకొమ్మ యగు ముఖ్యమంత్రిని సంహరించిన యాహంతకుని రక్తము జూచువఱకును, నాకును నిదుర యుండదు.

ఉద్రేకముచే రామదాను మైమఱచి, రాణియాజ్ఞను మీఱెను. ఆమె వలదనినపని, గావించెను. ఈతఁడట్టులనుసరికి, విజయమోహనుఁడు ముఖ్యమంత్రినిఁ గూడ నీ సన్న్యాసియేనా, సంహరించినాడు! అట్లైన రామచంద్రుని నేల బంధించితిరి? ఆతని నేల యరితీయింపఁ దలంచితిరి? అని ప్రశ్నించెను.

రామ:—అవును— కాని, రామచంద్రుఁడు నిర్దోషి కాడు. ఆతఁడు రాజద్రోహి! ఆసన్న్యాసికే, యాహత్యా విషయమున కొంతకాకపోయినఁ గొంతమైనను, సంబంధ ముండియుండును. ఆతఁడు వెంకటప్పయ్య శిగస్సును గూర్చి, రహస్యముగాఁ జయరాముఁ డను పేరిట నొక యుత్తరమును వ్రాసి, విమలభవనమునుండి రాణికిఁ

జేరునట్లు చేసినాడు. ఆతని కీహత్యలో సంబంధముండి యుండనియెడల నీమహత్తరమైన రహస్యమెటులఁ దెలియఁగలదు ?

విజ:—ఆతనికి నాసంగతి నెవరైనఁ జెప్పియుండఁగూడదా ?

రామ:— ఎవరు చెప్పెదరు? ఎవనికి తెలియును?

విజ:— హైమవతికి !

ఈమాట వినుసరికి, మరల రామదాసునకు విభ్రాంతి పుట్టెను. అవును! రామచంద్రుఁడును, సన్న్యాసియును, రాణికి సమానప్రియులు. హైమవతిని, సంతోషపఱచుటకు, రామచంద్రుఁడు మంత్రిని హత్యఁజేసెను. ఆ రహస్యమంతయు హైమవతికి నాతఁడు మిగులఁ బ్రియముతో నివేదించెను. ఆమెయును, సంతసమున నీసంగతి నంతయు సన్న్యాసిచెవి నూదెను. ఆతఁడు మారుపేరుతోఁ దెలియఁజేసెను. ఇటులేల కాఁగూడదు? మరల నిదివఱకుఁ జేసికొనిన దృఢనిశ్చయము పలుచబారెను. మరల బిగ్గరగా విజయమోహానునితో, ననియెను. "రామచంద్రుఁడే హత్యచేసిన, వెంకటప్పయ్య తల నాతని యింటనే ప్రాఁతి పెట్టుకొనునా?"

విజయ:— అను సందియము ప్రతివారికిని తోచుటకు! ఏల కాఁగూడదు? దానిలో నెట్టివిషమరహస్య మున్నదో! రామదాసు, తన మెదడు, తలక్రిందులై పోవునటుల

నుండ, విజయమోహానుని యొద్ద సెలవు తీసికొని, తనయింటికిఁ జేరెను.

మెదడునకు విశ్రాంతి నీయక, నదేపనిగా నేవిషయము నుగాని, యాలోచించిన యెడలఁ గ్రొత్తసంగతులు గోచరించు చుండును. అట్టి సమయములం దొకప్పుడు, మంచి యాలోచ నలు చెడ్డవిగను, చెడ్డవి మంచివిగను, గూడఁ గన్పట్టుట కలదు. అదేపనిగా నాలోచించుట వలన నొకప్పు డిదివరకుఁ గనియు, వినియు నెఱుంగని, సరియైన దానినే పట్టుటఁ గూడఁ దటస్థింప వచ్చును.

రామదాసునకు విజయమోహానునితో సంభాషించి నది మొదలు, మతియే చలించున ట్లుండెను. ఆసన్న్యాసినిఁ జూచువఱకు నాతనికి, నిదురయుండునటులఁ దోఁచదు.

ఆతని కిపుడు మరల నింకొక క్రొత్తసంగతి గోచరిం చెను. విజయమోహానునితో సంభాషించునపు డాతఁడు, యెప్పటివలెఁ గాక; కొన్ని యసందర్భపు జవాబుల నిచ్చియుం డెను.

రామచంద్రుని విచారణ రేపు జరుగుననగా నాతఁడు రామదాసింటి కరుదెంచి "విచారణ యెపుడని గ్రుచ్చి యడిగి నాడు. ఆతఁడానాడు సభకు రాలేదు. సరికదా మీఁదు మిక్కిలి నూరలేనని, యిపు డసత్యమాడినాడు. అంతియకాక, సన్న్యా సిని యాతఁడు, కారణము లేకుండగనే, మంచివాడనియు,

నంతపనిఁ జేయఁడనియు సమర్థించుటఁ జూడ, నిజముగా నతనికిని, సన్న్యాసికి నేదియో సంబంధ ముండియుండవలయును. కాని, యాతఁ డతి వినయపరునివలెను, సచ్చరిత్రునివలెను, కన్పట్టునే! ఇప్పుడైన, నీతఁడు నిజముగా వినయపరుఁడే కావచ్చును. కాని యాదుర్మార్గుఁడైన సన్న్యాసిని గురించి యాతనికిఁ దెలియునటుల నగపడుచున్నది. ఆతనికి సన్న్యాసి, పూర్వస్నేహితుఁడో, లేక చుట్టమో యైయుండవచ్చును. కాని హంతకుఁడనియు, గజదొంగయనియుఁ దెలిసియున్నపు డాతనినిఁబట్టియిచ్చుట విజయమోహనునివిధి............ఈతని కింతమంది యనుచరులేల? సామాన్య వర్తకున కిందఱు సేవకులుందురా? చూచినవాఁడు మరల నగపడఁడే! ఇంతమంది యున్నను నీతని కెంత భయము!

ఈతఁడు, నిజముగా విచిత్రమానవునివలెఁ గన్పట్టుచున్నాడు. చూడవలయును!

రామదా సిటుల కొంతసే పాలోచించి శశిభూషణుని నొకసారి పిలిచెను. కాని యాతఁడు పలుకలేదు. ఈతఁ డీమధ్య నగపడుటయే లేదు. కానబడినయపుడు పరధ్యానముతో నుండి, యేదియో తలంచుచుండును.

ఈ విధమున కొంతసేపాలోచనలతో గడపి రామదాసు నిద్రాపరవశుఁ డాయెను.

## ముప్పదియవ ప్రకరణము

శశిభూషణుఁడు చంద్రముఖినిఁ జూచినది మొదలు మారెను. ఆమెరూప మాతనియెదుట సర్వకాలసర్వావస్థలయందును బ్రత్యక్షమై మనశ్శాంతి లేకుండఁ జేయుచుండెను. అప్పటినుండియు నీతఁడు రామదాసునకుఁగూడ తఱచగపడుట మానివైచెను. ప్రతిదినమును గోధూళికా సమయమునఁ దప్పక నీతఁడు గొల్లపల్లె ప్రాంతములకుఁ బోవుచు, చంద్రముఖి యెచటనైన నగపడునేమోయని, మిగుల నాతురతతోఁ జూచుచుండెను. కాని యామె యీతనికి నగపడుటయే లేదు.

ఒక్కసారి మాత్ర మామె యగపడెను. కాని చాల మంది బాలికలతోను, రామలక్ష్మితోను, గూడియుండుట వలన శశిభూషణుఁ డామెతో నేత్రావధానము మాత్రమే జరిపి, తృప్తిపొందవలసినవాఁ డాయెను. కాని యీతనినిఁ జూచినపు డామెయును గొంత వింతదృష్టిని వహింపకపోలేదు. ఆవింతదృష్టియందు ప్రేమ సుగంధ మున్నదని శశిభూషణుఁడు గ్రహింపకపోలేదు. అందువలన నీతఁడు మఱింత బాధకు లోనాయెను. చంద్రముఖి తన చెలులతో సంభాషించుచుఁ జీఁకటి పడువఱకును గడపెను. అంత సేపు, నేదో చదువుకొనుచున్నటుల నటింపుచు, శశిభూషణుఁడు నచటనేయుండి, యామె బయలుదేఱి వెడలిన వెనుక నెమ్మదిగాఁ గాల్జీడ్చికొనుచు నింటి వైపు దాఱిఁబట్టెను.

కాని యటుల నాతఁడు చాలదూరము పోలేదు. ఆగొల్ల పల్లెను వీఁడి, రెండువందలగజముల దూరముమాత్రము పోవు నప్పటికి, నచటనుండిన చెట్లచాటుననుండి, పదిమంది బలిష్ఠు లగు మనుష్యులు వచ్చి, యీతనిఁజుట్టు ముట్టడివైచిరి. ఈబాలుఁ డేమియును మాటలాడక పూర్వమే, వారి నెదుర్కొనకుండగనే, బలిష్ఠులగు నాదొంగ లీతనికాలుచేతులఁ గట్టి యాప్రక్కనే యున్నపడవయందుఁ బడవైచి, వారెల్లరు నందెక్కిరి. ఇంతయకస్మాత్తుగాఁ బట్టువడి, మిగుల నాశ్చర్యవిషాదములకు లోనై, శశిభూషణుఁడు, మారువల్కక, గింజుకొనక, దైవముపై భారమువైచి, కదలక మెదలక పడియుండెను.

వీరటుల నెక్కిన వెనుక, పడవ నవతలగట్టునకుఁ ద్రోసి మనోవేగమున దాని నా నావికులు నడపుచుండిరి. గుసగుసలును, తెడ్లయొక్క ధ్వనులును తక్క శశిభూషణుఁ డేమియును వినుటలేదు. వీరు, తన కెవరో శత్రువులుకాని దొంగలు కారని యాతఁడు తలంచెను. వీరి ముఖములలో తానిదివఱకుఁ జూచినదొకటియుఁ గన్పట్టుటలేదు. అందరును క్రొత్తవారే? రామదాసుయొక్క శిష్యునకు విరోధులుండుట యాశ్చర్యము కాదు. కాని, యెవ రీవిరోధులని, శశిభూషణుఁడు దీర్ఘముగా నాలోచింపఁ దొడంగెను. రామచంద్రుని యనుచరులా? అటులైన నొక్కముఖమైననుఁ దాను చూచినది యగపడదే! ఇక నెవరు? హైమవతీదేవిచేఁ బంపఁబడినవారై యుందురు! కాని

యీపట్టణవాసులుమాత్రముకారు. రామచంద్రనగర వాస్తవ్యులైయుందురు. ఈయాలోచన తట్టునప్పటికి, శశిభూషణుఁడు చాలభయపడెను. వీఱిప్పుడు తప్పక పడవమీఁద రామచంద్ర నగరము తీసికొనిపోయి, హైమవతీదేవియెదుటనుంతురు. ఆమెగౌరవమంతయు నశించుట నీతనివలననే! అందువలనఁ, బగఁబట్టిన త్రాఁచువలె నామె యీతనిని మిగుల ఘోరముగా నిర్మూలింప నాజ్ఞాపించును. భగ్గున మండుచుండు మంటలలోఁ బారవేయుమనుటయో లేక, యేకొండనుండియైనను గ్రిందికిఁ ద్రోయుమనుటయో లేక,మదపుటేనుగు కాలిక్రిందఁ బడవేయుమనుటయో,నామెయాజ్ఞయైయుండును. తనకు మరణమాసన్నమైనదని శశిభూషణుఁడు రూఢిగానమ్మెను. రక్షించుటకు రామదాసున కీవిషయ మేమియును దెలియదు. "చంద్రముఖియు నన్నింక జూడఁజాలదు." అని యనుకొని శశిభూషణుఁడు విచారించుచుండెను. ఆకారుచీఁకటిలో, గట్టుననున్న మనుష్యులకగపడకుండగనే, నదీ మధ్యభాగమునందుండి, యాపడవ, మిగులవేగముతోఁ బోవుచుండెను. పల్లెలపట్టణమంతయు, దీపములచే నలంకరింపఁబడి శృంగారమయమై కానవచ్చుచుండెను. ప్రతిదినమును జూచుచున్నను, యీనాఁడీపట్టణమింత యందముగా నున్నదేల? యని శశిభూషణుఁ డనుకొనియెను.

అటులఁదోఁచుట వింతకాదు. బ్రతికియున్న దినములలో, సర్వబాధలఁ బడుచుఁ దానెంతక్రూరముగాఁ జూచినను, సహించి తననీడవలె వర్తించిన నిజభార్య చనిపోయినవెనుక, పశ్చాత్తప్తుఁడౌ మగనికి, బ్రదికియున్న దినములలోఁగంటె, నామృతచ్ఛాయచే నలముకొనఁబడిన యర్ధాంగి వదనమండలమే మిగుల సౌందర్యవంతమై యగపడనచ్చును. ఆక్షణకాలములోననే, యాతని హృదయమునందు మునెప్పుడును నెరుంగని, కరుణరసప్రవాహము, పుట్టి, పొంగి, పొరలిపోవుటయును వింత కాదు.—అటులనే, నిత్యమును జూచుచున్నదైనను, దానికఁ జూడఁజాలనని తోఁచినపు డా సౌందర్యరాశియగు పట్టణమును గాంచి శశిభూషణుఁడు కన్నీరువిడచుటయును వింతకాదు. "పల్వెలపట్టణమా! సెలవు. ఇంక మరల నీవీధులలో నడచు భాగ్యము నాకుఁ గలుగదు. కౌశికానదీతీరమున నుండివచ్చు మలయమారుతము నాఘ్రాణించుచు, హాయిగనుండెడి దినములు గతించినవి." అని శశిభూషణుఁడు, పరిపరివిధంబుల వాపోవుచుండెను.

నావయు, నటులబోయి, విజయమోహనుని యోడ కట్టివేయఁబడిన స్థలమున గట్టు సమీపించుచుండెను. అంతి యకాదు! సరిగా నాయోడయున్న స్థలమునకే వచ్చుటఁ గాంచుటచే శశిభూషణునకుఁ గొంచెమాశ మొలకలెత్తుచుండెను. ఏలనన, విజయమోహనుఁడు, రామదాసునకు మిత్రుఁడు.

ఈ పడవలో బంధింపఁబడిన, శశిభూషణునిఁగాంచి, యా తఁడు వెంటనే, రామదాసునకుఁ గబురుపంపును. ఆతఁడువచ్చి యాతనిని రక్షించును. మూడువంతులు, విజయమోహనుఁడే యీపడవలోని వారల బంధించును. ఆతనియొద్ద సేవకు లెంతమందియున్నారు! రామచంద్రనగరమునుండి, క్రొత్తగా నరుదెంచుటచే నీయోడలో నెవరున్నదియుఁ దెలియక నావికు లటుఁబోవుచున్నారు. విజయమోహనుఁడు విలాసభవనము నం దుండెనేమో! ఎచటనున్నను, ముం దీయోడలోఁ బ్రవే శించిన భయముండదు" అని శశిభూషణుఁ డనుకొనుసరికి సరిగా నాయోడదరికిఁ బడవచేరెను. శశిభూషణుఁడును సంత సించెను.

ఓడయంతయు, దీపములతో మిగులఁ బ్రకాశించుచు, నానందసూచకధ్వనులతో నిండియుండెను. నావలోనుండి యొకఁడు చిన్న 'బూరా' నొకదాని నూఁదెను. ఓడలోనుండి పదిమంది బయట కరుదెంచిరి. వారిలో విజయమోహనుఁడు కూడ నుండుట గ్రహించి శశిభూషణుఁడు "అయ్యా! వీరు నన్ను బంధించి, తీసికొని పోవుచున్నారు. నేను, శశిభూషణుఁడను" అనెను. అదివిని, విజయమోహనుఁ డొకపెద్దనవ్వు నవ్వి,

"ఆలాగుననా! అటులైన, నేను నిన్ను కాపాడెదను రమ్ము" అనియెను.

# ముప్పది యొూకటవ ప్రకరణము

శశిభూషణుఁడు పరధ్యానముగ నుండిననే రామదాసు విచారించెడివాఁడు. ఆబాలుఁడింటిముఖము చూచి యప్పుడే రెండుదినములైనది. రామదాసు మతిలేని వానివలె నూరంతయు దిరుగుచుండెను. శ్యామసుందరీ దేవిని జూచి, యామెతో నీమాటను జెప్పెను. రామదాసునకుఁ గుడిభుజమువలె నుండి, ముందు ముందు పల్వోలరాజ్యమున కత్యంతసాహాయ్యముఁ జేయు ననుకొనఁబడిన శశిభూషణుని గురించి, రాణియు మిగుల శంతించి, రాజ్యము నందలి నల్దిక్కులనుఁ దన సేనల బంపెను.

తన భవనమునం దుండుట రామదాసునకు మిగులఁ గష్టముగా నుండెను. "శశిభూషణుఁడు కొన్ని దినములనుండి, చాల పరధ్యానముగనే యున్నాఁడు. అయ్యో! అప్పుడే కారణ మరసిన నెట్టి యిక్కట్టును రాకపోవునేమోకదా! నాతోఁ జెప్పకుండ నొకపూటయైనను బయటకుఁ బోయి యెఱుఁగఁడు. ఈతనికి నేను తక్క మఱెవరును దిక్కులేరు. నా యీవిచిత్ర జీవితాంధకారమున నాతఁడొక నక్షత్రమై వెల్గుచున్నాఁడు. మరల నాకంటఁ బడునా? ఇతరుల కెట్టి యాపదవచ్చినను, కడు ధైర్యముతోఁ బనిచేసి, జయముఁగొనెడి వాఁడను. కాని

యిప్పుడు, మాశశిభూషణుని కొరకే పనిచేయుట కేలకో కాని నాకు ధైర్యమే చాలకున్నయది." అని రామదా సొంటరిగ గూర్చుండి, విచారించుచుండెను. ఇటులూరకఁ గూర్చుండుట, యాతనికి మఱింత కష్టముగా నుండుటచే, తన దుస్తులఁధరించి పట్టణమునందలి వీథుల వెంబడి తిరుగ నారంభించెను. ఈతని నెరిగియున్న స్నేహితు లనేకు లీతనిఁజూచి, పలువిధముల ధైర్యము చెప్పిరి. కాని, రామదాసునకు ధైర్యమే లేకుండెను.

అటు కొంతదూరము నడచి, రామదాసు విలాస భవనముదరికిఁ బోవునప్పటి కచట నాచీఁకటిప్రోవగు యానందమోహానుని గాంచెను. "మీ యజమానుఁడు, లోపలనున్నాఁడా?" అని రామదా సాతనిఁ బ్రశ్నించెను. ఆనందమోహానుఁ డటుఁ జూచి మాటలాడక యూరకుండెను.

"మీ యజమానుఁడు విజయమోహానుఁ డున్నాఁడా?"

నాకుఁ దెలియదు. ఉన్నను చాలతొందరపనిలో నుండి యుండును.

"నేను వచ్చితినని చెప్పుము."

"ఆయన యింట లేనిదే!"

వీరిటు మాటలాడుచుండ, విజయ మోహానుఁడే బయట కరుదెంచెను. రామదాసుని జూచి, "ఏమండీ, చిత్రముగా నున్నది! మీ శశిభూషణు నెవరో తీసికొనిపోయినారట! రక్షక

భటాధికారికే శిక్షపడినదే! ఆతని సంగతి మీ కేమైనఁ దెలిసినదా? పల్వెలపట్టణ మంతయు, రావణుని లంకవలె, రాక్షస మాయలతో నిండియున్నదే! మనుష్యులు మాయమైపోవుట! నరహత్యలు! మొత్తమున కాఁడుదాని రాజ్య మన్నందుల కూరక పోలేదు" అనియెను.

రామదాసున కీమాటలు చాల నస్వాభావికముగాఁ దోచెను. ఇట్టి విచిత్రమైన మాటలతో నూరడించిన స్నేహితుల నాత డిదివఱకు చూడలేదు. శశిభూషణు నెవరో తీసికొని పోయినారనుట క్రొత్తసంగతిగాఁ దోఁప, రామదాసు బిగ్గరగా "ఇఁక నెవరు! ఆసన్న్యాసి మమ్ముల నింకను వదల లేదు" అని మూచెను.

ఈ మాట వినుసరి కావర్తకపుంగవుని ముఖము మారెను. చోరుఁడు, రక్షకభటునిఁ జూచినపు డెటులుండునో, యటులనే విజయమోహనుఁడు వెలవెలబోయెను. ఒక్కక్షణము మాత్రమే! ఇరువురును మాటలాడలేదు విజయమోహనుఁడు తనముఖమాతనికి నగపడకుండునటులఁ ద్రిప్పెను. రామదా సోరకంటితో నంతయుఁ జూచెను. విజయమోహనుఁడు, గట్టిగా నవ్వి, "మీకింకను సన్న్యాసి పిచ్చి వదలనేలేదా? మీమాటలు నాకుఁ జాల చిత్రముగానున్నవి" అనెను. ఆయస్వాభావికమగునవ్వును గూడ రామదాసు, కనిపెట్టక పోలేదు.

అంత నాతనియొద్ద సెలవుతీసికొని, రామదాసు కొంచె కా నదీతీరమునంబడి పోవుచుండెను.

"తప్పక నానన్నాన్వేసికిని, విజయమోహనునికి నేదియో సంబంధమున్నది. ఎంత దాచుటకు బ్రయత్నించినను, శాపమిా రోజున నాతనిగుట్టు దాగినది కాదు. ఇక గట్టిప్రయత్నము చేయవలెను. కాని యీతనితో బహిరంగయుద్ధమునకు దిగినం జాలకష్టములున్నవి" అని రామదాసు తలంచెను.

రామదాసు, తన్నువీడిన వెంటనే, విజయమోహనుడు లోనికింబోయి, మిగుల కలవరముతో నటునిటుం దిరుగాడ సాగెను. ఆనందమోహనుం డది కనిపెట్టి, "విజయా! నీవటుల విచారింపం బనిలేదు. నేనిప్పుడే బయలుదేరిపోయి, రామదాసును వెన్నంటి, యెచటికిపోవునో, యేమిచేయునో చూచెదను. మనరహస్యమెంతమాత్రమును బయల్పడలేదు. నీకాభయ మక్కరలేదు" అని ధైర్యముం జెప్పెను.

విజయమోహనుండు, వానికి వెంటనే వేసమును మార్చి, యాయుధపాణింజేసి, రామదాసువెనుకనే పంపెను. తనయాలోచనలలోనే మునింగియుండుటవలన, రామదాసు, తన్ను వెంటాడించి వచ్చుచున్న, యానందమోహనుని విషయ మేమియును, కనిపెట్టనేలేదు. అప్పటికి రామదాసు, గొల్లపల్లె ప్రాంతములకు వచ్చెను.

అప్పటికి, చీకటి బాగుగా జగమంతయు నావరించెను. రామదాసు, తాను చాల దూరము వచ్చుటఁ జూచి, "వచ్చిన వాడ నింతదూరము వచ్చితినికదా, ఒకసారి యవ్వను చూచి పోవుదము" అని తలచి, పాఠశాల వంకకు, దారి దీసెను. ఆనందమోహనుఁడు, నెమ్మదిగా నీతనిని వెన్నంటి వచ్చుచునే యుండెను. ఏదియో కార్యముఁ జేయఁ గృతనిశ్చయుఁడై, యిటులఁ బోవుచున్నాడనియు, దానంతయుఁ బట్టితీరవలయుననియు, నానందమోహనుఁడు నిశ్చయించికొనెను. రామదాసు పాఠశాల దగ్గరకుఁ బోవునప్పటికి, చంద్రముఖియు నవ్వయు నేవో మాటలు చెప్పుకొనుచు, వీథియరుగుపైఁ గూర్చుండియుండిరి. దీపము వెల్తురున రామదాసు నానవాలు పట్టి, వారాతనిఁ గూర్చుండ నాహ్వానించిరి. కాని రామదాసు నిలువఁబడియే" "అవ్వా! నీవును చంద్రముఖియు నారోగ్యముగా నున్నారా?" అని ప్రశ్నించెను. "మా కేమియును లోటులేదు. కాని, నాయనా! నీముఖ మటుల వాడియున్న దేల? నీకేమైన జబ్బుచేసినదా? అయ్యో! ఎంతచిక్కిపోతివి?" అనెను రామలక్ష్మి.

"నా కేజబ్బును లేదు. అటులైన బాగుగనేయుండును. కాని, నామేనల్లుఁడు, శశిభూషణుఁడు, రెండుదినములనుండి, యెచ్చట నగపడుటలేదు. అందుచే" అని రామదాసనుచుండ చంద్రముఖి "మొన్నసాయంకాలమున నేనాయనను నదీతీర

మునఁ జూచితిని. ఆయన యింటికి రాలేదా? అయ్యో! ఏమై నదోకదా, యాయనకు!" అనెను.

రామలక్ష్మి:—శశిభూషణుఁడా! ఆతఁడు మాయింటిపై పెపుడును రాలేదే! నేనాతని నెఱుగనే యెఱుగను. చంద్రా! నీవాతని నెట్లెఱుగుదువు?

చంద్ర—సుమారు, పదిదినముల వెనుక, నేను నాచిలుకతో నదీతీరమునఁ గూర్చుండి యుండ, నది యెగిరిపోయినది. దాని నాయన యెంతో దయతోఁ దెచ్చియిచ్చినారు. ఎంతమంచివారాయన! మరల మొన్న సాయంకాలము చూచితిని. ఎచటికి వెళ్లినారోకదా!

రామదాసు—అవును. ఆతఁడు మొన్న సాయంకాలము మొద లింటికే రాలేదు. ఆతఁడనిన నాకు ప్రాణము! నాకునిజముగా మతిపోవునట్లున్నది. ఆతఁడు లేనియెడల నేను బ్రదుకఁగలనా! ఆతనికై, నేనెంతయో తలఁచితిని. ఆతనికెన్నియో చేయుద మనుకొంటిని. చంద్రముఖి! ఆతఁడు చక్కనివాఁడు కాఁడా!

చంద్ర—చాల నందమైనవారు వారిపలుకులు.

రామలక్ష్మి:—ఊరుకొనుము! పురుషులనటులవర్ణించుటతగునా?

రామదాసు—అవ్వా! మరేమియును భయములేదు. నీకీ వృద్ధాప్యములో నన్నియును విపరీతముగనే కన్పట్టును.

నా శశిభూషణుఁడు నాకు దొరకి తీరును. చంద్రముఖీ! ఆతనిని గురించి నీవు విచారింపకు. కాని, యవ్వానాకింటి యం దేమియుఁదోచుటలేదు. దయయుంచి, చంద్రముఖిని మాయింటికి......

రామలక్ష్మి—మరల నీయొద్దకా? నేను దానినివదలి యొక్క క్షణమైన నుండఁజాలను. నాచావునకు సమ్మతించి దానినిఁ దీసికొని పొమ్ము, నీవు దానికి సర్వాధికారివే! కాని నామాటగకూడ కొంచె మాలోచింపుము, నాయందు దయయుంచి, దానినట్లు బ్రదుకనీయుము. నీవు పెద్దయుద్యోగస్థుఁడవు, గొప్పవాడవు, విచిత్రపురుషుఁడవు. దాని కా డాంబికమైన జీవనము నలవాటు చేయవలదు. ఈపల్లెటూరియందీ బాలికల తోడనే కలిసి యుండనిమ్ము, నీయొద్ద కది వచ్చినయెడలఁ బంజరములో నున్నపక్షివలె, సుఖముగా నుండదు.

రామదాసు—అట్లైన నీయిచ్ఛవచ్చినటులనే చేయుము. నేనిపు డామెను తీసికొని వెళ్లను. చాలనాలస్యమైనది. నే నిక పోయెదను.

అని రామదాసు వెడలిపోయెను. ఒకచెట్టుచాటున నిలువబడి, యానందమోహనుఁడు వీరిమాట లన్నిటిని వినెను. కాని, రామదాసును మాత్రము వెంబడించిపోలేదు. "ఇదియొక

చిత్రకథ. ఇటువైపునకు నేనెపుడును రానేలేదు. ఈ సుందరి యెవ్వతె? రామదాసునకును వీరికినిగల సంబంధమెట్టిది? ఈరాత్రికి నేనిచటనే యాఁగి యంతయు గ్రహించెదను. రామదాసిక నింటికిఁ బోయి నిదురించును. అతని వెంటాడించుటవలన లాభమేమియును లేదు" అని తలంచికొని, యానందమోహనుఁడు చెట్టుచాటుననుండి, యీవలకు వచ్చెను. అవ్వ లోనికిఁబోయెను. చంద్రముఖి మాత్ర మేదో కలఁ గనుచున్నదానివలె వింతగాఁ జూచుచుండెను. తనకుఁ బూర్వము జ్ఞప్తికి వచ్చినసంగతుల కుఁదోడు, నీయవ్వ, రామదాసు తనకు సర్వాధికారియని చెప్పినప్పటినుండియుఁ దన యనుమానము మఱింత బలపడెను. ఆమెయిట్లనుకొనుచుండఁగా లోననుండి యవ్వ "చంద్రా" యని కేకవైచెను. తలుపటులనే యుంచి చంద్రముఖి లోపల కరిగెను. ఆమెవైపే చూచుచు నిలువబడియుండిన యానందమోహనుఁడాద్వారములోననుండి లోపలకరిగి యొకగోడచాటున నిలువఁబడెను. అచ్చట నంతయు జాలపరిశుభ్రముగ నుండెను. చలువరాతిని మించిన కుడ్యములు, వానిపైన జక్కని రంగురంగుల చిత్రములు నల్లగ గచ్చుచేయబడిన చావడి అంతయు జాలశుచిగా నుండెను. భోజనానంతర మవ్వయును చంద్రముఖియు చావడిలోనికి వచ్చి నిద్రించుటకు ప్రయత్నముల చేయుచుండిరి. ఆనందమోహనుఁడు వారున్న స్థలమున కెంతయో దూరమున లేదు. ఆసమయమున జంద్రముఖి "అమ్మా,

రామదాసెవరు? ఆతడు నాకు సర్వాధికారి యనెద వేల?" అని యడిగెను.

"ఆమాట నడగవలదని, నేనిదివఱకే చెప్పలేదా ?"

చంద్ర—నేనేమి యడిగితిని ? నాకీతఁడు సర్వాధికారియందు వేల ? నాసర్వాధికారిని నేఁ దెలిసికొనఁగూడదా ?

రాము—తెలిసికొనుట కేమియున్నది ? ఆతఁడు పల్వెల పట్టణ రక్షకభటాధికారి. నిన్నొకసారి, యాతనియింటికిఁ బంపుమనుచున్నాఁడు. నాకు పరిచయుఁడు.

చంద్ర—ఇంతమాత్రముచేఁ దృప్తినొందుటకు నేనంతయజ్ఞానురాలను కాదు. మరల నీయింటికిఁ బంపన నెదవేల ? ఇంతకుముందొకసారి నన్ను పంపితివా ?

రామల—ఎప్పుడో చిన్ననాటఁ బంపితిని. నీవపుడజ్ఞానురాలవు.

చంద్ర—ఆతఁడు నన్నుఁబంపమనినపుడు, నీవటులభయపడెద వేల ?

రామల—భయమేమి యున్నది ? నిదురపొమ్ము చాలరాత్రి యయినది. నీ వొంటరిగా నచట నుండలేవని నే నట్లంటిని.

చంద్ర—అమ్మా ! నీమాటలేమియు నాకు బాగుగాలేవు. నేను ఱేపటియుదయమున నే పోయి, రామదాసుగారి

యిల్లు కన్గొని, యారహస్య మేదియో గూడ జెప్పమని యెదను. ఱేపే పోయెదను. నీవు నన్నెంతమాత్రము నడ్డుపెట్ట వలనుకాదు.

కృతనిశ్చయు రాలైనటులఁ జంద్రముఖి పల్కెను. అవ్వ నిజముగాఁ జంద్రముఖి యంతపని చేయునేమోయని భయపడి చంద్రా! నేనే చెప్పెదను వినుము! ఈరహస్య మత్యంత నిగూఢ మైనది. రామదాసుకూడ నీకుఁ జెప్పడు. నీ విం కెవరితోడను యనకూడదు. నీమీది ప్రేమచే నేను చెప్పుచున్నాను వినుము.

ఆనందమోహనుఁడు వీరి ప్రక్కనున్న స్తంభము దరికిఁ జేరెను. అవ్వ యారహస్యమును నెమ్మదిగాఁ దెల్పెను. చంద్రముఖి భయంకరముగాఁ గేకవైచి, లేచి నిలువబడి, మరల కూలఁబడెను. దానిని వినిన యానందమోహనుఁడును మిగుల చమకితుఁడాయెను.

వెంటనే తలుపుఁదీసి, యొక్కపరుగున విలాసభవనముఁ జేరి, విజయమోహనుని కారహస్యమును దెలుప నాతఁడును మిగుల నాశ్చర్యమును బొందెను.

---

## ముప్పది రెండవ ప్రకరణము

మఱికొన్ని దినముల కొకనాటి సాయంకాలమున విజయ మోహనుఁడు నానందమోహనుఁడు, మఱికొంద అనుచరులతోఁగూడి, వారియోడ పైభాగమునఁ గూర్చుండి మాటలు చెప్పుకొనుచుండిరి.

ఆకాశ మంతయు మేఘమాలికలచే నిండియుండెను. నిశ్చలముగా నున్న కౌశికానది యంతయు చిన్న చిన్న తరంగములతో నిండెను. వృక్షములయందలి యాకు లావీఁచుచున్న గాలిచేఁ జిత్రమైన ధ్వనిఁజేయుచు, వినుట కింపుఁగూర్చుచుండెను. విజయమోహనుఁడనుచుండెను "ఆనందా! ఈమధ్య దాసుగారెచ్చటగూడ జాడలే" డెందు చేతనో!

ఆనం—దాసుగారు! వాని సంగతియంతయుఁ బూర్తిగాఁదెలిసిన తరువాత నింకను మన్నన యేమి? తలవనితలంపుగా వాని జుట్టు మనచేతఁ జిక్కినది. ఆభయముచే తనే యాతఁడు మనకనులఁబడుట మానినాడు.

విజయ—ఆకుజ్జువా డెటుల నున్నాడు. ఈ మధ్య నాకుఁదీరికయే లేదు. తనయాటలేమో, తనపాటలేమో చూచికొ

నక, పెద్దయాలోచనలా! సన్యాసి యట, హైమవ తితోఁ గలిసి యుండగాఁ జూచినాడట! పులినిఁ జూచి, నక్క వాతఁ బెట్టుకొనినటుల నన్నింటియందుఁ బెద్దముం డకొడుకేదియో చేయుచున్నాఁడు కదా, నేనేల చేయ కూడదని! మంచి శాస్త్రియైనది.

ఆనం—వానిని గురించి నీ వేమియును గలుగఁజేసికొనవలదు. వానిని నాకు వదలుము. ఏమి చేయవలయునో నేనే చేసెదను.

ఈతఁడిటుల చెప్పుచుండ, విజయమోహనుఁడు నీటివైపు మిగుల నాశ్చర్యముతోఁ జూచుచుండెను. ఆయోడకుఁ గొంత దూరమున, నేదియో, నల్లగా మనుష్యశరీరమువలెఁ దేలుచు పోవుచుండుట నాతఁడు గాంచెను. ఆత డటుల చూచుచుంటఁ గాంచి, మిగిలినవారును, తమదృష్టుల నావైపునకుఁ ద్రిప్పిరి. "అదితప్పక మనుష్యశరీరమే! ఎవఁడో స్వర్గయాత్ర చేయుచు న్నాడు. కాని ముదుసలిదే! జుట్టు తెల్లగా నెఱసినది" అని యానందుడా శవమును వర్ణించి, మిగిలినవారి సందియ ములఁబాపెను.

"ఇంకను బ్రాణమున్నటులనే యున్నది" అని మరి యొకఁడనెను.

"కొండా ! నీవులోనికువెళ్లి ప్రాణమున్న దేమో, చూడుము" అని విజయమోహనుఁ డాజ్ఞాపింప, మరియొకఁడు లోనికు వెళ్లి, యావిగ్రహము నోడదరికిఁ ద్రోసికొని వచ్చెను. "ప్రాణమున్నదా ?" యను నాల్గుధ్వను లొక్కసారి బయల్వెడలెను. ఏమో ! తెలియుటలేదు. ఎవఁడో ముదుసలి, పంపు ! బ్రదికినను నొకటే!చచ్చినను నొకటే!వదలివైచెదను" అని కొండడు ప్రత్యుత్తర మిచ్చెను.

"ఉంపు! చూతము"! అని యానందుఁ డావిగ్రహమును యోడపైకి లాగెను.

ఆసీటఁబడిన పురుషుఁడు వృద్ధుఁడే కాని, దృఢగాత్రుఁడే! కారుమబ్బువలె నల్లని శరీరము. ముగ్గుబుట్టవలె నంతయు నెరసినతల, చిరిగినగుడ్డలు, మూసికొనిపోయిన కన్నులు వెండిమురుగులతో నలంకరింపఁ బడిన చేతులు కలిగిన యా నిర్భాగ్యుఁ డెవఁడో బీదవానివలెనే యుండెను. దీపములవేళ కావచ్చుటచే నాపురుషుని ముఖ మంత బాగుగాఁ గన్పట్టుటలేదు.

ఆనందమోహనుఁడు నాడిని బరీక్షించి ప్రాణమున్నదనెను. వెంటనే వారాతనిని లోనికిం గొంపోయి, తడిగుడ్డలఁ దీసివైచి, పొడిగుడ్డలఁ గట్టి, శరీరమునకు వేడిమికలుగఁ జేసిరి. కొంతసేపటికి కాతనికి స్పృహకలిగెను. విజయమోహనుఁడు ప్రాణదానముచేయగల్గితిని కదా యని సంతసించి, కొంచెము

వేడిగంజిని యాతనినోటఁబోయించెను. మరికొంత సేపటికాతఁడు సంపూర్ణముగా స్వస్థుఁడాయెను.

ఆదీనుఁడు, విజయమోహనుఁడు మొదలగు వారినిఁ జూచి, కనులు చికిలించి, నమస్కారములు చేయ మొదలిడెను. అంతయు నాతని కాశ్చర్యకరముగా నుండెను. మహారాజభవనమువలె నాయోడలోనిగది,ముఖమల్ సోఫాలతోను, చిత్రవస్తువులతోను నిండియుండెను. దీని నంతయు నోరు తెఱచికొని యాతఁడుచూచుచుండెను.

విజయ:—మాటలాడఁ గలవా?

ఆతఁడు:—బాబూ నేనెక్కడ నుంటిని?

విజయ:—ముందు, మీ దేయూరో చెప్పుము!

ఆతఁడు—బాబూ! మాది రామచంద్రనగరము. దిక్కులేనివాఁడను. భార్యయును బిడ్డలు గతించిరి. ఈపట్టణములోనేదైన నౌఖరీచూచికొనవలయు నని వచ్చితిని. నాకర్మము బాబూ! మామహారాజుగారి కొమరిత మాయమై పోయినదట. ఆమె దర్శనము చేసికొని బ్రదుక వలయునని పుట్టెఁడాశతో వచ్చితిని. నాల్గుదినములనుండి భోజనము లేదు. చివరకు జీవితముపై నసహ్యము పుట్ట, నీటఁబడితిని. ఈనిర్భాగ్యు నేల మరల బయటకుఁ దీసితిరి? భూమికి నాభారముకూడ నేల? బాబూ! మరల నన్ను నీటఁద్రోయుడు. మహాలక్ష్మివంటి, మామహారాజుగారి

కొమరితయే మాయమైపోయినపుడు, నేనుమాత్రము బ్రదుక వలయునా? నేను నిజముగాఁగలఁగనుచుంటినా, లేక బ్రదికియే యున్నానా ? భూలోకములో నుంటినా, లేక స్వర్గలోకములో దేవేంద్రునియెదుట నుంటినా ? ఇదేమో మహారాజభవనము వలెనున్నదే ! ఇదే దేశము ? మీరే దేశపు రాజులు ! ఇవన్ని యునేమిటి? తండ్రీ !రక్షింపుము, అని విజయమోహనుని పాదములపైఁ బడెను. అంత విజయమోహనుడు ఓయీ ! నీవునిజముగా, మరలఁ దల్లికడుపున జన్మించితివి. దేవుని దయవలన నీవికఁ గ్రొత్తజీవితము ననుభవింపఁగలవు. ఇది పల్వెలపట్టణమే! నేను పల్వెల దేశపురాజును కాను, కాని మరియొక దేశపు రాజునే! నీది రామచంద్ర నగర మనుచుంటివి. రామచంద్ర నగరరాజులు మాకుఁ బ్రియులే! అందుచే నిన్ను నేనన్నవస్త్రముల నిచ్చి పోషించెదను. నాకు సేవకులు చాల మంది యున్నారు. కాని యందఱును మాదేశస్థులే ! ఇచటివారిని మేము నమ్మము. కాని నీకుఁ బ్రాణదానము చేసితిమి కనుకను, నీవు దిక్కులేనివాడ వని చెప్పుచుంటివి కనుకను, రామచంద్రనగరవాస్తవ్యుఁడ వగుటచేతను, మా దయను సంపాదింపఁగలిగితివి. నీవు ముదుసలి వైననుచాల దృఢగాత్రునివలె నగపడుచుంటివి. నీకు యుద్ధము చేయుట చేతనగునా ? అని ప్రశ్నించెను. అంతనాతఁడు, "రెండువందలమందిని నేనవలీలగ నాఁపఁగల్గుదును. నేను చిన్నప్పుడు, కుస్తీ చేసి, కత్తిసాము

నేర్చికొంటిని. నే నసిన మాపేటయంతయు హడలుచుండెడిది. ఇప్పుడు పెద్దవాఁడనైతిని. కాని యిప్పుడును, స్వామికార్యము కొఱకై, ప్రాణములనైనఁ దెగించి పోరాడగల్గుదును. అని యావృద్ధుఁడు కనులాడించుచుఁ బల్కెను.

"సహబాస్! నీవంటివారు మాకెంతమందియైనను కావలసియున్నారు. కొన్ని రోజులుండిన నిచటి సంగతులన్నియు నీకు బోధపడఁగలవు. నీకేమియును భయములేదు......ఆనందా! వీనిని నీయధీనమునం దుంచికొనుము. క్రమముగా సంగతులన్నిటిని బోధింపుము. మనసంఘములో నుండఁదగినవాఁడే అని విజయమోహనుఁ డనియెను.

## ముప్పదిమూఁడవ ప్రకరణము

ఈ ముసలి వాని పేరు కోటయ్య. ఆతఁడు త్వరలోనే తన వాక్చాతుర్యము చేతను, సుగుణసంపదచేతను విజయమోహనుని యనుచరు లందఱితోడను మిగుల స్నేహముఁ జేసికొనెను. తలబాగుగా నెఱిసినను, నీతఁడు చేయుకార్యముల కన్నిఁటికిని వారందఱు నాశ్చర్య పోవుచుండిరి. ఈతనిని గురించి యెల్లప్పుడును మంచిమాటనే వినుచుండుటచే విజయమోహనుఁడు కూడ నీతనిని మిగుల గౌరవింపుచుండెను.

కాని విజయమోహనుడు చాల జాగరూకతఁ గలవాడు. పరుల నంతసులభముగా నమ్మువాఁడుకాడు. ఈతని సేవకులందఱును గూడ పుటమువైచిన బంగారమువలె పరిశుద్ధమైన స్వామికార్యదీక్ష కలవారు. అవసరమైన యెడలఁ బ్రాణములఁ గూడఁ దృణప్రాయముగా ఇచ్చివైచుటకు సంసిద్ధులు. కోటయ్యతక్క మిగిలిన వారెవరు, విజయమోహనునిచే నంత శీఘ్రముగా నమ్మఁబడలేదు.

కోటయ్య, విలాస భవనమునందలి వింతలన్నిటిఁ గాంచి మిగుల యాశ్చర్యమును బొందెను. విజయమోహనుఁడు, పైకి సామాన్యమైన ధనముగల వర్తకుని వలెనే కన్పట్టునుగాని, విలాసభవనాంతర్భాగమును జూచిన, నాతనిఁ గూర్చి మన యభిప్రాయము మారును.

కోటయ్య, విలాస భవనమునుండి, యోడదరికిఁ జేయబడిన నేలబాటను జూచి చాల చకితుఁడాయెను. అది సాధారణమైన బాటమాత్రమేకాదు. చాలవెడల్పుకలిగి, గచ్చుచేయబడి, రమ్యమైన హర్మ్యమువలెనే యుండెను. ఆబాట కిరుప్రక్క విచిత్రపు సొరంగములు, గదులుకూడ నుండెను. ఇంత స్వల్పకాలములో విజయమోహనుఁ డింత పనిచేయ గలిగెననిన నెవరు నమ్మఁగలరు?

అంతియకాదు. ప్రతిదినమును, ప్రాతఃకాలమునందును, సాయంకాలమందును, విజయమోహనుని సేవకులందఱు, సరి

యైనయుద్ధభటులవలెశిక్షనేర్చుకొనుచుండిరి. వారియొద్దనున్న నాయుధసామగ్రినంతయును జూచి, కోటయ్య చాలయాశ్చర్యపడెను. ఆతఁడు తనకుఁ దీరికయైనపుడెల్ల విలాసభవనమునందలి ప్రతిగదిని పరీక్షించుచుఁ బ్రతిగోడను, నెచ్చటనైన గుప్తద్వారములున్న వేమోయని,నఖశిఖపర్యంతము వెదకుచు, కాలముగడపుచుండెను. విలాసభవనమును జాలభాగ మతఁడు చూచెను. కాని యాభవనమునకు వెనుకతట్టుననున్న మేడ నాతఁడుచూడలేదు. ఆ రెండు భాగములకును మధ్యనొక గోడయడ్డముగనుండెను. దానికొక్క ద్వారము మాత్రమే కలదు. కాని యాద్వారమునొద్ద నిరువురుయమకింకరులవంటిభటులు కాఁపుండిరి. ఆద్వారమునుదాఁటి లోపలి కెవరు నెప్పుడు పోకపోవుటఁ గాంచి కోటయ్య "లోపలనెవరున్నారు"అని యొకని నడిగెను. ఆతడందులకు "లోపల రాణీగారును, దాసీలును నున్నారు. వారు పైకిరారు. పురుషుల ముఖములఁజూడరు" అని ప్రత్యుత్తరమిచ్చెను.

"రాణీగారి పేరేమి?"అని కోటయ్య మరలఁబ్రశ్నించెను. "నీవు రాజుగారికిఁ జాల ప్రియుఁడవు. ఎప్పుడో నీకు వారే చెప్పెదరు. వారేమిచెప్పెదరో, యంతియే కాని, మేము నోరెత్తఁగూడదు. అది రాజుగారి యాజ్ఞ"అని చెప్పి యాతఁడు తన దారినిఁబోయెను. కోటయ్యమాత్రము పిచ్చివానివలె నటునిటుఁ దిరుగఁజొచ్చెను. విజయమోహానుఁ డీతనిని మిగులఁ జన

వృత్తిఁ జూచుచున్న మాటనిజమే! కాని యూతఁడెప్పుడో కాని కోటయ్యకనులఁబడుటలేదు. దారిలో కనఁబడినయపుడు పలు కరించుట తక్క నాతని సంగతి కోటయ్య కేమియుఁ దెలియుట లేదు. కోటయ్యకుఁ క్షేమంబుగనుండ పనికూడలేదు.

ఒకనాఁడిటులనే, పనియేమియును లేక తిరుగుచుండగా నానందమోహనుఁ డీతనిఁ బిలిచెను. రాజుగారు నిన్నొక పర్యాయము పిలుచుచున్నారని చెప్పి యాతనిని వెంటనిడికొని, యానందుఁడు విజయమోహనుని యొద్దకుఁ గొంపోయెను.

అచట సుమారు పాతికమంది దృఢగాత్రులు నల్లని వస్త్రముల ధరించి కూర్చుండియుండిరి. వారి హస్తముల యందు ధవళఖడ్గములు మెఱయుచుండెను. కోటయ్యను జూచి, విజయమోహనుఁడు "కోటయ్యా! నీ వీ రాత్రి నీచాకచక్యమును బాహుబలమును జూపవలయును. ఈ పట్టణముననే మాకొక విరోధియున్నాడు. వాడుబహుదుర్మార్గుఁడు! చోరుఁడు హంత కుఁడు. మామీఁదనాతఁడు కత్తిగట్ట ప్రయత్నించుచున్నాడు. నీవు వీరందఱితోడను కలిసి యాతని నీరాత్రి బంధించి తీసికొని రావలయును. సాధ్యమైనంతవఱకు బ్రాణములతోఁ దీసికొనిరా వలయును. లేనియెడల......

కోట—శవమును దీసికొని రావలయును.

విజయ—ఆ! నీకు మనుష్యులను జంపుటయనినభయమా?

కోట—భయమా! హాహాహా! భయమనిన నేమియో నేనె ఱుఁగను. కాని నేనిది వఱకెన్నఁడును మనుష్యులఁ జంపలేదు.

విజ—సరే! ఇఁకఁ బ్రయత్నము చేయుము. మనవిరోధులను మనము చంపినఁగాని, మనకు నిశ్చింత యుండదు. ఈరాత్రి మఱియొక గంటకు మీఱందఱును బయల్వెడలవలయును. సిద్ధముగా నుండుఁడు.

ఆరాత్రి నిశాచరులకు చాల ననుకూలముగానే యుండెను. మంత్రి హత్యచేయఁబడిన యంతటి కాళరాత్రి గాకపోయినను, యమావాస్యచీఁకటి పెనుగాలి మబ్బులు, అంతయు ననుకూలముగ నే యుండెను. రాత్రి రెండుయామముల వేళ నీదండు బయల్వెడలెను. కోటయ్యకూడ, నల్లని వస్త్రముల ధరించి, ఖడ్గపాణియయ్యెను. అతఁడును నీవేషమున నేమియు నానవాలు పట్టుటకు వీలులేని గజదొంగవలెనే యుండెను.

వారటులఁ జాలదూరముపోయి రక్షకభటాధికారియగు రామదాసు నింటిముందునాఁగిరి. ఈ యిల్లే! యని యానందమోహనుఁడు వ్రేలితోఁ జూపెను. కాని లోపలనొక దీపమైనను లేదు. అలుకుడు లేదు. మనుష్యులున్న జాడయే లేదు. తలుపు తాళము వేయబడి యుండెను.

"మనకంటెను గజదొంగ! ఈరామదాసు లోపలనున్నా డని నాకుఁ దెలియును. గోడదూఁకి లోన ప్రవేశింతము" అని యానందమోహనుఁ డనునరికి నందఱును గోడ నెక్కిరి. వయోవృద్ధుఁడైనను కోటయ్య వీరందఱికంటెను ముందేదూ కెను. అందఱు నింటిలోఁ బ్రవేశించిరి. అన్నిభాగముల వెద కిరి. కాని రామదాసెటను లేడు! అందుచే వారందరు నాగ్రహ పూరితులై, రిక్తహస్తములతోఁ బోవుట, మగతనమునకు లోపమని యెంచి, విలువగల వస్తువులఁగొన్నిఁటి నెవరికి దొరకి నవి వారు చేతఁ బట్టిరి. కోటయ్యమాత్ర మొక పెట్టెనుతీసి, దానిలో నుండునొక మూటను తీసికొనెను. "ఏమికోటయ్యా! నీవేమో నీస్వంతగృహమునందుఁ దిరిగినటే సంచరించు చుం టివి. నీకేమైన దొరకినదా?" అని యొకఁడు ప్రశ్నించెను. "ఓఁ! దొరకినది. గల గల లాడుచున్నది" అని కోటయ్య తన్నడి గినవానికిఁ బ్రత్యుత్తర మిచ్చెను.

కొంత సేపటికి వారందఱును మరల తిరుగుముఖములఁ బెట్టి మరల విలాసభవనమును జేరిరి. అప్పటి వఱకును మేల్కాంచియేయుండిన విజయమోహనుఁడు వీరిమాటలు విని చాల నిరుత్సాహుఁడయ్యెను. "మనము తలఁచిన కార్యము లలో నపజయము పొందుట యిప్పుడే! రామదాసు సాయంకా లమచట నుండెనని తెలిసినదే? ఇంతలో నేమైపోయినాడో! పోనిండు. మరల నింకొకమారు" అని విజయమోహనుఁ డనెను.

కోటయ్య తీసిన మూటయందు నేమియు విలువగల వస్తువులు లేవు. ఒక యంగరకా, తలగుడ్డ, చిన్న వాడియైన కత్తి, మాత్ర మందుండెను. ఆవస్తువులఁజూచి యాతఁ డాశ్చర్యమును బొందలేదు. సరికదా, మిగుల విలువగల ధనసంగ్రహమును దాఁచినటుల నాతఁడు దానిని జాగ్రతపెట్టెను.

## ముప్పదినాల్గవ ప్రకరణము

కోటయ్య విలాసభవనముఁ బ్రవేశించి నెలదినములు కావచ్చుచుండెను. విజయమోహనుఁడు నాతని యనుచరులు క్రమముగా నీతనితోఁ బూర్తిగా కలిసిరి. ఈతనియొద్ద రహస్యము లేమియు వారు దాఁచుటలేదు.

విజయమోహనుని, మిగిలిన వారందఱు రాజని పిలుచుటతక్క నాతనియొద్ద రాజచిహ్నము లేమియుఁ గోటయ్యకు కానవచ్చుటలేదు. రూపమున మన్మథునిఁ బోలియుండినను, గుణములయందు మాత్రము రక్కసునిఁ బోలియుండిన యావర్తకపుంగవునిఁ గని కోటయ్య మిగుల నాశ్చర్యపడుచుండెను. విజయమోహనుడు తన సేవకులను శిక్షించువిధము కథలలోని యమలోకఁపుశిక్షలను జ్ఞప్తికిఁ దెచ్చుచుండెను. సేవకుఁ డెవ్వరైన తనపనిని సరిగా నిర్వర్తింపనియెడల నేదో

ఘాతుకమృగమును మోదినటులఁ గొరడాలతో మోదుట జూచి కోటయ్య సహింపలేకుండెను. ఆతని నడవడియెంత నస హ్యము కలిగించుచున్నను, బ్రాణదానముచేయుట చేతనో, మఱి యేకారణముననో కాని, కోటయ్యయాతని విడచిపోవుటలేదు.

ఆయుద్యానవనములోనున్న తటాకప్రాంతమున విజయ మోహనుఁడు పచారుచేయుచు, నొకదినమున నటుఁబోవుచు న్నకోటయ్యను పిలిచి "రమ్ము! నేఁడు నీకొక చిత్రమును జూపెదను. మేమొక విచిత్రమృగమును బంధించితిమి. అది పైకి మనుష్యరూపముతో నుండును. కాని యదిమనుష్యునిఁ బోలిన యొక మృగము." అనికోటయ్యను దనతోఁ దీసికొని పోయెను. కోటయ్య కూడ నామృగమును జూచుటకు మిగు లఁ గుతూహలము గలవానివలె, నుత్సాహముతో నాతని వెంబడించెను.

"మహారాజా! ఆనాఁడు నేముపట్టితెచ్చుటకు బోయి తిమే! వానిపే రెవరు? రామరాజా? ఆతఁడు మరల పగప డెనా?" అని కోటయ్య ప్రశ్నింప, విజయమోహనుఁడు నవ్వి "రామదాసా! వాఁడు చాలనసాధ్యుడు! ప్రస్తుత మీపట్టణ మున లేడు. ఎచ్చట నున్నను వాఁడు మనకుఁ బ్రబలశత్రువే! కాని విజయమోహనునికి జోడుకాడు! కుడిచి కూర్చుండక నాతోఁ గలుగఁజేసికొనినాడు. వానికి పోఁగాలము సమీపించి

నది. త్వరలో దొరికినయెడల వానిచే నెంతయాటనైన నాడిం తును" అని ప్రత్యుత్తర మిచ్చెను.

వారిటుల మాటలు చెప్పుకొనుచుఁ చిన్నగోపురము వలెనున్న యొకగదిఁ బ్రవేసించిరి. అది భూమిలోఁ జేయబడిన దానికి మార్గమని కోటయ్యకింతకుముందే తెలియును. ఆగ దిలో నున్నద్వారము నొకదానిని విజయమోహనుఁడు తెఱ చెను. ఆద్వారమునుండి క్రిందికి మెట్లు కలవు. ఆమెట్లదారినిఁ బడి వారు కొంతదూర మరగిరి.

ఒకచోట విజయమోహనుఁడాగి, "ఇటుచూడుము. దీని నదిమినయెడలపైనున్నతటాకములోనుండినీరుప్రవహించి,యఁది యీబాటనంతటిని ముంచివేయును. రామదాసు దొరికినయె డలనిందులో ముంచి భాగవత మాడింతును"అనెను. తరువాత వారు మరలఁ గొంతదూరము నడచిరి. మరల నొకచోట విజ యమోహనుఁడాఁగి, యాగోడలోనతిచిత్రముగా నమర్చబడిన తలుపునొకదానిఁదెఱచెను. కోటయ్య దానినంతటిని మిగుల జాగరూకతతోఁ బరిశీలించుచుండెను. ఆద్వారములో నుండి వారు లోపలికిఁ బోయిరి. కొంతదూరమున మరియొకద్వార మినుఁప యూచలతో బంధింపఁబడియుండెను.

"నేను చెప్పిన మృగ మీబోనులోనే యున్నది. భయ పడకు! అదికరవదులే! నాచేతిలాంతరు వెలిగించెదను, చూడుము

అని విజయమోహనుఁడు దీపమును వెలిగించెను. కోటయ్య చూచెను. తనయెదుట నేమృగమును లేదు! నవవయస్కుఁడగు సుందరాకారుఁ డొకఁడు మిగుల జాలిఁ గలిగించు రూపముతో నచ్చటఁ బడియుండెను. ఆతని కోమలదేహము సౌఖ్యముచెడి, మలిన భూయిష్టమై యుండెను. భూమిరజంబు నాతని శరీరమంతయు నిండియుండ నాబాలుఁడు, వేటగానిచే మృతినొందింపఁబడిన కపోతముమాడ్కి, దిక్కులేక నేలఁ బడియుండెను. ఆతని సుందరముఖము, వాఁడిన గులాబీ పూవువలె వికాసము దక్కియుండెను. ఆవిగ్రహమును జూచి, కోటయ్య నిజముగా నిశ్చేష్టుఁడాయెను. ఆతనినోరు తడియార మాటయే రాలేదు. అప్రయత్నముగాఁ గనులవెంట నీరు ప్రవహింప, విజయమోహనుఁడు చూడకుండ నాకన్నీటిని దుడిచికొని "మృగమెచట! ఎవరోబాలుఁడు" అని గద్గద స్వరముతో కోటయ్య యనెను. "మృగముకాదా! చూడు" అని విజయమోహనుఁడు లోనికిఁబోయి, చేష్టలుడిఁగి నేలఁబడి యున్న యాబాలకునిఁ దనచేతిబెత్తముతో గట్టిగా మోదెను. ఆబాలకుఁడును, చనిపోవుటకు సిద్ధముగానున్నవానివలె నతి కష్టముతో "మామా!" యని గట్టిగా నఱచెను.

"మామకాడు—నీయముఁడు" అని విజయమోహనుఁడు మరల నాబాలకుని రెండుతాపులు తన్నెను.

కోటయ్య యసహాయుఁడై నిలువఁబడెను. ఆతని హృదయము దుఃఖవారిపూరితమై, నది కడువడిగాఁ బ్రవహింప విరిగి క్రిందబడు గట్టువలె నుండెను. ఆతని ముఖము పూర్తిగాఁ గళ తప్పెను. కన్నులెఱ్ఱగా జేవురించెను. శరీరము పెనుగాలిలో నల్లలాడు నాకువలె వణఁకుచుండెను. గుండెలత్యంత తీవ్రముతోఁ గొట్టుకొనుచు బ్రద్దలైపోవునటుల నుండెను.

"కోటయ్యా! చూచితివా మావిచిత్రమృగమును దీనికి మాటలుకూడ వచ్చును. మాయానందమోహనుఁడు దీనిని పెంచుచున్నాడు. కాని వాని కీరోజున జ్వరము తగిలినది. నాలుగుదినములవఱకును నీవే దీనిని పెంచుము. దీని కాహారము మీదెబ్బలే! చనిపోకుండ రోజునకింత రొట్టెమాత్రము దీనికిఁ బడవేయవలెను. ఇప్పుడు నేను రొట్టెను వైచితిని. మరల రేపీపాటివేళ నీవు రమ్ము. నీకప్పుడు దీనితాళము నిచ్చెదను. మరచిపోకుసుమా! నిష్కారణముగా మృతినొందును. దీని నింకను కొంతకాలము పెంచవలయును. మీరు మొన్న బంధించుటకుఁ బోతిరే! ఆపెద్దమృగము, రామదాసు! వీనిని రెండింటినిఁ గలిపి స్వర్గయాత్రఁ జేయింపవలయును." అని దయావిహీనుఁడై విజయమోహనుఁడు పల్కెను. తరువాత వారిరువురును బయట కరుదెంచిరి. కోటయ్యమాత్ర మాస్థలమును విడువలేక విడువలేక వెడలెను.

మరునాటిసాయంకాల మెప్పుడువచ్చునా, యని కోటయ్య తదేకదీక్షతోఁ గనిపెట్టుకొని యుండెను. ఆనాటిరాత్రి యతనికి నిదురయే లేదు కలఁత నిదురపట్టినను నది భయంకర స్వప్నములతో నిండి యాతనిని మిగుల బాధించెను. ఆబాలుని విజయమోహనుఁడు రంపముతోఁ గోయించుచున్నటులను, నతఁడు గోలపెట్టి యేడ్చుచున్నటులను; రక్తము ధారలై ప్రవహించి, తన్ను తడిపినటులను కలగాంచి, కోటయ్య భయముతోఁ లేచెను. శరీరమంతయు స్వేదమయమై యుండెను. ఈ పాడుకలలకు భయపడి, యాతఁడు మరల నిదురపోవనేలేదు. తెల్లవారినను, బయటకురాక, కోటయ్య సాయంకాలాగమనము కొఱకు నిరీక్షించుచుఁ దన గదియందే పరుండియుండెను.

ఇంకను సాయంకాలము కానిదే, కోటయ్య విజయమోహనుఁగాంచుటకు బయల్వెడలెను. "ఇంతత్వరగా వచ్చితివేల? మఱికొంచెము సేపుండి రమ్ము ఇంతలోననే వాఁడు మృతినొందఁడు." అని విజయమోహనుఁ డాతని మరల వెనుకకుఁ బంపెను. కోటయ్యయు నాప్రక్కనే నిలువఁబడి, కొంత సేపటికి మరల విజయమోహనుని యెదుటఁ బ్రత్యక్షమాయెను. ఒకరొట్టెమూటను, తాళము నొకదానినిచ్చి, విజయమోహనుఁడు "అన్నిటికీ నిదే తాళము జాగ్రత్త" అనిచెప్పి, కోటయ్యను పంపెను. విచారము నాతురతయు, నూతనశక్తి

యొసఁగి, యాతనిఁ బట్టిత్రోయ, కోటయ్యయుఁ గడురయంబున నాబాలకుఁ డున్నగది ముందఱకుఁబోయి తలుపుదెఱచెను.

ఆబాలకుఁ డాక్రిందటి దినమునవలె మూర్ఛిల్లి పడి యుండక పోయినను, నీరసముచేఁ జాల బలహీనుఁడై కనులు తెఱచికొనియే నేలమీద దొరలుచుండెను. తలపుఁదీసిన చప్పుడును, తనగదిలో పాదధ్వనియు నాతని వీనులఁబడ నాబాలకుఁడులేఁచి కనుల నావైపుద్రిప్పి, తానిదివఱకు చూడని యా నూతన పురుషుఁజూచెను. కోటయ్య ముఖవైఖరి దయా పరిపూర్ణమై యున్నటులనే కన్పట్టుచుండెను. కాని విజయమోహనుని నిజచరిత్రఁ గాంచినవెనుక నీతనికి, రూపమునుబట్టి మనస్సును గ్రహించుటయందు నమ్మకము పోయెను. దినము వెనుక దినము నలవాటుఁ బడియుండుటచే నాతఁడు మరల దెబ్బలకై సిద్ధపడుచుండెను.

కోటయ్యకు లోపల మాటలాడవలయుననియే యుండెను. కాని యానిర్భాగ్యునితోడ నేమి మాటాడవలయునో యెటుల మొదలుపెట్టవలయునో యాతని కేమియుఁ దోఁచుట లేదు. చివర కాబాలకుండె, "అయ్యా! ఆఁకలి యగుచున్నది. తినుట కేమైనఁదెచ్చిన దయయుంచి పెట్టెదరా?" అని దీన స్వరముతో నడిగెను.

అదే విజయమోహనుఁడు కాని, యానందమోహనుఁడు కాని మైనయెడల నీత డిటుల నడుగఁజాలక పోయియుండును. వారేమయిన "ఆఁకలి యగుచున్నదా? అటులైన నివిగో వీనినిఁ దీసికొనుము" అని వీపుపై నాలుగు తన్నెదరు. కాని కోటయ్య కొత్తవాఁడగుటచేతను, క్షుద్బాధ మిగుల బీడించుటచేతను,నాతఁడటు ధైర్యమువహించి యడిగెను. కోటయ్యాయను తడవుసేయక తనయొద్దనున్న రొట్టె నాతని కందిచ్చెను. ఆబాలకుఁడును, దానిని రెండుముక్కలక్రింద విరచి తిని యింకను నేమైన నున్నదేమోయని కోటయ్యవైపుఁ జూచెను. ఆచూపులలో జాలి ప్రవహించుచుండెను.

ఒకవనమునం దొక కురంగమిథునమునుగాంచి, వేటకాఁడందులో నొకదానినిఁ దెగవ్రేయ నది చనిపోవుచుఁ దన ప్రియునివైపు మిగుల దీనత్వముతోఁ జూచినటుల,నీబాలకుఁడు కోటయ్యహస్తములవైపు చూచెను.

ఆబాలుని 'నీరుదేఱు తెలిగన్నుల' చూపులకుఁ గోటయ్యమనస్సు కరఁగిపోయెను. ఇక నాగఁజాలక, నాతఁడు "శశిభూషణా!" యని యానిర్భాగ్యుని గట్టిగాఁ గౌఁగలించుకొనెను. శశిభూషణా యనునపుడు కోటయ్య కంఠస్వరము పూర్తిగా మారిపోయెను. తాను బంధింపఁ బడిననాటనుండియుఁ దనచే మరచిపోఁబడిన తననామము మరల వీనులఁబడ

శశిభూషణుని కమృతస్నాన మాయెను. విచారసముద్రమునఁ బడి నిరాశతోఁ గొట్టుకొని పోవుచున్న యాతనికొక యండ దొరకిన ట్లాయెను.

"నా పేరు మీ కెటులఁ దెలిసినది?" అని శశిభూషణుఁడు కోటయ్యను ప్రశ్నించెను. అప్పుడు కోటయ్య యి ట్లనెను. "శశిభూషణా! నన్ను నీవానవాలుపట్టలేదా? నిన్న నీయెదుటఁ గడవలకొలది కన్నీరుకార్చుచు, నేను నిలువఁబడలేదా? శశిభూషణుని మనస్సంధకారమయమై యుండెను. కోటయ్య మాటలను విని యాతఁడు భయముతో వెనుకకు జరిగి "నీవు మరల విజయమోహనుఁడవేనా ? యనెను "విజయమోహనునితో నిన్న మఱియొకరురాలేదా?" అని కోటయ్య ప్రశ్నించెను. నేను చూడలేదని యాబాలుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అంతఁ గోటయ్య "శశిభూషణా! నే నంతపూర్తిగా మారిపోతినా? అందులకే నీతుచ్ఛులెవరు నన్నానవాలు పట్టలేకపోయిరి. నీ వింటికి రాకపోయినప్పటినుండియు, నిజముగా నాకు నిద్రాహారములు లేవు. ఒక గొప్పతంత్రమువలన నేనిచట నీవిధమునఁ జేరితిని. ఈశ్వరకృపవలన నిన్ను నేఁ గనుగొంటిని. ఇఁక మనమిద్దరము నిటనుండి దాఁటిపోవుట, వీరినందరిని వేటాడి పట్టుకొనుట మిగిలియున్నది." అని నమ్రతతో ననియెను.

కంఠధ్వని రామదాసుదే! కాని యారూపమో! ఈ నెఱసినతల, కారుమబ్బువంటి శరీరచ్ఛాయ! ఇదంతయునేమి? వినిన

వారికే సులభముగా నమ్మ వీలులేకపోయినప్పుడు, శశిభూషణుఁ డట్టిస్థితిలోఁ దనమామయే యటుల వచ్చెననుసంగతి, కలగాక, నిజమని తలఁపఁగలఁడా! శశిభూషణున కింకను గల లోనే యున్నటులుండెను.

“నిజముగా......మీరు........! మరల నాకు మిమ్ముఁ జూచు భాగ్యమా! ఆహా! ఏమిది! ధ్వనితక్క నితర యానవాళ్లేమియు నాకుఁ గానవచ్చుట లేదు. మీ రీరూపము నెటులఁ దాల్చితిరి? ఈసింహముల గుహ నెటులఁ బ్రవేశించిరి? నేనిచట నున్నటుల మీ కెటులఁ దెలిసినది?” అని యనేక ప్రశ్నల దడదడ వైచెను. “వత్సా! నీ ప్రశ్నల కన్నిటికిని సమాధానము చెప్పుటకు నాకు గాలము చాలదు. చాల తడవైనయెడల విజయమోహనుఁ డనుమానించును. అయినను త్వరలో నంతయుఁ దెల్పెదను వినుము. నే నీయుద్యోగమునఁ బ్రవేశింపక పూర్వము, నాకథయంతయుఁ జాల చిత్రమైనది. దాని నంతయు నిప్పుడు చెప్పుటకు వలనుపడదు. అది చాల పెద్దకథ! నాపూర్వజీవితములో నేనొక సిద్ధునితో స్నేహముచేసి,యపూర్వములగు విచిత్రవస్తువుల ననేకముల సేకరింపఁగల్గితిని. ఒకదాని సాహాయ్యమున నాజుట్టంతయు నిటుల నెరసి జడలుకట్టుకొని పోవునటులఁ జేయగల్గితిని. మరియొకదానివలన నా నల్లజుట్టు నాకు రాఁగలదు. ఈరంగునుగూడ నిట్టే మార్చుకొంటిని. మరల నారంగుకూడ నాకువచ్చును.—ఒకదినమున నీవగ

పడకపోయిన తర్వాత, నేను విజయమోహానుని జూచి, యాసన్యాసియే మరల మమ్మిట్టుల మోసముచేసినాడని తెలుప నాతఁడు వెలవెలఁబోయి, వెఱ్ఱిముఖము వైచెను. అందువల నను, యింతకుముందే యాతనిమీఁదఁ గొంచ మనుమాన ముండుటచేతను, ఆసన్యాసి యాతనికి సంబంధించినవాఁ డని యు..." అని రామదాసింకను చెప్పుచుండగాశశిభూషణుఁడు,

"ఆసన్యాసి యెవ్వరో తెలియదా, మీకు? విజయ మోహానుఁడే! హైమవతి యిప్పుడిచ్చటనే యున్నది!" అని గ్రుక్కదిప్పకుండఁ బలికెను. రామదాసామాట వినునప్పటికిఁ జేష్ట లుడిఁగి, విగ్రహమువలె నిలువఁబడిపోయెను. ఆతని కనేకసంగతులు జ్ఞప్తికి వచ్చుచుండెను. కొంతసేపు వెఱ్ఱివాని వలె, వెఱ్ఱిచూపుఁజూచుచు నిలువబడి యాతఁడు చివర కిట్టు లనెను.

"ఎంతమాయజేసినాడు! ఎంతదుర్మార్గుఁడు ఆ...హా!" "మొదట నదియంతయుఁ జూచినపుడు నాకును జాల వింతగనే యుండెను. మీ రిచటికీరూపమున వచ్చుట, యెంత వింతగ నున్నదో, విజయమోహానునిచరిత్ర యంతకంటె వేయిరెట్లా శ్చర్యకరముగ నున్నది. హైమవతియెదుటఁ దాను మరల నాసన్యాసిరూపమునేధరించి"ఏమిచూచితివిరా?ఏమని ప్రేలితివి? ఇపుడేమిచేయఁగలవు?" అని హైమవతిని ముద్దిడుకొని

నన్నొక కఱ్ఱతో స్మృతి తప్పిపోవుటకును మోదినాడు. మన కనులయెదుటనే తిరుగుచు, మన కత్యంత స్నేహితునివలె నటింపుచుఁ బల్వేలలో జరిగిన హత్యల కమిత విచారమునొంది, చివర కిట్లుమారినాడు. వీఁ డింకను నెన్ని దారుణములఁ జేసెనో!" అని శశిభూషణుఁడు పల్కెను.

"సరిలే! మేల్కాంచితిమి. ఇక భయములేదు. జయరాముఁడను పేరిడుకొని, యెంత-యెంత భయంకరవ్యాపారముఁగావించినాడు ! వినుము. నాకుఁ జాల ప్రొద్దుపోవుచున్నది. ఇది యాశ్చర్యపడుటకు సమయము కాదు. గుండెను బ్రద్దలచేయునట్టి విషయములున్నను ధైర్యముతో నెదుర్కొనవలయును—నేనావిధమున నీతని ననుమానించి, యీ వేసము వైచికొని, కౌశికలోఁబడి కొట్టుకొని పోవుచున్నటుల నటించితిని. వీరు నన్నుఁ దీసి, యిచటికిఁ దీసికొనివచ్చి వారిగుంపులోఁ జేర్చుకొనిరి. వీరందరు నన్ను పూర్తిగా నమ్మినారు. నే నింకను, నాల్గుదినములవరకు నీకు రొట్టెను తెచ్చియిచ్చెదను. మరల మాటలాడుకొందము. ధైర్యముతో నుండుము. తినుటకు రేపు మరేమయినఁ దెచ్చెదను లెమ్ము. నేనిఁక పోవుచుంటిని" అని చెప్పి, యెప్పటివలె ద్వారమును బంధించి రామదాసు బయట కరుదెంచెను.

## ముప్పది రెండవ ప్రకరణము

చ. మదనుఁడిగాఁ దలంతు రిల మానిను లెల్లను, సత్కవీశ్వరుల్
పదపడి కర్ణుఁ డీతఁడని ప్రస్తుతి సేతురు యెల్ల దిక్కులన్
మదవద రాతివర్గముల మానుప గవ్వడియండ్రు భూప్రజల్
మది నరనాథుఁడందురు సమస్తము ద్రవ్యముఖంబుచూచినన్

—ధనాభిరామము.

ధనముగలవాఁడగుటచే విజయమోహనుఁడు తలఁచిన కార్యములనెల్ల నవలీలగఁ జేయుచుండెను. ఆ వేషగాంభీర్యము చేతను, భాషావిశేషముచేతను, సువర్ణదానములచేతను, పల్వాల పురపౌరులీవిజయమోహనుని దేవతాంశాసంభూతునిగాఁ దలఁచుచుండిరి. ఈతఁడు, నిజముగా, మహారాణి యగు శ్యామసుందరీదేవితో సమాన గౌరవ మందుచుండెను. అట్టివాఁడు చోరాగ్రేసరుఁడనియు, దారుణహంతకుఁ డనియు, వినినను, ప్రజలు నమ్ముట సులభసాధ్యముకాదు. ప్రబల నిదర్శనములు ప్రదర్శింపఁబడినఁ గాని వారు నమ్మరు.

విజయమోహనుని కొక్కపనికాదు. ఒక్కయాలోచన కాదు. రామదాసును నిర్మూలించు ప్రయత్నము ద్వితీయపక్షము. ఆతఁడు పల్వాలరాజ్యముపైననే కన్నువైచెను.

దీనికంతకును హైమవతి చాలవఱకు కారణము. పల్వోలరాజ్యము నెంతసులభముగాఁ బట్టవచ్చునో యారాజ్య మిపు డెట్లనాథమై, శ్యామసుందరివలెనే దిక్కులేకయున్నదో; విజయమోహనుని కామె సతతముఁ జూపుచుండెను. హైమవతి తనతండ్రితోను, సోదరునితోను గూడ నుత్తర ప్రత్యుత్తరములు మానెను. ఎంత యాశాపరుఁడైనను జయచంద్రుఁడు మానపరుఁడు. తనకొమరిత, మహాగౌరవనీయుఁడగు, రత్నసింహుని రాణియగు హైమవతి, హంతకుని పొందుఁగూడి, నీచజీవనమట్లు గడపుట కాతఁడు సమ్మతింపఁడు. ఆభయముననే హైమవతి, తానెక్కడ నున్నదియు నాతనికిఁ దెలియనీయలేదు. ఇచటిపనులన్నియు విజయమోహనుని సాహాయ్యమునఁ బూర్తిచేసి, రామచంద్రనగరము స్వయముగా బోయి, యంతయు సిద్ధము చేయుదమని యామె తలఁచెను. హైమవతి రూపవయోవిశేషములకుఁ బూర్తిగా లోఁబడి విజయమోహనుఁ డామె చెప్పినదెల్ల జేయుచుండెను.

మిగుల ధనికుఁడగు నాతఁ డేదితలఁచిన జరుగదు! కాని పల్వోల రాజ్యాంగవిధానమున నీతఁడు చేయుపనులేమియును బట్టీయకుండెను. ఆకాలమునఁ బల్వోలరాజ్యములోఁ జాలమంది మిగుల నుత్తమజీవితములు కలవారై, రాజ్యక్షేమముకొఱకుఁ బ్రాణములఁ దృణప్రాయముగ నెంచుకొనువారై యుండిరి. అందువలన, విజయమోహనునికిఁ బెద్దపెద్ద రాజ్యా

తంత్రజ్ఞులను ధనమిచ్చిలోబఱచికొనుటకు వీలుచిక్కకుండెను. ముఖ్యముగా నీతనికి సైనికోద్యోగులతోఁ బరిచయ మావశ్యకమైయుండెను.

ఆయాలోచనతోడనే, వెనుక రామచంద్రుని, హైమవతీదేవి, తనసౌందర్యముచే భ్రమింపఁజేసి, మోహముగ్ధునిఁ గావించి, తనయభీష్టము సులభముగా నెఱవేర్పఁ దలఁచికొనెను. కాని యాతఁడు, దురదృష్టవశమున, రామదాసుచేతఁ జిక్కి కారాగృహప్రవేశము చేసెను. అంతియకాక చావు బ్రదుకులమధ్యఁ బడికొట్టుకొనుచుండెను. ఆతఁడటుల నధికారమునుండి తొలగింపబడుట, హైమవతి కొకగొప్పనష్టము సంభవించెను. మఱియొకరి నెవరినైన జాగ్రతచేయుమని యామె సతతము తన ప్రియునిఁ బీడించుచుండెను. విజయమోహనుఁడును, సామాన్యసైనికుని మొదలువెట్టి ముఖ్యాధికారి వఱకును గదల్చిచూచెను. అటులవెదుకగాఁ జివరకు భాస్కరుఁడను చిన్నసైనికోద్యోగి యొకఁడు విజయమోహనునికి దొరకెను.

భాస్కరుఁ డేబది నీతగట్టులకాగినవాఁడైనను నాశాపిశాచి మాతనిని వదలలేదు. డబ్బునిన నాతనికిఁ బ్రాణమే. లంచగొండి యగు నాతఁడు తనయున్నతోద్యోగులచే ననేకపర్యాయములు శిక్షింపఁబడి, యుద్యోగమునం దేమియు నెదు

గును బాగుగునులేక తనయిరువదవ వత్సరమున నేయుద్యోగములోఁ బ్రవేశించెనో, యిప్పుడు నట్టులేయుండెను. ఆతనికి వచ్చువేతనము తక్కువ, సంసారమెక్కువయగుటచే నాతఁడు ధనార్జనకై పలుపాట్లుపడుచుండెను. ఈతనితో విజయమోహనుఁడు స్నేహముచేసి యాతని దారిద్ర్యమును జాలవఱకుఁ బోఁగొట్టెను. ధనమువచ్చినకొలఁదియు నాశహెచ్చుచుండుట సహజమేకదా! భాస్కరుఁడు ధనము సంపాదించుచు, నింకను సంపాదింపవలెనను కోరికతో, విజయమోహనుఁ డేది చెప్పిన, దానినిఁ జేయుచుండెను. ఉద్యోగము చిన్నదైనను ముప్పది వత్సరము లాశాఖలోనే యుండుటచే, సైనికవిషయములగు గుట్టుమట్టులన్నియు భాస్కరునకుఁ బాగుగాఁ దెలియును. హైమవతియు, భాస్కరునిమూలముననైనను కొంత యుపకారమును బొందవచ్చునని సంతసించెను. కాని యిట్టిరాజద్రోహు లామె కెఁక నెవరును నగపడలేదు.

## ముప్పదియారవ ప్రకరణము

కోటయ్యవేషముతో నున్న రామదా సట్లు శశిభూష ణుని వీడ్కొని, మిగుల కష్టముతో మరల విజయమోహను నెదుర్కొనఁ బోయెను. శశిభూషణుఁ డట్లుఁ గ్రూరముగా

బాధించుటచే విజయమోహనుఁడు మిగుల దుర్మార్గుఁడని యాతఁ డిదివరకుఁ దలఁచెను. శశిభూషణు నేకారణమున బంధించెనో, యాకారణముననే రామదాసును కూడ బంధింప యత్నించె నని యాతఁ డిదివఱకు తలఁచెను. సన్న్యాసికిని విజయమోహనునికిని కొంత సంబంధము మాత్ర ముండునని రామదాసు తలఁచెను.

కాని, శశిభూషణుఁడు విజయమోహనుఁ డీ సన్న్యాసి యని చెప్పినపు డాతనికిఁ గల్గిన కలవర మింతింత యని చెప్ప నలవికాదు. తన కనులయెదుట నిలచి మాటలాడుచు, తన క్రిందనే గోయిఁ ద్రవ్వినటుల, తనకన్నులఁ గప్పి విజయమోహనుఁ డెంతమోసముఁ గావించెను! నిజముగా దురదృష్ట వశమున నాతని కర్మము చాలక, విజయమోహనుని నిజరూపము బయల్పడెను కాని, లేనియెడల నాతఁ డింతవాఁడని యెవ్వరు తలఁపఁగలరు? ఎంత నెమ్మది! ఎంతమార్దవము! ఎంతభయము! ఎంతభక్తి! ఎంతజాలి! చివర కెంతయాలోచన! ఆశి దుర్మార్గుఁడా!!

పల్లెలపట్టణమున హత్యలు జరిగి చాల దినము లైపోయెను. హేమచంద్రుని హత్యమాట కథయై పోయెను. అదేదో మాయక్రింద మారిపోయెను. ఏలనన, జనిపోయిన జయరాముఁడు మరలఁ బ్రాణములతో బ్రదికి వచ్చి హత్య

చేయుట మాయ కాదా! వెంకటప్పయ్యను హత్య చేసిన వాఁడు పట్టువడెను. రాజసభలో నాతని నేరము ఋజువైనది. రామచంద్రుఁడు నేఁడో రేపో చనిపోవుటకు సిద్ధముగా నున్నాఁడు. మరల నిదియేమి? అంతయు నసత్యము!! రామ చంద్రుఁడు చంపుట యసత్యము!! తాను జంపి, తాను మోహించిన హైమవతి కుపపతియగు రామచంద్రునిమీఁది ద్వేషముచే విజయమోహనుఁ డతి చాకచక్యముగా నీ నేరమును సైన్యాధికారి నెత్తిపై మోపెను. ఎంతవింత!

కాని యిట్లుల నాశ్చర్యపడుచుఁ గూర్చుండిన లాభము లేదు. నెమ్మదిగా విజయమోహనుని యొద్దకుఁ బోయి తాళముచెవి నాతని కీయవలయును. ఆపని చాల దుర్భరమైనదిగా రామదాసున కగపడెను. అటుల చేయక తప్పదు. ఇప్పుడే "నేను కోటయ్యనుగాను. రామదాసును నీవే యీ సన్యాసివి. కారాగృహమునకు రమ్ము" అని 'గందరగోళము' చేసినయెడల, శశిభూషణుఁ డొకప్రక్కను, రామదాసొక ప్రక్కను, కళేబరమాత్రులై పడిపోవుదురు. ఎటులనో రామదాసు విజయమోహనునియెదుటఁ బడెను.

"కోటయ్యా! ఇంత యాలస్యము చేసితివేల?" అని విజయమోహనుఁడు ప్రశ్నించెను. కోటయ్య యను నామోచ్చారణ వినిన వెంటనే రామదాసునకుఁ దెలివి వచ్చెను.

తాను సింహమునెదుట నున్న మాట నిజమే కాని, తాను కూడ మఱియొక సింహరూపముఁ దాల్చితినని గ్రహించి రామదాసు "బాబూ! ఆకుఱ్ఱవాఁడు మూర్ఛపోయి, యెంత తన్నినను లేవలేదు. నిజముగాఁ జనిపోయెనేమో యనుకొంటిని. కాని శరీరము వేఁడిగనే యుండుటచే నింకను నంతవఱకును రాలేదని గ్రహించి, క్రిందికి మీఁదికి దొర్లించి, చివరకు రెండుసారు లెత్తి క్రిందఁ బడవైచితిని. అప్పుడు" అనుచుండ విజయమోహనుఁడు.

"అంతే! చాలమంచిపనిఁ జేసితివి. ఆనందమోహనునికిఁ దగినవాడవు నీవే! అందులకే యీపనిని నీకప్పగించితిని. ఆకుఱ్ఱవాఁడు, నిరంతరము చావుబ్రదుకులమధ్య నుండునటుల జూడుము. మరల రేపువచ్చి నీవే యీతాళముచెవిని, రొట్టెను తీసికొనిపొమ్ము. ఇఁక పొమ్ము" అని చెప్పి విజయమోహనుఁ డాతనిఁ బంపెను.......................................

.................................................

మరల మరునాటి సాయంకాలమున, సరిగా వేళ కరుదెంచి, కోటయ్య మనముకూడ విజయమోహనునితోఁ బాటు, రామదాసును మఱికొంతకాలమువరకును కోటయ్య యనియే- పిలుతము)—విజయమోహనుని యొద్దనుండి తాళమును, రొట్టెను తీసికొని, తానుఁగూడ మఱికొంతరొట్టెను చేర్చి, శశిభూషణుని చెంతకు వచ్చెను.

మరల తనమామ యెపుడు వచ్చునాయని, శశిభూష ణుఁడు తదేకదీక్షతోఁ గనిపెట్టుకొనియుండి, యాతనిరాకనుఁ జూచి మిగుల నానందించెను. ఇన్నిదినముల కీతనికి మరలఁ దినుటకుఁ గడుపునిండునట్టుల పదార్థము లభించెను.

"శశిభూషణా! మనమిఁక నిచ్చటనుండి వెడలిపోవు మార్గమును జూడవలయును. కాని పట్టణములోనే యున్నను యీ కార్యముకూడ మిగుల నసాధ్యముగనే కన్పట్టుచున్నది. నేను ముందుపోయి, రక్షకభటులను స్వాధీనము చేసికొనెద మనిన, నేను సాధారణముగా బయటకుఁ బోవుటకే వీలులేదు. ఎంతమాత్ర మాచోకీదారకిసను నిన్నేమి బాధించెదరోయని భయముగానున్నది" అని రామదాసాలోచించుచుఁ బల్కెను. శశిభూషణుఁ డీవిధమున సలహానిచ్చెను.

"ఇఁక మనకేమియును భయములేదు. భయపడవలసిన దినములన్నియు గతించినవి. మన మిఁక నిటనుండి తప్పించి కొనుట సులభసాధ్యమే యని నాతలంపు. వీరలనందఱను వెంటనే బంధింపవలయును. హైమవతి మరల రామచంద్ర నగరము పోవచ్చును. ఆమెనుగూడ నెట్టులైన వీరితో బం ధింపవలయును.

ఎట్టులైన నీ వీవేషముతో నున్నపుడే, బయటకుఁ బోయి రక్షకభట 'లయమున నరుణాచలము (ప్రస్తుత రక్షక

భటాధికారి)తో నాలోచింపుము. ఏదైన నొక యుపాయము దొరకకమానదు. చాలమంది రక్షకభటు లొక్కసారి పైఁ బడిన వీరేమియును జేయఁజాలరు. నన్నుఁజంపుటకైనను వీరు యత్నింపరు. ఏలనన, వారిప్రాణములమీఁదికే వచ్చుచుండగా, నాజోలి వారి కేల?"

అంతఁ గోటయ్య యనెను. "నీవు చెప్పినది బాగుగనే యున్నది. కాని విజయమోహనుఁడు, తగినంతపనియుండినఁ గాని తనవారినెవరిని బయటకుఁ బోనీయఁడు. నేనుఁ బైకిఁ బోయినను, రక్షకభటాలయ మిచ్చటికిఁ జాలదూరమున్నది. అందుచేత నాలస్యమగును. గమనించినయెడల విజయమోహనుఁడు మనపనిఁబట్టును. నేనింకను యాలోచించెదను. నీవుఁ గూడ యోజించుచుండుము. నిన్ననే యాలస్యమైనదని విజయమోనుఁడు నన్నుఁ బ్రశ్నించియున్నాఁడు. ఈదినముననైనఁ ద్వరగాఁ బోవనియెడల ననుమానమునకుఁ గారణ మగును. మరలజేపోపాటివేళ! "అనిపల్కి కోటయ్య యథాప్రకారము వెడలిపోయెను.

ఆమరునాటి యుదయమునఁ గోటయ్య నిదురనుండి మేల్కాంచక పూర్వమే విజయమోహనుఁ డాతనికడకు వచ్చి, యాతనిని లేపి,

"కోటయ్యా! ఆనందమోహనున కెంతమాత్రమును నెమ్మది లేదు. ఒకదినముకంటె నొకదినము రుగ్మత హెచ్చు

చున్నయట్టుల నగపడుచున్నది. ఆనందమోహనుఁడు నాకు గురువువంటివాఁడు. ఆతఁడు నాకుఁ జేసినసాహాయ్య మమూల్య మైనది. నే ననిన నాతనికిఁ బ్రాణము. ఆతఁడు రాత్రి నన్నుఁ బిలిచి, "విజయమోహనా, నేను మంచముఁ బట్టుటచే మీరలందఱును మిగుల బద్ధకము వహించి" యింకను మనకు రామదాసను శత్రు వొకఁ డున్నాఁడను మాట మఱచుచున్నారు. ఇఁక నామూలమున మిగిలినకార్యము లన్నియు నూరకఁ బోవలసినదేనా? రామదా సెచ్చటికిని పోయి యుండఁడు. ఈపట్టణముననే, యేదో మాయవేషముతోఁ గొట్టుకొనుచుండును. మరల నీరాత్రి నెవరినైనఁ బంపి యేలఁ బ్రయత్నము చేయఁ కూడదు! ఈలోపున నెవరినైః తెలివితేటలు గల వానిని రామదాసును వెదకుటకుఁ బంపుము. కోటయ్య క్రొత్తవాఁడే కాని సూక్ష్మబుద్ధి కలవాఁడు. రామదాసు ని ల్లాతనికిఁ దెలియును. క్రొత్తవాఁ డగుటచే నాతని నెవరును ననుమానింపరు. ఆతనిఁబంపి యీకార్యము నెఱవేర్పుమనుము" అని నాతోఁ బల్కినాఁడు. రామదాసును నీవిదివఱ కెఱుఁగక పోవచ్చును. చాల బలవంతుఁడు; పడుచువాఁడే! శరీరము చామనచాయగా నుండును. నల్లనిమీసము గడ్డము నుండును. స్ఫురద్రూపి! ఎప్పుడును దెల్లనిదుస్తులను ధరించును. నీ వాతని కొఱకు నూరంతయుఁ దిరుగాఁడ నక్కఱలేదు. ఈదిన మంతయు నాతనియింటియొద్దనే యుండి చూడుము."

అని విజయమోహనుఁడు పల్కుటయుఁ గోటయ్య వెంటనే యందులకు సమ్మతించెను. శశిభూషణుఁడు చెప్పి నటులఁ జేయుట కీపని మిగుల సహాయకారిగా నుండు నని తలఁచి, వెంటనే యాతఁడు బయల్వెడలెను. గర్భదరిద్రునివలె వేసము వైచుకొనిన యాతనిఁ జూచి యెవ రనుమానింపఁ గలరు! నిజముగా నతఁడు తన ప్రతిబింబము నద్దములోఁ జూచినఁ దన్నుఁ దానే యానవాలుపట్టజాలఁడు. ఆతఁ డటుల వేసము వైచికొని బయల్వెడలి తనభవనముచెంతకే వచ్చెను. ఈతని వైపైన నెవరును సరిగా జూడలేదు. ఏలనన నెంతి బిచ్చగాండ్రు, కూలివాండ్రు, వీధులవెంటఁ దిరుగాడుటలేదు? తన భవనద్వారముననే నిలునఁబడి, రక్షకభటుఁ డెవ్వరైనఁ దన కగపడునేమో యని, యాతఁడు నలుప్రక్కల నిరీక్షించు చుండెను. అటులఁ గొంత తడవట నిలువబడిన పిమ్మట, నొక రక్షకభటుఁ డొక బలమైన దొంగ నతికష్టముతో నీడ్చి కొనుచుఁ గోటయ్య నిలువఁబడినస్థలముపై పరుదెంచుచుండెను.

"సిద్దప్పా!" అని కోటయ్య యారక్షకభటునిఁ బిలిచెను. రక్షకభటుఁడు నాల్గువైపులఁ జూచెను. పదిమంది సామాన్యభటుల కాతఁడు నాయకుఁడు. అందుచే సాధారణ మనుష్యులందరు నాతనిఁ జూచి, గడగడవణకుదు రని యాతని యభిప్రాయము. ఆతఁడు నాయకుఁడని సూచించు పువ్వొకటి యాతని శిరోవేష్టముపై నుండెను. ఆతఁడు, దాని నొకసారి,

సరిగా సందఱకుఁ గనఁబడునట్లు సవరించుకొని "ఈపువ్వు కన బడక పోవచ్చును. చూచికూడ నన్ను సిద్దప్పా! యని పిలుచువాని గుండెలు బ్రద్దల కొట్టనా!" యని తనలోఁ దా నను కొనెను. ఆతఁడు పువ్వు సవరించుకొనుట మొదలగు చేష్టల నన్నిఁటిఁ గనిపెట్టి, నిరంకుశాధికారి యగు కోటయ్య (వేష ముతో నున్న రామదాసు) నవ్వుకొనుచు మరల, "సిద్దప్పా" యని పిలిచెను.

సిద్దప్ప యాద్వారమువైపు చూచెను. నవ్వుచు తన్ను మరల "గారు" లేకుండ పిలచిన యాబీదవానినిఁ జూచి కోపా వేశితలోచనుఁడై "ఎవరు నీవు?" అని ప్రశ్నించెను.

"నీయొద్ద నొక కాగితము కలము నున్నదా? అరుణా చలమున కొకయుత్తరమును వ్రాయవలయును" అని కోటయ్య పలికెను.

"ఏ యరుణాచలము?"

కోట:— మాయధికారి.

సిద్దప్ప:— నన్నే కాక మా యధికారినిఁ గూడ ధిక్కరించు చుంటివే? నీవేమో, యీపట్టణమునకు రాజువలె మాట్లాడు చుంటివి. ఎవరు నీవు?

కోట:— నే నడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పుము. నీయొద్దఁ గాగిత మున్నదా?

సిద్ధప్ప—నీ దేయూరు ?

కోట—పల్లెలయే.

సిద్ధ:—నీకు మాయధికారితోఁగాని, నాతోఁగాని, పనియేమి యున్నది?

కోట:— ఉన్నది. నీవు మాటలాడక నీజేబులోనున్న పుస్తక మిటుఁ దెమ్ము.

సిద్ధ:— ఓరి ముసలిగాడిదా ! నీపొగరుఁబోతుఁదన మంతకంత కతిశయించుచున్నదే! మాదు నిన్నేమిచే...........

సిద్ధప్ప యామాట లనుచుండ నాబలశాలియగు దొంగ యొక్కగంతు వైచి, పారిపోయెను. సిద్ధప్ప యాతనివెంటఁ బరుగిడఁ జొచ్చెను. కాని యాతని నందుకొనలేక పోయెను.

అంత కోటయ్య బిగ్గరగా "ఆఁగు! ఆఁగు!" అనుచు లేఁడివలెఁ బరుగెత్తి, యాదొంగ నవలీలగాఁ బట్టి తప్పించు కొనుట కాతఁడెంత ప్రయత్నించినను విడువక గట్టిగా నొక్కి పట్టెను. "ఆఁగు! ఆఁగు!" అనుపలుకులు సిద్ధప్పచెవులలోఁ బ్రతిధ్వనించుచుండెను. ఆధ్వని తమనాయకశిఖామణి యగు రామదాసుది! ఆపరుగును నాతనిదే! "నిజముగా మాఱువేష ముతోనున్న రామదాసుకాదుకద యీతఁడు ! కొంపమునిఁగి పోవును"—సిద్ధప్ప మేనెల్లఁ జెమటపట్టెను. భయముచే నోడ

లంతయు వణంకెను. ఆశ్చర్యముచేఁ దెఱచిన నోరట్లే యుండి పోయెను.

కోటయ్య యాదొంగనుఁబట్టి తీసికొనివచ్చి "సిద్దప్పా! గట్టిగాఁ బట్టుకొనుము. మరల పారిపోఁగలఁడు! ఆజేబులోని పుస్తకము నీలాగుననీయుము. అరుణాచల మెచ్చటనున్నను, యీాయుత్తర మాతనికి తక్షణము నీయుము" అని యనెను. కాని సిద్దప్ప, దగ్గరకు రాఁజాలక, కొయ్యబొమ్మవలె నటులనే నిలువఁబడి పోయెను. రామదాసును సమీాపింప నెవనితరము!" "భయము లే దీలాగునరమ్ము" అని యాతఁడు దొంగను సిద్దప్పకు నందజేసి, యాతనిపుస్తకములోని పత్రముల నాల్గింటినిఁ జింపి యుత్తరమునొకదానినివ్రాసి "దీనిని నీవుచూడవలదు. తక్షణమే నేను జెప్పినటులఁజేయుము పొమ్ము" అని యాతనిఁ బంపి వైచెను.

## ముప్పదియేడవ ప్రకరణము

ఆనాటిరాత్రి విలాసభవనమంతయుఁ జాలకలవరముతో నిండియుండెను. "రామదాసరుదెంచినాడట. వానినీరాత్రి వేటాడవలయును" ఎక్కడ చూచినను నదేమాట.

"కాని వానిముఖముఁ జూచిన నాకుఁ గోపమాగదు. మనరాజు వానినిఁ బ్రాణములతోఁ దీసికొనిరావలయు నని యాజ్ఞాపించెను. ఏమి చేయవలయునో తెలియకున్నది" అని యొకఁడనుచుండెను.

"ఈరాత్రిమాత్ర మెటులో కొంచెము శాంతిపడుము. ఒక్కసారి నీవే వానిని జంపినయెడల మాకోప మెటులఁ జల్లా రును? ఇచటికిఁ దీసికొనివచ్చి మనమందర మాతనిని చిత్రవధ చేయవలెను" అని మఱియొకడు సమాధాన మిచ్చుచుండెను.

"అంతతొందరయేల? ఈరాత్రియే తలపెట్టవలయునా?" అనెను మఱియొకఁడు.

"ఈరాత్రి తప్పిన మరల రామదాసు కనపడవలదా? ఆతఁ డీమధ్యఁ బట్టణమున లేనే లేఁడు. మనయదృష్టవశమున నీరాత్రి వచ్చినాడు. వెనుకనెంతో ప్రయత్నము చేసికొనివెళ్లి నపుడంతయు వృథాయైపోయినది" అని మఱియొకఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

"కాని యీరాత్రి మన కంతయనుకూలముగా లేదు. వెనుక మనము కార్యము తలపెట్టినపుడు, దైవముకూడ మనకు సాహాయ్యముచేసెడివాఁడు. కారుచీఁకటి, మేఘములు, ఉరుములు, గాలి, వాన, అంతయు మనము తలపెట్టిన దారుణ

కార్యములవలెనే మిగుల భయంకరముగా నుండెడిది. కాని యీరాత్రి పాడువెన్నెల వచ్చినది. ఇటువంటి రాత్రులయం దెవరైనఁ జూచినను జూడవచ్చును." అని యొకఁడు భయ పడెను.

"ఓరి, పిరికిపందా! మనమింతమంది యుండగా నెవ్వరో చూచినమాత్రము భయమేమి? అంతగా మనకడ్డమువచ్చిన మనయాయుధము లేమగును? వెన్నెలయున్నంతమాత్రమున భయమేమి?" అని మఱియొకఁడు వానిభయము మాన్పెను.

విజయమోహనుని యనుచరు లందరును నావిధమున రెండు యామముల వఱకును సంభాషించుచుఁ గాలమును గడపిరి. అప్పుడు విజయమోహనుఁ డచ్చటి కరుదెంచుటఁ జూచి వారందఱు లేచి నిలువబడిరి. "వేళ యయినది. ఇక మీరందఱును వేషములనుధరించి సిద్ధముకండు. నాకు మీతో వచ్చుటకు వీలులేదు. మీకుఁ గోటయ్య నాయకత్వము వహించును. మీరందఱు నాతఁడు చెప్పినటులఁ జేయుఁడు. ఈదినమున రామదాసును బట్టి తీసికొనివచ్చిన మీకందఱకును నూరేసిరూప్యముల నిచ్చెదను" అని విజయమోహనుఁ డనెను.

ఆమాటలను విని, వారందఱు హర్షధ్వనులఁ గావించిరి. కోటయ్యను జూచి కొంద రసూయపడిరి.

"ఇక మీరందఱును పొండు. సాధ్యమైనంతవఱ కాతని జంపవలదు. బంధించి తీసికొనిరండు" అని విజయమోహనుఁ డానతిచ్చి లోనికిఁ బోయెను. అందఱు నల్లనిదుస్తులను ధరించిరి. ముఖములకుఁ గూడ నల్లవస్త్రములఁ గట్టి ఖడ్గధారులై బయల్వెడలిరి.

ఆరాత్రి శుక్లపక్ష త్రయోదశి. ఆకాస మంతయు నతి నిర్మలముగానుండెను. చెట్లయాకులలోనుండి వివిధధ్వనులఁ జేయుచుఁ జలిగాలి యరుదెంచుచుండెను. మనుష్యాలయములకు డెచ్చటను కానరాదు. వీరలనందఱను మిగుల సంతసముతో నాహ్వానించుచున్నట్టుగఁ జంద్రుఁడు తన కిరణజాలమును నలువైపుల బ్రసరింపఁజేయుచు, నత్యంతప్రకాశమానమై వెల్గుచుండెను.

"రాజబాటమీదుగనే పోవుదమా, లేక మఱియొక మార్గ మేదైన నున్నదా?" అని విజయమోహానునియనుచరులలో నొకఁడు ప్రశ్నించెను.

"రాజబాట యేల? రక్షకభటులుండవచ్చును. రాత్రిగానో కాని పగటివలెనే యున్నది. మఱియొకదగ్గరదారి యున్నది. నాతో రండు. చూపెదను" అని కోటయ్య యనెను.

ఈ ముదుసలి కన్నిమార్గములు తెలియుట చిత్రముగనే యున్నదని మఱియొకఁడు గొణఁగుకొనియెను. కోటయ్య

మఱియొక క్రొత్తమార్గమున వారలనందఱను దీసికొనిపోయెను. ఆ బాటయంతయు వృక్షములచే నిండియుండుటచే వీరినెవరును జూడలేదు. రక్షకభటులు కాని, యితరులుగాని యెవరును వీరి నడ్డలేదు. కొంతదూరము నడచి, రామదాసు భవనప్రాంతముఁ జేరిరి. మేడపైభాగమున దీపము వెల్గుచుండెనుకాని యలుకు డేమియును లేదు. సింహద్వారము బంధింపఁబడియే యుండెను.

"లోపల నున్నాఁడు. హాయిగా గుఱ్ఱువెట్టి నిదురపోవుచుండును. [illegible]ము! ఎవరు నేమియు నలుకుడు చేయకుఁడు నిద్రాభంగమగును. ఆతనిని లేవకుండగనే బంధించినఁ దలకు నూరురూపాయలు!" అని వారిలో నొకఁడు మిగిలినవారిని హెచ్చరించెను.

"పెరటితలుపు తీసియేయున్నది. మనము గోడదూఁక నక్కఱలేదు. అందఱు నిటురండు" అని కోటయ్య యాజ్ఞాపించెను. వారందఱు మేఁకలమందవలె పెరటిలోనఁ బ్రవేశించిరి. "ఇంటితలుపుకూడ తీసియేయున్నది. హి- హి- హి!" అని యొకడు సకిలించెను. "గట్టిగా నవ్వకు మెలఁకువ వచ్చును" అని కోటయ్య యనెను.

ఇంటితలుపు తీసియ యుండుటచే వీరందఱు సు గనే లోనఁ బ్రవేశించిరి. మెట్లనెక్కి పైకిఁ బోయిరి. మేడ యంతస్తొక్కటే యైనను గదులు చాల యున్నవి. చావడిలో నొక్క దీపికమాత్రము వెల్గుచుండెను. గదులలోఁ జీకటియే!

"సగముమంది క్రిందికిఁ బొండు. మీరందఱిరువు రిరువురు వరుసన నొక్కసారి, నేనీల వైచినపుడు గదులలోనఁ బ్రవేశింపుడు. రామదా సెవ్వరికి దొరకిన, వాఁడు మరల నీలవేయవలెను, అప్పుడు మిగిలినవా రచటికి వత్తురు. కత్తుల నెవరు నుపయోగింపవలదు. అది మనరాజుగారియాజ్ఞ. మనము చాలమంది యున్నాము కనుక భయములేదు. అందఱు నొక్కచోటనే యున్న ధ్వనియగును. రామదా సెక్కడనుండి యైనను మన యలుకుడువిని దూఁకిపోఁగలఁడు. అంతయు నిశ్శబ్దముగా జరుప వలయును." అని కోటయ్య నెమ్మదిగా వారికి నుద్యోగపద్ధతిని బోధించెను. సగముమంది క్రిందిచావడిలోనికిఁ బోయిరి. అంతయు నిశ్శబ్దముగా నుండెను.

"కూ, కూ" యని కోటయ్య యీలవైచెను. క్షణములో గదులలో నందఱు నొక్కసారి ప్రవేశించిరి.

వింత! ప్రతిగదియందునొక బల్లయుండెను.ఆబల్లపై నొక మనుష్యుఁడు కప్పుకొని పరుండియుండెను. విజయమోహనుని యనుచరులలో నొకనికి తెలియకుండ నొకడు "దొరికినా" డనుచు నాబల్లమీఁదిపురుషునిపైఁ బడిరి.

మరియొకవింత !! ఆబల్లక్రిందనుండి, మరినల్గురువచ్చి, యావిజయమోహనుని యనుచరులజంటను మాటాడక బంధిం

చిరి. ఈలలగోలతో మేడయంతయుఁ బ్రతిధ్వనించుచుండెను. కాని గదులను విడచి యెక్కడును బైటకురాలేదు. ఏగదిలో వా రచ్చటనే బంధింపఁబడిరి. ఎవరికిని నాయుధముల నుపయోగింపవలసినయక్కఱ లేకపోయెను. ఆగదులలోనివారు సాధన సామగ్రితో వచ్చియుండుటచే ప్రతిజంటను సవలీలగా బంధించివైచిరి. ఒక్కడును మిగులలేదు. కోటయ్యమాత్రము చావడిలోనుండి క్రిందికిఁ బైకిఁ దిరుగుచుండెను. ఆతని నెవరును బంధింపలేదు.

ఇదంతయు వ్రాయుట కింతతడవైనదికాని యైదునిముసములలో జరిగెను. దీపములు వెలిఁగింపఁబడెను. ఆగదులలోఁ బరున్నవారే గాక, మరియొకసమూహము—సుమారు నలువదిమంది—చెట్లచాటుననుండి పరుఁగున వచ్చిరి. విజయమోహనుని యనుచరుల నందఱిని మూటలనలె బంధించి తీసికొనివచ్చి పైచావడిలోఁ బడవైచిరి. అందఱును గోటయ్య వైపుఁ జూచిరి. తాము రక్షకభటుల యధీనములో నుంటి మని యాయాగంతుకులందఱికిఁ దెలిసిపోయెను. అరణాచల మమూల్యములగు దుస్తులను ధరించివచ్చి కోటయ్యకు నమస్కారము జేయుటఁ జూచి, యాతఁడు తమ్ము మాయజేసెనని గ్రహించి, విజయమోహనుని యనుచరులందఱు నిర్ఘాంతపోయిరి. కాని విజయమోహనునితో నీసంగతి చెప్పుటకొకఁడును మిగులలేదు.

"అరుణాచలం! వీరినందఱి నీరాత్రియే ఖైదులో నుంచుము. కాని వీరి నేమియుఁ బ్రశ్నింపవలదు. నే నెచ్చటనుంటినో తెలిసికొనఁ బ్రయత్నింపవలదు. ఈవిషయ మేమియుఁ బట్టణప్రజాళికిఁ దెలియరాదు. ఇప్పటికి నేను పోవుచున్నాను మరల వ్రాసెదను. సిద్ధముగా నిప్పటివలెనే యుండుము. పొమ్ము" అని చెప్పి, కోటయ్య తనదారిని విలాసభవనోన్ముఖుఁ డయ్యెను.

## ముప్పదియెనిమిదవ ప్రకరణము

తనయనుచరుల నటుఁ బంపివైచి, విజయమోహనుఁడు సంతుష్టాంతరంగుఁడై, యానందమోహనుఁడు పరుండియున్న గదిఁ బ్రవేశించెను. మేల్కాంచియేయున్న యానందమోహనుఁ డత్యాతురతతో "ఏమి! పంపివచ్చితివా?" యని ప్రశ్నించెను.

విజయ—ఆ! పంపివచ్చితిని. మఱియొకగడియ కా నిర్భాగ్యుఁడు రామదాసిచట మనపాదాక్రాంతుఁడై పడియుండును.

ఆనం—వీఁడు కూడ పట్టుపడినయెడల......ఇఁకఁ జెప్పవల యునా? ఓహో! తలఁచుకొనుటచేత నేనాబాధయంతయు

నశించుచున్నది. ఇకఁ బల్వాలరాజ్య మనాదమై మనపా
దములకడ నుండును. తరువాత నేమిచేయునది- చెప్పు
టయేల? నీవు రాజు! ...హైమవతి రాణి! నీవు మరల
రత్నసింహుఁడవు! హైమవతి నీరాణి! నేను వెంకటప్ప
య్యను! మరలఁ బల్వాలరాజ్య మెప్పటివలె సంపూర్ణ
యౌవనవికాసముతో విలసిల్లుచుండును.

విజయ—మఱి—రాజసింహుఁడు?

ఆనం—వానిని శ్యామ పెండ్లియాడుట కలలోనివార్త.

విజ—అట్లయిన హైమవతి మనసద్ధతుల కంగీకరించునా?

ఆనం—ఆమె యంగీకరించుట యేమి? నిన్నామె మోహించి
నది. నీచేతులలోని కీల్బొమ్మ. ఆమెచెప్పినటులనే మన
ము చేయుచున్నటుల నటించెదము. రాజసింహునికిని
శ్యామసుందరికిని వివాహము చేయునటులనే మనము
నిశ్చయించెదము. ఆమెతండ్రిసైన్యము మనకు సాహా
య్యము చేయునుగదా! కాని, యీవివాహమునకు
శ్యామసుందరి యియ్యకొనదు. మనమును బలవంతము
చేయ కామెను, బలవన్మరణప్రాప్తియో, లేక యావ
జ్జీవకారాగృహప్రాప్తియో పొందనిత్తుము. రాజసిం
హుఁడు తిరిగి తనదారిని తానుపోవును. ఇఁక మిగిలెడి
వా రెవరు? నీవు, హైమవతి—రాజు! రాణి!!

విజయ——నీవు గాలిలో మేడలు కట్టుటయందు బహునమ ర్థుఁడవు!

ఆనం——అవును! కాని నామేడలు గాలిలోనే నిలచును. అవి యెప్పుడును గూలవు. ఇదివఱలో మనము కట్టిన మేడ లెన్నడైనఁ గూలినవా?

విజ——లేదు! కాని యింతఘనమైన కార్యమును మనము తల పెట్టిన దెపుడు?

ఆనం——చిన్నవానినుండి, పెద్దవానికి. ఇంతకుముందు మనము కావించిన వన్నియుఁ జిల్లరిపనులే! ఇఁక వానితో మన కుఁ బనిలేదు. ఇఁక బ్రదికినదినములన్నియు నుద్యోగము తోడనే కడచిన, ననుభవించు టెప్పుడు? మనము చేసిన పను లన్నిఁటికి మన కిదివఱ కేమియు లభింపనే లేదు. ఇఁకముందు! మన కేగాక, మనతరువాత వచ్చు వారలకుగూడ, పేరు ప్రతిష్ఠ.

ఇంతలో వారి కేదియో, కలవరము వినవచ్చెను. "కో టయ్య యెక్కడును చెమటలు గ్రక్కుకొనుచు పరువెత్తి కొని వచ్చుచున్నాఁడు" అని సేవకుఁ డొకఁ డఱచెను.

విజయమోహనుఁ డొక్కపరుగున కోటయ్యను గలిసి కొనెను.

"ఏమైనది? ఏరి, మిగిలినవారు, రామదాసు? ఏమైనది" అని విజయమోహనుఁడు మిగులఁ గలవరముతోడఁ బ్రశ్నించెను. కోటయ్య మాటలాడలేక క్రిందఁ గూలబడియెను. ఆతనితోడ విజయమోహనుఁడుకూడ, క్రిందఁ జతికిలఁబడి, "ఏమి, కోటయ్యా! ఏమైనది?" అని మరల ప్రశ్నించెను.

"నాశనము! అంతయును మునిఁగిపోయినది" అని కోటయ్య ప్రత్యుత్తర మిచ్చెను.

కోటయ్య కుచ్ఛ్వాసనిశ్వాసములు తక్క మాటయే వచ్చుటలేదు.

ఏమైనదని విజయమోహనుఁడు మరలఁ బ్రశ్నింపఁగాఁ గోటయ్య మొదలువెట్టెను.

"ఆయింట రామదాసొక్కఁడును లేఁడు. చాలమంది రక్షకభటులుకూడ నున్నారు. వారందఱు గదులలోఁ బడి నిద్రించుచుండిరి. మనవారాగదులలోఁ బ్రవేశింపఁగనే, వారందఱిని బంధించిరి" అని కోటయ్య నాల్గుముక్కలలో ముగించెను.

"మరి నీవు ?"

నే నెటులనో యీవార్తఁ జెప్పుటకుఁ దప్పించికొని వచ్చితిని."

"టథ్! మనము వచ్చెద మని వారి కెటులఁ దెలిసినది? మోసము! నీవు మాత్ర మెటులఁ దప్పించుకొని వచ్చితివి?

ఈలాగున రమ్ము" అని విజయమోహనుఁడు కోటయ్యను ద్రోహము చేసెననుమాట వాస్తవమే!"

అందులకు విజయమోహనుఁ డనెను "కోటయ్య, యంతపనిచేయునని నేను దలంపను. ఏలననగా నాదిక్కులేని వానికి మనము ప్రాణదానముఁ జేసితిమి. అంతియకాక నీతఁడు మరల మనచెంతకే వచ్చినాఁడు. ఱేపుగనుక, రక్షకభటులు కాని, రామదాసుగాని, మనభవనప్రాంతములకు వచ్చినయెడల కోటయ్యను, శశిభూషణుని ముక్కలు ముక్కలుగానరికి వేయమా?—బంధింపఁబడిన మనవారుప్రాణములనైన వీఁడెదరు కాని మనరహస్యమును వెలిబుచ్చరు. ఆమాట నిశ్చయము. ఇంతకును మనకుఁబోయిన దేమియును లేదు. తలఁచినకార్యము చెడినది. కొంత బలగము నశించినది. ఇఁకపైని, కోటయ్యకే విషయమునను బెత్తనమీయను. అంతియగాక నాతనిపై నొక కన్నుఁగూడ వైచి యుండవలయును."

నాకు మఱియొకసంగతి తోఁచుచున్నది. రామదాసు నిజస్వరూప మాముసలిదానివలన మనకుఁ దెలిసినది కదా! "రామదాసు నిజముగా రాజద్రోహియనియుఁ తంత్రపరుఁ డనియు దెలిసికొని మేమే బంధించి మీకర్పింపవలెనని యిటులఁ జేసితిమి. అందుచే మావారు నిర్దోషులు కనుక వారిని విడిచి పెట్టుఁడు. అని రాణి నడిగిన నెట్టు లుండును? "అని యానందమోహనుఁడు ప్రశ్నించెను.

"అది యంత సమంజసమైన యాలోచనకాదు. దీనికిఁ దగిన నిదర్శనము లెచ్చటనున్నవి? రామదాసధికారముతోఁ గూడి యున్నవాఁడు; రాణి కాంతరంగికుఁడు. అందుచేఁ దగినంత నిదర్శనాబల ముండినఁ గాని యాపనిఁ దలపెట్టకూడదు. ఆముసలిది నిజముఁ బలుకునా?" అని విజయమోహనుఁ డనియె.

"ధనములకు లొంగినవారెవరు? ఆముసలిదానికి ధనాశయున్న దనుకొనియెదను. అంతకును లొంగనియెడల మనపనికి మన మారంభింతము. ఆ చంద్రముఖి యను బాలికను విడిచి యామె యొక్కనిమిసమైన నుండఁ జాలదు. ఆమెను శశిభూషణుని వలెనే, మాయముచేతమని బెదరించిన నాయవ్వ మన పాదాక్రాంతురాలగును. దీనివలన మనకుఁ గూడఁజాలలాభమున్నది. రామదాసు నిజమును బయల్పెట్టిన యెడల శ్యామసుందరికిఁ గూడ మన మీఁద నను మానము పోయి యభిమానము మొదవును. అందువలన మనకార్యము మఱింత శీఘ్రముగా నెఱవేఱును." అని యానందమోహనుఁడు మఱియొకక్రొత్త యాలోచనను దెల్పెను.

అప్పటికి రాత్రి చాలవరకతిక్రమించుటచేత విజయమోహనుఁడు రోగియగు నానందమోహనుని నిదురింపుమని యానతిచ్చి తాను కూడ నిద్రించుటకై యరిగెను.



## ముప్పది తొమ్మిదవ ప్రకరణము

విజయమోహానుని యనుచరులింకను చాలమంది యే యుండిరి. కాని మరునాటి సాయంకాలము శశిభూషణునకు కాహారముఁ గొని పోవుటకు వారు మరలఁ గోటయ్యనే పంపిరి. కోటయ్యయును కడు జాగరూకతతోఁ దలుపులదీసి శశిభూషణునిఁజూచి జరిగిన సంగతినంతటినిఁదెలిపెను. శశిభూషణుఁడు చాలసంతసించెను అని రామదాసగెను.

ఇంకను విజయమోహానునికిఁ జాల బలగమున్నది. నిన్నరాత్రి బంధింపఁబడినవారు కొలఁది మందియే ! మిగిలిన వారినిఁగూడ త్వరలో బంధింపవలయును. విజయమోహానుని ముందు బంధించినఁగాని, నిన్నువిడిపించుటకు యత్నములు చేయువలనుబడదు. ముందే నిన్ను విడిపించినయెడల నాతఁడు మనకు దొరకుటయే చాలఁగష్టమగును.

శశి—ఇచ్చట నేను చాలదినములుంటిని. ఒంటరిగా నీచీఁకటి కొట్టునందింకను నెన్నిదినములుండ వలయును? ఇంకను మనమేల యాలసింపవలయును ? వెంటనే విజయమోహానుని, నాతని యనుచరులను బంధింపవలయు నని యరుణాచలమున కేల యుత్తరము వ్రాయగూడదు ?

రామ—శశిభూషణా ! కొంతది కాలము మాత్ర మోపిక పట్టుము. మనము తొందరపడి కార్యముఁ జెడకొట్టుకొన కూడదు. సూక్ష్మబుద్ధియగు విజయమోహనుఁడు నిన్నటి యపజయమునకు నన్ను కొంతవర కనుమానించి యున్నాఁడు. ఆయనుమానము పోయియుండును. కాక పోయినయెడల మరల నన్నే యిచటికిఁ బంపునా ? నిన్ను ద్వారలోనే విడిపించెదను. అంతియకాదు. విడిచి పుచ్చినవెంటనే నీకొక గొప్ప బహుమానముగూడ నిచ్చె దను. నీవీచెఱయందు నాకొఱకుఁ జాలఁగష్టపడితివి. అం దుచే నీకొక బంగరుబొమ్మనుయిచ్చి, సన్మానింప దలచి తిని. నీవాబొమ్మనుజూచి తప్పక యీ కష్టములను మర చుటయేగాక, నాజన్మాంతము సుఖివై యుందువు.

శశి—నా కేమియునువలదు. బొమ్మయునువలదు. కొమ్మయు నువలదు. నేను మీచెంతనేయుండి సుఖింపఁగలను.

రామ—వెఱ్ఱివాఁడా ! నేను పెద్దవాడనౌచుంటిని. నావిచిత్ర జీవితచరిత్ర నిఁక ముగింపఁజెదను. ఈముదుసలితో నీకేమి సుఖము ! నాకాలములో నాకన్నిసుఖములును దీరినవి. మనుష్యజీవితమునం దెంత సుఖముండునో, దానినంతయు నేను నిరంకుశాధికారినై యనుభవించితిని. ఈ యిహ లోకసౌఖ్యముల నన్నింటిని రుచిఁజూచితిని. ఇక నీరంగము నుండి విరమించి, పరలోక సుఖముల కాసించెదను.—నీ

కింకను జీవితము మొదలు! నీవేమి చూచితివి? పురు
షుఁడవై పుట్టినందులకు నీవేమి కార్యములఁజేసితివి?
కాని, నావలెనే నీవును ఉండవలయునని నేను కోరను.
నాజీవితమెట్లు మొదలిడినదో, యెట్లుమారినదో, చివర
కిప్పుడెటుల నున్నదో తలఁచికొనిన, నాలోనాకే మిగుల
నాశ్చర్యమగును. నాకును నీకును జాల తారతమ్యము
న్నది. నావలె నీవుండవలదు! వలదు!! నీవు కుటుంబివై,
నిర్మలమైన, నిశ్చింతతోఁగూడిన గృహస్థాశ్రమ స్వర్గ
మును జవిఁజూడుము.

శశి—మామా! మీరటుల మాటలాడుచుంటిరేల? మీ
కంఠమటుబొంగురు వోవుచున్నదేల? మీకన్నులు—

రామ—అవునవును! నేనిట్టిదుర్బల రూపముతో నుండగా
నీవెప్పుడును నన్నుఁగాంచి యుండలేదు. కాని నానిజ చరి
త్రను నీవు వినినయెడల నీవును నావలె విచారమునొం
దకపోవు. నీకొక దినమున నాచిత్రకథనంతయుఁ దెలుపు
దును. కాని నీకు నాబంగరు [illegible]మ్మను,—నాచంద్రముఖి
నిచ్చి వివాహముచేసిన పిదపఁగాని చెప్పను.

చంద్రముఖి! శశి భూషణుఁడామెపేరు వినినవెంటనే
యులికిపడియెను. ఆధూళిధూసరితమై, సుఖదూరమై, కష్ట
పరంపరల కాశ్రయమైయున్న యాపాడుకొట్టునందే యాతని

నేత్రద్వయమున కొక యానందస్వరూపము కానఁబడియెను. దుర్భరమైన రాక్షసబాధల సహింపజాలక, కష్టపరంపరలచే వివశులై, దారుణకు తంత్రాగ్ని జ్వాలలయందు మాడి, మాడి, చివర కేదిక్కును గానక; మహాఋషులు దైవమును ప్రార్థింప, మేఘమాలికలనడుమ, చిత్రవిచిత్రవర్ణములలో, మహాతేజస్స్వరూపియై, శంఖ చక్ర గదా సహితుండైన విష్ణుమూర్తి తన కటాక్షవీక్షణముల నా ఋషులపై బఱపిన, వారానంద పరవశులైనట్లు-శశి భూషణుఁడు తాను జూచిన యానందస్వరూపముచేఁ బరవశుఁడాయెను. కాని యాస్వరూపము విష్ణురూపము కాదు. కౌశికానదీ తీరమున నున్న వనమధ్యప్రదేశమున, కరమున నొకశుకము నిడికొని, నిర్భరానందముతోఁ జిలుక పలుకులవలెనే, పలుకుచు కూర్చుండిన చంద్రముఖిబింబము నాతఁడు చూచెను.

అట్లొక క్షణమూరకుండి "ఏ చంద్రముఖి"యని యాతఁడు తనమామను బ్రశ్నించెను. . .

రామదాసునకుఁ గూడ కొన్నిసంగతులు జ్ఞప్తికి వచ్చెను. చంద్రముఖిని శశి భూషణుఁడు చూచియున్నాఁడు. ఆనాటి సాయంకాలమున చంద్రముఖి శశిభూషణుని వర్ణించెనుగదా! వీరిరువురకును ముఖపరిచయము మాత్రమే కాక, సంభాషణము కూడ జరిగి యుండుననితలఁచి, రామ

దాసు "ఆ చంద్రముఖియే!" నీవానాఁడు చిలుకను తెచ్చి యిచ్చిన చంద్రముఖియే! అనెను.

ఈ సుఖసంభాషణముచే వారెచటనుండిరో నిజముగా మఱచిరి. శశి భూషణుఁడు, తనమామ తన్నే చాటున నుండియో, చూచియుండుననుకొని, సిగ్గునొందెను. తానట్లు పరధ్యానముగా నుండుటకుఁగారణము తఱచాగొల్లపల్లి యప్రాంతములయందే తిరుగాడుట, మొదలగు సంగతుల నాతఁడు తప్పక కనిపెట్టియుండునని శశి భూషణుఁడనుకొనియెను.

రామదాసు, "ఇక నీకీముదుసలితోఁ బనియుండదు" అని హేళన సూచకముగ ననియెను.

"మామా! నేనెవరనో నాకుదెలియని నాటనుండియు, సమస్త సౌఖ్యములనిచ్చి నన్నతి గారాబముతోఁ బెంచి పెద్దవానిఁ జేసితిరి. మీసోదరి కుమారుఁడ నని మీరనుటయే తక్క నిజముగా నాతలితండ్రులెవ్వరో నాకుదెలియదు. మీరే నాకు తండ్రి! మీరు నాకుదైవ సమానులు. అట్టితఱి నాకీ త్రిలోకరాజ్యాధిపత్య మబ్బినను మిమ్ములను విడిచి యుండఁగలనా?" అని ప్రేమను సూచించునట్లు శశి భూషణుఁ డనియెను.

అప్పటికి రామదాసరుదెంచి చాల తడవాయెను. విజయమోహనుని కాతనిపైననుమాన మిదివరకే యంకురించి

నది. ఆలస్యమైన నాయనుమానము మఱింతవృద్ధికాగలదని తలఁచి కష్టముతో నాబాలునివీఁడి, రామదాసు బయటకరు దెంచెను.

యాతాళము చెవి నిచ్చుటకు, విజయమోహనుని వెదుక నారంభింపగా, రామదాసున కాతఁడెచ్చటను నగ పడలేదు. కాని, హైమవతియుండు భవనమునుండి యొకస్త్రీ యార్తనాద మాతని వీనులఁజొచ్చెను. ఆ కంఠస్వరము రామ దాసునకుఁ జిరపరిచయమైనదిగాదోఁప నాతఁడు మిగుల కలఁతనొంచెను. కాని యాకంఠస్వరమెవరిదో యాతనికిఁ దెలి యలేదు. ఆభవనమంతయు నల్లకల్లోలముగాకూడ నుండెను. రామదాసు "ఏమిది?" యని యెవరినడిగినను దెలియ లేదు.

## నలువదియవ ప్రకరణము

విలాసభవనమున రామదాసునకును శశిభూషణునకును సుఖసంభాషణము జరుగుచున్న సమయమునఁ బళ్ళాల పట్ట ణమున కనతిదూరమున నున్న గొల్లపల్లెయందొక చిత్రకథ జరిగినది.

గొల్లపల్లెయందుఁ దమ యరుగుపై, రామలక్ష్మియు, చంద్రముఖియుఁ గూరుచుండి యుండిరి. ఆ యవ్వ తన రహ

స్యమును జెప్పిన నాటనుండియుఁ జంద్రముఖి చాలచింతాక్రాంత చిత్తురాలై, తఱచు కౌశికానదీ తీరమున వాహ్యాళికై బయ ల్వెడలుట, చిన్న బాలికలతోఁ గూడి యాడుట, తన చిలుకకు మాటలు చెప్పుట మొదలగుపనుల నన్నిటిని మానివైచెను. అంతియగాక, శశిభూషణుఁ డగపడుటలేదని వినినప్పటినుండి యు నామె మిగుల బెంగగొనియెను. ఏనిముసమున శశిభూషణు నామె చూచెనో, యప్పటినుండియు నాతనిపై నామెకుఁ ద్రిప్పి కొనలేని ప్రేమ యుదయించెను. అతని మరలఁ జూడవలయు నని యామె యువ్విళ్లూరుచుండెను.

వెనుక రామదాసును జూచినపు డామెకుఁ గొన్ని సంగ తులు జ్ఞప్తికి వచ్చినటుల నింతకుఁ బూర్వమే పాఠకమహాశయు లకుఁ దెలుపఁబడినది. తనబాల్యమున రామదాసే తన్నుఁ దీసి కొని వచ్చినటుల నొకయభిప్రాయ మామెకుఁ గల్గెను. దానిని గురించి సవిస్తరముగా నడిగిన రామలక్ష్మి చెప్పలేదు. తా నెఱిఁ గిన కథనంతయుఁ బూర్తిగాఁ దెలుపక యేదోభయంకరరహ స్యమును వెలిబుచ్చి, రామలక్ష్మి చంద్రముఖిని కలతబెట్టెను. ఆరహస్యమును వినిననాటనుండియు నాబాలిక మిగులఁ గృశిం చుచుండెను.

నాటిసాయంకాల మటుల వారు కూరుచునియుండగా, వీరియొద్ద కొక బీదవా డరుదెంచెను. ఆతఁడు మిగుల పాడఱి పోయిన వస్త్రములను ధరించి, కేల నొక కఱ్ఱ నూఁతకై కొని,

దగ్గుచు, చంద్రముఖి యధిష్ఠించిన యరుగున కెదురుగా నాఁగెను. అంతట రామలక్ష్మి యా బీదవానిని "మీ దేయూరు?" అని ప్రశ్నించెను.

బీద:—ఏయూరా? ఈయూరే! తిరుగలేక ప్రాణములు పోవుచున్నవి.

రామల:—ఈ యూరే యయిన తిరుగు టెందులకు?

బీద:—ఎందులకా! మతిలేక! ఈయూరే యయినంత మాత్రమున, ప్రతిపల్లెలోను నెవ్వరున్నారో నాకేమి తెలియును అడుగలేక నోరుపడిపోయినది. చెప్పువారు సరిగాఁ జెప్పరు! నోఖరనిన కుక్కకంటెను నీచము!

రామల:—నిన్నెవరుపంపినారు? పనియేమి? ఎవరియొద్దకు? సరిగా మాటలాడక నాలాగున గొణఁగుకొనిన నెటుల?

బీద:—ఇప్పటికి నూరుపర్యాయములైనది. ప్రొద్దుటినుంచియు తిరుగుటయేపని! అగపడినవారందరు "పనియేమి" అనుట; విని, "మాకు తెలియదు పో" అనుట. మీరుకూడ అంతే! పట్టణము పట్టణమంతా గాలించివైచితిని. ఎక్కడనూ లేదు. గొల్లపల్లె, అనిన నీపట్టణములో పది గొల్లపల్లె లున్నవి. ఎవరో ముసలమ్మయట! చంద్రముక్కట! చంద్రముకోక్క—కొంగముకోక్క! ఒళ్లుమండుకొని పోవుచున్నది. ఇక నేను నడువలేను. ఈయుత్త

రమును తీసికొనిపోయి మరల నాయనమొగానఁ బార
వైచెదను.

రామల:—ఏదీ? యుత్తరము చూడ నీయుము. నే నెఱిఁగినవా
రైన జెప్పెదను.

ఆమాటలు విని మరల నాతఁడు గొణఁగుకొన మొదలు పెట్టెను. ఎట్టకేల కాయుత్తరమును తీసి రామలక్ష్మిచేతనుం చెను. అప్పటికి సంధ్యాకాంతికూడ తగ్గిపోవుటచే రామలక్ష్మి యాయుత్తరమును లోనికిఁగొంపోయెను. చంద్రముఖియు నామె వెంటనేపోయెను. ఆయుత్తరమును చదివి, రామలక్ష్మి దానినిఁ దనయొడిలో నుంచుకొని, కలఁత నొందినటులఁ జూచుచు నిలు వఁబడియెను. చంద్రముఖి తనవెనుకనే యున్నదని యామెకుఁ దెలియదు. అందుచే నాయుత్తరమును మరల నాతని కిచ్చివేచి తన కేమియుఁ దెలియదని, తప్పించుకొనఁ జూచెను. ఆవెఱ్ఱి చూపులలో నేదియో యర్థమున్నదని గ్రహించి చంద్రముఖి రామలక్ష్మి వెనుకకుఁ దిరుగకుండఁగనే "ఏది! ఆయుత్తరమును నన్నుకూడఁ జూడనిమ్ము" అనెను. రామలక్ష్మి వెనుకకుఁ జూచి "నీ విచ్చటనే యుంటివా? నీడవలె నన్నుపట్టుకొని వద లవు. ఎవరికో యీయుత్తరము! ఈ బ్రహ్మవ్రాత నాకేమియుఁ దెలియుటలేదు. మరల వానికే యిచ్చిపొమ్మనెదను" అనెను.

చంద్రముఖి:—నన్నుకూడఁ జూడనిమ్ము. నాకేమైనఁ దెలియు
నేమో చూచెదను.

రామల:— నాకంటె నీకెక్కువ తెలియునా? వాడు పాప మాలస్య మగునని తొందరపడుచుండును. మనకుఁ గానిదానికేల?

చంద్ర:—నీవింతతడవు మాటలాడిన నాలస్యము కాదు కాఁబోలు! నన్ను కూడ నొక పర్యాయము చూడ నీయ కూడదా?

రామల:—నీ కన్నియును కావలెను. ఆతతాయిపిల్లవు!

చంద్ర:—పోనిమ్ము! నీ కంతవిసుగును, గష్టమును గలిగించుచు నీయొద్దనేల యుండవలయును? నేను నీడవలె నిన్ను బాధించు టెందులకు? కష్టమో, సుఖమో! రామదాసుగారియొద్దకే పోయెదను.

రామ:—బాగుగనే యున్నది బెదరింపు! నీకుఁ దెలియ దనిన వినెదవా? చూడుము.

అని యాయుత్తర మామెముఖముపై విసరెను.

ఆయుత్తరమును చంద్రముఖి విడఁదీసెను. రామలక్ష్మి తెల్పినటులనాయుత్తరములోనివ్రాత బ్రహ్మవ్రాతవలెనుండుటకు మారుగానందలియక్కరములుముత్యములఁబోలిముద్దులొలుకు చుండెను. చదువుటమొదలుపెట్టుటకు ముందట్లసత్యమాడినందుల కాముదుసలివైపు చంద్రముఖి బొమముడిపాటుతోఁ

జూచెను కాని యామె యప్పుడే వీధియరుగు నధిష్ఠించి,యుత్త
రముఁదెచ్చిన వానితో మాటలాడుచుండెను.

"శ్రీమతి చంద్రముఖిదేవికి" ఆయుత్తరమట్లే మొదలు
పెట్టఁబడియెను. ఆయుత్తరమును పూర్తిగఁ జదువకుండగనే
యెవరు వ్రాసిరో యని తత్తఱముతో క్రిందనున్న సంతకమును
చంద్రముఖి చూచెను."శశిభూషణునివ్రాలు" అని యుండెను.
చంద్రముఖి తదేకదీక్షతోనాయుత్తరము నిట్లు చదువుకొనెను:

"శ్రీమతి చంద్రముఖి దేవికి"

మామామయగు రామదాసు చాలజబ్బుతో మంచము
మీద నున్నాడు. ఆతనిస్థితి యేమియును బాగుగాలేదు. వై
ద్యులుకూడ నిరాశఁ జెందుచున్నారు. నే నిచ్చటికి వచ్చి
మూడుదినములైనది. ఆతని యవసాన గడియలలో నిన్నును
మీయవ్వను నొకసారి యాతఁడు చూడవలయు నని కోరుచు
న్నాడు. ఈయుత్తరముఁ జూచిన తక్షణము మీరు బయల్వెడలి
రావలయును.

"మీయవ్వ వెనుకటివలె ననేకయడ్డములుచెప్పఁబ్రయ
త్నించినను, నీవామెతోఁగలియక మృతినొంద సిద్ధముగానున్న
ట్టియు, నీకుఁ బితృసమానుఁడ నైనట్టియు నాకోరిక రిత్తపోకుం
డఁగాపాడెదనని నమ్మకముతోనుంటిని" అని మామామ వ్రా
యుమనినాడు. వచ్చునపుడు తప్పక మీయవ్వనుగూడఁ దీసి

కొనిరావలయు నని యాతనికోరిక. ఆమెతో మాటాడవలసిన వ్యవహారములు చాల నున్నవట.

శశిభూషణునిప్రాలు.

ఉత్తరము మిగుల జాలికరముగ నుండుటచే నొక్కసారి పోయి, రామదాసును దప్పకఁ జూడనలయునని చంద్రముఖి సంకల్పించుకొనెను. అది చదివి ముగించునప్పటి కాబాలిక నేత్రద్వయమునం దశ్రువులు బిందురూపము వహించెను. ఆమె యుత్తరమును గైకొని రామలక్ష్మియొద్దకు వచ్చెను.

అవ్వామన స్సెటులుండునో యూహించుట సులభము. చౌర్యము చేసి పటువడినవాని హృదయమువలెనే, యామె హృదయముకూడ కడువేగముగఁ గొట్టుకొనుచుండెను. చంద్రముఖి తప్పక తన్నవమానపఱచునని యామెతలఁచెను. కాని యటుల జరుగలేదు. సరళహృదయయగు నాబాలిక ఏల యిట్లసత్యమాడితివి? అని యడుగనేలేదు.

"నీయభిప్రాయమేమి? బయలుదేరిపోవుదమా?" యని మాత్ర మడిగెను.

అవ్వయు మొదట నటుల మాయ చేయకపోయినయెడలఁ దప్పక నడ్డుచెప్పి, ప్రయాణము సులభముగా సాగనీయక పోయియుండును. కాని యిప్పుడంతయును మారినది. అయినను రామలక్ష్మి యూరకుండలేదు.

"ఇంత చీఁకటిలో నీరాత్రివేళ నెచ్చటికిఁ బోవుదము? ఉదయముననే బయల్వెడలి చూచివత్తము" అనెను.

"చీఁకటియేమి? పుచ్చపువ్వువలె వెన్నెల కాయుచుండఁగా? ఇప్పుడు పోయినయెడల మరల నుదయముననే బయలుదేరి రావచ్చును.—ఏమి అబ్బీ! రామదాసుగారి కేలాగున నున్నది?" అని చంద్రముఖి ప్రశ్నించెను. దానికి నాతఁడు "నాకుఁ దెలియదండి. అబ్బాయిగారే డ్చుచు నీయుత్తరము నిచ్చినారు" అని ప్రత్యుత్తరమిచ్చెను.

రామలక్ష్మియు నడ్డుపెట్టిన కార్యము లేదనుకొని మాటలాడక ప్రయాణమునకై సిద్ధపడుచుండెను. నాల్గుమెతుకుల నోట వైచుకొని, మఱికొంత సేపటికి వారిరువురును బయల్వెడలి, కాలినడకనే యామనుష్యునివెంటఁ బడి ప్రయాణము సాగించిరి.

రామదాసిల్లెచ్చటనున్నదో వారికిఁ దెలియకపోవుట చేతను, నిశాసమయ మగుటచేతను వా రామనుష్యుఁడు చూపినదారినే చాలదూరము ప్రయాణము సాగించిరి.

వారి కేవిధమైన యనుమానమును కలుగలేదు. దారిలో వారి నెఱిఁగినవా రెవరును బలుకరింపలేదు. అందుచే వారు విలాసభవనమే ప్రవేశించినను రామదాసుదే యాభవన మని మాటలాడక యూరకుండిరి.

పాఠకమహాశయు లీ వేషమును ధరించినవాఁడు కృత్రిమవేషములయందు రామదాసునకుఁ దీసిపోని, విజయమోహనుఁడుతక్క మరియొకఁడు కాఁడని గ్రహించి యుందురు. తన యనుచరులు బంధింపఁబడిననాటిరాత్రి యానందమోహనునితో జరిపిన సంభాషణయొక్క పర్యవసానమే యిది!

వారినిరువురను విజయమోహనుఁడు మొదట హైమవతియున్న భవనమునకుఁ దీసికొనిపోయెను. ఆమాయలాఁడియు వీరిని గౌరవించి కూర్చుండఁ జేసెను. ఆమెకుఁ గూడ నీకపట తంత్రమంతయుఁ దెలిసియేయుండెను. రామలక్ష్మికి మాత్రమి దంతయుఁ జిత్రముగా నుండెను.

"రామదా సెచ్చట?" అని యామె ప్రశ్నించెను. ఆ ప్రశ్నకు విజయమోహనుఁడును, హైమవతియు నొకరినిఁ జూచియొకరు నవ్వుకొనిరి. ఏదియో పొరబాటు జరిగెనని యామెగ్రహించి మరల నావిధముననే ప్రశ్నించెను.

"రామదా సిచ్చటలేఁడు. అవతలిగదిలోఁ బరుండియున్నాఁడు. నే నొకపర్యాయము చూచి వచ్చెదను. మీ రిచ్చటనే యుండుఁడు" అని విజయమోహనుఁ డానందమోహనుని యొద్దకుఁ జనెను. ఈతఁడు వచ్చినవెంటనే "కాయా, పండా?" అని యాదోగి ప్రశ్నించెను. విజయమోహనుఁడు నవ్వుచు "ఆముసలిదియుఁ జంద్రముఖియుఁ గూడ హైమవతియొద్ద

నున్నారు. ఇక నేఁజేయవలసినదేమి?" అని విజయమోహ నుఁడు ప్రశ్నించెను.

"ఆముసలిదాని నొక్కతెను ఇచ్చటికి తీసికొనిరమ్ము. రామదాసు నీతో నొంటరిగా మాటలాడవలయు ననుచున్నాఁడని చెప్పుము" అని యానందమోహనుఁడు విజయమోహనునిఁ బంపెను. చంద్రముఖి యెంత పట్టుపట్టినను సరకు చేయక విజయమోహనుఁడు ముసలిదానినొకతెను దీసికొనివచ్చెను.

ఆకప్పుకొని పరుండినది రామదాసేయని మొదట మన యవ్వ తలఁచెను. కానియాతఁడు ముసుగుఁ దీసివైచిన వెంట నే, నల్లగాఁ గొఱవివలెఁ బడియుండిన యానందమోహనునిఁ గాంచి, పూర్తిగా ననుమానముఁ జెంది, రామలక్ష్మి వెఱ్ఱి చూపులు చూచుచు నిలువఁబడియెను. ఆనందమోహనుఁ డామె నొకయాసనముపైఁగూర్చుండ నియమించి "అవ్వగారూ! మిమ్ముల నిట్లుమోసముచేసి తీసికొని వచ్చినందులకు క్షమింప వలయును." అనెను.

రామలక్ష్మికి భయము హెచ్చెను. ఆనందమోహనుని సంభాషణ యెంత మృదువుగా నున్నను యాతని వదనము మిగుల భయంకరముగా నుండెను. అంతియకాక మోసమను మాటవిని యామె మఱింతభయపడుచుండెను. కాని యాతడు చెప్పుమాటల నన్నిటిని, చివరవఱకు నడ్డము చెప్పక యోపి

కతో మాత్రము వినెను. ఆనందమోహనుఁ డీక్రిందివిధమున మరల మొదలిడియెను.

"మిమ్ములను మోసమే చేసితిమి. కాని మీకుఁ జాల లాభమును గలిగించుటకే! మీకుఁగాని యా బాలికకుఁగాని మే మెట్టిహానియుఁ జేయము. అందుచే నామాటలను మీరు సావధానచిత్తముతో వినఁ బ్రార్థించుచున్నాను. మీరు విని నటుల రామదాసున కెంతమాత్రమును జబ్బు లేదు. ఆతఁడు సుఖముగానే యున్నవాఁడు. మిమ్ముల నిటకు రప్పించినది రామదాసును జూచుటకుఁగాదు. రామదా సింతకుముందు మీతో మాటలాడినపుడు చంద్రముఖిని దన వెంటఁ బంపుమని యడిగెను. మీరు నిరాకరించితిరి. తరువాత నా బాలిక రహస్యమేదో చెప్పుమని మిమ్ములను జాలఁ బీడించినది. లేనియెడల రామదాసునే యడిగెద ననినది. అవునా?" రామలక్ష్మి తల నూఁపెను.

"మీరుఁ గొంతసేపైన వెనుక నారహస్యమును చెప్పితిరి. అది విని యాబాలిక చాల భయపడెను. ఇంకను దాఁప నేల? ఆరహస్యమును నేనుకూడ వింటిని. నాతో నది యాగ లేదు. నేను చెప్పవలసినవారికిఁ జెప్పివైచితిని. మీరుకూడ నేను చెప్పుమనినవారికిఁ జెప్పవలయును. ఆరహస్యమును వెలి బుచ్చినందులకు మీకు యావజ్జీవమును సుఖముగాఁ దినుట

కొను మీచంద్రముఖి కిచ్చుటకును వలసినంతధన మిచ్చెదము. ఏమి! చెప్పెదరా?"

ఈకథనంతటిని మిగుల భయముతోడను, ఆశ్చర్యముతోడను రామలక్ష్మివినెను. ఆమె కొంతసేపటివఱకును మాటలాడ లేకపోయెను. ఎట్టకేలకు "ఈరహస్యము రామదాసు ప్రాణములతో సరియైనది. దీనిని వినినయెడల నాతఁడు నిజముగాఁ జనిపోవును. నేను మఱియొకరితోఁ జెప్పఁజాలను. మీరుకూడ వినినయెడల దాచియుంచవలయునని నాప్రార్థన. అని ముసలియామె కోరెను.

"దాచియుంచుటయా? త్రాఁచుపామును బ్రక్కనిడికొని యెవరు నిద్రింతురు? దుర్మార్గున కేనిముసమునం దెట్టిబుద్ధి పుట్టునో యెవరు చెప్పఁగలరు? మీరీరహస్యమును వెల్లడిచేయక తప్పదు!" అని యానందమోహనుఁ డుద్రేకముతోఁ బల్కెను. "నన్ను పోనిండు. తరువాత నాలోచించుకొనియెదను. మీరు మరల మాయింటికి రండు. అచట నేను చెప్పెదను." అని యవ్వ మారుపల్కెను.

"మీయింటికా! వీలులేదు. మీరిచ్చట నున్నట్లు రామదాసునకుఁ దెలియదు. మిమ్మాతఁడు రక్షింపఁజాలఁడు. ఈరహస్యమును నేను వెల్లడిచేయుమనిన వారికి వెల్లడిఁ జేసిననే మీయిల్లు! లేనియెడల నిదే మీగృహము. మిమ్ములను జెప్ప

నంతవరకుఁ బోనీయము. మీ రాబాలికతో నాలోచించుకొ నుఁడుపొండు." అని యానందమోహనుఁడామెను పంపివైచెను.

మరల చంద్రముఖినిఁ గాంచినపుడు రామలక్ష్మి యొక వెఱ్ఱికేకను వైచెను. ఆకేకనే రామదాసు వెనుక వినెను.

## నలువది యొకటవ ప్రకరణము

పాఠక మహాశయులారా! మనము రామచంద్రనగరము వైపు చూచి చాలదినము లైనది. వెనుక వర్తకు లరుదెంచి జయచంద్రునితో హైమవతికిఁ గల్గిన యవమానమును దెల్పు టయు, నందులకు జయచంద్రుఁడు మిగులఁ గోపముఁ జెంది, శ్యామసుందరిపై పగదీర్చుకొనుటకు సంకల్పించుటయు మనము చూచియుంటిమి.

హైమవతికొఱకై యాతఁడన్నివైపులను వెదకించెను. కానియాతనిప్రయత్నములన్నియు నిష్ఫలము లాయెను. ఆమె యవమానమునుసహింపఁజాలక ప్రాణత్యాగముచేసికొనెనేమో యని జయచంద్రుఁడు తలఁచెను కాని హైమవతి యంతమనో దౌర్బల్యముకల యాఁడుది కాదని మరల ధైర్యముఁ దెచ్చికొ నెను. ఎచ్చటనో బ్రదికియే యుండునని యాతనితలంపు. కాని చాలకాలమువరకును వారి కెట్టిసంగతులును దెలియలేదు.

పాపము! జయచంద్రుని కొక్కతెయే కొమరిత. ఆమెకు వైధవ్యావస్థయే కాకుండ, శ్యామసుందరివలనఁ బొందిన దుర్భరావమానమునుజూచి యాముదుసలి కడుంగడు విచారించెను. తనతండ్రి భార్య యను గౌరవమేమియును జూపక, సామాన్యస్త్రీని బహిష్కరించిన ట్లామెను బహిష్కరించుటచే జయచంద్రుఁడు పల్వాలరాణిపైఁ ద్రిప్పరాని శత్రుత్వమును వహించెను. ఆతనికోపాగ్నిని దురాశాపీడితుఁ డగు రాజసింహుఁడు మరింత ప్రజ్వలింపఁజేయుచుండెను. శ్యామసుందరికి తప్పక బుద్ధిచెప్పవలయుననియును, దనసోదరి నట్లవమానపఱచుట తమ్మవమానించుటయే యనియును, రామచంద్రనగరము నాశనమైనను బల్వాలరాజ్యముపై దండెత్తుటతప్పదనియు, రాజసింహుఁడు తనతండ్రిని చెవి నిల్లుగట్టుకొని పోరుచుండెను. ఎట్టకేల కా వృద్ధుఁడును దాని కియ్యకొని, తనకు మిగిలినయాయుర్భాగ్యముల నాప్రయత్నమునందే వ్యయపఱుపఁ దలఁచికొనియెను. అందుకొఱకే వారు తమసైన్యమును బలపఱచి మంచిస్థితిలోనికిఁ దెచ్చిరి.

రామచంద్ర నగరమునకుఁ గొంతదూరమున, భయంకరమైన పర్వతములు నరణ్యములు కలవు. ఆసాంద్రారణ్యభాగములయందు క్రూరు లగు కోయవాండ్రు నివసించుచుందురు. వారికిఁ గ్రమమైన యుద్ధశిక్ష లేకపోయినను, వారు కత్తులను బల్లెములను చాలబాగుగా నుపయోగింపఁగలరు. వారియొద

నుండు విషపూరితము లగు బాణము లిప్పటి తుపాకులకంటె నెక్కువపనిఁ జేయగలవు. వారొకరికి లోఁబడరు. కాని తగి నంతధనమిచ్చి, మంచిమాటలఁజెప్పి వారిసాహాయ్య మెవ్వరైన గోరినచోఁ బెంపుడుకుక్కలవలె ప్రాణములకుఁ దెగించి పో రాడుదురు. అట్టికోయవాండ్రనుగూడ జయచంద్రుఁడు చేరఁ దీసెను.

అందుచే జయచంద్రుఁ డిప్పుడు చాలబలముకలిగియుం డెననియే చెప్పవచ్చును. ఇంతసైన్యమున్నను బల్లాలరాజ్య ముతో డీకొనుట స్వల్పకార్యముకాదని యాతనికిఁ దెలియును. అందుచే నూయోపాయంబు లేమైన నున్నవేమో యని యూ తఁడు వెదకుచుండెను.

ఇటులఁ గాలము గడచుచుండ నొకదినమున సేవకుఁ డొకఁడరుదెంచి పల్లాలనుండి యొకఁ డుత్తరముఁ దెచ్చెననియు రాజదర్శనముఁ గోరుచున్నాఁడనియుఁ దెలిపెను. రాజున కదే ధ్యానమగుటచేనాసందేశహరునకువెంటనేయాతనిదర్శనభాగ్య మబ్బెను. ఆమనుష్యుఁడును జయచంద్రునకు నమస్కారముఁ గావించి తనయొద్దనున్న యుత్తరము నిచ్చెను. ఆయుత్తరము హైమవతిచే వ్రాయఁబడెను. జీవించియున్నదో లేదో యని భయము నొందుచున్నపు డామెయే స్వహస్తముతో వ్రాసిన యుత్తర మావృద్ధరాజునకు మిగుల సంతసము కలిగించె నని

వేఱుగా వ్రాయ నక్కఱలేదు. దానిని తనపుత్రున కిటుల బిగ్గరగాఁ జదివి వినిపించెను.

ప్రియజనకా!

తమ కిన్ని దినములవఱకును నాసంగతి నేమియును దెలియఁజేయక యుండినందులకుఁ దమరు నన్ను మనస్ఫూర్తిగా క్షమించినఁగాని నేను బ్రదుకఁజాలను. నేనింతకుఁ బూర్వమే యనేకకష్టములఁ బాల్బడితిని. దానికిఁదోడఁక మీరుకూడ నిర్దయ వహించినయెడల నాకిఁక వేఱుగతిలేదు.

వెనుక నేను మీ కొకయుత్తరము వ్రాసియేయుంటిని. అదే నేను వ్రాసిన కడసారియుత్తరము. మరలనిప్పుడు వ్రాయుచుంటిని. కాని యాయుత్తరము మీ కందకపోవుటయేకాక, మనవిరోధియగు "శ్యామి" చేతఁబడినది. ఆయుత్తరమును జూచి, నే నొకరాజద్రోహినని తలఁచి నన్నూరినుండి వెడలింప నామె సమకట్టినది. అంతియకాక, రామచంద్రుఁ డాయుత్తరమును రామచంద్రనగరము పంపించుట కియ్యకొనెనని, శ్యామసుందరి మాతనిని కారాగృహమున నుంచినది. దీనికంతకును ముఖ్యకారకుఁడు రామదాసను రక్షకభటాధికారి. వానికి పోగాలము సమీపించినది లెండు!

న న్నే దినమున, పట్టణమునుండి వెడలింప యత్నించిరో యా దినముననే యొక గొప్పవిచిత్రము జరిగినది. దానివలన

నేనే నిటుల క్షేమముగానుంటిని. ఆవిచిత్రమేదన, నొక కళింగ దేశపు రాజకొమరుఁడు నన్ను రక్షించినాఁడు. ఈవిజయమోహనుఁ డను రాచకొమరుఁడు పల్వొలవచ్చి సంవత్సరము దాఁటినది. ఆతనికి భాగ్యమునందుఁ గుబేరుఁడును, సద్గుణముల యందుఁ బ్రహ్లాదుఁడును తక్క మఱియొక రీడురారు. ఆరాచకొమరుఁడు నన్నూరినుండి వెడలఁగొట్టు టన్యాయమని తలఁచి మిగులదయతో నన్నా యవమానమునుండిరహస్యముగా రక్షించియున్నాఁడు. నేనిప్పు డాతనియింటనే రహస్యముగా నతిథినై యుంటున్నాను. ఆమహాత్ముఁడు నన్నుఁ దనసోదరికంటె నెక్కుడుప్రేమతోఁ జూచికొనుచు, నాకధనంతయువిని మిగుల విచారించెను. శ్యామసుందరికి గర్వభంగముచేయుట కాతఁడు మనకన్నివిధములఁ దోడుపడ సంసిద్ధుఁడై యున్నవాఁడు. ధనికుఁడు గాన ధనము వ్యయపఱచి రాజకీయోద్యోగులను మన వంకఁ ద్రిప్పఁ బ్రయత్నించుచున్నాఁడు. కాని యేకజాతిపక్షులొకేచోట జేరునటుల,యిప్పుడున్న వారందఱును శ్యామసుందరి వలెనే కడుదుర్మార్గులు. ఎట్లైనను దైవము న్యాయపక్షమునే వహించును. భాస్కరుఁ డను నుద్యోగియొకఁడు మనకు సాహాయ్యము చేయుట కియ్యకొనినాఁడు.

మనరక్షకుఁడగు విజయమోహనుఁడు మఱియొక ప్రయత్నము చేయుచున్నాఁడు. రాజ్యమునకుఁ బైనుండియే కాక, లోపలనుండికూడ నటించినయెడల మిగుల ననుకూలముగా

నుండునని తలఁచి మనకుఁ బ్రబలవిరోధి యగు రామదాసు నసహాయునిగాఁ జేయుటకు యత్నము చేయుచున్నాఁము. అన్ని యు నొకేపర్యాయము జరుగవలయును. శ్యామసుందరి రాజ సింహుని వివాహమాడుట కల్లయనియు, రాజ్యమే చేతఁబడ నున్నపుడు, రాణికొఱకేల యాసింపవలయుననియు విజయ మోహనుఁడు పల్కుచున్నాఁడు. అదియునునిజమే! ఆపెం కెప్పిల్ల యేకాని మఱియొకతె మనరాజసింహుని వరింపదా యేమి? దైవకృపవలన నంతయును, గడ్డిమేటిమీద నూనెపోసి యెండఁ బెట్టియుంచినటుల, సిద్ధముగానున్నది. ఇఁక నంటించుటయే మిగిలి యున్నది. మీరును సర్వసిద్ధముఁ జేసికొని నిరీక్షింపు చుండవలయును. నే నేదినమున కబురునుబంపెదనో యాదిన మున బయల్వెడలుటకు సిద్ధముగా నుండవలయును. ఎంతవ్య యమైనను, దొరకినంతవఱకు సైన్యమును సిద్ధముచేయవల యును.

ఎంత వ్యయమైనను మనకు భయములేదు. పలయన రాజ్యము మనచేతఁ బడనున్నది. సామాన్యమైన రాజ్యము కాదు! పల్వాల రాజ్యము. ఇఁక మనప్రయత్నములు కొన సాగుట కెంతయోకాలము పట్టదు. కొలఁది దినములు మా త్రమే!

రాజసింహునకును సర్వసౌఖ్యములుఁ జేకూరవలయునని కోరుచు నింతటితో ముగించు

మీప్రియపుత్రిక

హైమవతి.

హైమవతి హార మావర్తకపుంగవున కెటులవచ్చెనో జయచంద్రున కిప్పుడు బోధపడెను. ఆతఁడు దాని నేల నమ్మవలయునో యని మొదట నాతఁడు చాల నివ్వెఱపడెను. కాని యుత్తరమంతయు ముగించి, జయచంద్ర రాజసింహు లిరువురు నావిచారమును మఱచి పల్వేలరాజ్య మప్పుడే తమచేతఁబడి నటులే సంతసించిరి. విజయమోహనుఁడు త మ్ముద్ధరించుటకు క్రిందికిదిగిన యీశ్వరుఁడే యని యాతనిని పరిపరివిధంబులఁ బొగడిరి.

అంతర్భవనమునకు నడుచునప్పుడు రాజసింహుఁడు చూపిన ఠీవి యింతింతయని వర్ణింప నలవికాదు. మఱునటిదినమున మఱియొక యుత్తరమును గైకొని విజయమోహనుని సేవకుఁడు పల్వేల కేగెను.

## నలువదిరెండవ ప్రకరణము

ఆనందమోహనుని భయంకరవృత్తాంతము నంతయు విని, రామలక్ష్మి మరల చంద్రముఖిని జూచినపుడు ఆమెను

కౌఁగలించుకొని, యొక వెఱ్ఱికేక నిడెననియు, నాకేకను రామదాసు వినెననియు వెనుకఁ దెలిపియుంటిమి. ఆకేక యెవరిదో యని తెలిసికొనుట కాతఁ డనేక విధంబులఁ బ్రయత్నించెను. కాని యాతని కేమియును తెలియలేదు. ఆరాత్రి నిద్రించుట కాతఁడుచేసిన ప్రయత్నము లన్నియు నిష్ఫలము లాయెను. ఎంతచూచినను, నా యార్తనాదమే యాతని వీనులయందుఁ బ్రతిధ్వనించుచుండెను. చివర కాతఁడు లేఁచి, తన మందిరమును వీడి, బయట కరుదెంచి యుద్యానవనమునందుఁ బచారు చేయ నారంభించెను. హైమవతియున్న భవనమున కీవల నొక గోడయున్నదని, చదువరుల కింతకుముందే తెలుపబడియున్నది. తిరిగి, తిరిగి, యలసటచే, రామదా సాగోడక్రిందనే కూలబడెను.

ఆకాశమంతయు వెన్నెలచేఁ జాలనిర్మలముగానుండెను. కాని చెట్లచాటుననుండుటచే రామదాసెవరికి నగపడుట లేదు. ఆవిధమున నాతఁ డటులఁ జాలసేపటివఱకును గూర్చుండి యుండెను. అట్లు కూరుచుండుటయం దాతని కేయభిప్రాయమును లేదు కాని, చివర కాతని కదియే చాల మేలాయెను. ఏలయన నాతఁ డటుల దీర్ఘాలోచనపరుఁడై యుండగా "చంద్రముఖి" యను రామలక్ష్మి కేకను వినెను. ఆ పిలిచినది ఈ మహాలక్ష్మియని యాతఁడు నిర్ధారణచేసికొని రామదాసు మిగుల విషాదభయంబులకు లోనాయెను. చంద్రముఖి యా

కేకకుఁ బ్రత్యుత్తరము నిచ్చుటగూడ విని, రామదాసు తన సందియమును బూర్తిగా నివారణచేసికొనెను. తరువాత వా రేదో మాటలాడుదురనియు, నామాటలవలన వా రిచ్చటి కేల వచ్చిరో తెలిసికొందమనియు నాతఁడు చాల ప్రయత్నించెను. వారిద్దఱునుఁ గలసికొనుట నాతఁడు కనిపెట్టెను. కాని వారి మాట లేమియు నాతనికిఁ దెలియలేదు. చాలతడవటఁ గూరు చుండి యెట్టిలాభమును గానక యాతఁడు మరలఁ దనగది కరు దెంచెను.

తన శయ్యపైఁబరుండి సూక్ష్మబుద్ధియగు నా రక్షక భటాధికారి వారిరాకకుఁగల కారణమెద్దియో యని పరిపరి విధంబులఁ జింతింపఁ దొడంగెను.

విజయమోహనుఁడు సామాన్యుఁడు కాడు. వాని తెలివి తేట లత్యద్భుతములు. చంద్రముఖి రూపముఁజూచి దురుద్దేశ ముతో నామె నిటకుఁ గొనివచ్చెనా? అట్లైన నాముదుసలి కూడ నేల నరుదెంచును? చాల మాయగా నున్నయది. ఆమెను మోహించి తెచ్చెననుట కల్ల! ఏలయన నత్యంత విలాసవతియు, జగన్మోహన సౌందర్యరాశియు నగు హైమవతి నే చెట్టబట్టినవాఁడు చంద్రముఖికై చేయిఁజాపఁడు. అట్టిపనికి హైమవతియు నియ్యకొనదు. మఱియేలఁ దెచ్చియుండును? నాగుట్టు నేమైన బయలుపెట్టుట కామె నిట నిర్బంధించి యుం

డునా? నా రహస్యమును దెలిసికొనిన దీ ముదుసలి తక్క, బళ్ళాల పట్టణమున మఱియెవరును లేరు. ఈసంగతి నెటులైన విజయమోహనుఁడు గ్రహించియుండునా?

తలఁచుకొనుట కీ విషయమెంత విపరీతముగా నున్నను నంత యసందర్భము కానేరదు. విజయ మోహనునివంటి య సాధారణ ప్రజ్ఞగలవాఁ డీరహస్యము నెటులనో గ్రహించుట యు వింతకాదు. ఈతని యోజనయంతయు నన్నెటుల నంత మొందింప వలయుననియే! నన్నెటులనో నాశనముచేయుట కీతఁడు సర్వయత్నములఁ జేయుచున్నవాఁడు. నా గుట్టునైన బయటపెట్టి, నాపైఁ బగసాధించుకొనుట కీ రామలక్ష్మిని, చం ద్రముఖిని రప్పించి యుండవచ్చును. నాప్రాణముల నపహరించు యత్నములు భగ్నమైనవని యీయెత్తు నెత్తియుండవచ్చును.

సరే! ఇదే నిజమైనచో నాపని యేమగును? పళ్ళాల పట్టణవాసు లీ కథను విశ్వసించెదరా? రామలక్ష్మి నిదర్శన పూర్వకముగా నిరూపించిన ప్రజలు విశ్వసింపవచ్చును. అటు లైన విజయమోహనునిఁ బెంద్రలకడనే చెఱకంపవలయును. అటులైన నాకు భయముండదు.

ఈతఁడే హేమచంద్రుని వెంకటప్పయ్యను హత్యఁజేసి నటుల నిరూపింపవలయును. అట్టిసమయమున నాగుట్టుఁ బైట పెట్టుటకు విజయమోహనుఁడు సంకోచముఁ బొందఁడు.

అందువలన దానికిఁగూడ నేదైన నుపసంహారాస్త్రమును బ్రయోగింపవలయును. ఇట్టి యాలోచనలతో రామదాసు రాత్రి చాలవఱకుఁ గడపెను. చివర కెందులకైనను మంచిదనియును, దానుండినను లేకపోయినను బనిఁజేయు ననియును, విజయమోహనుఁడే హత్యలను చేసినవాడని నిరూపించెడి నిదర్శనముల నన్నిటిని పత్రములపై వ్రాయసమకట్టెను. ఆ ప్రయత్నమున పూర్వపుసంగతుల ననేకములు జ్ఞప్తికిఁదెచ్చికొని విజయమోహనుని చర్యనంతయును మొదటినుండియు విమర్శించి చూచెను. ఆతని విస్మయమున కంతులేకపోయెను. ఏలనన, ప్రతిహత్యలోను నీ దుర్మార్గుఁడు తన ప్రభావమును బ్రకాశింపఁజేయుటకో యన, హంతకుఁడు నేనే యనునటులఁ దన్నుదానే ప్రదర్శించికొనుచువచ్చెను. కాని యప్పుడీతఁడు, రాజవర్తకుఁడనియు, న్యాయస్థుడనియు తలపఁబడుటచే నా నిదర్శనములు పనిచేసినవి కావు. కాని యిప్పు డటులఁగాదు.

రామదాసు తాను దలంచినదంతయు వ్రాసిముగించునప్పటి కుదయకాంతు లాకసమునఁ దాండవమాడుచుండెను. వ్రాసి పూర్తిచేసిన దానిని మరల నొకపర్యాయము చదివి ముగించి యాతడు మరల నిదురకై మేనువాల్చెను. రాత్రి యంతయును జాగారము చేయుటచే నిదుర యాతనికి వెంటనే యావహించెను.

# నలువదిమూడవ ప్రకరణము

మరల రామదాసు లేచునప్పటికి చాల ప్రొద్దాయెను. కాల్యంబులఁ దీర్చికొని మరల రాత్రి సంగతులన్నియు జ్ఞప్తికి వచ్చుచుండుటచే నప్పుడప్పు డులికిపడుచు, కోటయ్య యుద్యానవనమునఁ దిరుగుచుండెను. విజయమోహనుఁడు, చంద్రముఖి కేమైన నపకారము చేయునేమో యనుభయ మాతనికి మెండాయెను. అట్టిదేదైనఁ దటస్థించినయెడలఁ దాను రామదాసు వేషముతో నా హంతకుని బింక మప్పుడే యణఁచవలయునని యాతఁడు నిశ్చయించుకొనెను.

ఆ పగలెట్టి విశేషములును జరుగలేదు. సాయంతనము శశిభూషణున కాహారముఁ గొనిపోవుటకుఁ దాళముకొఱకై కోటయ్య విజయమోహనుని యొద్దకువచ్చెను. విజయమోహనుఁడును, నానందమోహనుఁడు నేదియో మాటలాడు కొనుచుండిరి.

తన యనుచరులు బంధింపఁబడుటకు కారణము కోటయ్యయే యని మొదట విజయమోహనుఁడు యానంద మోహనుఁడును తలఁచియుండిరి. కాని వా రనుకొనినటుల రక్షకభటులుగాని, రామదాసుగాని, విలాసభవనమునకు రాలేదు. మఱెట్టి యలజడియును జరుగలేదు. కోటయ్యకూడ చాల నమాయకునివలెనే గన్పట్టుచుండెను గాని, యేవిధమైన కుతం

త్రము నాతనియొద్దఁ గాన్పించుటలేదు. ఆ కారణములచే శశి భూషణున కాహారమును గొనిపోవుటకు మరలఁ గోటయ్యనే నియోగించిరి.

కోటయ్య తాళముకొరకై వచ్చినపుడు "నీవా బాలునితో నెట్టిమాటలను జెప్పవలదు. లన మామను బంధించుటకుఁ బోయిన మనవారు బంధింపఁబడిరను సంగతికూడ నాతనికిఁ దెలియనీయవలదు" అని యానందమోహనుఁ డాజ్ఞాపించెను.

"అతఁడు మన విరోధియని నాకుమాత్రము తెలియదా? మీరు నన్ను వట్టి వెఱ్ఱివానిగను ద్రోహిగను తలఁచుట నా దురదృష్టమే" అని కోటయ్య దీనవదనుఁడై ప్రత్యుత్తర మిచ్చెను. ఆమాట కానందమోహనుఁడు, విజయమోహనునిఁ జూచి, తాము కోటయ్యవిషయమున పొరఁబడితిమని సూచించుటకో యనునటుల నొక చిఱునవ్వు నవ్వెను. అధికారి మందహాసమున కమందానందమందు సేవకునివలె, రామదాసునుఁ దాళముచెవినిఁ గైకొని సంతుష్టాంత రంగుఁడై వెడలిపోయెను.

ఎప్పటివలె ద్వారములన్నిటినిఁ గడచి, రామదాసు శశి భూషణునిఁగాంచి, యాతనికి వలసినంత యాహారము నిచ్చెను. ఆతఁడు దానిని భక్షించినవెనుక

"శశిభూషణా! విజయమోహనుఁడు సామాన్యుఁడు కాఁడు. వీనికి నిజముగాఁ బరుల మనస్సులం దిమిడియున్న యాలోచనలను, రహస్యములనుగూడ గ్రహించుశక్తి యున్నది." అని రామదాసు పలికెను.

ఏమి? నిన్నానవాలు పట్టెనా? అని శశిభూషణుఁడు ప్రశ్నించెను.

"కాదు. చంద్రముఖిని, రామలక్ష్మిని మాయోపాయముచే నిచటికిఁ దీసికొని వచ్చినాఁడు." అని రామదాసు సమాధానమిచ్చెను.

దానిని విని శశిభూషణుఁ డప్రయత్నముగా లేచి నిలువబడి,

"మన చంద్రముఖినేనా? దుర్మార్గుఁడు? హంతకుఁడు మామా! వీనియాట లింకను నెంతకాల మిటులసాగుట! మీరేల యిట్లశ్రద్ధ వహించుచుంటిరి? అంతయు నైనవెనుక మనము చేయునదేమి? చంద్రముఖినిఁ దీసికొనివచ్చుట వీనికేల? నీచురాలగు హైమవతినిఁ జేసినట్లులే చంద్రముఖినిఁగూడ చేయదలఁచెను కాఁబోలు! కాని నామేనఁ బ్రాణముండ, నీ తుచ్ఛుఁ డామెను స్పృశింపకలఁడా?" అని శశిభూషణుఁడు క్రోధముతో ననుటలో వింత యేమియును లేదు. తన్ను బంధించుటకైన, శశిభూషణుఁడు సహించెను! తన మామ నాతఁడు

బాధింప యత్నించెనని విని సహించెను. తన రాణియగు హైమవతి కులపతి యగుటకు సహించెను. కాని తా నెవ్వతెను భార్యగాఁ బడయఁగోరుచుండెనో, యెవ్వతెరూపము తనకనుల యెదుట నిత్యమును తాండవమాడుచుండెనో, యెవ్వతె నామ స్మరణ మాత్రముననే తనశరీరము పులకాంకితమగుచుండెనో, యెవతెను తాను ప్రాణములకంటెను మిన్నగాఁ జూచికొనుచు నుండెనో, యట్టి చంద్రముఖి నవమానముచేయుటకే, విజయ మోహనుఁడు బలిమినిఁ బట్టితెచ్చెనని విని యాతఁడు సహింప లేక పోయెను.

కాని రామదాసు యాలోచన యట్టిదికాదు. వారిని రావించుటకు వేరు కారణ మున్నదని యాతనికిఁ దెలియును. అందుచే "శశిభూషణా! ఇప్పుడుకలిగిన తొందరెద్దియునులేదు. చంద్రముఖి నాతఁడవమానించుటకై కొనిరాలేదు. అదియును గాక నే నశ్రద్ధ వహించుచుంటినని నీవు తలంపవలదు. నీకుఁ దెలియని కష్టము లనేకములు నన్నావరించికొనియున్నవి. అవి నీకే క్రమముగాఁ దెలియగలవు. వీరి నందఱిని బంధించుటకు నేను జేసే ప్రయత్నించెదను. మిమ్ముల నందఱను రక్షించె దను. ఈ హంతకులకుఁ దగినశిక్ష వేయింతును. ఇంతటితో నా కథ ముగియును. నా చిత్రకథకు కడపటిరంగ మిదియే యగును. నేను నీతో నిదివఱకే తెల్పినటుల నే నింతటినుండి నీ యుద్యోగమునుండి విరమింతును. దానికిఁగల కారణములు

మున్ముందు నీకే తెలియఁగలవు. ఒకవేళ, నేఁకారణముచేతనైన ను నిన్నను చంద్రముఖిని విడిపించిన తరువాత నేను నీకనుఁ బడక పోయినప్పటికిని, నీవు విచారింపక చంద్రముఖినే వివాహము జేసికొనుము. ఆమె నాకుఁ బుత్రికా సమానురాలు ! నీవు నంతియే ! అందుచే మీరిరువురును సుఖముగా వివాహముఁ జేసికొని నా యాస్తి ననుభవించుచుఁ బుత్రపౌత్రాభి వృద్ధిగా వర్ధిల్లుఁడు ! ఇదిగో, ఈపత్రములకట్టను నీయొద్ద నునిచి కొనుము. నిన్నరాత్రియంతయు నిదురమాని దీని నన్నిఁటిని వ్రాసితిని. ఇందు, విజయమోహనుఁడే హంతకుఁడని నిదర్శన పూర్వకముగాఁ జూపితిని. నేను రేపే రక్షకభటులతో వచ్చి వీరినందఱిని బంధించెదను. విచారణ సమయమున నేను లేని యెడల నాకుబదులుగా నీవే యీకాగితములను రాణికిమ్ము. నీవే నిజముగా వీరు బంధింపఁబడుటకు మూలకారణము. నాకుఁ బ్రొద్దుపోవుచున్నది. నేనికఁ బోవుచుంటిని. పత్రములు జాగ్రత" అని తలుపును మూసివైచి రామదాసీవలకు వచ్చెను.

శశిభూషణుఁడు నిలువఁబడియేయుండి "మామా ?" యని కేకవైచెను. గంభీరహృదయుఁడగు తన మామకు లోపల నేదియో గొప్పవిచార ముండినటుల నాతఁడు మరల రెండవసారి కనుపట్టెను. "ఈతని బహిరంగ గాంభీర్యమునకుఁ దీసిపోని, యాంతరంగిక దీర్ఘవిచార మెద్దియో నీతనిని బాధించుచున్నది. ఇన్నిదినములనుండి తనతోనున్నను నాకేమియుఁ

దెలుపకపోవుట కెద్ధియో తగినంత కారణముకూడ నుండి యుండవును" అని శశిభూషణుఁ డనుకొనెను.

రామదాసటుల తొందరగా బయల్వెడలి, యుద్యాన వనమున నున్నద్వారము నొద్దకువచ్చి దానికిఁ దాళము వైచుచుండెను. ఆసమయమున నటరామలక్ష్మి ప్రత్యక్షమాయెను. రామదాసావిషయము నెఱిఁగియుండియు నామెనుఁజూచి నిర్ఘాంతపోయెను. తానామెను తప్పక పలుకరింపవలయు నని తలచెను. కాని యామె మిగుల చాదస్తురాలు. వ్యవహారము త్వరలో ముగించుట యామెకుఁ జేతకాదు. నేను రామదాసు నని చెప్పిన నాశ్చర్య సంతోషములతో నీమె గట్టిగా కేకనిడిన యెడల గొంప మునుఁగును. కాని యెట్టులో నామెతో మాటలాడకఁ దప్పదని యాతఁడు నిర్ధారణ జేసికొని, నలువంకలఁ జూచి, యెవరు నగపడకపోవుటచే మిగుల సంతసించెను.

సాధ్యమైనంతవఱకు మంచిమాటలచేతనే కార్యము నెఱవేర్చికొనవలయునని విజయమోహనుని తలంపు. అందువలనఁ జంద్రముఖిని రామలక్ష్మిని, దాను కష్టపెట్టుచున్నటులఁ గాని, నిర్బంధములో నుంచినటులఁగాని, పైకెంతమాత్రమును దెలియనీయకుండ నుండెను. ఆమె యిచ్చవచ్చినటులఁ జేయవచ్చును. తిరుగవచ్చును. మాటలాడవచ్చును. కాని విజయమోహనుఁ డామెపై నొకకన్నుంచక పోలేదు. రామదాసామెనుఁ జూచినపుడు గూడ నాతఁ డామెను వెన్నంటి

యే యుండెను. కాని చెట్లచాటున నుండుటచే నాతఁ డెవ్వ
రికి నగపడుటలేదు. అందువలన రామదా సచ్చట రామలక్ష్మి
తప్ప మరెవ్వరును లేరనియే భావించెను.

రామలక్ష్మి మెల్లగా సింహద్వారము వంకకు నడచు
చుండెను. రామదా సామె సమీపముననే యుండెను వారి
వెనుక విజయమోహనుఁడు తప్పటడుగు లిడుచు ధ్వని యేమి
యుఁ గాకుండ నడచుచుండెను.

రామదాఁసా యవ్వచేతిని పట్టుకొనెను. "అవ్వా!"
యని తన సాధారణధ్వనితో సంబోధించెను. ఆ వికృతవేష
ధారినిఁజూచి, రామలక్ష్మి భయపడి, యెలుగెత్తియఱచుటకుఁ
బ్రయత్నించెను. కాని యాతఁ డామెనోరునుమూసి "నేను!
రామదాసును" అని చెవిలో మెల్లగా నూఁదెను. "నీవా!—
ఆ!" యని యవ్వ చాల నిశ్చేష్టపడెను. "నేనే!" గట్టిగ నర
వబోకుము. మూడే మాటలు నీ విచ్చటికేల వచ్చితివి? అని
దాసు ప్రశ్నించెను. రామలక్ష్మి,

"మరల దొంగలతోఁ జేరితివా? పుట్టినబుద్ధి పుడకల
తోఁ గాని పోదు" అనెను.

"నాకునీతోఁదీరికగా మాటలాడుటకు వ్యవధిచాలదు.
నేను మిమ్ములను రక్షించెదను. నీ వెందులకు వచ్చితివో
చెప్పుము. ఊ!" అని రామదా సామెను యాజ్ఞాపించెను.

"నీ నిజరూపమేదో, నీవసలెవరవో, వారుచెప్పవలెనని వారి కందఱికిని, దెలుపవలయునని, యిచ్చటి వారు నన్నాజ్ఞా పించుచున్నారు. లేనియెడల నన్నిచ్చటనేయుంచి కదలనీయ రట. నీకు జబ్బుగా నున్నవను యుత్తర మొకటితెచ్చి నాకుఁ జూపి నన్నిచటి కావిజయమోహనుఁ డనునాతఁడు తీసికొని వచ్చినాడు" అని రామలక్ష్మి నాలుగుముక్కలలో ముగించెను.

ఈ చిత్రమంతయుఁ జిత్తరవువలెనే నిలువఁబడి, చిత్త విభ్రమముతో విజయమోహనుఁడు చూచుచుండెను. కోట య్య మాయవేసముతో నుండిన రామదాసా! రామలక్ష్మి యీమాటల ననునప్పటి కాతఁ డట నిల్వలేకపోయెను. వెం టనే రామదాసును బంధించి, ముప్పతిప్పలఁ బెట్టవలయునని విజయమోహనుఁడు తలచి యొక్క యుల్లంఘనమున రామ దాసుపైఁ బడెను.

"ఇన్ని దినములనుండియు నీవేనా? ఇపుడేమి చేయఁ గలవు" అని విజయమోహనుఁ డనెను.

అత్యద్భుతసంఘటనము! సమాన బలవంతు లిరువురు నొకరినొకరు తెలిసికొని బయటఁబడిరి. ఇద్దరికిని యొకరినొకరు చంపవలయునను కోరికయుండెను. ఒకరిసంగతి యొకరికిఁ దెలి యును. కాని యిరువురు నిన్నిదినము లొక్కచోటనే యొక్క పనినే చేయుచునుండు టెంతయద్భుతము! విజయమోహ నుని కసంఖ్యాకములగు నాలోచనలు పుట్టుచుండెను. ఈతనినే

రామదాసును బంధించుటకుఁ బంపుట, శశిభూషణున కాహార మిడుటకుఁ బంపుట మొదలగు సంగతులన్నియు జ్ఞప్తికి వచ్చి యాతనిని వెఱ్ఱివానివలెఁ జేయుచుండెను. "ఎంత మాయలో బడిపోతిని !" అని యాతఁ డనుకొనెను.

అటుల రామదాసుపైనురికి, యాతని హస్తద్వయమును విజయమోహనుఁడు గట్టిగా నొక్కి-పట్టుకొనెను. ఇరువురికిని, భయముగాని క్రొత్తగాని లేదు. ఎప్పుడో యొకప్పుడు జరుగ వలసినట్టులే జరిగెను ! విజయమోహనుఁడు బలవంతుఁడే! కాని రామదాసీతనికన్న మిగుల బలశాలి విషయలోలుఁ డగు విజయమోహనుఁ డాతనిఁ జయించుట కల్ల ! అందుచే రామదాసాతనిపట్టును వెంటనే విడిపించుకొనఁ గల్గెను. కాని విజయమోహనుఁ డంతమాత్రముననే వెనుదీయునా ? రామ దాసును యిప్పుడు విడిచినయెడలఁ దప్పక ప్రాణముల మీఁదికి వచ్చును. అందుచే మరల నాతనిపైఁబడి విజయమోహనుఁ డాతనిని గ్రిందఁబడవైచెను. రామలక్ష్మి భయముతో నంద ర్భములేని కేకల నిడజొచ్చెను. ఆ కేకలు విని యందరును కల వరపడిరి. మొత్తముమీఁద నంతయు నల్లకల్లోల మాయెను. ఇంతలోఁ బదిమంది, విజయమోహనుని యనుచరులు పరుగు పరుగున వచ్చుటగాంచి, రామదాసు యిక నాలసించిన లాభ ముండ దనుకొని, తనపైనున్న విజయమోహనుని విడిపించు కొని, క్రిందఁబడవైచి, తన వజ్రముష్టితో బలముగ నాతని

కపాలముపై గ్రుద్దెను. తోడనే విజయమోహనుఁడును స్మృతి తప్పి నేలఁగూలెను.

రామదాసు వెనుకకుఁ దిరుగకుండ నొక్కపరుగున ద్వారముదాటి వీథిలోనికి వచ్చెను. అచటినుండి కడురయము మున నాతఁడు ముందునకు నడచిపోయెను. చీఁకటి రాత్రి యగుటచే నాతని నెవరును పరీక్షించి చూడలేదు.

"ఇప్పుడు నేనేమిచేయవలయును. రక్షక భటాలయము నకుఁ బోయి విజయమోహనుని, యాతని యనుచరులను బంధించు ప్రయత్నమును జేయుదునా? తరువాత, విజయ మోహనుఁడు నా నిజనామమును, నానిజకథను వెలిబుచ్చును. నేనీ యుద్యోగమునుండి, విరమించుచున్నపు డందువలన నష్ట మేమియును లేదు. కాని యింకను నేనేల యసత్య మాడవల యును? విజయమోహనుఁడు హంతకుఁడని నిదర్శనములఁ జూపుచు, వ్రాసిన పత్రములు శశిభూషణునియొద్ద నున్నవి కదా! ఇఁక భయములేదు." అని రామదా సనుకొనెను. ఈత డిటుల యోజించుచుండగా, మరల సిద్దప్పయాతని కగపడెను. ఆతఁడును, రామదాసు నానవాలుపట్టి సవినయముగా నమ స్కారముఁ గావించెను.

"సిద్దప్పా! సరియైనవేళకు వచ్చితివి. మరల రెండు పత్రములను, వ్రాత పుడకయుఁ దెమ్ము" అని రామదా సడుగఁ

గనే, సిద్దప్ప వానినిచ్చెను. రామదాసు వానిపై దాను వ్రాయ దలచికొనినది వ్రాసి యాతనిచేతి కిచ్చి "దీనిని తీసికొనిపోయి యరుణాచలమున కిచ్చి, వెంటనే రాణిదర్శనమునకుఁ బోయి, దీని నామెకుఁ జూపి యామె చెప్పినటులఁ జేయు మనుము. ఆతని నీ కాగితములఁ జూడవలదనుము. ఇది నాయాజ్ఞ! పొమ్ము" అని చెప్పి తనదారిఁ దానుపోయెను.

## నలువది నాలుగవ ప్రకరణము

విజయమోహనుఁ డటుల రామదాసుచే గ్రిందికిఁ ద్రోయ బడిన యొక గంటవరకును పూర్తిగా స్వస్థుఁడు కాలేకపోయె ను. ఆతనికిఁ బూర్ణమైన తెలివివచ్చునప్పటి కాతని నానంద మోహనుఁ డున్న గదిలోని కాతనియనుచరులు కొంపోయిరి. రామలక్ష్మినిఁగూడ నొకభటుఁడు గట్టిగాఁబట్టుకొని యచటనే నిలువఁబెట్టెను. ఇదంతయుఁ జూచి యానందమోహనుఁడును మిగులఁ గలవరపడెను. ఏమి జరిగినదనిన మాటలాడువా రెవ రును లేరు. ఎవరికి వారే కోటయ్య పరుగిడిపోవుచున్నాఁ డని మాత్రము తెల్పిరి. కొంతసేపటికి విజయమోహనుఁడు తెప్పరిలి "కోటయ్య రామదాసే!" యని యచ్చటివారందరు నిర్ఘాంత పోవునటులఁ దెల్పెను.

ఇఁకఁ జేయవలసిన పనియేమి? ఇపుడో, యిఁక నొక ఘడియకో రక్షకభటు లరుదెంతురు. అంతయు మునిఁగిపోయి

వదని విజయమోహానుని యనుచరు లనుకొనుచుండిరి. ఇంతలో నానందమోహానుఁ డచ్చట నున్న వారి నందరిని బయటకుఁ బొమ్మని యాజ్ఞాపించెను. ఆనందుఁడు విజయమోహానుఁడు మాత్రమే మిగిలియుండిరి. ఆనందమోహానుఁ డిటు లనెను.

"విజయమోహానా! దుర్మార్గుఁ డెంతపనిఁ జేసినాడు! కాని యిప్పు డిట్లాశ్చర్యపడుచుఁ గూర్చుండిన గార్యము లేదు. నీవేదో యొకపనిఁ జేయవలయును. నీకేమియును బలమైన దెబ్బ తగులలేదు కదా? అటులైనసరే! వినుము.

"రామదాసు నిజముగా నెవరో గ్రహించి మీకు నర్పింప వలయుననియే నాతనిని బంధింప యత్నించితిమి. మేము రాజ్యక్షేమముకొఱకే యీపనిఁ జేసితిమి. మీకు వలసినన్ని నిదర్శనములఁ జూపెదము. మీరు వెంటనే రామదాసును బంధింపవలయును" అని రాణి కొక పత్రము వ్రాసి పంపుము. తరువాత నేమౌనో చూతము."

ఈమాటల నన్నిఁటిని నెవరు నమ్ముదురు? ఇక మన కేమియు దారిలేదు. ముందాబాలుని నరికివేసెదను. గుఱ్ఱము నధిష్ఠించి నేను రామచంద్రనగరముపోయి సైన్యముతో వచ్చి మిమ్ములను రక్షించెదను. హైమవతి యచటి కొక యుత్తరము వ్రాసినది. అంతయు సిద్ధమై యుండును. ముందాబాలుని నఱికెదను. ఏదీకత్తి?" అని విజయమోహానుఁడు తత్తరపడెను.

"ఇంతమంది ప్రాణములు పోవుచున్నపు డొక బాలుని ప్రాణము సరిపోదు. ఆమాట నటుంచి ముందు మన ప్రాణముల సంగతిఁ జూడుము. మాయజబ్బిప్పుడే వచ్చినది. లేనియెడల ..............నీవు రామచంద్రనగరము పోయెదవా? పొమ్ము పాపము! నీప్రాణములైన దక్కును. ఇన్ని ప్రాణముల నూరక మన్నుపాల్జేయవలసినదేనా? నేను జెప్పినటుల నీవొక యుత్తర మునువ్రాసి రాణికడకుఁ బంపుము. ఆబాలునిఁజంపిన మనకేట్టి లాభమును లేదు. ఈపనులన్నియు నెఱవేరినపిదప నింకను వ్యవధియున్న బాలునిఁ జంపవచ్చును. ముం దుత్తరము వ్రా యుము" అని యానందమోహనుఁ డాతనిని వేఁగిరించెను. ఆ పద్ధతియే బాగుగా నున్నదనుకొని విజయమోహనుఁడు వెంట నే యొకకాగితముపై నుత్తరమునువ్రాసి భటునొకనినిఁ బిలిచి "సత్వరము దీనినిఁగొంపోయి మహారాణికి నిమ్ము" అని చెప్పి పంపెను.

తరువాత మఱియొకనినిఁ బిలిచి శశిభూషణునొకకత్తితో ముక్కలక్రింద నఱుకుమని యాజ్ఞాపించెను. తాళముచెవి కొఱ కాతఁడు చేయిఁ జాచెను.

"రామదాసు దగ్గరనే యున్నది. ఎంతపని జరిగినది. ఆతలుపును బ్రద్దలు గొట్టుఁడు. కాని వలదు!—

ఆహారములేక వా డటులనే చచ్చును.— కాని—రామ దాసువచ్చి వానిని విడిపింపఁడా?.........గుఱ్ఱము! మంచి వడి

గలదాని నొకదానినిఁ దీసికొనిరండు" అని యాజ్ఞాపించి వెంటనే యాతఁడేపోయి గుఱ్ఱమునెక్కి పలాయితుఁడాయెను.

దుర్మార్గుడు! తనమార్గమును దాను జూచికొనెను. కాని వెనుకసంగతులు చూడలేదు. తన్ను మోహించి తన సాహాయ్యముచే పల్వెలరాజ్యాధికారమంతయుఁ దనచేత నిడి కొని యేదియో చేసెదననుకొన్న హైమవతిగతి యేమగునో చూడలేదు. ఈతఁడు మిగుల పక్షపాతబుద్ధిగల క్రూరుఁడే! కాని యామెమాత్రము! అమె మాట నటుంచి, తన యనుచరులు చావుబ్రదుకులమధ్యఁబడి కొట్టుకొనుచుండిన యానందమోహనుఁడు మొదలగువారి నందఱను విడచిపోవుట మిగుల నన్యాయమే! అవును! నరహంతకుఁడును, చోరాగ్రేసరుఁడును విషయసుఖలాలసుండును మాయలమారి వేషధారియు నగు వానిని నమ్మినవారి కింతకంటె నెక్కువ మేలు చేకూరునా?

ఇక విజయమోహను నిచట విడిచి రామదాసు వ్రాసి యిచ్చిన పత్రమునుఁ బట్టుకొని వెడలిన సిద్దప్ప యేమి చేసెనో చూచెదము గాక! ఆతఁడు వెంటనే యరుణాచలము సన్నిధికిఁ బోయెను. అరుణాచలమును దనగృహమున నప్పుడే శయనించు ప్రయత్నములో నుండెను. ఆసమయముననే సిద్దప్ప యరుదెంచి తలుపును దొందరగా గుంజెను. అరుణాచలమే స్వయముగా వచ్చి తలుపును దెఱచెను. సిద్దప్ప రామదాసు చెప్పిన మాటల నన్నిఁటినిఁ జెప్పి యుత్తరమునిచ్చెను. అరుణాచలము

నేదియో మునిఁగినదనుకొని తగిన దుస్తులను ధరించుకొని గుఱ్ఱము నొకదాని నధిష్ఠించి శ్యామసుందరీదేవి దర్శనార్థమై పోయెను. అరుణాచలమింటికిని కోటకును చాలదూరము కలదు. అందుచే నీతఁ డచ్చటికివచ్చునప్పటికి రాత్రి చాలవర కతిక్రమించెను.

ఇంద్రభవనమున తన యంతఃపురమున మహారాణి యగు శ్యామసుందరీదేవి యుండెను. రాత్రిం బవలు లామె రాజకార్య నిర్వహణమున కనేకకష్టములఁబడి మంచి పేరుఁ దెచ్చికొని ప్రజలను సుఖపెట్ట యత్నించు మహారాణి కనుక నేవియో రాజ్యాంగపత్రములఁ జూచుచు నానాటిరాత్రి యామె చాలవఱకు మేల్కాంచియే యుండెను. అట్టిసమయమున నొక సేవకురా లరుదెంచి "మహారాణీ! తమదర్శనార్థ మెవ్వడో వార్తాహరుఁడు వచ్చియున్నాడు. తమ్ముఁజూచుట యత్యావసరమని యాతఁడు పల్కుచున్నాడు. చూచుటకు వీలులేని యెడలఁ దానిచ్చుపత్రమునైనఁ జిత్తగింపవలయునని కోరుచున్నాడు." అని తెలుప రాణి యామెను పత్రముఁ దెచ్చునటుల నాజ్ఞాపించెను. ఆసేవకురాలును వెంటనే బయటకుఁ బోయి యాపత్రముఁ గొనివచ్చి మహారాణి చేతికి నిచ్చెను. దానినిఁ జదివి శ్యామసుందరీదేవి మిగుల నాశ్చర్యమగ్నమానసయై "ఈవార్తాహరు నిటకుఁ గొనిరా" అని యాజ్ఞాపింప, నాసేవకురాలు చూచివచ్చి యాతఁడటలేడని చెప్పెను. రాణి

తన యంతఃపురమునువీడి కచేరీచావడిలోనికి వచ్చి మరియొక సేవకునిఁ బిలిచి వెంటనేపోయి యరుణాచలమును తీసికొని రమ్మని కబురుపంపెను. ఆసేవకుఁడు వెంటనే హయము నొక దాని నధిష్ఠించి బయల్వెడలెను.

చావడిలోని కరుదెంచి శ్యామసుందరీదేవి మరల నా యుత్తరమును జదివిచూచెను. అరుణాచలముకొఱకామెమిగుల నాతురతతోఁ గనిపెట్టికొని యున్నటుల గడియ గడియకు ద్వారముచెంతకుఁ బోవుచుండుట వలనను, సేవకుని వెనుక సేవకుని, నాదారిని కొంతదూరమరిగి చూచిరమ్మని పంపుట వలనను దెలియనగును. అంత తొందరపడుట కాయుత్తరము నం దేమున్నదో!

మొదటిసేవకుఁడటు హయము నధిష్ఠించి కొంతదూరము పోవునప్పటి కాతనికెదురుగా మరియొక గుఱ్ఱమునెక్కి వడిగా నెవ్వరో వచ్చుచుండుట నాతఁడు గాంచెను. కొంత తడవున కాతని కీయరుణాచలమే యెదురగుటఁ జూచి మిగుల సంతసించి, యాసేవకుఁ డాతనినాగుమని కేకవైచి "మిమ్ములను మహారాణిగారు వెంటనే తీసికొనిరమ్మనినారు. నేను మీయొద్దకే వచ్చుచున్నాను" అనెను.

"నన్నా! ఇంతరాత్రివేళ! నేనును నొక యద్భుతవ్యాపారముపై నామెదర్శనమునకే వచ్చుచుంటిని. ఏమి! ఏమిజరిగినది?" అని యరుణాచలము ప్రశ్నించెను.

ఎవరోయొక లేఖ నొకదానిని దీసికొనివచ్చి, మహారాణి కందఁజేసి, తాను పారిపోయినాడు. దానినిఁజూచి యామె మీకొఱకుఁ గబురంపినది" అని సేవకుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. గొంత సేపటికి వారిరువురును కోటలోఁ బ్రవేశించి శ్యామసుందరీ దేవి దర్శనము గావించిరి.

"ఇంతత్వరలో నెటులవచ్చితిరి?"అని రాణి ప్రశ్నించెను.

"నేను మీయొద్దకేవచ్చుచుండ, మీ సేవకుఁ డెదురైనాఁడు. రామదాసు యీకాగితమును తీసికొని, వెంటనే మీ దర్శనముఁ జేయవలయునని కబురుపంపినాడు." అని యరుణాచలము చెప్పెను.

"రామదాసా! ఏడీ? ఎచ్చటనున్నాడు? ఏకాగితము?" అని శ్యామసుందరీదేవి మిగుల విస్మయముతో బ్రశ్నించెను.

ఆకాగితమును రాణి కందీయబోవుచుండ మీరే చదువుఁడని యామె నాతని నాజ్ఞాపించెను. అరుణాచలమీ క్రింది విధమునఁ జదివెను.

"మహారాణి సన్నిధికి'

నేనీ యుత్తరమును చాలతొందరతో వ్రాయుచుంటిని. ఇన్ని దినములకు నేను పడినకష్టము ఫలించినది. మహామంత్రి యగు వెంకటప్పయ్యను, నిరపరాధియగు హేమచంద్రుని హత్యచేసిన దుర్మార్గుని నే కనుఁగొంటిని. ఆతఁడు మనకనుల

యెదుటఁ దిరుగుచు మనలను మోసపుచ్చినాడు. కాని యదృష్టవశమున నాతని సంగతిని నేను తెలిసికొంటిని. గొప్పరాజకుమారుఁడననియు వర్తకపుంగవుఁడననియుఁ జెప్పి విలాసభవనమును గొనిన యావిజయమోహనుఁడే యీ దుర్మార్గుఁడు!"

ఇది వినునప్పటికి రాణియు నరుణాచలమును గూడ చాల నిర్ఘాంతపోయిరి. అరుణాచలము చదువుట నాపి వెఱ్ఱి చూపు చూచుచుండెను. శ్యామసుందరి లేఁచి నిలువఁబడెను. కొంతసేపటి కాతఁడు మరల జదువుట మొదలుపెట్టెను.

"సన్న్యాసివేషముతో రాణియగు హైమవతీ దేవి బొందుఁగూడిన యాతఁ డీతఁడే! రామచంద్రుని యింట వెంకటప్పయ్య తలను పాతిపెట్టినవాఁడుకూడ నీతఁడే!! రామచంద్రుని విచారణసమయమున హైమవతిని విడిపించినవాఁడును నీతఁడే!!! ఇన్నిదినములనుండియు హైమవతి యీతనితోనే యున్నది. ఇప్పుడుకూడ నీమె విలాసభవనమున నిర్భయముగా నున్నది. అంతియకాదు. ఈదుర్మార్గుఁడు శశిభూషణునిఁగూడ బంధించి యొకయంతర్గృహముననుంచి తగినంతయాహారమైన నీయక యాతనిని మిగుల బాధించుచున్నాఁడు. నాకాప్తులగు వారినందఱిని నీతఁడు నాశనముచేయ యత్నించుచున్నాడు. చంద్రముఖియనుబాలికను, రామలక్ష్మియనునామెను, నాకాప్తులగుటచే బాధించుట కాతఁడు తెచ్చినాడు.

మీరు వెంటనే ప్రయత్నించినఁగాని యాతఁడు దొరకడు. ఈ రాత్రియే యాతఁడు పారిపోవుటకుఁ బ్రయత్నించును. ఆతనిగుట్టంతయుఁ బయటపడిన యట్లాత డిప్పుడే గ్రహించినాడు. అరుణాచలమును వెంటనే యిన్నూర్గురు రక్షకభటులఁదీసికొని యీరాత్రియే యచ్చట నున్నవారినందరిని బంధింపవలయునని చెప్పి పంపవలయును. విజయమోహనుఁడు హంతకుఁడని చూపుటకు నిదర్శనములనన్నిటిని వ్రాసిశశిభూషణున కిచ్చితిని. వానిని జాగ్రత్తగా గ్రహించి విజయమోహనుని తగినటుల శిక్షింపవలయును.

ఇఁక నావిషయము. నేను, కొన్ని కారణములచే నిఁక నుద్యోగమును జేయఁజాలను. నన్నుగురించి మీరేమియుఁ దలఁపవలదు; భయపడవలదు; విచారింపవలదు; ఈరాత్రియే ప్రయత్నముఁ జేయుఁడు. ఇక వ్రాయుటకు వ్యవధిలేదు.

ఇట్లు, విన్నవించు,
మీప్రియభృత్యుఁడు;
"రా మ దా సు."

ఈయుత్తరము సాంతమైనపిదప రాణి యొక్క నిట్టూర్పు పుచ్చెను. ఆబాలిక కివి యన్నియు భరింపరాని కష్టములు కావా?

"దుర్మార్గుఁ డెంతపనిఁ గావించినాడు! ఆతని రూపముఁ జూచియు, వేషభాషలఁ జూచియు నాతఁ డెవ్వరో మహాత్మా

జనియే ప్రజలు తలంచిరి. చివర కెంతపనిఁ జేసినాడు. ఇదిగో ఈయుత్తరమునుఁగూడ చదివి ముగింపుడు” అని శ్యామ సుందరి తనయొద్దనున్న యుత్తరము నరుణాచలమున కిచ్చెను. ఆతఁ డాయుత్తరము నిటులఁ జదివెను.

“మహారాణియగు శ్యామసుందరీదేవి సన్నిధికి నేను కళింగదేశపురాజకొమరుఁడ ననియు, వర్తకము చేసికొనుచు, ఇచ్చటికివచ్చితిననియుఁ దమకు క్రొత్తగా మనవిచేసికొన నక్క ఱలేదు. పల్వెలపట్టణమున కనతిదూరము నొక గొల్లపల్లె కలదు. అందు, రామలక్ష్మియను వృద్ధురాలు, చంద్రముఖి యను బాలికతో నచటగాపురమున్నది. అచ్చట నామెయొక బాలికా పాఠశాలపెట్టుకొని జీవించుచున్నది. ఆమెయొకరితో జెప్పుచుండగా నేనొక భయంకరరహస్యమును వింటిని. అదెం తమాత్రమును నమ్మదగినదిగాలేకపోయినను కొన్నికారణము లచే నమ్మక తప్పినదికాదు. అదేదన, ప్రస్తుతపల్వెలపట్ట రక్షకభటాధికారియు, సమస్తజనులకు పూజనీయుఁడును, దమ చే మిగుల మన్నింపఁబడువాఁడును నగు రామదాసునుగురించి ఆతఁడు నిజముఁగా రామదాసుమాత్రమేకాడు. అనేక నరహ త్యలఁగావించి, దొంగతనములుచేసి, ప్రజలను మిగుల బాధిం చిన జయరాముఁడే యాతడు! ప్రస్తుత మిటుల మారినాడు. రాజ్యక్షేమముకొఱకు వానినెటులైనఁబట్టి, మీస్వాధీనముచే యుదమని తలఁచితిమి. కాని యాతఁడు తప్పించికొని పోయి

నాడు. ఆతఁడు దొరకిన తత్క్షణము బంధింపవలయును. ప్రస్తు తము మాయొద్ద నున్న రామలక్ష్మియను వృద్ధురాలివలనను చంద్రముఖి యను బాలికవలనను మీకు నిజము తెలియఁ గలదు.

ఇట్లు విధేయుడు,

విజయమోహనుఁడు.

ఈయుత్తరద్వయ మత్యంత భయంకరముగను మిగుల నిగూఢముగను నున్నదని వేరుగాఁ దెలుపనక్కరలేదు. బాలికయగు శ్యామసుందరీదేవియును, వృద్ధుడగు నరుణాచలమును గూడ నాయుత్తరములవలన మిగులఁ దత్తరముఁ జెందిరి. జేవురించిన కనులతో నరుణాచల మాయుత్తరమువైపట్టే చూచుచుండెను. క్రొత్తగా బంధింపఁబడి పంజరములో నుంపఁబడిన పక్షివలె శ్యామసుందరి మనస్సనేక విధములఁగొట్టుకొను చుండెను. ఈ రెండవ యుత్తర మసత్యమని చించిపారవేయ వచ్చును. కాని యత్యంతనమ్మకమైనవాడని పేరొందిన రామచంద్రుఁడు మారలేదా? మంచివారు చెడ్డవారుగా మారినట్లే దుర్మార్గులుకూడ కొంతకాలమునకు సత్పురుషు లేల కాఁగూడదు? "దీనివిషయమై మీ యభిప్రాయ మేమి?" అని ఎట్టకేలకామె యరుణాచలము నడిగెను. అరుణాచలమిటుల మొదలు పెట్టెను.

"తల్లీ ! ఇందులోఁ గొంత నిజము లేకపోలేదని నానమ్మకము. నాలుగు సంవత్సరములనుండి రామదాసును, నేనును గలిసి సమానముగాఁ బనిచేయుచుంటిమి. ఆతనిఁగూర్చి "నీ పూర్వవృత్తాంత మేమి?నీతలి తండ్రులెవరు? నీవెచటివాఁడవు?" అని యనేకపర్యాయములు ప్రశ్నించితిని. కాని, నాకు సరియైన సమాధాన మెన్నఁడు నాతఁడు చెప్పలేదు. విచిత్రముగా నాకథను మార్చివైచెడివాఁడు. వెనుక హేమచంద్రుఁడు హత్యచేయబడినపుడు, జయరాముఁడే హంతకుఁడని ప్రజలనుకొనినను, నేనేయని యాతఁ డుత్తరమునుగూడ వ్రాసినను, రామదాసు కారణమేమియును జెప్పకుండగనే "జయరాముడు కాడు. ఆపూర్వపు జయరాముఁడు వేరు; ఆతఁడిటుల వ్రాయడు" అని మంత్రితో వాదించెడివాఁడు. మరియొక సంగతి! జయరాముని నారుసంవత్సరములకు వెనుక, మీతండ్రిగారు రాజ్యముచేయున్నపు డొకసారి బంధించితిమి. అప్పుడు నేనుకూడ నుంటిని. కాని యాతఁ డతిచాకచక్యముగాఁ దప్పించుకొనిపోయినాడు. అదంతయుఁ జాల పెద్ద కథ! అపుడు మీతండ్రిగారు జయరాముని నఱికివైచితిమని ప్రజలు శాంతినొందియుండుటకు మమ్ముఁ బ్రచురింపుడని యానతిచ్చిరి. మేమటులనే చేసితిమి. ఆజయరాముని నేనొక్కసారియే చూచితిని. ఆతని ధ్వనిఁగూడ వింటిని. ఆజయరాముఁడే యీ రామదాసని నాకనేకసారు లనుమానము తట్టినది. కాని నేనెప్పుడు

నావిషయమును బహిరంగముగా నెవ్వరితోడను జెప్పియుండ లేదు. మన రామదాసువలెనే ఆజయరాముఁడుకూడ మిగుల బలవంతుఁడు, చతురుఁడు. ఆతఁడే యీతఁడనుటకు నా కెట్టి సందియమును లేదు. కాని యుద్యోగములోఁ బ్రవేశించిన తరువాత నాతఁడు పూర్తిగా మారిపోయినాఁడు."

ఈకథనంతటిని మిగుల నాశ్చర్యముతో విని, శ్యామసుందరి "సరే! నాకుమాత్ర మేమియును దెలియుట లేదు. ప్రస్తుతము నాకర్తవ్యమెద్దియోకూడ నాకు బోధపడుట లేదు. మీరు వెంటనే యీతఁడు తెల్పినటుల రక్షకభటులను తీసికొనిపోయి విలాసభవనమునందున్నవారి నందఱిని బంధింపుడు హైమవతిని మరల విమలభవనములో నుంచుడు. రామదాసేదియో వ్రాసితిననెను. దానినికూడఁ జదువవలయును. విలాసభవనమంతయుఁ దాళములు వైచి జాగ్రత్తగా కాపాడుడు. శశిభూషణుని జాగ్రత్తగా నుంచుడు. పాప మా బాలుఁడు! మీరిఁక బయలుదేరి పోవచ్చును." అని శ్యామసుందరీదేవి యాతనిఁ బంపి తానులోనికిఁబోయి విశ్రమించెను. అరుణాచలము రక్షకఁభటాలయమునకుఁ బోయెను.

---

# నలువదిమూడవ ప్రకరణము

జయరాముని చరిత్ర సవిస్తరముగాఁ దెలుపుటకొక గ్రంథము పట్టును. ఆతని యద్భుతచర్యలను వర్ణింప సమకట్టినఁ జాలకాలమగును. అయినను, క్లుప్తముగాఁ బాఠకమహాశయుల కాతని విచిత్రచర్యలఁ గొన్నిటినిఁ జూపి విరమించెదము. జయరాముని జన్మస్థానము పల్నాటిరాజ్యమునందున్న యొక కుగ్రామము. ఈతనితండ్రి మిగుల భాగ్యవంతుఁడగు నొకకృషికుఁడు. ఆతనికి జయరాముఁడను నొక కొమరుఁడును, సీతాదేవియను నొకకొమరితయు నుద్భవించిరి. జయరామునికి బాల్యమందుండియు విద్యమిగుల శ్రద్ధతో గఱపఁబడియెను. సీతాదేవియు సుగుణములకాటపట్టయి స్త్రీలకు వలసిన విద్యాబుద్ధుల నేర్చికొనుచు శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధిఁ గాంచుచు తలితండ్రులకుఁ జూచువారలకు నమందానందమొడగూర్చుచుండెను.

ఇటులఁ గొంతకాల మరిగిన పిమ్మట నా తలితండ్రులు ద్వాదశవర్షయగు తమతనయను, వయోరూపములయం దామెకుఁ దీసిపోని పదునారేండ్ల బాలకుని కొకనికిచ్చి కన్యాదానముచేసిరి. కొన్నిమాసములకు సీతాదేవి యుక్తవయస్కురాలాయెను. తనయత్తవారింటఁ గాపురముచేయుచు, నామెసుఖముగానుండి తనపదునైదవయేట నొక మగశిశువును గనెను.

అప్పటికి జయరాముఁడు పదునెనిమిదేండ్లవాఁడు. ఆతఁడు తన యీడునకుఁ దగని విద్యల నభ్యసింపుచు తలిదండ్రులకు మిగుల మోదముఁ గూర్చువాఁడై యుండెను. ఆతఁడు శరీరవ్యాయామముగూడ బాగుగాఁ జేసి, కత్తివిప్పులు, కఱ్ఱఁదిప్పుట, మొదలగు యుద్ధవిద్యనుఁగూడ చాలవఱ కభ్యసించెను.

కాని, కాలమొక్కరీతిని, కష్టమయమైగాని, సుఖమయమైగాని, యెట్టివారికిని జరుగదనుట సర్వవిదితము. ఆసంవత్సరమున సంభవించిన మరిడీవ్యాధి చాలమందిని దనపొట్టఁబెట్టుకొనెను.

దురదృష్టవశమున, జయరాముని తలిదండ్రులుగూడనావ్యాధిపాల్పడి, గతించిరి. జయరాముఁడొక్కఁడే మిగిలెను. ఆతని సోదరియగు సీతాదేవి యీ దిక్కుమాలిన యువకునిఁ గొంపోయి, తనయొద్దనే పెంచుచుండెను.

సీతాదేవి భర్తయగు వీరభద్రుఁడు, మిగులధనముఁగలవాఁడేగాని,యంతబుద్ధిమంతుఁడు కాడు. ఆతనిరూపమును జూచి యైశ్వర్యమునుజూచియు సీతాదేవితలితండ్రు లామె నాతనికిచ్చిరి. అదుపును, ఆజ్ఞయును లేని యాతఁడు, చెడుసహవాసముచే జూదమాడుట మొదలుపెట్టి తన సర్వస్వమును బోఁగొట్టుకొనెను. అంతియకాక, వీరభద్రుఁడు, జయరామునిఁగూడ నావిద్యయం దారితేరినవానిగఁ జేసి చెడఁగొట్టెను. అది మొద

లుగా జయరాముఁడును, తనయాస్తినిగూడ జూదమునందే వినియోగింపజొచ్చెను. ఒక్కొక్కప్పు డాతఁడు గెలుచుచుండి నప్పటికిఁ దనయాస్తిలోఁ జాలభాగము నాశనమగుటకే గెలుపు లేమియు నడ్డురాలేదు. వీరభద్రుఁడు సర్వభ్రష్టుఁడగుటచే నాత నికిఁగూడ జయరాముఁడు వలసినంత ధనము నిచ్చుచుండెను. బాలుఁడగుటచే నాతఁడు తనధనము నంతటిని త్వరలోనే పోఁగొట్టుకొనెను. చివరకు వీరభద్ర జయరాము లిరువురును గూడ నిరాధారులైరి. మిగుల సుగుణవతియు నోర్పుగలదియు నగు సీతాదేవికూడఁ దన యర్భకునితో వీరలంగూడి సకల యిడుమలు పడుచుండెను.

దారిద్ర్యము సర్వనాశనమునకు హేతువు. మంచిగుణ ముల నడుగంటఁజేయుచు దుష్పథములకు మనస్సును ద్రిప్పును. నీచత్వమలవడఁ జేయును. దారిద్ర్యమువలననే భయంకరరోగ ములు కాకపోయినను మహావ్యాధులవలెనే పీడించు,చిరాకు, భయము, యధైర్యము మొదలగునవి బయలుదేరును. వీర భద్రున కిప్పుడిట్టిగతియే సంభవించెను. పుట్టుభోగియగు నాత నికి దినము గడచుటయే కష్టముగా నుండెను. ఏదారియుగానక చివరకాతఁ డొక దొంగలగుంపుతోఁ జేరి, దారిదోపుళ్లు, నర హత్యలు మొదలగు క్రూరకృత్యములఁ జేయ మొదలిడెను. కొంతకాలమువరకు నీసంగతి జయరామునికి తెలియకుండ వీర భద్రుఁడు చాల రహస్యముగా నుంచుచువచ్చెను. కానియాతని

రహస్యము చాలకాలమువరకు దాఁగియుండలేదు. ఒక సంద ర్భమున జయరాముఁడు వీరభద్రుని నిజోద్యోగమునుఁ గాంచెను.

జయరాముఁ డిప్పు డిరువది సంవత్సరముల వయసుగల నవయౌవనుఁడు. ఉష్ణరక్తమాతని శరీరమునఁ గడువేగముతో బ్రవహించుచుండుటచే యుక్తాయుక్తవిచక్షణమున కాతనికి శక్తిచాలకపోయెను. వీరభద్రుఁడేదో ఘనకార్యమునే చేయు చున్నటులను, దన బాహుబలమును యుక్తమైన మార్గము ననే వినియోగించుచున్నటులను జయరాముఁడు తలఁచెను. కాని యీసంగతులేవియుఁ దనసోదరితో మాత్రము తెలుప లేదు. వీరభద్రుఁడొంటరిగా నున్నపు డొకసారి తన్నుకూడఁ, దన దండయాత్రలలో పాల్గొనునటుల ననుగ్రహింపవలయు నని జయరాముఁ డాతనినిఁ గోరెను. ఆతఁడును జయరామునిఁ దన జట్టులో నొకనినిగాఁ జేర్చుకొనెను.

ఆనాటిరాత్రి వీరందరును గలసి మఱియొక గ్రామము, పోయి యచటనున్న యొకధనికునిఁ గొల్లకొట్టుటకు దండెత్తిరి. ఆ దొంగలజట్టులో సుమా రిరువదిమంది యుండిరి.

ముందు చాలజాగ్రతపడి, యేర్పాట్లన్నియుఁ గావిం చుకొని వీరటులఁ జౌర్యమునకు సమకట్టిరి.

ఆయింటి యజమానుఁడొక యపత్నీకుఁడగు వృద్ధుఁడు. జరాభారముచేతను, ధనభారముచేతను నాతఁడు మిగుల వాడి

యుండెను. ఆతనికి భార్య గతించెను. పదిసంవత్సరముల యీడుగలకుమార్తెమాత్ర మాయింట నాతనికి దిక్కై యుండెను.

ఆనాటిరాత్రి సరిగా పండ్రెండు గంటల కాదొంగ లాతనియింటఁ బ్రవేశించిరి. ఆతనిధనమంతయు నెచట నున్నదోయని వారు నల్దిక్కుల గాలించిరి. ఈసందడి నంతటిని విని యావృద్ధుఁడు నిదురనుండి మేల్కాంచెను. దీపముఁదీసికొని, గది బయట కరుదెంచునప్పటి కాతఁడు తనయెదుటఁ బెనుభూతములవలె నిరువదిమంది దొంగలాయుధధారులై నిలువబడి యుండుటఁ గాంచి, మిగుల బయపడి, కెవ్వున కేకవైచెను.

శరీరము వణఁకు చుండఁగా నచట నిలువబడియున్న యాదీనుని, దొంగలలో నొకఁడు గట్టిగాఁ బట్టుకొని "ఈమారఱచిన నిన్ను బలవంతముగాఁ జంపివైచెదము. మాటాడక నీ ధనమంతయు నెచ్చట నున్నదో చెప్పుము. లేనియెడల నీకాగడాతో నిన్ను కాల్చి వైచెదము" అని భయంకరముగా నాజ్ఞాపించెను. ఆ ముదుసలియు భయముచే వణకుచుండెను. కాని మాటాడుట లేదు. "ఏమి చెప్పెదవా, లేదా?" అని మరియొకదొంగ యనెను.

"అట్లు కాదురా" అని వీరభద్రుఁడు తనచేతనున్న కాగడాను తీసికొనివచ్చి యానిర్భాగ్యుని ముదుసలిగెడ్డము నంటిం

చెను. అదంతయు నిముసములో గాలిపోయెను. బాధచే వృద్ధుడేడ్చెను. ఏడ్వవద్దని వీరభద్రుఁడు మరల నాతనిని గట్టిగాఁ దన్ని నీధన మెచ్చటనున్నదో తెలుపుమనియఱచెను. ఈసందడి నంతటిని విని, యావృద్ధుని పదియేండ్ల బాలిక లేఁచి పరుగెత్తికొనివచ్చి దొంగలనుచూచి భయపడి నిలిచి, కొంత తడవున కాగెడ్డము కాలిన తన తండ్రి నానవాలుపట్టి యేడ్చుచు బోయి, యాతనిఁ గౌఁగలించుకొనెను.

“ఓరీ ముదుసలీ! నీయేడ్పులతో మాకు జాలికలుగదు. ఓపిల్లా, పో! అవతలికి పో!” అనుచు వీరభద్రుఁడా బాలిక నొకగెంటు గెంటెను. ఆయదటును సహింపఁజాలక నాబాలిక నేలఁ గూలెను. “అయ్యో!” అని యా వృద్ధుఁడు, పుత్త్రవాత్సల్యముచే నాబాలిక చెంతకుఁ బోవుచుండగా,

“గుడ్లుపీకివైచెదను: కాల్చివైచెదను. నీకూఁతును నఱుకెదను. నీడబ్బెచ్చటనున్నది? ఏమి?” యనుచు, మరల వీరభద్రుఁడే, తన హస్తమునందున్న నిశిత కరవాలము నాముదుసలి కనులయెదుటనుంచి, పొడవబోవుచుండెను.

దీనినంతటిని, మిగుల విభ్రాంతుఁడును, చింతాక్రాంతుఁడునై, జయరాముఁడు చూచుచుండెను. “చౌర్యమనిన నిదియా? ఇంతటి భయంకరముగా నుండునా?” అని యాతఁడనుకొనెను. వీరభద్రుని క్రూరకృత్యములఁజూచినకొలదియు నాతని తలతిరిగి

పోవుచుండెను. కన్నీరప్రయత్నముగా వెలువడఁ జొచ్చెను. కొంతవఱకెట్లో సహించి యూరకుండెను. కాని, తనబావ యాముదుసలి కన్నులను బొడవనున్న సమయమున, నోడలు తెలియక, జయరాముఁ డాతనిపై, సింహామువలెనురికి క్రిందఁ బడవైచెను. అటులఁ బడునప్పుడా చేతనున్న కృపాణము సరిగానాతని కంఠమున దిగుటచే వీరభద్రుఁడు గిజగిజ తన్నుకొని వెంటనే ప్రాణముల విడిచెను.

మిగిలిన చోరులందరు నీభయంకరకృత్యమునుగాంచి, మాఱుమాటాడక పరువిడిపోయిరి.

జయరాముఁడు యింతవట్టుకువచ్చునని తలఁపలేదు. మరలనాతఁడు తనసోదరి ముఖము నెటులఁ జూడఁగలఁడు? మిగుల విచారముతో నాతఁడాశవమును గనిపెట్టుకొని యుదయమగువరకు నచ్చటనే యుండెను. సూర్యోదయమయిన వెనుకఁ జాలగందరగోళ మయ్యెను. రక్షకభటు లరుదెంచిరి. దొంగలు, వారిలోవారు పెనగులాడుకొని, యొకనిని హత్యచేసిరని యావృద్ధుఁడు నిదురమత్తుతోఁ దెల్పెను. అచ్చటనున్నవాఁడు జయరాముఁడే యగుటచే, న్యాయాధిపతి యాతనిని నాల్గు వత్సరములు ఖైదులోనుండునట్లు శిక్షించెను. జయరాముని మొఱనెవరును యాలకింపలేదు. ఒక్కపర్యాయము తనసోదరినిఁ జూచివచ్చుట కాతనికి సెలవీయలేదు. వెంటనే

యాతనిని చెఱలోనుంచిరి. "ప్రపంచమున న్యాయమిట్టిదేనా?" అని జయరాముఁ డనుకొనెను.

ఈసంగతి నంతటినిఁ దరువాత సీతాదేవివినెను. గౌరవనీయులగు కృషికులవంశమునందు జనించి యిటు నవమానముతో జీవించుటకంటె మరణమే యుత్తమమని యామెతలఁచెను. కొన్నినగలను తనకుమారుని యిరుగుపొరుగువారికి నప్పగించి యానాటిరాత్రియే నామెయును బలవన్మరణమును జెందెను.

జయరాముఁడును నెపుడు తన శిక్షాదినములు పూర్తియగునా యెపుడు త న్నన్యాయముగా నటుల శిక్షించిన న్యాయాధికారికి మరలఁ దగినశిక్షను బ్రసాదింతునా యని పగ తీర్చికొనుటకుఁ దినములు లెక్కవెట్టుకొనుచుఁ జెఱయందుఁ గాలము గడపుచుండెను.

ఎట్టకేల కాతని శిక్షాదినములు పూర్తియాయెను. విడువబడినతోడనే యాతఁడు కడు రయమున తనసోదరిని మేనయల్లునిఁ జూచుటకై పోయెను. అప్పటికా బాలుని కైదుసంవత్సరముల వయస్సుండును. జయరాముఁడు తన్నీప్రపంచమున ప్రేమించువారిలో మిగిలియున్న తనసోదరికూడ గతించుటకు మిగులఁ జింతించి తన్ను వెంటనే చెఱసాలయందుంచక పోయినయెడల నట్లు జరిగియుండక పోయియుండవచ్చునని తలంచెను. తన్న టులఁ జేసిన న్యాయాధికారిని మరొక్కసారి కలవుతీరఁ ౬

కొని తన మేనల్లు నెత్తికొని ముద్దాడి మరల వచ్చెదనని యా బాలుని సంరక్షకులతోఁ జెప్పి తనదారినిఁ దానుబోయెను. కాని యాబాలున కీతఁడెవ్వరో తన తలిదండ్రు లెవరో వా రేమై పోయిరో యేమియును దెలియదు. .........................

అచ్చటనున్న న్యాయాధికారి కొక్కతెయే కొమార్తె. తన వృద్ధమాతకోరికప్రకార మాన్యాయాధికారి మూడవయేటనే తన తనయకు వివాహము గావించెను. ఆతని యల్లున కష్టైదేండ్లుండును. వ్యాపారమునిమిత్తము దేశసంచారము చేయు మణిజులగు తన తలిదండ్రులతోఁ గలిసి యాబాలుఁడు చిన్ననాఁడే వారితో నేఁగెను. ఇదంతయుఁ బదునారుసంవత్సరముల వెనుకటిమాట. కాని మన కథజరుగుచున్న కాలముననే యొకదినమున నేమైపోయెనోయని యెంత వెదకించినను కానరాని తనయల్లుఁడు, మరలనరుదెంచుటచే న్యాయాధికారి యమందానందమంది, పిండివంటలతో గ్రామవాసుల కందఱకు ను భోజనములిడి చాలసంతసించెను.

అనాఁడు సుదినమగుటచే గూఁతును, యల్లునిఁగూడ యానాఁడే కలిపెదమని యాతఁడు తలంచెను. కాని, తన యల్లుఁడు, పట్టణమునుఁజూచి, చాలదినములైనవి. ఒకసారి చూచివత్తము" అని మామగారినిఁ గోరుటచే వా రిరువురును పండువలెఁ గాయుచున్న వెన్నెలలో బయలుదేరిరి.

వారు తిరిగింటివైపు ముఖముపెట్టుసరి కర్ధరాత్రమాయెను. అటుల వారువచ్చుచుండగా నాయువకుఁ డొకచోట నొక పెద్దబండనుచూచి, యాగి, దానివైపే వింతగాఁ జూచుచుండెను.

"అట్లు చూచెదవేల? దాని నిదివర కెచ్చటను చూడనే లేదా? దీనినే బొండకొయ్య యందురు. స్వల్ప నేరస్థుల నిందులోఁ గాళ్లుపెట్టించి యెండలో నిలువఁబెట్టెదరు" అని న్యాయాధికారి వింతగాఁ జూచుచున్న తనయల్లునితో ననియెను.

"దీనిలో కాలుంచిన, చేతులతో లాగుకొని బయటకు నిముసములో నరుదెంచగలను. ఇదియేమి శిక్ష?" అని యల్లుడనియెను.

"ఏనుగైనను దీనిలోనుండి తప్పించుకొన జాలదు" అని న్యాయాధికారి ప్రత్యుత్తర మిచ్చెను.

"ఏదీ! చాల చిత్రముగానున్నది" అని యాయువకుడు తనకాలు నందుంచబోవుచుండగా "ఉండుము! ఏదైన తగులును. నేనుచూపెదను" అని మామగా రల్లునిమీద గౌరవముచే తనపాదద్వయమునే యందుంచెను.

"తరువాతఁ గాళ్లుతీసికొనుటకై వీలులేకుండునట్లుఁ గట్టిల నిట్లు బిగింతురా?" అని యాయువకుఁ డత్యంత కుతూహలముతోఁ బ్రశ్నించుచు, తనమామగారికి పాదములను

తీసికొనుటకు వీలులేనట్లు గట్టిగా బిగించెను. అన్యాయాధికారికి నిజముగా మిగుల బాధగానుండినను లేని చిఱునగవును తెప్పించుకొని ఇకఁ బయటకుఁ దీసివేయుము. మనకుఁ బ్రొద్దు పోవుచున్నది” అనెను.

“ఆ! ఆ! ఇక వెడలిపోవుదము” అని త్వరపడి యా యల్లుఁడొక త్రాఁడును తన జేబునుండితీసి వింతతోను బాధతోను యింకను దొంగచిఱునగవుతోను చూచుచుండిన తన మామగారి హస్తములనుగూడ గట్టిగా బిగించి కట్టెను. తదనంతర మొకపత్రమున నొకధారముఁగట్టి మిగుల బాధతోఁ బెనగులాడుచుండిన యాన్యాయాధికారి మెడయందు దాని నలంకరించి “న్యాయాన్యాయముల విచారింపని న్యాయాధికారుల బ్రదుకింతే!” యని రివ్వునఁ బారిపోయెను.

మరునాటి యుదయమున వందలకొలది జను లీవింతను చూచుటకై వచ్చిరి. అన్యాయాధికారి యనినఁ జాలమందికిఁ గోపమగుటచే నెవరును వెంటనే యాతని విముక్తికై ప్రయత్నింపలేదు. వారిలో నొకఁ డాతని మెడనున్నచీటి నీక్రింది విధమున బిగ్గరగాఁ జదివెను.

‘నా [illegible] భో!

నేను నిజముగా నీ యల్లుఁడనుకాను. నాల్గుసంవత్సరముల వెనుక నన్యాయముగా శిక్షింపఁబడిన జయరాముఁడను.

ఇంతటినుండి ప్రజలకు నన్యాయము చేయువారలకుఁ బ్రక్కలోని బల్లెమై మెలంగెదను.

నా పేరు

—జయరాముఁడు.

ఆదినము మొదలు జయరాముఁడు తనబుద్ధిని బలమును నిట్టులే వినియోగింపఁజొచ్చెను. కాని యాతఁడు తనజీవిత మధ్యమున, స్త్రీలనుగాని, పసిపిల్లలను గాని యెన్నడును బాధించియెఱుఁగడు. వీరభద్రునిఁదప్ప మరెవ్వరినిఁ జంపలేదు. ఆతనినైనను చేతులార జయరాముఁడు చంపలేదు. బీదవారల ననేకుల నీతఁడు పోషించెను. ఈతని యద్భుతచర్యలనన్నిటిని యేకరుపెట్టుటకీపొత్తముచాలదు. కాన క్లుప్తముగా నీతని చరిత్రముగించివైచెదము. తరువాత నీతఁడొక పెద్దజట్టునొకదానిని చేర్చికొని యనేక మాయవేషములతో ననేకచిత్రకథలఁ జరిపెను. ఈతని వివాహముకూడ నొక యద్భుతకథయే! ఈతనికిఁ దనభార్య జీవించియుండ నొక్క కొమరితమాత్రమే జన్మించెను. ఆమెయే చంద్రముఖి!

ఆతని మేనయల్లుఁడే శశిభూషణుఁడు !!

వీరల నెటులఁ బోషించు చుండెనో మనకువిదితమే. రత్నసింహునికాలమున నీతనిని బంధించుట కనేకయత్నములు జరుగుటయు నవన్నియు వ్యర్థము లగుటయు మనమువినియే యున్నారము.

అన్నిటికంటెను యద్భుతచర్యయేదన, నీతఁడు మరల రక్షకభటునివలె, రాజకీయోద్యోగముననే ప్రవేశించి, రామదాసు నామమును ధరించి ముఖ్యరక్షకభటాధికారి యగుట. అత్యద్భుతమైన బుద్ధిబలము కలవారి కేదియడ్డము!

## నలువదియాఱవ ప్రకరణము

ఆనాఁ డట్లు శ్యామసుందరీదేవిచే నాజ్ఞాపింపఁబడి యరుణాచలము తిన్నగా రక్షకభటాలయమునకు వెడలెను. రామదాసు వ్రాసినప్రకార మిన్నూర్గురు రక్షకభటులను సిద్ధముచేసి వారి నందరిని ఆయుధహస్తులఁ గావించి విలాసభవనమునకాతఁడు ప్రయాణమయ్యెను.

అప్పటికి రాత్రి చాలవఱకు నతిక్రమించెను. ప్రపంచ మంతయు నిశ్శబ్దముగా నుండెను. పాపాత్ముని హృదయమువలె నొక్క విలాసభవనముమాత్రము చాలనల్లకల్లోలముగా నుండెను. తనవారి నందఱిని నీటఁ ద్రోసి విజయమోహనుఁడు తనదారిని దాను పారిపోయెను. మంచముమీద నుండియే యానందమోహనుఁడు తనవారి నాజ్ఞాపించుచుండెను. కోటయ్యావేషమునఁ దమ్ము మాయఁజేసిన రామదాసు రక్షకభటులను దీసికొనివచ్చుచుండునని యచ్చటనున్నవారందఱు నను

కొనుచుండిరి. ఆయుధముల వెదకుకొనువారు, మొఱ్ఱో యను వారు, విజయమోహనునిఁదిట్టువారు, పలువురు పలుతెఱంగుల సందడిఁ జేయుచుండిరి.

అరుణాచలము భటులతో సమీపించెను. ద్వారము నొద్ద నిరువురు భటు లుండిరి. వా రవలీలగనే బంధింపఁబడిరి. కాని వారిలో నొకఁడు "మా నాయకుఁడు దాఁటిపోయినాఁడు లెండు!" అని వారి నెగతాళి చేసెను.

లోపల పని యంతసులభముగా నెఱవేఱలేదు. విలాస భవనమునందున్నవారు దరిదాపుగా నూర్గు రుండిరి. వారి యొద్దఁగూడ నాయుధము లుండెను. అందుచే నొక చిన్న యుద్ధము జరిగెను. కాని యంతమంది రక్షకభటులముందు విజయమోహనుని యనుచరు లేమియుఁ జేయలేక పోయిరి. ఒక్కరొక్కరే రక్షకభటులచేతులలోఁ బడుచుండిరి. ఆనంద మోహనునిచెంత నిరువురు కాపుండిరి.

కాని యెంత వెదకినను ముఖ్యుఁ డగు విజయమోహ నుఁడుమాత్రము రక్షకభటుల కగపడలేదు. అన్ని మూలలను వారాతనికొఱకై వెదకిరి కాని లాభము లేకపోయెను.

తరువాత నరుణాచలము పదిమందిభటులను వెంటనిడి కొని హైమవతీదేవియున్న భవనమునందు బ్రవేశించెను. ఆమె యును మిగులఁ దత్తఱపడుచుఁ బ్రియంవదతోఁ గలిసి యొక

చోటఁ గూర్చుండెను. అచట నల్గురు భటులను గాపుంచిన తరువాత నరుణాచలము చంద్రముఖిని రామలక్ష్మిని కలిసికొనెను. వారికిఁ దా నెవరో తెల్పి యరుణాచలము శశిభూషణునికొఱకుఁ బ్రయత్నింపనారంభించెను. ఆతఁ డెచ్చటనున్నాఁడని యడుగఁగా విజయమోహనుని యనుచరు లెవ్వరు నాతనికి సరియైన సమాధాన మీయలేదు. అందుచే నరుణాచలమే స్వయముగా రామదాసు చెప్పిన యంతర్గృహ మెచ్చటనున్నదో దానిద్వార మెచ్చటనో యని వెదకనారంభించెను. అట్లు చాలసేపు వెదకి వెదకి చివరకు దానిని గానక మరల హైమవతీదేవిచెంతకు వచ్చి,

"అమ్మా! ఇఁక నీ స్వల్పములగుమోసములవలన నెట్టి లాభమును లేదు. ఒక్క శశిభూషణుఁడు కనుపడకపోయినంత మాత్రమున వీరి కందఱికిని శిక్షలు తప్పవు. నిష్కారణముగా నేల యాబాలుని బాధించుట! మీరాజ్ఞాపించినయెడల వీరిలో నెవ్వరైనను దారిచూపెదరు. కనుక నా మనవిని జిత్తగించి మీ రాజ్ఞనీయవలయును" అని యరుణాచల మామెను గోరెను. రాణియుఁ బ్రియంవదను పిలిచి రహస్యముగా నేదియో చెప్పెను. అంత నామెయును నరుణాచలము నొక భటునియొద్దకుఁ గొంపోయి యాభటునితో నేదియో రహస్యముగాఁ జెప్పి మరల హైమవతిదగ్గరకు వచ్చెను. ఆభటుఁడును రం డని యరుణాచలమును తీసికొనిపోయి,

"తాళముచెవి రామదాసు తీసికొనిపోయినాఁడు. అందుచేత నీతలుపును బ్రద్దలకొట్టవలయు" నని చెప్పెను. వెంటనే యాతలుపు బ్రద్దలుకొట్టఁబడెను. అరుణాచలము నిరువురు రక్షకభటులు నిరాయుధుఁ డగు విజయమోహనునియనుచరుఁడును గలిసి మెట్లుదిగి, నేలదారిఁబడి పోవుచుండిరి. ఆభటుఁడు కొంతదూరమటుల నడిచి గోడమీఁద నతిచిత్రముగా నమర్పబడిన మీటునొకదానిని మిగిలినవారి కెఱుకలేకుండున ట్లదిమెను. వెంటనే యాపైనున్న తటాకమునుండి నీరు ధారాపాతముగాఁ బ్రవహింపనారంభించెను. ఆ మోసమును గనుపట్టి యరుణాచల మాభటుని క్రిందఁ బడవైచి తనకత్తితో రెండు పోట్లు పొడిచెను. ఆ భటుఁడును స్పృహతప్పి నేలఁ గూలెను. కాని నీరుమాత్ర మట్లే ప్రవహించి వీరిబట్టలను తడిపివైచెను. ఆముగ్గురును వెనుకకుఁ బోవుటకుఁగాని ముందున కడుగిడుటకుఁగాని తోఁచక యేమి దిక్కని యటులనే నిలువఁబడిపోయిరి. నీరప్పుడే గుండెలవఱకును వచ్చెను. ఇకఁ గొలఁది సేపటిలో వారు మునిఁగిపోదురు. అయ్యో!

ఆభటుఁడు హైమవతీదేవియాలోచనప్రకార మటులు గావించెను. వీరు నిజముగాఁ గొలఁదికాలములో మరణింతురనియే యాతని తలఁపు! కాని యటుల జరుగలేదు. ఉద్యానవనమునుండి వీరు ప్రవేశించినద్వారము తెఱవఁబడి యుండు

టచే నీ రామట్టమున కరుదెంచగనే యాద్వారమునుండి యుద్యానవనములోనికిఁ బ్రవహింపసాగెను.

అట్లు భయపడుచుండిన యరుణాచలమును రక్షకభటులును నీరట్లుపోవుటగాంచి తమ్మావిధమునరక్షించిన సర్వేశ్వరునిఁ గొనియాడి నీ రంతకంతకుఁ దగ్గదని తెలిసికొని శశిభూషణుని వెదకుటకై బయల్వెడలిరి. వారానీటిలో నట్లే దారిఁ జేసికొని యిరువంకల జాగ్రత్తగా బరీక్షించుచు పోవుచుండగా నొకచోటమూల్గువినవచ్చెను. అచ్చటజాగరూకతతోఁ జూడఁగా నచ్చట నొక ద్వారముండుటయు దానిలోపలనుండియే యామూల్గు వినవచ్చుచుండుటయు కనుపట్టి తమయొద్దనున్న యాయుధములతో నచటిద్వారమునకుండిన కీలెడల్చిరి. ఆ ద్వారమునుండి లోపలికి వారు పోయి మరల నొక యినుపయూచల తలుపును దానిలోపల శల్యావశిష్టుఁడై పడియున్న శశిభూషణునిఁ గాంచిరి. కాని యాగది నేలలకుఁ జాలయెత్తున నుండుటచే జల మందు ప్రవేశింపలేదు. ఆ రక్షకభటులా యినుపయూఁచల తలుపునుగూడఁ దీసి శశిభూషణునితోఁ దామెవ్వరో చెప్పిరి. ఆతఁడును అమందానందభరితుఁడై బయట కరుదెంచెను. ఆయిరువురు రక్షకభటులును శశిభూషణుని తడియకుండఁ బట్టుకొనిరి. శశిభూషణుఁడు తనమామ యిచ్చిన పత్రముల నతిజాగరూకతతోఁ బట్టుకొనెను.

వారు తిరిగి యానీటిలోఁ బ్రాఁకులాడుచు వచ్చుచుండగా వెనుక వీరిని మోసపుచ్చిన భటుఁడు మూల్గుచు నచ్చటనే నిలువఁబడియుండెను. కాని వీరిరాకను జూచి మాఱాడక యూరకుండి వారిచేతులలోఁ బడకుండఁ దప్పించుకొనెను. అరుణాచలము వీనిమాటయే మఱచిపోయెను. పల్వెల రాజ్యవినాశనమున కాతఁడే యొక మూలశత్రు వగునని గ్రహించియుండిన, అరుణాచలము జాగ్రతపడియే యుండును!

తరువాత బంధింపఁబడిన మిగిలినవారందఱు రక్షకభటాలయమునకుఁ గొంపోబడిరి. ఆనందమోహనుఁడు నల్వురచే మోయబడి యచ్చటి కీడ్వఁబడెను. హైమవతీదేవియు, నామె ప్రియదాసియగు ప్రియంవదయు పాదచారులై మరల విమలభవనమును బ్రవేశించిరి. రామలక్ష్మియును జంద్రముఖియు నింద్రభవనమునకుఁ గొంపోబడిరి. శశిభూషణుని యరుణాచలము తనయింటికిఁ దీసికొనిపోయెను. ఇదంతయును జరుగునప్పటి కరుణోదయ మాయెను.

## నలువది యేడవ ప్రకరణము

ఆనాఁ డత్యంత త్వరతోను భయముతోను విజయమోహనుఁడు హయము నొకదానినధిష్ఠించి రామచంద్రనగర

మార్గమునుబట్టి పోయియుండె నని తెల్పియుంటిమి. అర్ధ రాత్రమని యెంజంకును లేక కడురయమున తనగుఱ్ఱమును బరు వెత్తించి యాతఁడు తెల్ల వారకమునుపే రేవుస్థలమును జేరెను. అచ్చటఁ బడవవానికి కొంతధన మెక్కువయిచ్చి యారాత్రియే యాతఁడు రేవును దాఁటెను.

ఆ ప్రకారమే యెచ్చటను నాగఁక యాతఁ డానాఁటి మధ్యాహ్నకాలముననే రామచంద్రనగరము చేరి తిన్నగా రాజదర్శనార్థము పోయెను. పట్టణమంతయు సైనికులతో నిండి యుండుటఁ గాంచి యాతఁ డమందానందమంది పూర్వవిచా రము నంతయు మఱచెను.

రాజద్వారముచెంత నున్న భటుని పిలిచి రాజుగారితో "మీకొఱకు పల్వేలనుండి విజయమోహనుఁడు వచ్చినాఁడు" అని తెలుపుమని యాద్వారపాలకుని నాతఁడు లోనికిఁబంపెను.

జయచంద్రునికిఁగాని రాజసింహునికిఁగాని విజయమోహ నునిపేరు క్రొత్త గాదు. వెనుక వర్తకు లాతనిసంపదను కొని యాడుటయేకాక తమ హైమవతియే యాతనిని వేనోళ్లఁ బొగడియుండెను. అందుచే వారిరువురును కడుసంభ్రమముతో నాతనిని లోనికిఁ గొనిపోవుటకుఁ గడు రయంబున నరుదెంచిరి. కాని ధూళిధూసరితమైన యాతనిదుస్తులఁ గాంచియు మిగుల నలసిపోయిన ట్లుండిన యాతనిశరీరమును గాంచియు నేదియో

మునిఁగినదని నిశ్చయించుకొని వా రాతనినిఁ బల్కరింపక యే లోనికిఁ గొంపోయిరి. లోపల నాతఁడును నుష్ణోదకమున జలకమాడి కొంతతడవు విశ్రమించినతరువాత నాహారమును గైకొని కూర్చుండెను.

"శయనించెదరా?" అని రాజసింహుఁ డాతనిని బ్రశ్నించెను.

"శయనించుటకుఁగాని మాటలాడుటకుఁ గాని యెట్టి తీరికయును లేదు. అచ్చట మనపని చాల నధోగతినిఁ బొందియున్నది" అని విజయమోహనుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఆమాటలకు జయచంద్రుఁడు భయపడి "మా హైమవతి క్షేమముగా నున్నదా?" యని ప్రశ్నించెను.

విజయ—అయ్యో! మా కొక గొప్పమోసము జరిగినది. ముందు నేనెవఁడనో, నేను మీకార్యమున నేల ప్రవేశించితినో, మీ కొమార్తె నెట్లు గాపాడుచుంటినో మీకుఁ దెలిసియే యుండు ననుకొనెదను.

జయ—మీ మేలునకు మే మెన్నఁడును బ్రత్యుపకార మొనరింపఁజాలము. నిజముగా మొన్న మొన్నటివఱకును హైమవతి మృతినొందిన దనియే తలఁచితిమి. కాని మీరే సోదరునివలెను రక్షకునివలెను నడ్డుపడి యామెను గాపాడితిరి. మి మ్మీశ్వరుఁడు రక్షించుగాక!

విజయ—ఇందు నేను చేసినఘనకార్య మెద్దియును లేదు. అంతయును దైవకృప! మీతనయ నిజముగా మహాపతివ్రత. అమాయకురాలు! అట్టియామెను జిక్కులు పెట్టుటకు సమకట్టిన శ్యామసుందరిని దైవము శిక్షింపకపోఁడు! కాని నేను చెప్పినటుల మా కొకగొప్పమోసము సంభవించినది. ఒకదినమున నదిలోఁ గొట్టుకొనిపోవుచుండఁ గాఁజూచి యొకమనుష్యునికిఁ బ్రాణదానము చేసితిమి. ఆతఁడు కోటయ్య యనుపేరుతో మా యొద్దనే నౌఖరుగా నుండి మాగుట్టుమట్టు లన్నియుఁ గనుపెట్టెను. ఆతఁడే రామదాసని మాకు నిన్న రాత్రియే తెలిసినది.

జయ—ఎవరు? ముఖ్యరక్షకభటాధికారియేనా?

విజయ—ఔ నాతఁడే! మహారాణి విలాసభవనమున నున్నటు లాతఁడు గ్రహించి యిటులు చేసెను. యతఁడే రామదాసని తెలియఁగనే నేను బంధించుటకాతనిఁ బట్టితిని. కాని యొంటరినగుటచేఁ దప్పించుకొని యాతఁడు పారిపోయెను. ఆతఁ డీ సంగతి నంతయు శ్యామసుందరికి నివేదించి మనవారినందఱినిఁ బట్టుకొనుటకు ప్రయత్నములఁ జేయుచుండును. మనవారందఱు బంధింపఁబడుదురు. అందుచే మనకు యుద్ధము తక్క తరణోపాయ మెద్దియును లేదు. పల్వెల పట్టణమునం

దిప్పుడు సేనలు కొలఁదిగా మాత్రమే యున్నవి. ఈ మధ్య యుద్ధములేమియు లేకపోవుటచే సైనికు లంద ఱును సోమరిపోతులై యున్నారు. అంతియకాక కొం దఱు సైనికోద్యోగులు మన కనుకూలురై యున్నారు. ఇట్టితరుణమున మనము పల్వోలరాజ్యముపై దండెత్తిన మనకు విజయ మవలీలగఁ జేకూరఁగలదు.

ఆమాటలకు జయచంద్రుఁడును రాజసింహుఁడును గూడ నానందించి వల్లె యనిరి. ఆ మఱునాఁటియుదయము ననే రాజ్యమునందలి యన్ని మూలలకు సైనికులకొఱకుఁ గబుర్లు పంపఁబడెను. కొండప్రదేశములనుండి కోయవాండ్రు మృగములవలె వచ్చిపడిరి. పచ్చినెత్తురు త్రాగు నా క్రూరులు యమకింకరులవలె వివిధవర్ణముల దుస్తులను ధరించి, చూచు టకు భయంకరముగా నుండిరి.

విజయమోహనుఁ డెంత తొందరకావించినను నాలుగు దినములకుఁగాని సైనికనికాయ మెల్ల సరిజేయుట పూర్తికా లేదు. రాజసింహుఁడు మితిలేని సంతసముతో హయము నధి ష్ఠించి పట్టణము నాల్గువైపులను నప్పుడే విజయునిపోలెఁ దిరు గాడ నారంభించెను. సైనికులెల్లరును సన్నద్ధులైనపిదప మంచి రోజునకై మరి రెండుదినము లాగవలసివచ్చెను.

ఎట్టకేల కన్నియును సమకూడెను. జయచంద్రునిచేత నే నడుపఁబడి యా సేనాసమూహమంతయుఁ బల్వోలపటణమును భగ్నము గావించుటకై బయల్వెడలెను.

## నలువది యెనిమిదవ ప్రకరణము

క. కావునఁ బరులకు హింసలు
గావింపఁగవలదు తనకుఁ గళ్యాణముగా
భావించి పరుల నెంచినఁ
బోవునె తత్ఫలము పిదపఁ బొందకయున్నే.

-భాగవతము.

విజయమోహనుని యనుచరులందఱును బంధింపఁబడి రనువార్త యానాఁడే యూరంతయును వ్యాపించెను. జను లందఱు గుంపులుగుంపులుగాఁ గూడి యీ చిత్రకథనే చెప్పు కొనుచుండిరి. నిన్నటివఱకును సుగుణభూషితుఁడనియు దాన కర్ణుఁ డనియు కుబేరుఁడేయనియుఁ బొగడఁబడినయాతఁ డీదిన మున చోరాగ్రేసరుఁడనియు హంతకుఁడనియు నిరూపింపఁబడిన నాశ్చర్యము కల్గుట వింతకాదు. సామాన్యపౌరులకు నిజముగా జరిగిన కథయంతయుఁ దెలియదు. రామదా సెంత కష్టపడెనో యెన్నిదినములు నిద్రాహారములు లేక యాలోచించుచుండెనో

వారి కెటులు దెలియఁగలదు? అంతయు సమర్పినయెడల దాని పై నుపన్యాసములను మాత్ర మతి చాకచక్యముతో నిచ్చుటకు వారు సమర్థులే! కాని రామచంద్రుని బంధించినపు డేర్పడిన ట్లిప్పుడు రెండుపక్షము లేర్పడలేదు. హైమవతి యాతని యింట నుంచుటచే విజయమోహనుఁడు కడు దుర్మార్గుఁ డని వారు తలఁచిరి. తరువాత నాతఁడు పరారియైపోవుటయే యొక ప్రబలనిదర్శనముగాఁ గన్పట్టుచుండెను.

విజయమోహనుని యనుచరు లందఱును బంధింపఁబడిన యామరుసటిదినముననే శ్యామసుందరీదేవి వారందఱిని బహిరంగముగా విచారింప నమకట్టెను. ఆ విషయ మాదినమున నూరంతయుఁ జాటఁబడుటచే ప్రేక్షకులు వేలకువేలు వచ్చిపడిరి. రాజకీయోద్యోగులందఱును సభ నలంకరించిరి. శ్యామసుందరీదేవియుఁ దగిన సమయముననే వచ్చి సింహాసనము నధిష్ఠించెను. విజయమోహనుని యనుచరులందఱు నొక్కచోట నిలువఁబెట్టఁబడిరి.

హైమవతియుఁ బ్రియంవదయు వారి కమర్పఁబడిన స్థలమునం దాసీనులై యుండిరి. ఈదినమున హైమవతి యొంత మాత్రమును గంభీరముగాలేక నేరస్తురాలివలెనే కళలు దక్కియుండెను. చివరవఱకును మోసపుటాలోచనముల ననేకములఁ జేసెను కాని యవేవియు ఫలింపకపోవుటచే విఫలమనోరథయై వాత్రిరహితమగు నదిమాడ్కి వికాసము తగ్గియుండెను.

మఱియొకచోట రామలక్ష్మియుఁ జంద్రముఖియు నాసీనలై యుండిరి. రాణికి మిగుల సమీపముననే యొక ముఖ్యాసనముపై బలహీనుఁడగు శశిభూషణుఁడు కూరుచుండి యుండెను. ఆ భయంకరకారాగృహమున నన్నిదినము లుండుటచే నాతని శరీరము వెలవెలఁబోవుచుండెను. ఆతనిని మనసారఁ బ్రేమించిన చంద్రముఖి యాతని ప్రస్తుతస్థితిఁ గాంచి, తనయవ్వారుఁ దెలియకుండగనే యనేకపర్యాయములు కనుల నీరుంచెను.

కొంతసేపటికి, శశిభూషణుని రాణి తనచెంతకుఁ బిలిచి యేదోమాటాడి పిమ్మట న్యాయవాది నొకనిని సభఁ గూర్చుటకు కారణములఁ దెలుపుమని యాజ్ఞాపించెను. అంత నాన్యాయవాది లేచి యీ క్రిందివిధమున సభ కభిముఖుఁడై పలికెను:

సభికులారా!

నేఁ డీసభను గూర్చుటకుఁ గారణము మీలో ననేకులకుఁ దెలియకపోదు. ఈమధ్యనే నాలుగైదు సంవత్సరముల నుండియుఁ గనియు వినియు నెఱుంగని భయంకరకృత్యములు రెం డీసంవత్సరముననే జరుగుటయు నందు మొదటిదానిని జయరాముఁడే చేసెనని తీర్మానించుటయు, మన రక్షకభటాధికారి యగు రామదాసు రామచంద్రు ననుమానించి శిక్షించుటయు మొదలగు పూర్వకథయంతయు నందఱికిని దెలియును. కాని, రామదాసే మరలఁ గొన్ని గొప్ప నిదర్శనములమూలమునఁ

దాను బొరపడినటుల గ్రహించి నిజమైన హంతకునిఁ గన్గొ
నెను. సవిస్తరముగా నాతఁడే యీవిషయమున నంతయు విపు
లముగా వ్రాసి శశిభూషణున కిచ్చియున్నాఁడు. వాని నీబాలకుఁ
డిప్పుడు చదువఁగలఁడు. మీరందఱు శ్రద్ధతో వినియెదరుగాక
యని కోరుచున్నాఁడను.

అంత శ్యామసుందరీదేవి శశిభూషణునివైపు చూచెను.
ఆతఁడును లేచి తన కోమలస్వరముతోఁ దనమామ వ్రాసిన
పత్రముల నిటు చదివెను:

"నేను వ్రాసిన యీక్రింది యంశములన్నియు నధికపరి
శ్రమతోడను, జాల యాలోచన మీఁదను వ్రాయఁబడినవి.
వీనిని వినిన విజయమోహనుఁడు దారుణహంతకుండు కాని,
యాతఁడు దెలిపినటులు రాజకుమారుఁడుగాని వర్తకశిఖామణి
గాని కాఁడని తెలియఁగలదు. పూర్వము జరిగిన విచారణ
మును మన మొక్కసారి మఱవవలయును. రామచంద్రుఁడు
రాజద్రోహియే కాని హంతకుఁడు మాత్రము కాఁడు.

హేమచంద్రునిఁ జంపినవాఁడును వెంకటప్పయ్యను జం
పినవాఁడును నొక్కఁడే. ఏలయన మొదటిహత్యయం దాతఁడు
నేనే చంపితినని జయరాముఁ డను పేరుతో మనకుఁ దెలియఁ
జేసియే యున్నాఁడు. ఇఁక రెండవహత్యయందు మంత్రితల
యెచ్చటనున్నదో తెలిపిన భయంకరరాక్షసుఁ డీ జయరామ

నామధారియే కదా! హత్యతో సంబంధము లేకపోయిన నట్టి భయంకర రహస్య మాతని కెటులు దెలియఁగలదు?...... హేమచంద్రునిఁ జంపుటకుఁ గారణ మిప్పటికిని దురూహ్యము. దానికి ధనాశయైనను కారణమై యుండవచ్చును. లేనియెడల నాఁటిరాత్రి నాట్యముచేసిన వారవనిత యైనఁ గావచ్చును. ఏది కారణమైనను హత్యచేసినపిమ్మట నాతఁడు జయరామ నామమును ధరించి ప్రజలను భ్రమపెట్టి తాను నిర్విచారముగా నుండఁదలఁచికొనినాఁడు. ఆహత్య జరిగినమఱునటిదినముననే నేను విలాసభవనముననుండగా విజయమోహనుఁడు తన యనుచరులతో నచ్చటికివచ్చెను. నే నాతనితో "నీహత్య చేసినవా రెవరో" అని యింకను యేమియో చెప్పఁబోవుచుండఁగా క్రిందనుండి "జయరాముఁడు" అను గంభీరవాక్య మొకటి వినవచ్చి దారుణాస్త్రపాతమువలె ప్రజలవీనులపైఁ బడినది. నేను క్రిందికిఁ బోయిచూడఁగా నచ్చట విజయమోహనుని యనుచరులుతక్క మఱెవ్వరును లేరు. కాని యప్పుడు వారిపై నా కెట్టియనుమానమును లేకపోయినది.

తరువాత జయరామనామధారి వ్రాసినయుత్తరము వెంకటప్పయ్య జేబులోనికిఁ జిత్రముగావచ్చిపడుట! ఆ యుత్తరము వచ్చిననాటి యుదయమున విజయమోహనుఁడు మంత్రి ప్రక్కఁ జాలసేపు కూరుచుండియుండి మాటలు చెప్పినాఁడు. అట్టి సమయమున నాతఁడే యెవరును చూడకుండ నాయుత్తర

మాతని జేబులోనికిఁ ద్రోసియుండును. కాని మొదటఁ దెల్పి నటుల నీతనిపై ననుమాన మప్పటి కెవ్వరికిని లేదు.

ఇకమంత్రిహత్యవిషయమై— ఈ పట్టణముననే యొక సన్న్యాసి యనేకదినము లమోఘమైన జపతపము లాచరించి ప్రజలమన్ననలకుఁ బాత్రుఁడై, జలస్తంభనము మొదలగు చర్య లనేకములను గావించి ప్రజలను చాల భ్రమపెట్టియుం డుట మీరు మఱచియుండరు. మంత్రి హత్యచేయఁబడిన మఱునటి రాత్రి యాసన్న్యాసియు హైమవతియుఁగలిసి విమల భవనమున మంత్రిహత్యనుగుఱించి మాటాడుచుండఁగాశశిభూ షణుఁడు వినెను. తరువాత నాతఁడా యోగిని వెంబడింపఁగా నాతఁడు విలాసభవనములోనికిఁ బోయెను. విలాసభవనాధి రుఁడగు విజయమోహనుని సన్న్యాసినిగూర్చి ప్రశ్నింపఁగా నా తఁడేమియు నెఱుఁగ నని చెప్పెను.

తరువాత మరల జయరాముని యుత్తరము! అందు రామచంద్రుఁడే హంతకుఁ డని వ్రాయఁబడి యుండుట మొద లగు కథ నందఱు నెఱుఁగుదురు. మఱికొన్నిదినములకు హైమ వతి మాయమై పోయినది. ఆమె వెనుకనే శశిభూషణుఁడు కూడ మాయమై పోయినాఁడు. ఆవిషయమై ప్రస్తావించుచు మాటవరుసకు నాసన్న్యాసియేమరల శశిభూషణుని మాయము చేసెనని నేను విజయమోహనునితో నంటిని. ఆమాటను విని యాతఁడు చాల కలవరపడి సన్న్యాసి యటులఁ జేయఁడనియు

నాతఁడు చాలమంచివాఁడే యనియు నొక్కి చెప్పెను. సన్న్యాసికిని విజయమోహనునికిఁ దప్పక యేదియో సంబంధము న్నదని తలఁచి నేనొకనాఁడు కౌశికానదిలోఁబడి కొట్టుకొని పోవుచున్నటుల నటించితిని. విజయమోహనుఁడు నన్ను దీయించి కాపాడెను. నేను కోటయ్యయను నామముతోఁ నచ్చటనే యుంటిని. క్రమముగా విజయమోహనుని నిజచరిత్రయంతయు నాకు బోధపడెను. ఒకదినమున నాతఁడు నా కొకవిచిత్రమృగమును జూపెదనని తీసికొని పోయి శల్యావశిష్టుఁడై పడియున్న శశిభూషణునిఁ జూపెను. ఆతనిఁ జూచి పట్టజాలని దుఃఖముతోఁ నిది యేమిమృగ మని నేను బ్రశ్నింపగా మృగమో కాదో చూడుమని యాతనిని విజయమోహనుఁడు చావమోదెను. శశిభూషణుని నాతఁడు పెట్టినయిడుమ లిన్ని యన్ని యని చెప్పనలవికాదు.

శశిభూషణుఁడు విజయమోహనుఁడే యాసన్న్యాసి యనియు హైమవతి యచ్చటనే యున్న దనియు నాకుఁ జెప్పినాఁడు. శశిభూషణునిముందట విజయమోహనుఁడు మరల నాసన్న్యాసిరూపమును ధరించి హైమవతినిజూపి యిప్పు డేమి చేయఁగలవని యాతని నడిగెనఁట.

నిజమంతయు నప్పుడుఁనాకు బోధపడెను. ప్రియంవద రాయబారిగానుండి హైమవతికిని సన్న్యాసికిని బంధుత్వము కలిపెను. హైమవతి తనసోదరుని శ్యామసుందరీదేవి కిచ్చి వివా

హాముచేసి రాజ్యాధికారమంతయుఁ దనచేతనే యుంచుకొన వలయునని యోజించినది. కాని యీవిషయమున వెంకటప్పయ్య యడ్డమువచ్చునని తలఁచి సన్న్యాసిచే నాతనిని చంపించినది. విమలభవనమునుండియే జయరామనామమును ధరించి రామచంద్రుఁడు హంతకుఁడని విజయమోహనుఁ డుత్తరమును వ్రాసి శ్యామసుందరి శయనమందిరమును జేరునట్లు చేసినాఁడు. కోటలోనేయున్న విమలభవనములోనుండియే యాయుత్తరమచ్చటికి వచ్చినది. ఇంటిదొంగ నెవరు పట్ట గలరు?

విజయమోహనుఁ డా నేరమును రామచంద్రునిపై నేల మోపవలయును? హైమవతీదేవి యాతనిని తనవలలో వైచి కొనినట్లే రామచంద్రునిఁగూడఁ జేరఁదీసినది. ఆసంగతిని విజయమోహనుఁడు కనిపట్టి రామచంద్రునిపై నీర్ష్యచే నట్లొనర్చెను. తరువాత రామచంద్రునివిచారణ యెప్పుడని సన్న్యాతఁ డడిగి యాదినముననే హైమవతిని తప్పించి, తనయొద్దనే యిప్పటి వఱకు నుంచికొనెను.

నే నచ్చట కోటయ్యవేషముతో నుండఁగా నన్నుఁజంపుటకు విజయమోహనుని యనుచరులు రెండుపర్యాయములు మాయింటికి వచ్చిరి. నేనును వారితోడనే యుండి రెండవ పర్యాయము వారి నందఱిని బంధింపఁజేసితిని. మాయింట దొంగిలించినవస్తువు లింకను వారియొద్ద నున్నవి.

ఇట్టివాఁడు విజయమోహనుఁడు. విజయమోహన నామముతో నరుదెంచి, సన్న్యాసిరూపముధరించి జయరామమాయ నామధారియై చివరకిటులఁ జేసెను. ఇట్టి నరాధములు ప్రపంచములో నరుదుగా నుందురు. దుర్మార్గుఁడును హంతకుఁడును చోరాగ్రేసరుఁడును నైయుండి రాజుమన్ననలకుఁ బాత్రుఁడై భూషింపఁబడుట చిత్రము కాదు! ఈ లోక కంటకుని మరల లోకమున కేయిబ్బందియు లేనటుల జాగ్రతపెట్టుట పాలకుల విధి!

రామదాసు.

దీని నంతటిని సాంతముగాఁ జదివి శశిభూషణుఁడు నిలువఁబడి యుండెను. "అంతియేనా" అని శ్యామసుందరీదేవి ప్రశ్నించెను.

"విజయమోహనుని గుఱించి యంతియే. కాని దీనిని తమకై వ్రాసినట్లున్నది" అని శశిభూషణుఁడు రాణికొకయుత్తరము నందించెను. రాణి యాయుత్తరము నిటులఁ జదివెను:

మహారాణీ

ఈ యైదుసంవత్సరములనుండియును నేను చేసిన సేవకుఁ దమరు నా కొక ప్రత్యుపకారముఁ జేసిన నాజన్మ సఫలమగును. ఆయుపకార మెద్దియనిన చంద్రముఖి శశిభూషణుల వివాహము. మీరు తలఁచిన నాకోరిక యచిరకాలములో

నెఱవేఱుఁ గలదు. నేను చేసినసేవకును నేను పడినకష్టములకును ప్రతిఫలముగా దీని ననుగ్రహింతు రని నాతలంపు.

ఇట్లు, తమవిధేయుఁడు.

రామదాసు.

ఈయుత్తరమునందలి యంశములు రామలక్ష్మికిఁ దక్కఁ దదితరుల కందఱకు సంతోషము నిచ్చెను. ఏలయన ప్రజాసమూహమంతయు శశిభూషణుఁడు తనకు మహోపకారమొనర్చిన ధీరుఁడని మాతనిని వేనోళ్లఁ బొగడు చుండెను. అందుచే నట్టివాని వివాహము ప్రజలకు సంతోషదాయకము కాదా! కాని రామలక్ష్మికి మాత్ర మావివాహము చాలకష్టముగా నుండెను. చంద్రముఖిని విడుచుట యనిన దిగులు దుర్భరమైనట్లామెకుఁ దోఁచుచుండెను. అందుచే నామె రాణి యా యుత్తరమును ముగించినతోడనే యప్రయత్నముగా లేచి నిలువఁబడెను. రాణి యనిన నామె కొకవిధమైన భయమును విధేయతయు జనించుటచే మాటాడలేక వణఁకుచున్నట్లే నిలువఁబడెను. శ్యామసుందరీదేవియు నామెవైపు వింతగాఁ జూచెను. ఆసమయమున నరుణాచలము రాణికడ కేఁగి యెద్దియోరహస్యముగా నామెకుఁ జెప్పెను. శ్యామసుందరి రామలక్ష్మిని జూచి "రామదా సెవ" రని ప్రశ్నించెను. తలఁపని తలంపుగా నవ్వారకు పిడుగు నెత్తిపైఁబడెను! "రా...మ...

దా...సును...చిన్ననాటనుండియు నెఱుఁగుదును...కా...ని—కా...ని" అని రామలక్ష్మి నీళ్లు నమలుచుండెను.

"రామదాసు జయరాముఁడేనా?" అని రాణి యధికారసూచకముగాఁ బ్రశ్నించెను. అంత నాయవ్వ "అవు...ను—కా...ని...కా...ని" యనునంతలోఁ బ్రజలలో నణఁపజాలనట్టి కలవరము హెచ్చుట వింతకాదు. రాణికూడ చాల నాశ్చర్యము నందెను.

కాని ప్రజలుమాత్రము తమప్రియరక్షక భటాధికారియు ప్రజల బిడ్డలవోలెఁ బాలించువాఁడును మిగుల బుద్ధిమంతుఁడును నగురామదాసు జయరాముఁడే యనుట విని భయపడుటకు మాఱుగా సంతోషాశ్చర్యములయందు మునిఁగిరి. అతఁడొకమహావీరుఁడనియు నత్యద్భుతచరిత్ర గలవాఁడనియు వారందఱు నేకగ్రీవముగా నంగీకరించిరి. కాని రాణిమాత్ర మాతనిని గౌరవింపవలయునో, శిక్షింపవలయునో తెలియక తహతహపడు చుండెను.

తరువాత విజయమోహనుని బట్టినవానికి గొప్పబహుమాన మిచ్చెదనని యామె ప్రకటించెను. విజయమోహనుని యనుచరులందఱును గఠినముగా శిక్షింపఁబడిరి. వారికి చేతిబొటనవ్రేళ్లు తెగఁగొట్టునటుల నాజ్ఞయీయఁబడెను. అందుచే వారు విడిచిపెట్టఁబడినను నిరాయుధులే! హైమవతీదేవిని,

ప్రియంవదను రామచంద్రుని, పురమునుండి వెడలఁ గొట్టించు టకు నిశ్చయించిరి. ఆనాఁటికి సభ ముగిసెను.

*    *    *    *    *    *

మఱిరెండుదినములకు శిక్షలు చాలమట్టుకు పూర్తి యయ్యెను. ఇఁక నూరినుండి వెడలింపఁబడ వలసినవారు మాత్రమే మిగిలిరి.

వివాహమును గూర్చి రామలక్ష్మి చాలవఱకు నడ్డములుచెప్పి మొత్తుకొనెను. కాని యామెమాట నిరాకరింపఁబడెను. సభయందు రాణిమాట కామెయెదురాడుటకు జంకుటచే చంద్రముఖిశశిభూషణుల వివాహ మత్యంతవైభవముతోఁ జరిగెను.

రామదా సావివాహమును చూచి సంతోషింపలేదని మనము విచారింప నవసరములేదు. ఏలయన ఆ వివాహమున కాతఁడే పౌరోహితుఁడై కనులపండువుగా నానూతన వధూవరులఁ జూచి స్వర్గసౌఖ్యము ననుభవించుట యెవరును కనిపట్టలేకపోయిరి. వేషధారణయం దాతఁ డసమానుఁడుకదా! రామలక్ష్మికూడ తనపాఠశాలను ముగించి రామదాసు నాతని యెదుటనే తిట్టుచు రామదాసునింటనే చంద్రముఖిశశిభూషణులతో నుండ నిశ్చయించికొనెను.

---

# నలువదితొమ్మిదవ ప్రకరణము

విజయమోహనునియనుచరులందఱును శిక్షింపఁబడిరి. కాని యొక్కఁడుమాత్రము మిగిలెను. విలాసభవనమున నర్జునాచలమును రక్షకభటులను నీట ముంచి చంప యత్నించిన వాఁడే యాతఁడు! ఆతఁడు విలాసభవనోద్యానవనమున మఱు నాఁడు కొంతతడవుండి సాయంకాలమున మాఱువేసమున పట్టణ వీధులవెంట తిరుగాడ నారంభించెను.

కాని యాతఁడెఱిఁగియున్నవాఁ డొక్కఁడును నాతని కంటఁ బడలేదు. ఏమియునుదోఁచక యెవరినిఁ బలుకరించుట కును ధైర్యము చాలక యాతఁడు తిరుగుచుండెను. కాని మఱి కొన్నిదినముల కాతని యదృష్టముచొప్పున భాస్కరుఁ డాతని కంటఁ బడెను. వెంటనే యాతనిఁ బిలిచి మాటలు చెప్పుచు నా భటుఁ డాతనిని జాలదూరము కౌశికానదీతీరమునఁ బడి తీసి కొనిపోయెను.

వారటుల నడచుచుండఁగా, కొంత సేపటికి వారి నొకఁడు వెంటాడించెను ఆతఁడు రామదాసు కాదు. విజయమోహ నుఁడే! జయచంద్ర రాజసింహులతో సైన్యసమేతుఁడై యాతఁ డప్పుడే చాలదూర మరుదెంచెను. కాని స్థితిగతు లెట్లున్నవో

కనుఁగొనుటకై విజయమోహనుఁడు ముందేబయల్వెడలిపల్లెల పట్టణప్రాంతభూముల కరుదెంచి, వీరిని కన్గొని, వీరిమాటలను వినుచుండెను. కొంతసేపటికి వా రెవరో తెలిసికొని వారిని పలుకరించెను. జరిగిన సంగతి నంతటిని దన యనుచరునివలన విని విజయమోహనుఁడు పల్వెలరాజ్యముపైఁ గడుక్రోధమును జెందెను. తగినసమయమునకే యరుదెంచితి నని యాతఁ డను కొనెను.

వారు ముగ్గురును గలిసి కొంతదూరము నడచి సము ద్రమువలె వ్యాపించియున్న రామచంద్రనగరమునుండి వచ్చిన సేనాసమూహముమధ్యకుఁ జేరిరి. ఒకచోట జయచంద్రుఁడును రాజసింహుఁడును నాసీనులై యుండ వీరును నచ్చటికిఁ జేరిరి.

జయ—ఏమైనది? వీ రెవరు ?

విజయ—ఏమగును? నేననుకొని భయపడినయట్టులే జరిగినది. నాప్రియసోదరియగు హైమవతీదేవికి నురిశిక్ష విధింపఁ బడెనట. కాని యేవిధమునఁ జంపుదమా యని వారు యోజించుచున్నారఁట.

జయ—ఎప్పుడు?

విజయ—ఇంకను ప్రాణములతోడనే యున్నదఁట. కాని రేప టి కేమగునో !

జయ—అటులైన మనము పోయి యీరాత్రియే మనవారిని రక్షింప వలనుపడదా?

విజ— ఏమి, భాస్కరా ! మాటలాడవేల?—అని, జయచంద్రునితో "అయ్యా ! యీతండు పల్వెల రాజ్యమునకు సేనాధిపతి. మనకు ముఖ్యస్నేహితుఁడు. మనకు వలసినంత సాహాయ్యమును జేయును. పల్వెలపట్టణము మన చేతఁబడినవెంటనే యీతనిని ముఖ్యమంత్రిగఁ జేయ వలయు నని నా ప్రార్థన."

జయ—తప్పక యటులనే చేయుదము. అయ్యా! ఏమిసెలవు?

భాస్కరుఁడు నిజముగా నుబ్బిపోయెను. వీరిటుల మాట్లాడుచుండగా రాజసింహుఁడు మఱియొకచోటునకుఁ బోయి, యమూల్యమైన రత్నహారము నొకటి తెచ్చి భాస్కరుని మెడ నలంకరించెను. భాస్కరుఁడును, తనజన్మ తరించినటుల సంతసించి, త్రాగుబోతగు నున్మత్తునిబోలె, తన విధ్యుక్తధర్మమును విడిచి, యీప్రకారముగా వారి కుత్తరమిచ్చెను :

"ఔను! ఈ రాత్రియే యనుకూలముగా నున్నది. ఉదయమున కంతయును బూర్తియగును. నేను కోటలో రహస్యముగాఁ బ్రవేశించి యర్ధరాత్ర మగునప్పటికి కోట ద్వారములను తెఱచియుంచెదను. మీరందఱునుమాత్ర మెటులనో లోపల ప్రవేశింపవలయును."

దానికి విజయమోహనుఁడు మిగుల సంతసించి తనబుద్ధి నంతయు వినియోగించి యుద్ధపద్ధతి నీక్రిందివిధమున వారికిఁ దెలియఁజేసెను.

"కౌశికానదీ తీరముననుండి రహస్యముగా మాచేఁ దయారుచేయఁబడిన బాట ననుసరించి విలాసభవనము ప్రవేశింప వలయును. అచ్చటనుండి బయల్వెడలి సైన్యము పట్టణమన్ని భాగముల నాక్రమించుకొనవలయును. విలాసభవనము పైభాగ మున నిలువఁబడి యొకఁడు వెల్గుచుండినకాగడా నొకదాని నెత్తిపట్టుకొనును.

ఆ నిముసముననే సైనికులందఱుఁ దమవాఁడికత్తులతో నగపడినవారి నందఱిని నఱికివేయవలెను. భవనముల నన్ని టినిఁ దగులఁ బెట్టవలయును. నేనును రాజసింహుఁడు, జయ చంద్రమహారాజు కొంతమంది ముఖ్యసైనికులతోఁ గోటలోని కిఁ బోయి హైమవతిని మిగిలిన మనవారిని రక్షించెదము. సైనికు లందఱు నిండ్లయందే యుందురు. అగ్నిజ్వాలలోఁ బడి వా రందఱుఁ జనిపోదురు. మిగిలినవారు మనకత్తులకు బలి!"

ఇది యుద్ధపద్ధతి! అందఱును దీనికి నంగీకరించిరి. భాస్క రుఁడు తనపనిని నెఱవేర్చుటకై వెంటనే పోయెను.

ధర్మము ననుసరించియే జయముండుననుట కలియుగ మునాటిమాట కాదు. సత్యపురుషులును న్యాయమార్గావలం

బకులును జయమునందుటకు మాఱుగా దుర్దశల ననుభవించి దుర్మరణముల నందుచుండ మన మొందఱిని గాంచుటలేదు! పల్వాలధర్మరాజ్యమునకు నట్టిగతి తప్పలేదు.

చీకటి బాగుగా నావరించిన వెనుక సైనికు లెల్లరు నా బిలమునుండి విలాసభవనమును బ్రవేశించిరి. మిగుల విశాల మగు నాయుద్యానవన మంతయును సైనికులతో నిండిపోయెను. కొన్ని దినములనుండి నిర్మానుష్యమై పాడఱియున్న విలాసభవనోద్యానవనము మరల నొకసారి, కడపటిసారి కలకలలాడెను. పల్వాలరాజ్యనాశనకారకుఁ డగు విజయమోహనుఁ డా సైనిక నికాయము నంతనుఁ బరీక్షించి యానందించెను.

కాలము సమీపించెను! విలాసభవనముఖ్యద్వారము తెఱవఁబడెను. సైనికులందఱు నిశితకరవాలముల ధరించి, చమురుకాగడాలను బయటకుఁదీసి పట్టణమంతయు నిశ్శబ్దముగా నన్నివైపులను సద్దుకొనిరి. విజయమోహనుని పరీక్షయును ముగిసెను. విలాసభవనపుఁ బైభాగమున కెక్కి యాతఁడే వెలుఁగుచున్న కాగడాను బైకెత్తెను. మహారాజ్యనాశన సూచక మగు తోఁకచుక్కవలె నాకాగడా భయంకరముగా వెల్గుచు సైనికులు తమపనిని మొదలుపెట్టవచ్చు ననుట సూచించెను.

ఒక్కసారిగా పట్టణ మన్నివైపులనుండియు మహాగ్ని జ్వాలలు, హాహాకారములు బయల్వెడలి యాకాశవీథి నంటు

చుండెను. అర్ధరాత్రిసమయమున నొకటిరెండిం డ్లంటుకొనిన యప్పుడే భయంకరధ్వనులు బయలుదేఱును. అట్టిది ముఖ్యరాజ్యస్థానమును సర్వసౌఖ్యప్రదమైన పుణ్యస్థలమును బూర్వపట్టణమును నగు పల్వేలపురి సర్వనాశనమై పోవునపుడు కల్లుకోలాహలము వర్ణింప నెవరితరము? ఇండ్లలోనుండి బయటకరుదెంచువారి నందఱిని స్త్రీలను శిశువులనుగూడ నారాక్షసాధములగు సైనికులు నిర్దయతోఁ జంపివైచిరి. ఆ రాజ్యనాశనమున కే యుద్ధమును జరుగలేదు. పల్వేల రాజ్యమునందలి సేనాజల మంతయు నన్యాయముగనే చంపఁబడెను.

ఇదంతయు నిట్టులుండ, భాస్కరుఁడు తనమాటప్రకారము యెట్లో కష్టపడి కోటతలుపులఁ దెఱచెను. విజయమోహనుఁడు రాజసిహుఁడు జయచంద్రుఁడు మఱికొందరు క్రూరులగు భటులునుగలసి కోటలోఁ బ్రవేశించిరి. విజయమోహనుని యాజ్ఞచే కోటలోనగపడిన ప్రాణులెల్ల నిదురలోనే హత్యచేయ బడుచుండిరి. కాని పాపము! రాజసింహుఁడు మాత్ర మాకోటలోఁ బ్రాణములతో నెంతయో తడవుండలేదు. శ్యామసుందరినిఁ జేపట్టుటకు బదులుగా నాతఁడు మృత్యుదేవతనే యాలింగనము చేయఁబోయెను.

విజయమోహనుని భటుఁడు యచ్చట పరుండియుండిన సైనికు నొకనిని నఱుకఁగా, నాతఁడులేచి గట్టిగా నఱచెను.

మిగిలిన యాతని నెయ్యురైదార్గురులేచి శత్రువులఁ జూచి ఖడ్గ ధారులైవచ్చి యందఱకును వెనుకనున్న రాజసింహునిఁ దుద ముట్టించిరి. తరువాత వారును మరల విజయమోహనుని చేతిలో మడిసిరి.

వృద్ధుఁడగు జయచంద్రుఁడు కూలఁబడెను. ఆతనియాశ లడుగంటెను. దేనిని తన జీవితాంధకారమున దివ్యజ్యోతివలెఁ బూజించుచుండెనో యట్టి కుమారరత్నము గతించుటచేత నా నిర్భాగ్యుఁడు మొదలు నఱుకఁబడినతరువువలె నేలఁగూలెను. కాని, యాతని నాదరించుటకు విజయమోహనుఁ డాగలేదు. విమలభవనమునందుండు హైమవతిపై నాతనిధ్యాన మంతయు కేంద్రీకృతమైయుండెను. అందువలన నాతఁడు కడురయంబున జని, తన ప్రేయసినిఁ జూచి బిగియార కౌఁగిలించుకొనియెను. హైమవతి మోహాంధకారమునను సంతసముచేతను నొడలు తెలియక "ప్రాణనాథా!" యని విజయమోహనుని కౌఁగిటిలో సుఖమనుభవించుచుండెను.

జయచంద్రుఁడటులఁ గొంతతడవుండి, లేచి, తలతిరుగు చుండ, హృదయభారముచే శరీరమంతయు వణఁకుచుండఁగా దన కొమరిత యున్నచోటి కరుదెంచెను. అచట నాతఁ డేమి గాంచెను! పుత్రనష్టముచేఁ గ్రుందుచున్న యాయభిమానవం తుఁడు తనకుముందు కొంతదూరముననే లజ్జారహిత యై విజ యమోహనుని "ప్రాణనాథా!" యనుచు ముద్దిడుకొను

చుండినతనగర్భమునజనించినకూఁతునుజూచి నిర్విణ్ణుఁడాయెను. ఉష్ణరక్తము తలకెక్కుటచేత నాతఁడు శరీరము తెలియక కనుల మూసియుంచియే, తనదారుణకృపాణము నెత్తియొక్క వ్రేటున వారిరువురిని ఖండించివైచెను. విజయమోహనుఁడును హైమవతియుఁ బ్రాణములవీడి క్రిందఁబడిరి. వారిప్రాణము లాపాపపు శరీరములనుండి పైకెగసి పోయెను. అనేకులరక్తములో నీఁదులాడిన, విజయమోహనుని మొండెము చివరకాతనిరక్తప్రవాహముననే పడి పొరలాడవలసి వచ్చెను.

పల్వోల పట్టణమంతయుఁ దెల్లవారుసరికి రక్తప్రవాహమయమై భయంకరముగా నుండెను. రమ్యహర్మ్యములు నాశనములై నేలఁ గూలియుండెను. అనేక సంవత్సరములకష్టముచే కూర్పఁబడిన యాసౌందర్యరాశి యొక్క రాత్రిలో భస్మీభూతముచేయఁబడెను. ఆకాళరాత్రియందుఁ జావక బ్రతికి బయటపడినవారు స్వల్పసంఖ్యాకులై యుండిరి. దురాశాపరుఁడగు భాస్కరుఁడు, మాయోపాయములయందారితేరిన యానందమోహనుఁడుకూడఁ గడకు మృతిఁ జెందిరి.

## ఏఁబదియవ ప్రకరణము

ఇప్పుడును బల్వోలయున్నది. కాని యందేమియును లేవు. అన్నియు నాశనమైపోయినవి. సుందరభవనములు యుద్యాన

వనములు వినిర్మలవారిపూరితంబు లగు జలాశయంబు లేమి యును లేవు. చివరకు కౌశికానదికూడప ల్లెలకొఱకేడ్చియేడ్చి తనయందున్న జలమంతయుఁ గన్నీరై పోఁగా కొంతకాలమున కెండియే పోయెను. ఇప్పు డానదిపేరునకుమాత్రమే యున్నది. ఇప్పుడున్న యీసామాన్యపల్లెల గ్రామమును జూచిన పూర్వ మత్యంతవైభవోన్నతిఁ గాంచిన పట్టణ మిదియేనా? మిగుల సుందరమగు విమలభవనము, విలాసభవనము, ఇంద్రభవ నము మొదలగురమ్యహర్మ్యముల కాటపట్టయిన దిదోకాదో కదా! యనిపించును.

ఒకతల్లి కొకసౌందర్యవతి యగు కూఁతు రున్నది. ఆ సుందరినిగని విశ్వాసఘాతకులును బరులను నిష్కారణముగా దూషించు సంచాలనపటులునుగూడ జాలసందమైనదని మెచ్చు కొనుచుండకన్న తల్లి కాబాలిక త్రిలోకసౌందర్యవతిగాఁ జూపట్టు ట యబ్బురముకాదు. కాని యాబాలిక యకస్మాత్తుగా మృతి నొందినది. విశాలశ్మశానవాటికయం దామె శరీరము నేల యందులీనమై పోయినది. అత్యంతదుఃఖార్తయగు నాతల్లి విచారభారమును మోయఁజాలక తనకూఁతురుకొఱ కేడ్చుచు శ్మశానవాటిక కేతెంచును. ఏమున్న దచట? తనకూఁతు రెవరు? చివర కామె నెచట పాతిపెట్టిరో గూడఁ దెలిసి కొనుట దుర్లభము కదా!

అక్లే ప్రపంచచరిత్రయొక్క విశాలశ్మశానవాటిక ! ఆ చరిత్రాగర్భమునం దెన్ని పట్టణము లణఁగి యుండలేదు! ఎన్ని మహాద్భుత విషయములు దాఁగియుండలేదు. ఇంతకంటెను విచారకరము లగు కథలెన్ని జరిగియుండలేదు !!! అటులైన మనకిక విచార మెందులకు? ఎన్నిటి కని విచారింపఁ గలము "మనుష్యజీవిత మెట్టిదో, దినజీవిత మెట్టిదో రాజ్య జీవితము కూడ నట్టిదే.

నిముసనిముసమునకు నెద్దియో ఘనకార్యమును జేసితి నని గర్వించు మహాబలసమన్వితు లగు మహారాజు లెందఱు మడియుటలేదు ! పగలంతయుఁ దన కిరణజాలంబులను బఱపి ప్రపంచమంతయు దేదీప్యమానముగాఁ జేయు సూర్యుఁ డస్త మింప రాత్రి రాలేదా? అదియొక విచారకారణము కాదా? "అయ్యయో! అంధకారము వచ్చినది. లోకబాంధవుఁడగు సూర్యుఁడు పోయినాఁడు" అనిమనము విచారించుచుంటిమా? విచారించిన నెంతసేపు ? ఎట్టి మహారాజ్యములు మలినభూ యిష్ఠములై నామరహితములైపోలేదు? దీనికి విచారమా? ఈ దీర్ఘవిచారమునకం తెచట? అందుచేత నీవేదాంతమును విడిచి కథలోఁ దరువాత నేమిజరిగినది క్లుప్తముగాఁ దెలుపుటమంచిది.

వెనుకటి ప్రకరణమున దెలిపిన విధమున శ్యామసుం దరీదేవి మోడిపోయెను. పల్వోలకోట నాశనమై యొక "దిబ్బ"

క్రింద నేర్పడియెను. దానినే "మెఱక" యనిరి. పల్వోలగ్రామములో నిప్పటికిని యొకభాగము "కోటమెఱక" యనుపేరిటఁ బరఁగుచున్నది. ఆవైభవమున కంతటికిని నిప్పుడు మిగిలియున్న దింతియే! అట్లైన మిగిలినవారికథ యేమైనది? నూత్నవివాహితులగు చంద్రముఖిశశిభూషణు లేమైరి? వినినవారలకు నమ్మిటకు వీలులేనిచరిత్రగల రామదా సెచ్చట? జయచంద్రుని బ్రదు కెటులు ముగిసినది? మహారాణియగు శ్యామసుందరీదేవి కథయేమి? పాఠకమహాశయు లింకను నిట్లు ప్రశ్నింతురు. కనుక మఱిరెండుముక్కలు చెప్పి ముగింతుము. విచారకథను విపులముగాఁ జెప్పుట యనవసరము.

శశిభూషణుఁడును జంద్రముఖియు రామలక్ష్మితోఁగూడి యారాత్రి గొల్లపల్లెయం దుండుటచే వా రాయుద్ధమున చని పోలేదు. జయరామదాసుమాత్రము తన ప్రాణములను తన రాజ్యమునకే ధారపోసెను. జయచంద్రుఁడు పల్వోలలోను గాక రామచంద్రనగరమునను గాక మధ్యదారిలో దిక్కు లేక గతించెను.

శ్యామసుందరీదేవి తరువాత నగపడనే లేదు. మృతి నొందినదేమోయనిన నామెశరీర మైనను గన్పట్టలేదు. ఆమె యగ్నిప్రవేశమైన నొనర్చియుండవలయును. లేదా పురాణ

గాథలను నమ్మినయెడల దేహముతోనే స్వర్గమునకుఁ బోయి యుండవలయును.

శశిభూషణుఁడు చాల వృద్ధుఁడగువఱకును జీవించెను. చంద్రముఖి మునిమనుమలకుఁగూడఁ బల్వురకథ చెప్పినది. ఆ బాలకులు తమ ముత్తాతయగు శశిభూషణుఁడు మేన్లో వాఁడి కూర్చున్నయప్పుడువచ్చి యింకను కథలఁజెప్పుమనియును దమ యవ్వ చెప్పినదంతయు నిజమేనా యనియు మా పాఠకమహాశయులవలెనే ప్రశ్నించెడివారు. ఆ బాలికాబాలకుల కందఱకును "జయరామదాసు" "రామలక్ష్మి" యను చారిత్రాత్మక నామము లుంచఁబడెను.

సంపూర్ణము

# విషాంకుశ

## ఉపయోగించు విధము

తేలుకాటు తగిలినచోటునందు పై కనుపరచిన నల్లని మందులో బియ్యపుప్రమాణమును, తెల్లనిమందులో 1 బియ్యపు ప్రమాణమును మెత్తిపెట్టి దానిమీద 1 చుక్క చన్నీళ్లు విడువవలెను. విడిచినతోడనే బుసబుసయని కొంచెము పొంగును. ఆపొంగు అణగినతోడనే నిండుగా నీళ్లువిడిచి కడిగి వేయవలెను. పైచెప్పినమందు పాము, మండ్రగబ్బ, కుక్క, ఎలుక, మొదలగు విషజంతువుల కాటులకు పైచెప్పిన విధముగా మిరియాలగింజ ప్రమాణం ఉపయోగించవలెను. ఇట్లు ఉపయోగించినయెడల అన్ని నివృత్తి యగును. మొదట ఉపయోగించి విషముపోసియెడల రెండవతూరి అదేమాదిరీ చేయవలసినది.

పాకెట్టు 1-కి 0-6-0 1 డజను పాకెట్టు 3-0-0

ఇదియునుగాక మావద్ద పలువిధరంగులలోఖద్దరు కోటు గుడ్డలు, పట్టుగుడ్డలు, బనియన్లువగైరా సామానులు దొరకును. కోటుగుడ్డ గజంు-కి 1-8-0 పట్టుగుడ్డ 0-12-0 బనియను రు.1

యం. సి. సుబ్బయ్యశెట్టి,
ఆయుర్వేదిక్ అండు యూనానీడాక్టరు.
భారతీ పరిశ్రమాలయము,
చాగలమఱ్ఱి (కర్నూలుజిల్లా)

## ప్రథమరత్నము సువర్ణకేసరీ కృష్ణసేన (నవల)

గ్రంథకర్త:—కల్వటాల జయరామరావుగారు

ఆంధ్రభాషయం దక్షరజ్ఞానము గల ప్రతిమానవుడును చదువతగిన యద్భుతకథ. సువర్ణకేసరికై చంపకమాలయును, కృష్ణసేనునికై చంద్రమల్లుడును, పన్నెడి ఉపాయములను పడెడిపాట్లును సమర్థించెడి సాహసకార్యములును, తుట్టతుదకు సువర్ణకేసరీకృష్ణసేనల సమాగమమును, సాంతముగా చదివిన వారల హృదయముప్పొంగి, మేను పులకరించి ఆనంద బాష్పముల విడువకమానరు.

సందర్భానుసారముగా పెక్కు సాంఘికవిషయములు చర్చింపబడినవి. వెయ్యేల! చదువ మొదలిడిన అంత్యమగు వరకు విడువరు.

వెల చందాదారులకు రు 0-12-0 ఇతరులకు 1-0-0 పోస్టేజివేరు.

## ద్వితీయరత్నము కలియుగ దర్పణము (నాటకము)

మోహములోమోసము

గ్రంథకర్త:—కల్వటాల జయరామరావుగారు

కలిపాతక నిరసనము! ఖలవిదారచండశాసనము!!

వృద్ధవివాహములు—అతిబాల్య వివాహములు, కలియుగానర్థములనియు యౌవనకంటకములనియు, ప్రదర్శించుటకు "కలియుగదర్పణమే" దర్పణము.

బాలవితంతువగు సుమతి దుఃఖమును చదివిన నెంతటి రాతిగుండెయైన కరుగకమానదు. ఇందలి పద్యములు రస వంతములు.

మోహవార్ధిని మునింగిన జనార్దనుడు మా మార్గము చూపును. వ్యభిచారి-విరాగిని యగుచు. నీతిబాహ్యుడు-నీతి బోధకుడగును.

ఇది దుండగీండ్రకు సమ్మెటపోటు. దుష్ట యౌవన విద్యార్థులకు వివేకబోధిని. వేశ్యావృత్తికిదావానలము. వేయేల చదివిచూచిన హృదయము రంజిల్లును. పెక్కుపత్రికలచేతను పండితులచేతను పొగడ్త గన్నది.

చదువరులమెచ్చునకై యీక్రిందిపద్యమునుముద్రించినారము.

సీ. తగినట్టినెరులను తెగగొరిగించును
ముందరిజుట్టును ముదముగూర్చు
"సంధ్యను" మాన్పును సంజెవేళను మంచి
బ్రాందీ దుకాణంబు బరగజూపు
జననిని దిట్టించు జనకునిదూరించు
మనభాషపై ర మ్రందజేయు
స్వేచ్ఛనుమాన్పియు సేవకుండైయుండి
సేవకావృత్తిని జేయమనును
గీ. మనకుంగల పూర్వవృత్తుల మానుమనును
పరులవృత్తులు మనకేమొ పట్టుబడును
తలపగా నాకు పరభాష తెగనిదయ్యె
నేను నిజముగా నాభాష నేర్వజాల.

పైపొత్తమందు గ్రంథకర్తగారియొక్కయు, అధ్యక్షుల యొక్కయు ఛాయాపటములు కలవు.

చందాదార్లకు రు 0-12-0 ఇతరులకు రు 1-0-0 పోస్టేజివేరు

# తృతీయరత్నము మనోరమావిజయము

(చరిత్రాత్మక నాటకము)

గ్రంథకర్త:—గండ్లూరి నరసింహారావుగారు, రిటయర్డు రివిన్యూ యినస్పెక్టర్, జంబులమడుగు.

ఇది మాంటిక్రిస్టో ఆఫ్ యిండియా యను ఇంగ్లీషు నవలనుండి తీసికొనబడినది. ఇందు మనోరమ తనభర్తకై పడెడి పాట్లును, సాహసములును అత్యద్భుత భయంకరములు. హిల్ దార్ దొరగారి దుండగములును, డాక్టరుగారి దయాహృదయమును వర్ణింపనలవికాదు. విరాగియగు భర్తను సంసారమునకు దించిన పతివ్రతాచరిత్రము. ముఖ్యముగా స్త్రీలు దీనిని చదివియే తీరవలయును. దక్షిణాఫ్రికాయందలి తేయాకుతోటల లోని భారతీయ కూలీలు పడుపాట్లుచదువ మిగుల సంతాపకరము. మచ్చునకైనొకపద్యమును వుదహరించుచున్నారము.

మనోరమ:—

శా. అమ్మా నాయెదజించిచూడుమిదె యందచ్చొత్తినట్లుంపునో
యమ్మా నాజనకుండు ప్రీతిమెయి గన్యాదాన మివ్వంగబల్
సమ్మోదంబునఁ బెండ్లియాడిన దయాసంపూర్ణ సాకారమో
యమ్మా! యన్యులకిచ్చుటల్ నెలవుసాధ్యంబౌనెయూహింపుమా

వెల చందాదార్లకు రు0-12-0 ఇతరులకు 1-0-0 పోస్టేజివేరు

చతుర్థరత్నము **మేవాడుపతనము** చరిత్రాత్మకనాటకము:

అనువాదకులు:—పాలపర్తి సూర్యనారాయణగారు

సుప్రసిద్ధ కవిశేఖరుండగు బాబు ద్విజేంద్రలాల్ రాయి గారి వంగభాషారూపకానువాదము. ఇందు మాన్సిచే పోషింపబడిన కరుణరసమును గోవిందసింహునిచే వన్నెకెక్కిన క్షాత్ర రసమును మహబత్ ఖానుని పట్టుదలయు చదివియే తీరవలయును. మొగల్ సేనాధిపతియగు హిదాయత్ ఖానుని పిరికి చేష్టలు చదువ పాఠకుల కడుపుబ్బనవ్వించును. సత్యవతి సమరోత్సాహమును చదువునప్పుడు ఎట్టిపిరికివారికైనను క్షాత్ర రసముప్పొంగును.

హృద్యములగు పద్యములు, అమృతోపములగు గేయములు, సాహిత్యభూషిత గద్యములు, ప్రదర్శనానుకూలము. సంస్కృతాంధ్రహిందీవంగభాషా భూషితులును విద్వత్కవులును నగు శ్రీజంధ్యాల శివన్నశాస్త్రిగారిచే పీఠిక వ్రాయబడినది. నిండు కాలికోబైండు.

| | | | |
|---|---|---|---|
| క్యాలికోబైండుప్రతి | చందాదార్లకురు | 1-0-0 | పోస్టేజివేరు |
| | ఇతరులకు | 1-8-0 | |
| సాదాప్రతి | ఇతరులకు | 1-0-0 | |

పంచమరత్నము **ప్రియదర్శిని** చరిత్రాత్మక నవల

గ్రంథకర్త:- పాలపర్తి సూర్యనారాయణగారు

ఇయ్యది సాంఘిక - నైతిక - చరిత్రాత్మక విషయిక ప్రియదర్శనము. ఆంధ్రవచనసుధారసప్రియదర్శనము. వివిధ

సుమధుర వర్ణనాచాతురీ ప్రియదర్శనము. నవీన దురభ్యాస కుంఠిత ప్రియదర్శనము. చదివియే తీరవలయును. వ్రాయుట ఆత్మభూషణ మగును.

సరసమగు శైలి. మృదుమధుర భాషణములు. హృదయాహ్లాదకరవర్ణనలు. దేశభక్తిప్రపూరితము. నిర్దూషితవిషయస్థము. క్షాత్రరసపోషితము. ప్రేమైక భూషితము. శృంగార భాషితము. చిత్రపటశోభితము. 200 పుటలు. చక్కని బైండు.

| | | | |
|---|---|---|---|
| వెల క్యాలికో బైండు | చందాదార్లకు రు | 1-0-0 | పోస్టేజి వేరు |
| సాదా ప్రతి | ఇతరులకు | 1-8-0 | |

మచ్చునకు దిగువనొక పద్యమును వుదహరించినారము.

సీ. అతుల ప్రతాపవీర్య ప్రభంజను శివా
జీపోకకై చింత సేయకమ్మ
ధర్మసంస్థాపనాతత్పరుండు ఘనుండు
ఛత్రసాలుడుపోవ జడియకమ్మ
ఆంధ్రభోజాంకితుఁ డనుపమకవిరాజు
కృష్ణరాయుని మృతికేడ్వకమ్మ
మ్లేచ్ఛయూథంబుల వ్రీల్చినరుద్ర ప్ర
తాపునిచావుకై తలఁగకమ్మ
ఆంగ్లాధిపతుల నల్లాడించు తిలకు మ
రణమునకై పరితాప మెనయకమ్మ

గీ. భారతాంబరో! కలరు కుమారులింక
గాంధిసర్వేశుడై శాంతి కయ్యమందు
జననిఋణముదీర్పంగ సరసమతులు
వారిక్షేమంబు మదిగోరి వరలుమమ్మ!

ప్రథమకుసుమము. **గండికోట** (గీతము)

గ్రంథకర్త:—జే. సుబ్బయ్యగారు, ప్రొద్దుటూరు.

ఇది కడపజిల్లా జంబులమడుగు తాలూకాయందలి వెన్నానదీతీరంబున నున్న నొకదుర్గరాజముయొక్క చరిత్ర. అప్పటి యున్నతస్థితికిని, యిప్పటి హీనస్థితికినిగల తారతమ్యమును చదివిన ప్రతిహైందవుడును కంటతడిపెట్టకమానడు. నేడే తెప్పించి చదువుడు.

వెల చందాదార్లకు ఉచితము.
ఇతరులకు రు 0—8—0.

పరా:—దీనిని ప్రత్యేకముగా పంపుటకు వీలుండదుగాన యేదేని నొకపాత్తమును తెప్పించుకొన్నచో దానివెంట పంపెదము లేదా రు 0-4-0 పోష్టుబిళ్లలంపినచో పంపెదము.

ద్వితీయకుసుమము. **రత్నాబాయి** (సాంఘికనవల)

గ్రంథకర్త:—బూదూరు రామానుజులు రెడ్డిగారు, చిన్వాడ.

వర్తమాన కాలమున ఆడుబిడ్డలుగల తల్లిదండ్రుల నమాంతముగా మ్రింగివేయుచున్న వరశుల్కములు గురించి తేటతెల్లముగా దెల్పబడినది.

వరశుల్కముల వైఖరి, ఆడుబిడ్డలు గలవారియవస్థ, వివాహమందలి విరుద్ధములు, మోహమందలి మోసము,ముద్దులొలుకు చక్కనిమాటలతో నిండియున్నది. ప్రతియింటను ప్రతిచేతను ఉండితీరవలసిన ఉత్తమాలంకారము. పాఠకుల బరవశమొనరించును. వెల స్వల్పము. ఫలమధికము.

శ్రీయుత దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు గారిచే పీఠిక వ్రాయబడినది.

వెల చందాదార్లకు రు 0 6 0 ఇతరులకు 0 8 0పోస్టేజి వేరు.

తృతీయకుసుమము. **శ్రీకన్యకాంబ** (శతకము)

గ్రంథకర్త: బాలకవి నామా వేంకటసుబ్బయ్యశ్రేష్ఠి, ప్రొద్దుటూరు.

ప్రతి వైశ్యకులజుండును జదువందగిన శతకరాజము. ఇందలి శ్రీ కన్యకాంబా స్తోత్రపద్యములు ఖడ్గములుగా నుపయోగించును. నీతులకు నెలవైనది. భాషౌచిత్యమున విలువైనది. చదివియే తీరవలయును.

చందాదారులకు రు 0 3 0 ఇతరులకు 0 4 0

ప్రత్యేకముగా కావలయునన్న 0—5—0 పోస్టుబిళ్లలు పంపవలయును.

చతుర్థకుసుమము. (శ్లోకములు-పద్యములు)

## ముకుందమాలా స్తోత్రము

భక్తిప్రపూరితము. తెలుగుపద్యములతో సహా పద్యములు హృద్యములు. ఇహపరసాధనము. పారాయణమునకు యోగ్యము. శ్రీకులశేఖరాళ్వారుని శ్లోకములు. శ్రీ పాలపర్తి సూర్యనారాయణగారి పద్యములు.

చందాదారుల కుచితము. ఇతరులకు రెండుపుస్తకములు 2 0 0 తగ్గకకొన్నవారికి ఉచితము. ప్రత్యేకముగా కావలయునన్న 0 3 0 లు బిళ్ళలుపంపవలయును.

# శ్రీ బాలభారతి గ్రంథనిలయము

చాగలమఱ్ఱిపోస్టు కర్నూల్ జిల్లా—దత్తమండలము

స్థాపితము 1923

ముఖ్యోద్దేశము

భాషోద్ధారణ! ఇందు పరిశ్రమపోషణ!

ప్రతిరెండు మాసములకు మత, సాంఘిక, దేశీయ, పౌరాణిక, అపరాధ, పరిశోధక, నవలలుకాని, రసవంతములగు నాటకములుకాని, శ్రేష్ఠతమములగు పద్యకావ్యములుకాని, యొకటి వంతున తప్పక ప్రకటింతుము.

చందాదార్లుగా చేరగోరువారు ప్రవేశరుసుము రు0-8-0 ముందుగా చెల్లించి రశీదు పొందవలయును.

ప్రతి రెండుమాసములకు ప్రకటించు ప్రతిగ్రంథమును చందాదారులు తప్పక తీసికొనవలయును.

పోస్టేజీకగు తపాలా ఖర్చులన్నియు చందాదారులే భరించుకోవలయును.

మా చందాదారులకు యితరులకన్న నూటికి యిరువది అయిదు రూపాయలవంతున ధరలు తగ్గించి పంపబడును.

చందాదారులుగా చేరగోరువారు వెనుకటి గ్రంథములు గాని, అనుబంధములుగాని కొననక్కఱలేదు. వలయునన్నచో వాటినిసహా తగ్గింపు వెలలకే పంపబడును.

చిరునామా మారినవెంటనే మాకు తెలుపవలయును.

మాతో వుత్తర ప్రత్యుత్తరములు జరుపవలసినచో తమ చందానెంబరు తెలుపనిచో జవాబువ్రాయుట కష్టసాధ్యము.

రసవంతములగు నాటకములను, నవలలను, తదితర గ్రంథములను, మాచందాదార్లుగాని, లేక యితరులుకాని మాకు పంపినచో వందనపూర్వకముగా నందుకొని, ముద్రణాయోగ్యముగానున్నచో తప్పక ప్రకటింతుము.

## గనుక

మా గ్రంథనిలయమునకు మహారాజ పోషకులు, రాజ పోషకులు, పోషకులు, సహాయులు, శాశ్వత చందాదార్లుగాను చేరి భాషాయోషధులను బెంచి విద్యావిహీనతయను రోగమును గుదుర్చనెంతురని నమ్మియున్నాను.

# విరాళములు

| | |
|---|---|
| మహారాజ పోషకులు | రు 116—0—0 |
| రాజ పోషకులు | 50—0—0 |
| పోషకులు | 25—0—0 |
| సహాయులు | 12—8—0 |
| శాశ్వతచందాదార్లు | 7—2—0 |

మహా రాజపోషకులు, రాజపోషకులు, పోషకులు, సహాయులు, వీరలనామములనుచేరిన లగాయతు మాయొక్క ప్రతిపుస్తకమునందు చేర్చబడును.

పోషకులు, సహాయులు, శాశ్వతచందాదార్లు వీరలు ప్రతిసంవత్సరము వారివారి విరాళములను చెల్లించుచుండ వలయును.

మహారాజపోషకులు, రాజపోషకులు, కార్యములపట్ల సర్వవిధములగు సహాయములు జేయవలయును.

పైఅయిదు తరగతులవారికి ప్రతిరెండుమాసములకు వెలువడు ప్రతిగ్రంథమును పోస్టుఖర్చులు యావత్తు మేమే భరించుచు వుచితముగా పంపెదము.

మొదటి మూడుతరగతుల వారికిమాత్రము మాగ్రంథ నిలయమునప్రకటించుప్రతిపొత్తమును వుచితముగాపంపెదము.

# హెచ్చరిక

మా గ్రంథనిలయమునకు యొక రాజపోషకునిగాని, ఇద్దరు పోషకులగాని, నలుగురు సహాయులుగాని పదిమంది శాశ్వతచందాదార్లుగాని, చేర్చువారికి మాచే వెలువరింపబడిన యొక నవలను నాటకమును పంపెదము. ఇరువదియైదు చందాదారులను జేర్చినవారిని ప్రవేశరుసుము లేకుండ చందాదారునిగా చేర్చుకొని ఒక సంవత్సరమువరకు పుస్తకముల నుచితముగ బంపుచుందుము. ఏబది చందాదారులను చేర్చిన మూడు సంవత్సరములు పొత్తముల నుచితముగ నొసంగుదుము. వంద చందాదారులను చేర్చిన సర్వదా గ్రంథముల నుచితముగ బంపుచుందుము. ఇందులకు సమ్మతించువారు మాకు వ్రాసిన రశీదులపుస్తకము, నోటీసులు వెంటనే బంపుదుము.

మా గ్రంథనిలయమునకు చందాదారులను చేర్చుటకును, గ్రంథముల విక్రయించుటకును యేజంట్లు కావలయును. రు 100 కి రు 25 ల వంతున కమీషను యిచ్చెదము. కోరినవారు వెంటనే దరఖాస్తుల బంపిన వివరములు తెలిపెదము.

చాగలమఱ్ఱి,
1—2—26

ఇట్లు,
యం. రామసుబ్బయ్యశ్రేష్ఠి
అధ్యక్షులు.

# ఆంధ్ర గ్రంథ రత్నాకరము

గుడివాడ కృష్ణాజిల్లా.

ఈ గ్రంథమాలా గ్రంథములు చందాదారులకు రూపాయకు 0-4-0 చొప్పున ధరలుతగ్గించి యివ్వబడును. ప్రవేశ రుసుము 0-8-0 మాత్రమే.

## దుర్గాదాసు (నాటకము)

అనువాదకులు:—జంధ్యాల శివన్న శాస్త్రిగారు

ద్విజేంద్రలాలురాయల బెంగాళినాటకమునకు తెలుఁగు

వెల రు 1-4-0 చందాదార్లకు 1-0-0

## కాళిదాస భవభూతులు (విమర్శక గ్రంథము)

అనువాదకులు:—జంధ్యాలశివన్న శాస్త్రిగారు

ద్విజేంద్రలాలురాయల బెంగాళి నాటకమునకు అనువాదము. నాటకతత్వము తెలుసుఁగోరువారికి ఉత్తమగ్రంథము.

వెల రు 1-4-0 చందాదార్లకు 1-0-0

## సాత్రాజితీపరిణయము (ప్రబంధము)

గ్రంథకర్త:—అడవి సాంబశివరావుగారు

వెల రు 0-12-0 చందాదారులకు 0-9-0

## చంద్రగుప్త (నాటకము)

అనువాదకులు:—డాక్టరు నండూరి శివరావుగారు

ద్విజేంద్రలాల్ రాయల బెంగాళీ నాటకమునకు అనువాదము. ఇందుముఖ్యముగా దేశభక్తి, పితృభక్తి, విశ్వప్రేమ మొదలగునవి చక్కగా నిరూపింపబడినవి.

వెల రు 1-0-0 చందాదార్లకు 0-12-0

## రాణా ప్రతాపసింహ (నాటకము)

వెల రు 1-4-0 చందాదార్లకు 1-0-0

## భీష్మ (నాటకము)

ద్విజేంద్రలాల్ రాయల బెంగాళినాటకమునకు అనువాదము.

పితృభక్తి, స్వార్థత్యాగము, అత్యద్భుతము. దాశరాజు ప్రసంగము కడుపు చెక్కలుచేయును. రసవంతములగు పద్యములుకలవు.

వెల రు 1—4—0 చందాదార్లకు రు 1—0—0

# అనుబంధములు

| | చందాదార్లకు | ఇతరులకు |
|---|---|---|
| అర్ధానుస్వారశకట రేఫచంద్రిక | 0-4-0 | 0-6-0 |
| సాసూను వైద్యశాలలోని గాంధిమహాత్ముడు | 0-1-0 | 0-1-6 |
| మయూరధ్వజ చరిత్రము (హరికథ) | 0-6-0 | 0-8-0 |
| మేవాడుపతనము నాటకము (సాదాప్రతి) | 1-0-0 | 1-4-0 |
| *శుద్ధాంధ్రనిర్వచనశతకంఠరామాయణము | 1-0-0 | 1-4-0 |
| హిందీ తెలుగు నిఘంటువు (క్యాలికో బైండు) | 2-0-0 | 2-0-0 |
| ఆంధ్ర హిందీ నిఘంటువు (చక్కని బైండు) | 1-0-0 | 1-0-0 |
| హిందీ తెలుగు వ్యాకరణము | 0 14-0 | 0-14-0 |
| శ్రీమద్రామాయణాద్భుతోత్తరకాండము | 1-4-0 | 1-4-0 |
| జగన్నాథీయము (ప్రబంధము) | 0-8-0 | 0-8-0 |
| శ్రుతశైల హనుమచ్ఛతకము | 0 1 0 | 0 1 0 |
| బాలశతకము (స్త్రీనీతులు) | 0-1-0 | 0-1-0 |
| కన్యావిక్రయము | 0-2-0 | 0-2-0 |
| వరవిక్రయము | 0-3-0 | 0-3-0 |
| యోగసారము | 0-4-0 | 0-4-0 |
| పరమేశనుతి కదంబము | 0-4-0 | 0-4-0 |
| హరిస్తుతి కదంబము | 0-2-0 | 0-2-0 |

N. B.* ఈగురుగల పొత్తము 0—5—0 చీట్లుపంపు

గ్రంథాలయమునకు వుచితముగా పంపబడును.

చిరునామా:—ఆంధ్ర గ్రంథరత్నాకరము,

గుడివాడ, (కృష్ణాజిల్లా)

వెలువడనున్న ది!  సప్తమరత్నము!!  వెలువడనున్నది!!!

# విశ్వనాథవిజయము (నాటకము)

గ్రంథకర్త:—సుప్రసిద్ధాంధ్రకవియగు భూతపురి నారాయణ స్వామిగారువిజయనగరసామ్రాజ్యాధీశుల మహోన్నతదశయందుదురాశాపరుడును తంత్రగాడును అగు తండ్రినిమిత్తము, ప్రహ్లాదునివలె కఠినపరీక్షయందుత్తీర్ణుడై వెలసి తన నిష్కల్మష జీవితమునుజాటిన యొక యాంధ్రవీరుని చారిత్రము నాటక రూపమున వ్రాయబడినది. కథాకల్పనము స్వేచ్ఛమై ప్రకృతి మనోహరముగా బెడిగి అల్లిబిల్లిగా నల్లుకొని పుష్పించి పరిమళముల వెదజల్లుతీగవలెసాగింపఁబడినది. ప్రతిపద్యము అమృతరస మొలుకుచుండునని చెప్పిన అతిశయోక్తికాజాలదు. గ్లేజు కాగితములపై చక్కగా ముద్రింపబడినది.

వెల చందాదారులకు రు 0-12-0 ఇతరులకు రు1. పోస్టేజి వేరు

## బాలభారతీగ్రంథనిలయము

## అనగా

ప్రతి రెండుమాసముల కొక నవలగాని నాటకముగాని

## వెలువరించు పరిశ్రమాలయము

నవరసములగునాటకములు, నవీన నవలలు. రసవంతములగు పద్యకావ్యములకు, రహస్య పరిశోధక నవలలకు నేడే వ్రాయుడు.  వలయువారు:—

యం. రామసుబ్బయ్యశ్రేష్ఠి, ప్రెసిడెంటు
చాగలమర్రి(పోస్టు) కర్నూలుజిల్లా.